# షా తత్వము









హుస్సేన్ షా
విజ్ఞాన విద్యా పీఠాచార్య
పిఠాపురము

1978



మూల్యము : రు. 100-00

# గమనిక

xxxxxxxxxx

ఇందున్న పీఠిక ఆమూలాగ్రముగ

చదివిన తరువాత, పాఠకులు

యీ గ్రంథమందుగల

విషయములను

పఠించెదరుగాక.

xxxxx



# గురుస్తుతి

xxxxxxxxxxxxxxx

సీ॥ గురుపీఠ నాధిక్య గురువుగా దృశ్యాన
గోచరించు నెవండు కోటి దీప్తి !
కహానెషా బాల్యాన గారవంబున బిల్చి
సన్మంత్ర బోధచే సాకెనెవడు !
భౌతికా భౌతిక ప్రౌఢిని, రూఢమౌ
శక్తి సంప్రాప్తించు శక్తుడెవరు !
రవి సుధాంసులు నలరారువరకు, బీరం
మలరారి రంజిల్లు, ననియె నెవడు !

తే॥ గీ॥ ఎపుడు తనశిష్యుంబుత్రుగా నెంచునట్టి
ఎపుడు విడిపోని బాంధవ్య మెవడు నెరపు
వంశ గురువుగం బూజింప బడెడు తేండు
అట్టి "ఆఖైలలీగురు" నర్ధించలతు.



బ్రహ్మర్షి శ్రీ హంస్సేన్ షా

సప్తమ పీఠాధిపతి

శ్రీ విశ్వ విజ్ఞాన విద్యాధ్యాత్మిక పీఠము



శ్రీ నడింపల్లి వెంకటపతిరాజుగారు, వారి ధర్మపత్ని తిరుపతమ్మగారు

పశ్చిమ గోదావరి జిల్లా వెంకటాపురం గ్రామస్థులు పెన్మెత్స సూర్యనారాయణరాజుగారు వీరిధర్మపత్ని సుభద్రయ్యగారు, వీరి పుత్రిక తిరుపతమ్మగారు పంచమ పీఠాధిపతియైన బ్రహ్మర్షి మొహియద్దీన్ బాద్షా సద్గురువర్యులవద్ద ధర్మోపదేశం తీసుకొన్నారు.

తిరుపతమ్మగారు లంకల కోడేరు వాస్తవ్యులు శ్రీ నడింపల్లి వెంకటపతిరాజు గారి ధర్మపత్ని. వీరు ధర్మపత్ని ప్రోత్సాహముతో షష్టమ పీఠాధిపతి శ్రీ బ్రహ్మర్షి ఉమర్ ఆలీషా వారివద్ద మంత్రోపదేశం పొందారు. వీరు నిత్య ఆధ్యాత్మిక గ్రంధపారాయణులు. పీఠాధిపతుల వంశపారాను గుణ్యముగ శ్రీమతి తిరుపతమ్మగారి వంశము కూడ మంత్రోపదేశం పొందుతూ ఉన్నారు. ఈ గ్రంథము నాల్గవ కూర్పునకు ఆర్థిక సహాయ మొనర్చి ధన్యులైనారు.

(4వ కూర్పు)

# విషయసూచిక

# పీఠిక



ఈ విజ్ఞాన విద్యా పీఠమునకు పీఠాధిపతులలో ఆది పీఠాధిపతి 1472 సం॥లో భారతదేశమునకు వచ్చియున్నారు.

ఆదిలో ఈ పీఠము అరబ్బు దేశమున అందలి బాగ్దాదునుండి పారశీకదేశము. అక్కడనుండి భారతదేశమునకు వచ్చి ఢిల్లీ నగరమున నివసించి, అక్కడ సర్మద్‌హుస్సేనీ (సర్మద్ షహీద్) పేరుగల తత్వవేత్తను ఔరంగజేబు చంపించినప్పుడు వారి సమకాలికుడైన యీ పీఠాధిపతి తానేషా కాలమున హైదరాబాదు వచ్చి హైదరాబాదు నుండి యీ పీఠమునకు జాగీరొసంగిన కారణమున ఆంధ్రదేశము ప్రవేశించి పీఠికాపురమున నివాసముగా స్థిరపరచుకొన్న మొదటి పీఠాధిపతి మదీనె కబీర్షా.

ఆ కాలమువారిచే యీ పీఠాధిపతి మదీనానుండి వచ్చిన తత్వవేత్త యని పిలువబడినారు. ఈ పీఠాధిపతులు ఏ దేశములోనున్నప్పుడు ఆ దేశ భాషలలో, ఉత్కృష్టమైనదిన్నీ గణనీయమైనదిన్నీ అయిన కవిత్వం చెప్పియున్నారు.

వీరు అరబ్బీ, పార్సీక భాషలలో తత్వముగూర్చి గ్రంధము వ్రాసి నట్లు తెలియబడుచున్నది.

ఈ మదీన్ కబీర్షాగారిని తత్వరూపులుగ గ్రహించుటకు ఆనాటి ప్రజలు వీరి మహత్మ్యము చూడగోరి బండ్లకొలది యిద్దనంబులు కాల్చి అగ్నిగుండము యేర్పరచి వారిని అందు కూర్చుండమని కోరగా అప్పుడు ఆ అగ్నిగుండమున పూలపాన్పున గూర్చున్నట్లు గూర్చుండి తన మానసిక మహత్మ్యము ప్రజలకు జూపిరని వారి చరిత్ర.

వారి తరువాత వారి అగ్రనందనుడు మధార్షా. ఆ తరువాత వారి సుతులు "హసన్మియాషా వారి కుమారులు కహెన్‌షావలి" వీరి పిన్ననాటి కాలమున బాల్యమందే వీరి తండ్రి హసన్మియాషా దివంగతులైన కారణమున వారికి తిరుగ అఖైలలీషా గురువర్యులచేత యీ పీఠ తత్వ స్వరూపమైన మహామంత్రము ప్రబోధింపబడి తిరుగ యీ పీఠము పునఃస్థాపితమైనది.

# 2

శ్రీ కహెన్‌షావలీగారి చిన్ననాడు ఒకనాడు వారి దృశ్యములో నొక మహాపురుషుడు కనబడి దర్శనమిచ్చి మీ వంశమందు ఆధ్యాత్మిక రూపమైన తత్వస్వరూపము పీఠాధిపత్య రూపంలో వెలార్చబడుచున్న విధానము మీకు ముందు మీ తండ్రిగారు పీఠాధిపతిగ నిర్వహించు కాలమున మీ బాల్యమునందే వారు నిర్వాణము పొందియుండుటచే, అది మృగ్యమౌ సమయము కలుగనున్నది. ఆ పీఠమునకు మీరు పీఠాధిపత్యాధికారము స్వీకరించవలసియున్నది. ఇప్పుడు నాచే మీకు యీ మహామంత్రము ప్రబోధింపబడి పునరుద్ధరణ కావలసియున్నది. కాబట్టి ఈ రహస్యము నాచేత తెలుసుకోవలసినదిగా చెప్పినట్లు పై విషయములు దృశ్యములో చెప్పిన విధానమున శ్రీ కహనేషావలీ గారు బడికిపోవు సమయాన యే మహాపురుషుడు దృశ్యములో తనతో ప్రసంగించెనో ఆ మహావ్యక్తి జాగ్రిదావస్థలో యెదుటబడి యే వాక్కులైతే దృశ్యములో ఆయన నోటి ధ్వనింపబడినవో, నదేతీరున ఆయనచే ఈ పీఠాధిపతులచే ప్రబోధింపబడు మహామంత్రము ఆనాడు కహనేషావలీగారికి ప్రబోధింపబడినది. ఆయనే శ్రీ అఖైలలీషా గురువులు. వీరు ఆకల్పాంతముదాక యీ పీఠాధిపతులకు గురువుగ సంస్మరణీయులు.

ఆనాటినుండి యీనాటివరకు యీ పీఠాధిపత్యము అవిచ్ఛిన్నముగ సాగుచున్నది.

వారి పీఠాధిపత్య కాలములో "కలిక భాగవతమనే" గ్రంథము ఈశ్వర పరిణామము తెలుపు మహత్మ్యములతో నిండిన తత్వము చెప్పబడినది.

ఆ తరువాత వారి అగ్రనందనులైన మహర్షి శ్రీ మొహియద్దీన్ బాషా గురువర్యులు. తన స్వానుభవైకవేద్యమైన కీర్తనలు, పదములు "పరతత్వ కీర్తనలు" అను గ్రంథముగ రచింపబడినది.

వారి కాలమున యీ పీఠాన్ని యనుసరించినవారు యెనిమిది వేలు. వీరి తరువాత వీరి అగ్రజులు బ్రహ్మర్షి శ్రీ ఉమరాలీషాకవి గారిని యెరిగినవారు యావత్ సృష్టిని కలరు. వీరి కవిత్వ మాధుర్యము సంస్కృతమున కాళిదాసును మించినది. వీరు పారశీక, ఉరుదు, ఆంగ్ల సంస్కృత, ఆంధ్రభాషాకూలంకషులు. వీరి కాలమున వీరి పీఠాన్ని అనుసరించినవారు యిరువది వేలు.

తత్వరూపములో వీరి కావ్యము ఈశ్వర సంభూతమైన మహాశక్తి రస స్వరూప తేజమును "సూఫీవేదాంత దర్శము"నందు మానవ వ్యక్తిత్వము పొందిన జీవమే ఈశ్వరుడని నిరూపింపబడినది.

మ॥ కనదుత్పాదరసంబు తాత్వికుడు బంగారంబు గావించిన
ట్లనుమానాస్పదమై వినాశకరమై అల్లాడు జీవుండు బ్ర
హ్మనుగా మార్చెడు త్రోవజూపితి నిధిధ్యాసంబు సంధించి మీ
కనులన్ విప్పుడు సూన్యమందె హరిసంకాశంబు సంధిల్లెడున్.

శా॥ ఈ దృశ్యంబులచాటు మాటున మహాశృంగార శృంగాటకా
పాదంబైన జనానుషంగము భవత్ ప్రత్యేకతన్ కేంద్రమై
ఈదారిన్ జను క్రింది మెట్లకు మహాంధీభూతమైయుందు నే
నాదిత్యేందు ఖగోళ మారసితి బ్రహ్మానందమే పారగన్.

ఈ "షాతత్వ" మను గ్రంధమందు "తత్వవేత్త"గా పలుచోట్ల పేర్కొనబడిన కావ్యము శ్రీ ఉమర్ ఆలీషావారి నోట పలుకబడిన క్షరరహితమయిన వాక్కులే.

వీరికి అగ్రనందనుడనైన హుస్సేన్ షా యనునేను ఈ పీఠాన్ని ది 10-2-1945 న అధిష్ఠించి "యీ షాత్వ" మను గ్రంధమును ది 9-9-1967 సం॥న ఆరంభించి ది 9-9-1968 నాటికి అభౌతికమయిన వాక్సందేశము ఉపనిషద్రూపము నానోట నిర్వచింపబడినది. నా కాలమున యీ విజ్ఞాన విద్యాపీఠము ననుసరించినవారు లక్ష ఇరువది వేలకు పైగానున్నారు.

ఇది మత మతాంతరములపై విమర్శనలు లేకుండా సర్వమత సమ్మతమయిన మానవ వ్యక్తిత్వపరిణామముపై మోసి ఈశ్వర ఏకత్వ ప్రతిపాదనలై వచ్చిన భావపరిణామము. ఉపనిషద్రూపంగా వచ్చిన ధ్వని అక్షరరూపంగా తెలుపబడినది.

ఇందు అనేకచోట్ల వచ్చిన విషయములే తిరిగి రావడములో ఆయాచోట్లగల వాక్కులు విడమర్చి తెలుసుకొనుశక్తి చదువు మానవుని ఆత్మకు తేటతెల్లముగా అవగాహన యగుటకే పునఃపునః చెప్పబడినవి.

ఈ గ్రంథమున మాటిమాటికి "రూపము" అను శబ్దము వాడబడినది. ఏ చోట రూప శబ్దము వచ్చినదో దాని వెనుకనున్న శబ్దము యొక్క అర్థము తెలుసుకొని ఆ అర్థమందు తన దృష్టిని కేంద్రీకరించి నెట్టిన ఆ శబ్దముయొక్క అసలు రూపము దృగ్గోచరము కాగలదు. ఆ రూపనిష్పత్తిని పురస్కరించుకొని సాధకుడీ గ్రంథమును చదివిన దీని యందుగల అలౌకికమైన శక్తి తనకు తత్వరూపమున గ్రాహ్యము కాగలదు.

దీనియందు చదువరులకు తమ ఆలోచనలతో అనేక సంశయములు రాగలవు. ఆ సంశయములు తన మనస్సులో పెట్టి విమర్శనతో దీనిని తెలుసుకోవలెనన్న ఆకాంక్షయందు నొక కాలమునకు తన విమర్శనా హంశములు అనుభవమునకు రాక మానవు. ఆ సమయమందు ఆ వ్యక్తి ఆనందించగలడు.

ఇట్లు,

హంస్సేన్ షా

శ్రీ విజ్ఞాన విద్యా పీఠాధిపతి.

# మానవుడు

మానవుడు అనే ధ్వని వచ్చినప్పుడు దృష్టికి నొక రూపము అనుచున్నది. అది సృష్టియందుకల స్థావర జంగమాత్మకములైన రూపము లన్నిటికంటె వుత్కృష్టమైనదిన్ని, సుందరమైనదిన్ని అతీతమైన బుద్ధి వికాశముతో కూడిన తెలివిగలదిగను పరిగణింప బడుచున్నది. ఇది యెప్పుడు సృష్టింపబడినది అన్న ప్రశ్న వచ్చినప్పుడు "విరాట్టు" నుండి తెగి జగద్రూపముగ మారి సృష్టి రూపముగానున్న యీ సృష్టి యొక్క ఆదిరూపము అణువని, ఆ అణువు మానవాకారముగ నున్న దని" అన్నాడు తత్వవేత్త.

ఆ మానవాకారముగనున్న అణువే పంచభూతములుగ ఆవిర్భ వించి సృష్టి చైతన్యమున యెనభై నాలుగు లక్షల (84) జీవరాసులుగ మారి దాని అంత్య పరిణామము మానవుడుగా వచ్చిన విషయం మన విమర్శనకు తేలకపోయిన్న, నీకు, సృష్టి యొక్క అంత్య పరిణామము యేమిటియని ప్రశ్న వచ్చినప్పుడు వుపమానముగ చెట్టుయొక్క పరి ణామము "పెం క" అనే విధానములో సృష్టికి మానవుడని చెప్పక తప్పదు.

ఇది మనబుద్ధినిబెట్టి విమర్శించిన యింతకుమించిన రూపనిష్పత్తి గల జన్మ యింకొకటి కానరాదు.

సృష్ట్యాతీతమైన త్రిమూర్త్యాత్మక శక్తి స్వరూపములు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టి, స్థితి లయ కారకులు అయియున్న సంగతి ప్రతివానికి తెలిసినవే. చిత్రకారుడు తన చిత్రలేఖనములో ఆ శక్తి స్వరూపములను చిత్రించినప్పుడు మానవరూప భిన్నంగ చిత్రించ

లేకపోయాడు, కాన సృష్టియొక్క పరిణామరూపములో శబ్ద, స్పర్శ రూప, రస, గంధములను శక్తులను తన గ్రహణేంద్రియ రూపములలో గ్రహించి "నేను" అనే ధ్వనిలో అయా శక్తులను వేరువేరు విధంగ తనవాక్కులో వ్యక్తంచేయగలిగిన రూపము మానవ రూపము. ఇది స్వాయంభువు అనే ప్రజాపతి మనువుగ మానవరూపి అయినప్పటికి యిప్పుడు మానవరూపముగావున్న వ్యక్తిత్వము వైవస్వత మనువు కాలంలో వైవస్వత మనువునే ఆదిమానవునిగ ఉపనిషత్తులలో పేర్కొనబడినది. "వైవస్వతో మనుర్నామ, మాననీయోమనీషిణామ్".

వైవస్వత మనువుయొక్క రూపము ప్రస్తుత మానవరూపంగ మొదట రూపించిందని ఆ ఉపనిషత్తు చెప్పుచున్నది. ఇదే శ్రీ కృష్ణ భగవానుడు ఈశ్వర విషయం తెలిసికొనే శక్తి మానవరూపమైన వైవస్వత మనువునకు ప్రబోధింప బడినమాట తన భగవద్గీతలో పేర్కొనియున్నాడు.

"ఇమమ్ వివశ్వతేయోగం ప్రోక్తవాన్ అహం
అవ్యయం వివస్వాన్ మనువే్ప్రాః......"

వివాహాది శుభకార్యములందుకూడ "వైవస్వత మన్వంతరే" అని విప్రులు ఉచ్చరించడములో వైవస్వత మనువునుండే యీ మానవ రూప నిష్పత్తి కలిగినటుల నిశ్చయమగుచున్నది. అటువంటి మానవ రూపం యీ యుగంలో యెంతవరకు తనబుద్ధియొక్క వికాసమును ప్రయోజకము చేయగలిగినది అని విమర్శించిన భౌతిక రసాయన శాస్త్రమందు భూగోళమునకు అన్యంగావుండే ఇతరగోళాలను తెలుసుకొని వాటిలోగల విశేషములను సంగ్రహించుటకు పయనించిపోయి చూడ సమకట్టినది. ప్రయత్నము సాఫల్యము కాగలదనే ఆశతో నున్నది. ఇట్టి మానవత్వము "ఏతద్విషయేతత్పూర్వం ప్రాచీనం" ఇటువంటి కాలమునకు పూర్వము యీ మానవత్వము యేలాగుండేదని

ప్రశ్న వచ్చినప్పుడు ఆనాటి మానవుడు ఉపనిషద్రూపములో తెలియ బర్చియున్నప్పటికి అప్పటి మానవ విజ్ఞానము యేవిధముగ తెలుసుకున్నదో తెలియకపోయినప్పటికి మానవ విధానము జంతువు విధానము నుండి విజ్ఞానబంధురమైన తెలివియొక్క వికాసమున నొక అంతరము నుండి యింకొక అంతరమునకు నొకస్థితి నుండి యింకొక స్థితికి పయనించి తెలుసుకొనవలెనను ఊహ మానవజన్మకు స్వభావ సిద్ధమైనది. ఇది మూడు విధములుగ సృష్టిలో మనము వాఙ్మయముగ పరిగణించి మననము చేయుచున్నాము. 1. చరిత్ర, 2. రసాయనిక శాస్త్రము, 3. అధ్యాత్మికము.

చరిత్ర :- ప్రస్తుత వర్తమానకాలమునకు పూర్వము జరిగిన విశేషములను వాఙ్మయముగ చిత్రించిన విషయము.

రసాయనికము :- చరిత్రను పురస్కరించుకొని లోకములో భౌతికముగ గ్రహించిన అభౌతిక శక్తిని భౌతికముగ నిరూపించునది.

అధ్యాత్మికము :- మానవాతీతమై సర్వశక్తివంతమై "సత్తు" గ యున్న యదార్థమును తెలుసుకొను వూహ. వూహాతీతముగ మార్చు విధానము వేదాంతరూపము అధ్యాత్మికము. ఇది చరిత్రను పురస్కరించుకొని రసాయినిక వేద్యమైన స్థితికిమించి దానిని తలదన్ను మహా విషయము అధ్యాత్మికము దీనికి వునాది.

చరిత్ర రూపముగ వెలసియున్న రసాయనశాస్త్రము (Science) ఈ సైన్సుయొక్క అంత్యము తరువాత మొలకెత్తు వూహయె అధ్యాత్మికము. కారణము యిప్పటి రసాయినక శాస్త్రవేత్తలు గణణీయమైన విషయంగా దీనిని గ్రహించినప్పటికి ఈశ్వర సంభూతమైన మహాశక్తి స్వరూపమైన రస స్వరూపమునుగూర్చి ప్రశ్నించినపుడు నమస్కరించి మౌనము వహించుచున్నారు. "ఆ విషయము తమకు యీా షత్తు తెలియదని నొప్పుకొనుచున్నారు".

ఇంతవరకు వచ్చిన మానవుడు మానవుడుకాడు. ఇంతటి రసాయనికవేత్తయయిన మానవునిగూర్చి ప్రస్తావన వచ్చినపుడు యిట్టి శక్తివంతుడైన మానవుని చేతికి నొకసాధారణ అల్పజీవి అయిన "వొక యీగను పట్టియిచ్చి దాని రెక్కలను త్రుంచి తిరుగ అతికించి సహజరీతిని యెగురునట్లుచేయ్యగలవా" అని "ఖురాను". దీనినిబట్టి చూచిన ఈశ్వరశక్తి ప్రమోల రసాయనికవేత్తయొక్క నైపుణ్యము శక్తి అతి అల్పమని తెలిపోయినది.

ఇటువంటి మానవునియొక్క బుద్ధి వికాసములకుమించి తెలియబడేటువంటి విషయము తెలుసుకొనుటకు ప్రయత్నించు వ్యక్తిత్వమే మానవ వ్యక్తిత్వము.

ఇది అనేక జడ జన్మల వూహలలోబడి నాశనమై మోసగాండ్రకు ఉపయుక్తమై మానవుని చీకటికూపములో పడద్రోసి నాశనమునకు దారితీయుచున్నది. యదార్ధమగు విషయమును తెలుసుకొన్న మానవుడు అనగా ఈశ్వర సంభూతమైన జగద్రూపముగ మారిన మానవుడు మానవదృష్టికి అగోచరుడుగ నుండును. అటువంటి మానవుని గూర్చి అతని రూపు చిత్రణ భగవద్గీతలో

"యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు
యుక్త స్వప్నావబోధస్య యోగేభవితి దుఃఖః॥

అనగా యోగరూపుడైన వ్యక్తి అందరి మానవులవలెనే యుండును. అతని గూర్చి అతని పరోక్షమందు విమర్శనలు హర్షణీయములై ఉపమానయుక్తముగ నుండును. అతడే జగద్రూపమయిన యోగము సాధించిన యోగి. ఆటువంటివాడు జగత్తులో సాధారణుడుగను ఆదరికి లభ్యుడుగను యెచ్చోట నున్నప్పటికి పూజ్యుడుగను నుండగలడు. అతని అలవాట్లు నడవడికలు యుక్తాయుక్తములు తెలుసుకొనునవిగ యుండును.

ఇటువంటి యోగియైన వ్యక్తిని చెట్లు, పశుపక్షి, మృగాదులు గ్రహించ గలవు. ఆతనిని గ్రహించు మానవ వ్యక్తిత్వము అతని యంతటి శక్తివంతమైయున్న ఆత్మ అతనిని గ్రహించి దరిజేరి తెలుసుకొని అలా తెలియబడినవ్యక్తి తనను ఆతనియంతటివానినిగ జేసినప్పుడు తాను విశ్వరూపిగా యున్నాననే నిశ్చయమునకు వచ్చి ఇంతటి నిశ్చయమునకు తీసుకొనివచ్చిన వ్యక్తిని సర్వవ్యాప్తంగా యున్నట్లు గ్రహించినవాడు మానవుడు. సృష్టి సమ్మిశ్రితమయిన పంచభూతములను, ఒకచోట చేర్చి చూచినట్లయిన తనదృష్టికి, మానవరూపముగ, రూపించక మానదు.

ఈ విషయము భారతమందు భారత యుద్ధాంతమునందు నొక పక్షి నరమాంసము కోరినప్పుడు యుధిష్ఠిరుడు పడియున్న పీనుగులను చూపించి "ఇందరి మానవ కళేబరములు శవములుగ పడియుండగా నర మాంసముకొరకు అర్చుచున్నావేమి?" అని అడిగినప్పుడు యుధిష్ఠిరుని ఆ పక్షి తన రెక్కలజాటున నిలిపి ఆ పడియున్న శవములను చూపించినప్పుడు అవి మానవ కళేబరములుగా కాక జంతుసముదాయములైన కళేబరములుగ కనిపించిన సంగతి యెల్లరకు తెలిసినదే.

ఆ శవ సమూహములో మానవుడన్నప్పుడు జగద్రూపిగాన అది జగద్రూప పరిణామముపొంది ఆ జంతుజాలమునుండి అదృశ్యమగుటచే శవరూపములోలేదు. మానవుడన్న శబ్దము వచ్చినప్పుడు అది విశ్వరూపమని చెప్పవలసి యున్నది.

ఎవడు మానవుడు అనిపించుకొనునో ఆ ఆత్మ జగద్రూపముగ యున్నప్పటికి భ్రాంతిజన్యమైన ఆశాబద్ధ అజ్ఞానతిమిరములోబడి జంతువుగ మారిపోవుచున్నటువంటి విషయము తెలుసుకొని అటువంటి విషయానికిపోక మానవరూపముగానున్న జగద్రూపము నీకు గురువుగా లభించినప్పుడు ప్రయత్నించి బడసి నీవుకూడా జగద్రూపిగా మారిన విషయం నీ ఆత్మ నీకు సాక్ష్యమిచ్చినప్పుడు నీవు మానవుడవు.



# తల్లి - తండ్రులు



తండ్రి :— మానవ జీవితావధిలో ప్రయాణము చేయునపుడు బాల్యం తరువాత యవ్వనం, కౌమార్యం యీ రెంటి మధ్యకాలంలో వివాహ క్రతువు నెరవేర్చవలసి యున్నది. వివాహానంతరం దాని పరిణామం సంతానంగా తేలుచున్న సంగతి అందరికి తెలిసినదే. ఈ సంతానము కలిగిన తరువాత మానవుడు తండ్రి అని అనిపించు కొను చున్నాడు. ఈ సంతానముగ వచ్చిన మానవరూపము తండ్రి యను వ్యక్తిని గ్రహించ వలసిన సంగతి అవసరమై యున్నది. తన వూహ యందు తండ్రి రూపము నిలిపి విమర్శనా దష్టికి తన వూహను పోనిచ్చిన జడజన్మల కాకరమైనటువంటి నా ఆత్మ మానవ వ్యక్తిత్వం దాల్చుటకు కారణభూతుడు. సృష్టియందుండు మానవునికి కలుగు జ్ఞానా జ్ఞానముల వివక్షతను తేల్చుకొని అజ్ఞానతిమిర గాడాంధకారము నబడి జడజన్మలకు పోకుండా ఈశ్వరవిషయం తెలుసుకొని జన్మరహిత పరిణామము నిర్వాణమునకు కారకుడైన ఈతడు సదా పూజనీయుడు అని దాని అంత్య పరిణామము తేల్చుకోగలుగుచున్నాడు. తన వూహలయందు ఆతను తన జడజన్మలను వూహించి ఆ జడజన్మలు తన దృష్టికి గోచరించినప్పుడు తానుకూడా యిటువంటి జడజన్మలలో క్రమ్గి తిరుగ జడజన్మలకు పోయే స్థితిని యీ మహనీయ వ్యక్తియొక్క తపః ఫలమువల్ల యీ ఆత్మ మానవవ్యక్తిత్వముపొందుటకు కారణమైన దని నిశ్చయించవలసియున్నది. ఆ తరువాత తన బాల్యమునుండి యవ్వ నము వచ్చేవరకు తండ్రి రూపమున తీసుకొనవలసిన జాగ్రత్తలను విమర్శించు కొనవలసియున్నది. తన ఆరోగ్యాన్ని శ్రేయస్సులను తన అదృష్ట, యశస్సులను పురస్కరించుకొని తన తండ్రి యెంతటి శ్రమలు పడియున్నాడో మాటి మాటికి స్మరణకు తెచ్చుకొన్నప్పుడు ఆ తండ్రి

యందు చూపవలసిన ఆధిక్యత, భక్తి, విశ్వాసము, ద్విగుణీకృతము కాకమానదు. అటువంటి మహనీయ వ్యక్తిని తన ఆత్మయందు పూజించవలసియున్నది. ఒకనాటికి తానుకూడా తండ్రిగా మారినప్పుడు తన సంతానమునుకూడా అంతటి విధానముగ పడిపించి, తన సంతతియొక్క యశోకీర్తులకు తన తండ్రివలె తానుకూడా బాధ్యుడై యున్న సంగతి మరచిపోకూడదు.

మానవరూపంలో యీ సృష్టియొక్క చిత్ర విచిత్రములను పరికించు యీ ఆత్మకు కలిగించిన భాగ్యము తండ్రియొక్క తపఃఫలమే. ఏ తండ్రి తన సంతతిని యశోధారులుగచేయునో అతను తండ్రి. అతడే ప్రేమమూర్తి. దీనికి భిన్నంగ నుండి తండ్రి అనుపించుకొనువాడు వాని యశోకీర్తులను మాయింప జేసుకొని జడ జన్మలకు పోవుటయేగాక తన సంతతినికూడ అజ్ఞానులుగమార్చి జడజన్మలకు దారిచూపువాడగుచున్నాడు. కాన నీవు తండ్రి అను స్థానమును అలంకరించునపుడు తన సంతతికి ఉత్కృష్టమైన గౌరవాధిక్యములు కలుగునట్లు చేయుటయేగాక తాను గడించిన యశస్సు తన సంతతియందు కీర్తింపబడునట్లు యెవడు చేయగలుగుచున్నాడో వాడు తండ్రి.

తల్లి :— తల్లి అన్నప్పుడు స్త్రీవాచకమున అపురూపమైన ప్రేమస్వరూపము. వివాహానంతరము భార్యగా పేర్కొనబడి ఆరాధదైవంగ భర్తను పూజిస్తూ గర్భము దాల్చుటకు యెన్నో నోములు నోచుచున్నది. ఆ నోములపంటగా వచ్చిన సంతానమును నవమాసములు మోయవలసిన సంగతి తనకే తెలియును. యేనాడు అటువంటి సూచనలు కనబడినవో ఆనాటినుండి ఆమెలో అపురూపమైన సంతోష ఆనందములు వూహారూపములో దినదిన ప్రవర్ధమానమై నవమాసములు మోసి యీ తొమ్మిది నెలలందుకలుగు యిక్కట్లకోర్చి తన శరీరమును ఆహుతిజేసి అందులో కలుగు శ్రమలను లెఖ్కచేయక మాసములునిండి ప్రసవించు సమయమందు ప్రాణాలపై ఆశలుకూడా

వదలుకొనవలసినంతటి ప్రసవ వేదనకు పాల్పడి శిశువు పుద్భవమైన తరువాత ఆ సంతతిని చూడగానే ఆ తల్లియందుకలుగు ఆనందమునకు విలువ కట్టలేము. అంతటి ప్రేమరూపములో తానుగన్న శిశువును జూచి ఆ ఆత్మ అభౌతికంగ యెంత సుఖమును అనుభవించునో ఆ తల్లి ముఖవర్చస్సులను చూచినప్పుడు తెలియకపోదు. అది అపురూపముగా వున్నదిగాన ఆ తల్లి దేవతాస్వరూపమని తెలిసిన మానవస్వరూపము నకు విదితము కాకమానదు.

అటువంటితల్లి తన సంతానముయొక్క ఆరోగ్య చిరంజీవప్రాప్తి మునకు లోలోపల యెంతయో సాధనారూపమైన తపస్సు తపస్వినియై తాపసిగామారి రక్షింప సమకట్టును. ఆ శిశువుయొక్క జీవమునకై ముందు తన ప్రాణములను నిలిపి కాపాడ సమకట్టును. ఆమెయే తల్లి శిశువుయొక్క ప్రాజ్ఞతకు భవిష్యత్తుకు తల్లియే మూలకారణము. తన సంతతి యశఃకీర్తులు వెలార్చి ప్రజా దృష్టికి వుత్కృష్టమైన స్థాన మలంకరింపజేయు బాధ్యత తల్లిదై యున్నది. అటువంటి స్థితికి వచ్చు టకు పునాదియే తల్లి. అటువంటితల్లికి పుట్టిన సంతానము ఆ తల్లిని యే స్థితిలోపెట్టి పూజించవలెనో ఆ సంతానముయొక్క ఆత్మలు అను భవరూపంలో గ్రహించి ఆగ్రాహ్యం ఆ తల్లియందుచూపు విధేయత యందు కనపడగలదు. అటువంటిస్థాన మలంకరించినట్టి ఆమెయే తల్లి. తల్లి యుత్కృష్టత గడించిన సంతానమె సంతానము. సర్వమానవ వ్యక్తిత్వమునకు తల్లియొక్క గుణగణముచే ఆకరములు.

పైన పేర్కొన్న వర్ణనకు భిన్నమై ప్రకృతి ఆశాబద్ధమునకై లోనై తన సంతానమును దుర్గుణముల కాకరమైన ప్రజాదృష్టికి దూష్యమనిపించు ప్రవర్తనలకు పాల్పడునట్లు చేసి దుర్యశస్సుకులోనై తన సంతతిని దండనార్హులుగా చేయు తల్లి తల్లికాదు పిశాచము.

— ✱ —

# భార్యా - భర్తలు

—★—

సృష్టిలో మానవగణంగా వున్న రూపంలో భార్యా-భర్తలను విషయం సామాన్య పరిపాటి అయినది. భార్యా అన్నప్పుడు స్త్రీవాచకమున్ను భర్త అన్నప్పుడు పురుషవాచకము. ఇది వారివారి కులమత ఆచార విధానమునందు కార్యకర్తృత్వమునందు తంతులమూలకంగా సభాసమక్షమున పురోహితుల ఆశీర్వాద ప్రామాణికమైన విధులను నిర్వర్తించి వివాహమునుపేర జంటలుగా పేర్కొని భార్యాభర్తలను చున్నారు.

ఇది ఆశీర్వాద రూపంలో జీవితకాల పర్యంతము యీ విధంగానే వారిజంట విడిపోవనట్లుగా కలసిమెలసి యుండునట్లు ఆశీర్వదిస్తూ ఆచాగుండగలమని ప్రమాణము చేయిస్తూ స్వీకారం చేయిస్తూ యున్నారు. సృష్టియొక్క వైచిత్ర్యము అటువంటివారిని కాలము వేరువేరు పంధాలనుబెట్టి యెందుకు కొరగానివారిగా చేయుచున్నది అందుచేత దాంపత్యరూపంలో సృష్టియందు తన మనుగడ చాలా ప్రమాదమయినది.

భర్త : పురుష వాచకంగా ధ్వనింపబడే ధ్వని భర్తయని ధ్వనింపజేయ వలసియున్నది. ఎప్పుడైతే తాను సృష్టియొక్క దృష్టిలో భర్తగా నిరూపింపబడినాడో తాను తనకు తెలియని నొక స్త్రీ రూపముచే ఆకర్షింపబడినట్లు తెలుసుకొని ఆమెకు ఏ విధంగాను గౌరవంలోను ఆదరణలోను లోటు రానియ్యక దయాకృపణత్వము, జాలి, పుట్టిపడునట్లు తన అంతర్యమునందు రూఢపరచి అనుభవమందు ఆస్త్రీ వ్యక్తిత్వము తెలుసుకొని ఆనందపరవశయై భర్తగానున్న వ్యక్తిని ఆరాధదైవంగా పూజించవలసిన స్వాభావికస్థితి ఆమెలో నిరూపింపవలసియున్నది. ఈ విధమైన పరిణామమునకు తీసుకొచ్చినవాడే భర్త.

భార్య :— భార్య అన్నప్పుడు స్త్రీవాచకమైన పదములో తెలియ బడుచున్నది. ఈ వ్యక్తిత్వము అతీతమయిన సహసరూపంగ మారి తన కార్య కలాపములను నిర్వర్తించుచు సృష్టియందు ప్రతిదానిని విమర్శిస్తూ యేది స్త్రీ త్వము భార్యగా మారిన విషయమునకు కళంక పరచునో దానిని నిరసించి నిష్కళంకమయిన విధానమును తన మనుగడ యందు నిరూపణ యగునట్లు యే సమయమునందును ప్రకృతిని దృష్టి యందు పెట్టి తన జీవిత పురోగమనమునకు తానొక అపురూపమైన దేవతగ తన కన్యంగా నుండు వారి దృష్టికి నిరూపింపపడవలెను. కావున తనభర్త హృదయమందు నిర్మించుకొనిన స్వర్గ సౌధాలను చూరగొనుటకు (బడయుటకు) భర్తగానున్న వ్యక్తిని అనంతమైన ఆప్యాయత, ఆత్మీయత, సాధుత్వము, సౌశీల్యములను పైకి తెలియ బడకనే తెలియబడునట్లు ప్రకటితము కావలెను.

ఆమె మాటలయందు సౌమ్యత, ఆలోచనయందు దిట్టరితనము కార్యకలాపములందు బాహుళ్యము, తనపనులు నిర్వర్తించునప్పుడు సహనము. నొకరిదృష్టికి విమర్శనకు రాకుండునట్లు సహజత్వము, భార్య అను స్త్రీయొక్క సౌజన్య రూపములు. అదియే భర్తదృష్టికి ప్రేమ స్వరూపము. ప్రేమ ప్రణయ స్వరూపము ఆమెయే భార్య.

వివాహము :— వివాహ మనునది భౌతికమైన వేదోక్త మంత్ర విషయములతో కూడిన విధానమేకాక, అభౌతికమైన ఆత్మీయ యేక త్వములో నిరూపణ కావలసియున్నది. వివాహ రూపంలో భార్యా భర్తలుగ వచ్చిన దంపతులు జంటగ అభిన్న దృక్పథంతో తమ జీవితావధిలో పయనించి యున్నప్పటికి దానికి భిన్నతగా విడిపోవడం కూడాజరుగుచున్నది. కొబట్టి కేవలం మంత్రప్రోక్తమయిన వివాహ రూపంతో భార్యాభర్తలు అని నిర్వచించినంతమాత్రాన పై విషయం సరిపోవడంలేదు. "షిరీన్ ఫరహాద్", "లైలామజ్ను" వారు వివాహ

రూపంలో భార్యాభర్తలు కాకపోయిన ఆత్మీయ యేకత్వములో భార్యభర్తలుగ నిరూపింప బడుచున్నారు. కాబట్టి ఆత్మీయ యేకత్వ మన్నప్పుడు అది స్త్రీ ఆత్మగాని పురుషాత్మగాని కాకుండా కేవలం యేకత్వ ప్రతిపాదకమై అభిన్నమైన యప్పుడు అది ఈశ్వరత్వమే తప్ప వేరుకాదు. ఇటువంటి యేకత్వ ప్రతిపాదనలో కూడ భ్రాంతి శక్తి ఆవహించి నిరూపణగా పరిణమించినప్పుడు ఇరువురు సద్గురు ప్రబోధితులై గురుమహాశక్తిని స్మరణలో తెచ్చినయెడల ఆ భ్రాంతి శక్తి యొక్క మాయాస్వరూపము వేరై భిన్నమై మాయమూపై నిజము వెల్లడై అందు విరక్తివచ్చి భిన్నత్వమును వదలక మానదు. ఈ స్థితిలో సాధకులకు అగ్నిపరీక్షగ యుండును. ఇటువంటిస్థితిలో నున్న వానికి సద్గురువు గురువుగానుండిన అతను భౌతికంగానో అభౌతికంగానో సాక్షాత్కరించి ఆయా విషయాలను సమర్థనీయమైన స్థితికి తీసుకొని రావలసి యున్నది. అది వారి అనుభవంలో తేల్చబడి ఆత్మీయ యేకత్వమైన ఆనందము కలగజేసి ఆధ్యాత్మిక తత్వజీవులుగా మార్చి వేయబడినప్పుడు అది తమ అనుభవంలో తెలిసికొన్నప్పుడు వారి సుఖ జీవన ఆనందమునకు మేరలేదు. ఇది కేవలం ఈశ్వర సన్నిభమైనది. పై విధంగా వచ్చిన వ్యక్తిత్వములే రాధామాధవులు. శ్రీ అయేషా మహమ్మద్ ప్రవక్తలు. వీరి జీవితములను గ్రహించి తెలుసుకొనవలసి యున్నదిగాన తెలుసుకొనెదరుగాక.



# పవిత్రత



మానవ దృక్పథంలో పవిత్రతా అనేది అపురూపమైనది. దానిని తేలికైన విషయంగా జారవిడచుచున్నారు. పవిత్రతా అన్న ప్పుడు లోకంలో సుచియని యాసుచి అన్నప్పుడూ దాని అర్థము స్నానముచేసి దేహమును సుభ్రపరచటములోను భౌతికంగా దేహమందు అసుచియను విషయ మనిపించేచోట నీళ్ళతో సుభ్రపరచేవిషయం, దేహం శుభ్రమైనదని నిశ్చయించి శుభాశుభ · కార్యములైనప్పుడు స్నానముచేసి తృప్తి పొందుచున్నారు. ఈ సుచికి పవిత్రత అను నామ ముతో పిలవాలంటే ఆత్మకూడా జ్ఞాన జలముచే స్నానముచేసి సుచి త్వము బడసినప్పుడు పవిత్రుడగుచున్నాడని పేర్కొనుచు భౌతికమైన దేహమును స్నానరూపమునను - ఆత్మీయమైన విషయము జ్ఞానమనే క్రమబద్ధమయిన కార్యకలాపముల వలన ననగా కర్మరూపములో ఆచ రించు ప్రతివాక్కు ప్రతికర్మ ప్రతిదృష్టి పవిత్రమయిన సుచి సుభ్రదతో కూడిన పై రీతిగ నుండవలెనని ప్రబోధకుడు తన శిష్యులకు బోధించే విషయాలలో వాక్సుద్ధియన నదియుండవలెనని (అనగా సత్యమే పలుకవలెను. అబద్ద మాడరాదు) దృష్టివిషయము వచ్చినప్పుడు ఆ దృష్టి కళంకరహితమయిన చూపులుగా నుండవలెనని కర్మ రూప ములోకార్యకలాపములు చేయునప్పుడు సర్వజన సమ్మతముగా నుండ వలెనని, తన నడువడిలో మనుగడలో చాలా పవిత్రత రూపించవలసి యుండవలయునని ప్రబోధించుచున్నారు.

కాని ఆధ్యాత్మికంగా చెప్పవలసి వచ్చినప్పుడు యీ శరీర విష యమయి చెప్పినప్పుడు ప్రపంచ విధానమును మరచి మానసికమయిన విషయంపై మోసి ప్రబోధరూపమయిన మంత్రము ధ్వనిరూపంతో సాధనాక్రమము ఆచరించునప్పుడు అదితప్పక ముక్తి నీయజాలినదైతే

నదీ ముందుకు సాగు పరిస్థితిలో జడజన్మలకు తీసుకుపోవు భ్రాంతి మహా శక్తి ఆవహించి ఆ సాధకుని ఆధ్యాత్మికమయిన బాటనుండి తిరోగ మింపజేసి నాశనమునకు గొనిపోవ చూచుచున్నది. అటువంటి విధా నంగా మారిన వ్యక్తిత్వంతో చార్వాకులు ఈశ్వరవిషయం వదలి భౌతికవాదులై ప్రపంచకమందు తనకు ఆనందము నిచ్చునట్టి విధా నమే మానవుడు తెలుసుకొనవలసిన విషయం తప్ప అది పవిత్రతా పవిత్రత విచక్షణ అవసరంలేదని పవిత్రతా విధానమున మానవాతీత మయిన ఈశ్వర విషయం ఆవసరమయినదని వారివారి మతస్థులకు ప్రబోధించుచు ప్రతివిషయం పవిత్రతగ యున్నను అపవిత్రతగ యున్నను లెఖ్ఖచేయక మానవుడు లభ్యమయిన ఆనందమును అనుభ వించడమె ఆశయమయిన బ్రహ్మస్వరూపమని అంతకంటె వేరులేదని చెప్పి ఆ ఆనందమునకై ప్రయత్నముచేసి కడకు "విధినిషేధములేటికి పవిత్రుడౌనెడన్" అనుమాటను పురస్కరించు కొని యీ ఆనందము స్త్రీ పురుష సంభోగములందు కలుగు ఆనందమును స్థిరపరచి దానికి దేహదారుఢ్యము అవసరముగాన పాషాణనోషధి ఫలాదులలోగల శక్తిని గుణములను తర్కించి విషయేచ్ఛలను ప్రేరేపణచేసి అపవిత్ర మయిన లిప్తానందమును సంభోగమున బడసి కొన్నాళ్ళు తృప్తిపడి కాలము గడచినకొలది నా యీశక్తి సన్నగిల్లి నా యీనందము మటు మాయమయి తుదకు చార్వాకమతము నశించినను వారు చెప్పిన సూత్రప్రాయమయిన మాట "విధినిషేధము లేటికి పవిత్రుడౌనెడన్" అను మాటను పురస్కరించుకొని అచలమతసిద్ధాంతమున క్రోడీకరించి ఆత్మ పవిత్రమయినదని, దేహముతో చేయు కర్మతో కూడిన కార్య కలాపములవలనవచ్చు నికృష్టత దేహమునకే గాని పవిత్ర ఆత్మకు అంటవు గాన యీ దేహం కాలి బూడిదై పంచభూతములలో లీన మగుచున్నదనిన్ని మరి ఆత్మ బైలులో కలసిపోవుచున్నదనిన్ని అచల ప్రబోధకులు అతి హేయమయిన అసహ్యకరమయి అపవిత్రతను

పవిత్రత అని బోధించి వొప్పించి వారివారి విషయేచ్ఛలను తీర్చు కొనుటయందు కల్గు ఆనందమె యదార్థమయిన ఆనందమని యింకా వేరే పరమార్థము లేదని నది అచలమని అచలమనగా "రాయి" యని చెప్పబడినను అది స్థిరత్వమున కర్థము చెప్పి ఆ స్థిర త్వము వచ్చినప్పుడు పరిపూర్ణమని ప్రబోధ ప్రచారములచే వారి అను చరులను నీచాతి నీచమయిన విషయకూపములో దింపి వారి జన్మలను నాశనము చేసుకొనడమేగాక వీరి వెన్నాడువారి జన్మలనుకూడ నాశ నముచేసి భూత ప్రేతాదులుగ జన్మించునట్లు, మారునట్లు చేసుకొను చున్నారు.

దీనినే యదార్థమైన తాత్వికుడు తత్వరూపములో ప్రబోధించు నప్పుడు విధినిషేధముల రెండింటిని విడదీసి క్రమమును తెలుపవలసిన బాధ్యత తనపై మోసియున్నదని తెలుసుకొని విధినిగూర్చి చెప్పు నప్పుడు

విధి :— మానవునికి వూహ కలిగినప్పుడు తనకు లభ్యమై సాక్ష్య ముగ యున్నవిషయం తన తెలివితో సమర్థించుచు తనబుద్ధిని అతిక్ర మించి తన తెలివికి అందనంతదూరమై తనకు తెలియని పరిస్థితులలో కలుగు స్థితులకు కార్యకలాపములందు కలుగు పరిణామమునకు విధి యని చెప్పవలసి యున్నది. భౌతికమైన విషయమందు తాను తప్పక చేయవలసిన కార్యకలాపములు నియమబద్ధమైన వాక్కు వీటిని సమ ర్థించు విషయము విధియని చెప్పవలసి యున్నది.

నిషేధము :— నిషేధమని ప్రపంచకమందు మానవుడు తలచు వారి వారి కులమత సాంప్రదాయములనుబట్టి భౌతికా భౌతిక విషయా లలో కొన్ని నియమబద్ధములను స్థిరపరచి వాటి కన్యంగా నుండు వాటిని నిషేధము లనుచున్నారు. మహమ్మదీయులు పందిమాంసమును నిషేధింప హిందువులు పశుమాంసమును నిషేధించుచున్నారు. శాఖా హారులు పై రెండింటిని నిషేధిస్తే, ఫలక్షీరాన్నహారి పై శాఖాహారిని

నిషేధిస్తూ యున్నాడు. ఈలాగునే వారివారి మతానుసారము భిన్న భిన్న కర్మ కలాపములు విధులై నిషేధములుగ నున్నవి.

ఒక మతముయొక్క కర్మకాండ యింకొక మతమువారికి నిషేధమయి యున్నది. కాని నొకరి నొకరి నిషేధింపవిషయాలను నొకే విధాన మయినచోటున నిలిపి చూచి వారి వారి శరీర అవయవముల సౌష్ఠవము నొకే పరిస్థితిలో వున్నసంగతి ప్రతివానికి సుబోధకమే. అందుచేత

"విధియు నిషేధముల్ విడిచిపెట్టితివేల స్వతంత్ర జీవిత
ప్రధిత విలాసముల్ బడయవచ్చితివా అవి నిష్టకంటె న
త్యధిక తరంబు కష్టముసుమా. అపకీర్తి శిరానబెట్టి ఈ
పృధిని తృణంబుకంటె కడుహీనునిగా తలపోయునేర్తువే.

అన్నాడు తత్వవేత్త.

ఈవిధి నిషేధములు తెలుసుకొని ప్రతిదానిని విమర్శించి పాటించుట యనునది మానవ యసాధ్యము. ఆ వ్యక్తి ప్రపంచకములో జీవితములో నొక్క అడుగైన ముందుకు వేయలేడు. కాన మానవుడు ఈ "విధి నిషేధము" లను విషయములను తెలుసుకొని పవిత్రు డగుటకు ప్రయత్నించు వ్యక్తి తన జీవితమందు తనమనుగడలో తన నడవడి యందు తనవాక్కు, తనదృష్టి, తనవూహలో యప్పటికప్పుడు యే సమయాని కా సమయం తనలోతాను విమర్శించుకొని దాని అంత్య పరిణామము తేల్చుకొని ఆ తేలినవిషయంలో పరులయందు విమర్శకు వచ్చినప్పుడు అవి మంచిగా రూపించి వాటిని చెప్పువారు వినువారు ఆ ఉపమానము వారి జీవితమునకు అంకురింప జేసుకొనునట్లు రూపించునప్పుడు విధినిషేధములను వేరుచేయగల్గు హంసను బోలిన వ్యక్తిగ మారి యట్టి విమర్శకు పాల్పడక ఆదర్శ జీవియై ప్రజాదృష్టికి పవిత్రుడుగ రూపించగలడు.



# శీ ల వం



శీలమనునది ప్రకృతి సిద్ధమైన సృష్టియందు మానవరూపము పొందిన ఆత్మ శుచియగు రూపములో చెప్పినమాటను అనుభవంతో చెప్పేవిషయం శీలమునకు తార్కాణము.

స్త్రీ లైనప్పుడు పాతివ్రత్య ధర్మము అగ్నిసాక్షిగ వివాహ రూపంలో నిర్మాణమైన వ్యక్తిని భర్తగా నిశ్చయించి ఆ వ్యక్తిని ఆరాధదైవముగ పూజించుట శీలము. పురుషుడైన అగ్నిసాక్షిగ వివాహ రూపములో వచ్చిన స్త్రీ యందే యేకపత్నీవ్రతమను విష యము వెలార్చుట యనిన ఆమెయే స్వర్రూపియని నిశ్చయించి ప్రేమరూపంగా మార్చి తనతో సమానమైన గౌరవముతో చూచి ఆదరించుటయే శీలము అనబడుచున్నది. కాని ఈ శీలమనునది మహా జలధి. దీనియందు స్నానముచేసిన శుభ్రత అనునది శరీరమునకే గాక ఆత్మనుకూడా శుచినిచ్చునది శీలము. ఈ శీలమను ధ్వని తన అనుభవ మునకు తీసుకొచ్చి తన మనుగడలో ప్రవేశపెట్టవలెనన్న చాలా దుర్ఘ టమైన విషయము. పైనిచెప్పిన వివాహ సంబంధమయిన ప్రేమారా ధనయే శీలమునకు మూలముకాదు. అంతమాత్రముచేత శీలవతియని, శీలవంతుడని పిలువజనదు. స్త్రీ అయిన తనభర్తకు అన్యమైన ఖిం కొక స్వర్రూపము అభౌతికమయిన తన దృక్కునందు అనుచు న్నది. దానిని అన్వేషించవలెనని భ్రాంతిజన్యమయిన నీ అంతర్వాహ ప్రేరేపించుచున్నది. పురుషుడైన తాను అగ్నిసాక్షిగ వివాహమాడిన భార్యకు అన్యమయిన స్వర్రూపము అభౌతికమయిన నీ దృక్కునందు గోచరించి నిన్ను ఆకాంక్షించుచున్నట్లు నిన్ను పిలుచుచున్నది. అటు వంటి స్థితిలోనున్న నీవు ఆమెను భౌతికంగ సంగ్రహించవలెనని నీ అంతర్వాహ ప్రేరేపించుచున్నది.

ఇటువంటి స్థితిలోనున్న భార్యాభర్తలు తమతమ శీలములను కోల్పోవుచున్నారు. ఈ వ్యూహా పరంపర దృఢమయి నొకరినుండి యింకొకరు విడిపోవుచున్నారు గాన శీలవంతు లనిపించుకొని ప్రజచే కొనియాడ బడవలెనన్న ఈ శీలమను పవిత్రత ఆపాదమస్తకమయిన భౌతిక శరీరమునందుగల అవయవములతో చేసెడి కర్మ సుచియయి నప్పుడు అది భౌతికమయిన శీలమనబడును. చేతులతోచేయు ప్రతిపని నీ ఆత్మకు స్థిమితమిచ్చునట్లు నుండవలెను. నీ కాళ్ళతో చేయుకర్మ నడకరూపంలో నీవువేయు ప్రతి అడుగునందును చూచువానికి ఆశ్చ ర్యము గొలుపునట్లుండవలెను.

నీకంటినుండి నీ దృష్టిరూపములో చూచుచున్న విషయము గ్రహించుచున్న విధానము నీ కనురెప్పలు సుచినే పాటింపవలయును. నీ చెవులతో వినే ప్రతీధ్వని నీవు అవగాహన చేసుకొని విమర్శించు కొని ఆ ధ్వనియందుగల మంచినే సంగ్రహించు నట్లుండవలెను. ఆఘ్రాణరూపంలో నీ ముక్కుచే గ్రహించు ప్రతివాసనా అంత్యమునకు సువాసనగనే నుండవలెను. (లోకములో అన్నిటికంటె దుర్వాసనగ యున్న అశుద్ధమును విమర్శించిన పంచభూతాత్మకంగావుండే యీ సృష్టిలో అది భూమియందు ఉద్భవించిన పదార్ధ రూపములయొక్క విధానమును విమర్శించిన అదిలో సమ్మిశితమయిన పదార్థములు సువా సనగనే యున్నట్లు తెలుసుకొనగలరు.)

ఈవిధముగనే కామ వికారమయిన భోగలాలసమందు అది కూడా తన తృప్తికి మంచిగనే అనిపించును. కాని దానినే విమర్శిం చితిరేని పరస్థలమును కాంక్షించునప్పుడు హత్యవరకు తీసుకొనిపోవును గాన నటువంటి విషయము వచ్చినప్పుడు నీ ఆత్మ నిగ్రహణ బలీయ పర్చుటయే శీలమునకు పునాది.

ఈ పైని చెప్పబడిన విషయము ప్రతి అవయవములయొక్క ఆధారమువలన గ్రహించినటువంటి విషయము విమర్శనారూపంలో దాని పరిణామము కడకు మంచిగనే తేలవలెను. నీ సంభోగావయవరూప మయిన వూహనీచవిధానముగా పోయినప్పుడు దానిని విమర్శించితివేని దాని పరిణామము హత్యలవరకు తీసుకొనిపోవును. గాన దానికి పాల్పడ వేని యే ఆపద రాదు.

ఇవి స్థూల శరీరముల యొక్క అవయవ రూపంలో అవయవ ములు గ్రహణరూపంలో శుచియని తేల్చువరకు విమర్శించిన స్థూల శరీరము శుద్ధతరూపంలో శీలవంతునిగమార్చి నిన్ను యే ఆపదకు పాల్పడనీయదు. ఇది భౌతికమైన శీలము.

అభౌతికమైనదిన్ని స్థూలశరీరమునకు ఆంతరంగిక మయినదిన్ని నూహాపరంపరలకు ఆకరమైన శక్తిస్వరూపము ఆత్మగాయున్న విష యము అందరికి తెలిసినదే. ఈ ఆత్మకు వునికియైనచోటు భావము. భావము నుండి వెలువడు వూహలు శుచియైన విధానములో ఆత్మశీల మనబడును. ఇది మానవ అసాధ్యము. దానినే సుసాధ్యముగా మార్చి తన ఆధీనమందు అనుభవరూపంలో తెలుసుకొనవలెనన్న తెలిసిన సద్గురువు ఆశీర్వాదమునతప్ప వేరు గత్యంతరములేదు. దేనికి సాధ్య ముగాదు. గాన నీవు నీ భావమునుండి వెలువడు కర్మరూపంగాయున్న కర్మేంద్రియములు గ్రహణరూపంగానున్న గ్రహణేంద్రియములందు కలుగు మార్పులపై వచ్చు వూహలు విమర్శనా రూపములో సుదూ రముగా పోనిచ్చితివేని నొకానొకచోట దెబ్బతిని అవూహలు పడిపోవు నట్లు ఆ వూహలకు అంతరాయము కలుగును. అవి వెనుకకు మరలి నప్పుడు దానియందే విమర్శన వెలువడును. విమర్శనకు రెండు బాటలు. సమానమైన స్థాయిలో ప్రయాణము చేయగలవు. ఒకటి మంచి యింకొకటి చెడ్డ. నొకటి సుకృతము మరియొకటి దుష్కృతము

యేవిషయమందు మానవునిబుద్ధి సమ్మిశ్రిత మగునో దానియొక్క పరిణామము దుష్టులకు దుష్కృతము శిష్టులకు సుకృతము కలుగజేయును. ఈ స్థితికి వచ్చినప్పుడు శుశీల మనునది శాంతము ఆనందమును యిచ్చును. దుశ్శీలము దుఃఖాకరమె కాకుండా శరీరమును, ఆత్మను కూడా నాశనము చేయును.

ఈ విధముగ ప్రతి లిప్తకాలమందు కలుగు నూహా జన్యమును విమర్శించి దాని పరిణామము సుఖప్రదముగ తేల్చుకొనుటయే శీలము. దానిని నొకమాటలో చెప్పవలెనన్న నీవుచేయు ప్రతిపని నీవు వేయు ప్రతి యడుగు విమర్శించుకొంటయేగాక నీవు యేచోటనున్నప్పటికి, నీవు యెటువంటి విషయములో నున్నప్పటికి నిన్ను శీలవంతునిగా యెరిగి కాలమే నీకు నమస్కరించవలెను. నీ యందుండే శీల మహాశక్తియొక్క గుప్పెటలో యీ యజాండ ముండవలెను. నిన్నుచూచిన వారు నీ పరోక్షమందు మంచి వుపమానముతో నిన్ను శీలవంతునిగ పేర్కొనవలయును. ఈ విధమై ఆదర్శప్రాయమై, నీ జీవిత మనుగడ సాగించుటయే శీలము.

# ప్రేమ



ప్రేమ యనునది అపురూపమయిన పలుకు. దానిని తెలుసుకొనవలెనని పిపీలకాది బ్రహ్మ పర్యంతము ప్రయత్నము చేయుచున్నమాట నిజము. ఇది నానా ముఖములతో నానా రూపులుగ నానా కళలుగ వెలార్చు మహనీయమయిన అంతశ్శక్తి. దానిని ధ్వనిరూపములో పలువిధములుగ పొగడినారు. యేది పొగడబడినదో యెవరు పొగడినారో వారికి కూడా ప్రేమ అనునది తెలియలేదు.

ప్రేమ సృష్టి రహస్యమని కొందరు, ప్రేమయే ఈశ్వరుడని కొందరు, శివజీవైక్య సమ్మేళనమే ప్రేమయని కొందరు సృష్టి సమస్తము ప్రేమ మయమని కొందరు, ప్రేయసీ సమాగమరూపమే ప్రేమయన్ని కొందరు, పలువిధములగు వూహలు వ్యాఖ్యల రూపములో వెల్లడింపుచున్నారు.

ప్రేమ యనునది మానవుడు భౌతికముగ పలువిధముల పలు రీతులలో చూచుచున్నాడు. వాటిలో ముఖ్యమయినది తల్లిప్రేమ. జీవజాలమునందు తల్లిరూపముగా వచ్చిన ప్రతిజీవి తన సంతానమును ప్రాణాతీతమయిన విషయముగ పరిగణించి ప్రేమను వెల్లడించు చున్నది. స్త్రీ పురుష యవ్వనమందు మోహ హావ భావములయందు చూపు ఆసక్తి ప్రేమ. సోదర సోదరీలందుగల అన్యోన్యత ప్రేమ. తండ్రి తన సంతానమునుచూచి సంతసించునది ప్రేమ, పశు పక్ష్యాదులుకూడా తమ ప్రస్తుత కాన్పుగానున్న వాటియందుచూపు జాగ్రత్త కూడా ప్రేమ. ఒక వస్తువును చూచి ఆశించువిషయము ప్రేమ. వధూవరుల ఆనందదాయకము ప్రేమ. ఈ పై విషయములను పురస్కరించి కొని ప్రేమగా చిత్రించబడినది కాని ఇది ప్రేమ అనుట సాహసము.

ప్రేమయే సృష్టియనునది నిజమైన యీ సృష్టి ఈశ్వరుని నుండి విడిపోదు. ఈశ్వరుడే యదార్థమగు ప్రేమ మయుడైయున్న స్వర్గ నర కాలుండవు. శివజీవైక్య సమాధియే ప్రేమయన్న శివుడను శుభప్రద మైనశక్తి ప్రేమ మయమైతే జీవమనునది లేనేలేదు. సృష్టి సమ స్తము ప్రేమ భూయిష్ఠమైన దోష ద్వేష దూషితమైన స్వభావము లుండవు. ప్రేయసీ సమాగమమే ప్రేమయని యేకరూప నిష్పత్తి యుండవలెను. కాని యదిలేదు. దాంపత్యమున వివాహమునకు పూర్వమున్న ప్రేమ వివాహానంతరము కాలము గడిచేకొలది వారి హావ భావములందు విరక్తి కలిగిన ఆ ప్రేమ ప్రళయంగా మారును.

తల్లియందు నిజమయిన ప్రేమయున్న సంతానము పెరిగిన వారియందు ద్వేషము పెరుగకూడదు. స్త్రీ పురుషులందు కనపడు మోహ హావభావములైన ఆసక్తియే ప్రేమయనుకొన్న, విరక్తి రూప మున తెగిపోరాదు. సోదరీ సోదర అన్యోన్యతయే ప్రేమయనిన కాలం మారిన నౌకరియందు నౌకరికి కలుగు ఈర్ష్య అసహనము కలుగరాదు. తండ్రి తన సంతానము చూచి ఆనందించుటమే ప్రేమయనిన తండ్రిని, సంతానము వ్యతిరేకించినప్పుడు వారియందు కలుగు ఆక్రో శము క్రోధము నిర్దయ వుండకూడదు. పశు పక్ష్యాదులు తాము చూపు ప్రేమ తనకు తరువాత కాన్పులో కలిగినదానికి ముందు సంతా నము తన చేరువకు వచ్చినప్పుడు, దానిని కసరికొట్టకూడదు. (పొడవ కూడదు.) ఒక వస్తువును చూచి ఆసించు ఆసక్తిమే ప్రేమయనిన నది తన అంత్యమువరకు గౌరవింపబడలేదు. వధూవరుల అన్యోన్య ఆనంద దాయకమే ప్రేమ మయమయిన వధువు సంతానవతి యయినప్పుడు తన వరునియందు ప్రేమ లోపించుచున్నది. కాన యీ ప్రేమ యను నది, నిజమయిన అర్థములో ఐహికముగ యెవ్వరు తెలుసుకొనిన వారు కారు.

ఆధ్యాత్మిక రూపములో ప్రేమ యనునది తెలుసుకొనుటకు సాధ్యముగా వున్నది. ఆధ్యాత్మికమయిన విషయమును నొక తత్వవేత్త భువన బ్రహ్మాండములను నొక ఉవిదగా పోల్చి ప్రేమించినాడు. మజును లైలాయందు ప్రేమ చూచినాడు. ఫరహాదు షీరీను రూపము రాళ్ళపై చెక్కి, ప్రేమను చూచినాడు. శ్రీ కృష్ణుడు రాధయందు ప్రేమ చూచెను. శ్రీ మహమ్మద్ ప్రవక్త సర్వ మహమ్మదీయ మానవ హృదయాలలో ప్రేమను చూచెను. ఏసుక్రీస్తు సహనము నందు శిలువలో ప్రేమను చూచెను. ఇది నిజమయినటువంటి ప్రేమారాధన అయినప్పటికి స్వభావరూపములో వారిప్రేమ యథార్థమయినప్పటికి వారు చిత్రించి చూపలేకపోయినారు.

ప్రేమ యనునది ఈశ్వర సంభూతమయిన మహాతేజస్సును యెవరు గ్రహించి యెదుటివానిని ఆ రీతిగ మార్చగలిగినప్పుడు ఆ యెదుటి ఆత్మ, ఓహో! యని సంభోధించునో అది ప్రేమ. అది "నిగూఢప్రేమ కలనా రాగంబు గర్భములో నీరై నిల్చినతీరు పాతాలుగ నేర్పున్ మహాత్యాగియై" ప్రతియాత్మ ఈశ్వర స్వరూపముగ తేజోరూపమయిన విషయముగ వున్నదని చెప్పబడిన తత్వవేత్త యొక్క వాక్కు యెదిరి ఆత్మ గ్రహించి, "నేనూ అంతటివాడను" అని పలికింపజేయు శక్తివంతుడగు త్యాగియే ప్రేమమయుడు. అతడే సద్గురువనబడును. అందుచేతనే

"గురుర్బ్రహ్మ, గురుర్విష్ణు, గురుదేవో మహేశ్వరః।
గురుసాక్షా త్పరబ్రహ్మ తస్మై శ్రీ గురువేనమః"

"నగురోరధికం" యన్న ఆర్యోక్తి నిరూపింపబడిన వ్యక్తిత్వమునకు తెలియబడినదే ప్రేమ. అట్టి ప్రేమనే త్యాగరూపములో శిష్య రూపములోనున్న యెదిరివానిని తనంతటివానిగా, నిరూపింప గలిగే

శక్తి వంతుడైనప్పుడు, ఆతడు చూపించు ప్రేమను "వెలకు నెవరేని కొనెడివారు గలరే" అను తత్త్వవేత్తయొక్క వాక్కు నిజము.

త్రిమూర్త్యాత్మ్యక మహాశక్తులకు, మించిన గుణరహితమయిన సద్గురు స్వరూపమే ప్రేమమయరూపము. అట్టి సత్తే గురుస్వరూపుడై ప్రేమమయమయిన త్యాగియై, వెలార్చు నతనియందే శిష్యరూపమయినవ్యక్తి ప్రేమను చూడగలడు. ఇది యెవరికివారు స్వయంగా తెలుసుకొను విధానమయి యున్నది.

ప్రేమయన భ్రాంతిరహితమయి నిష్కలంకమయిన రస స్వరూపము. ప్రేమ శాశ్వతమయినది. అది అంతములేనిది. ఈ ప్రేమనే రస స్వరూపమని చెప్పక తప్పదు.

# ద్వేషము (విరోధము)



ఈశ్వరునినుండి ప్రకృతి విడిపోవడము ద్వేషమే (విరోధము) కారణము. పంచభూతాలుగ కనిపించుచున్న యీ ప్రకృతిలో నొక భూతమునకు యింకొక భూతమునకు మధ్య ద్వేషమే యున్నది. ఈ ద్వేషము స్థావరజంగమాత్మకమయిన ప్రతిజీవికి నొకదానిపై యింకొక దానికి ద్వేషము కలదు. అలాగుననే మానవజన్మ వచ్చేవరకు యెనభై నాలుగు లక్షల జీవరాసులలో ప్రతిదానియందు ద్వేషమున్నది ప్రతీది ద్వేషపూరితముగనే యున్నది. మానవుడుగ వచ్చిన తరువాత నొక మానవునికి యింకొక మానవుడికిమధ్య ద్వేషమున్నది. తండ్రియందు కుమారునికి ద్వేషము. కుమారునియందు తండ్రికి ద్వేషము. భర్త యందు భార్యకు ద్వేషము. భార్యయందు భర్తకు ద్వేషము. సోదరునియందు సోదరునికి ద్వేషము. స్త్రీ యందు పురుషునికి ద్వేషము. పురుషునియందు స్త్రీకి ద్వేషము. కుటుంబానికి కుటుంబానికి మధ్య ద్వేషము. కులానికి కులానికిమధ్య ద్వేషము. సంఘానికి సంఘానికి మధ్య ద్వేషము. గ్రామానికి గ్రామానికి మధ్య ద్వేషము. పట్నానికి పట్నానికి మధ్య ద్వేషము. దేశానికి దేశానికి మధ్య ద్వేషము. మతానికి మతానికి మధ్య ద్వేషము. జాతికి జాతికి మధ్య ద్వేషము. ఈ ద్వేషపూరితమయిన విషయము స్వభావసిద్ధమయినది. ఇది కావాలంటే వచ్చేదిన్ని పోవాలంటే పోయేదిన్నికాదు. ఇది కేవలము స్వభావ సిద్దమేకాక అస్వభావికము కూడా. ఈ కారణమును పురస్కరించుకొని మానవుడు యిటువంటి ద్వేషపూరితమయిన విరోధాన్ని మాయింపజేయుటకొరకు ప్రయత్నించుట మానుటలేదు. కలయికతో కూడిన అయికమత్యాన్ని నిర్మాణము చేయవలెనను ఆశ లేకనూ పోలేదు. కాని విరోధ రూపమయిన ద్వేషము యీ ప్రకృతి కాలరూప

ములో విడిపోయిన సమయము విషరూపమయిన ద్వేషమే కారణము కాబట్టి దీనిని జ్ఞానియైన వ్యక్తి తెలుసుకొని నిర్జించి శాంతియుతమైన స్థితి తెలుసుకొని మనగల్గుట నాతని స్వభావము. అతడు ప్రకృతి ఆదిగా గల్గిన విషయములు శాంతియుతమైన విషయానికి తేలేడు గాబట్టి తనకు చేరువుగానున్న, తన ఆధీనమందున్న విషయములలో గల ద్వేషాన్ని వూహించి ఆ వూహ భావరూపములో నిర్ధారణ అగు సమయమున స్థాయిరూపములో తనకుతానే శాంతరూపము దాల్చి ఆ ద్వేషమును నిర్జింపవలసి యున్నది.

తాను కుమారునిగ నున్నప్పుడు తన తండ్రిలో నుండి వచ్చు ద్వేషము తనపై ప్రసరించబోవు స్థితిని గమనించి, నది యేపరిస్థితిని కలిగినదో అవగాహన చేసుకొని నది ప్రజ్వలింపజేయు పరిస్థితిని వోర్పుతో ఆ తండ్రిని వుద్దేశించిన వ్రదిక్తత కాలక్రమమున తన యంతట నతనే తెలుసుకొని లోలోన ఖిన్నతపొందునట్లు చేయగల్గిన వాడే జ్ఞాని. తాను తండ్రిగామారి తన కుమారుడు ద్వేషరూపములో తనపైకి యెత్తివచ్చినప్పుడు నతనిని ఆసమయమునకు తగినట్లు ఆ స్థితి నుండి తప్పించి తన మనుగడయందు నాతని తప్పులను నిరూపింపజేసి కుమార రూపములోనున్న వ్యక్తి చింతాక్రాంతుడయి తండ్రియందు చూపిన ద్వేషమునకు పశ్చాత్తాపుడగునట్లు చేయువాడె జ్ఞాని. తాను సోదరరూపములో నున్నప్పుడు సోదరీసోదర రూపమునవచ్చిన విరోధ భావము ద్వేషరూపంగ మారినప్పుడు వారివారినుండి తొలగి తన ఔన్నత్యమునకే పాటుపడి సంగ్రహించిన తన వున్నత స్థాయినిచూచి వారు తనప్రోల తలలువంచు విధానములో వారు తన సోదరుని గూర్చి చేసిన ద్వేషరూపమైన అపకారమును తలచి శోకరూపులై క్షమాపణ రూపులుగ మార్చువాడె జ్ఞాని. తాను భర్తగా వున్నప్పుడు భార్యయను స్త్రీ రూపములో ద్వేషరూపమయిన విషయము యే నిము

షమందయినను తన హృదయ కుహరమందు చొరనియ్యక కారణాం తరమున భర్తయందు ఆమెకు ద్వేషము కలిగిన తనపొరపాటు తాను నొప్పుకొనునట్లు చేయగల్గినవాడె జ్ఞాని.

మానవునియందు కులరూపములో సంఘరూపములో మత రూపములో, జాతిరూపములో, కలుగు ద్వేషములకు విరోధములకు వేరై సర్వసమ్మతమయిన జీవిత విధానమును పురస్కరించుకొని తానే వారికి అన్యంగావుండి వారివారియందు ద్వేషంవలన వచ్చు అవాంతర ముల వలన కలుగు పరియవసానము పరికించి ఈశ్వర సంభూతమయిన మహాశక్తి జీవరూపములో నుండుటచే తెలియజాలని పరిస్థితిలో ద్వేష మనే ఆవేశము కాలమనే మహాశక్తి యేతీరున విజృంభింపజేసి ఈశ్వర సంభూతమయిన విశ్వరూపముగా యున్న యీ ఆత్మను భ్రాంతిజన్య మయిన యీ ద్వేషము జడజన్మలకు తీసుకొనిపోవుచున్న సంగతి తెలుసుకొని ఖేదపడి పశ్చాత్తప్తుడై ప్రకృతిని తిలకించి దాని పరిణా మమును తెలుపు సద్గురువును ఆశ్రయించి ద్వేషరూపమై విరోధము విడిపోవునట్లు చేసుకొని ప్రతిజీవియందు నిగూఢముగ ఐకమత్యమే యున్నసంగతి తెలుసుకొని తాను ఆ ఐకమత్యముగ మారి ఈశ్వర సంభూతమయిన విశ్వరూపము గురు ఆశీర్వాదమున బడసి తరించ గలడు. ఆ ద్వేషములోనే సమ్మిళితమయి యున్న ఐకమత్యము ప్రేమస్థాయి శాంతి స్థిరత్వము నున్నసంగతి తెలుసుకొనగలడు. తెలుసుకొన్నవాడై నిర్ద్వేషిగ తన మనుగడమార్చి లోకమున మన్ననలకు పాత్రుడు కాగలడు.

# బాంధవ్యము



ప్రకృతియందు నొకజీవికి యింకొక జీవికిగల సామరస్యమునకు బాంధవ్యమని అది బంధన రూపమయిన బాంధవ్యముగా రూపొంది నొకరినుండి యింకొకరికి ఆప్యాయత కలుగజేసే శక్తి బాంధవ్య మన వలసి యున్నది.

అది మానవులలోగల జీవరూపమును విమర్శించిన సృష్టిలో మొదటి బంధువు తల్లి. ఆమెవలన యెరిగింపబడిన తన యెరుకలో నిశ్చయమయిన వ్యక్తి తండ్రి. వారి సంతానముగా తాను పెరిగి పెద్ద వాడయి వివాహితు డగువరకు తనకు బంధువులు తల్లి, తండ్రి, సోదర సోదరీలు, తరువాత మంత్రి ప్రోక్తంగా అగ్నిసాక్షిగా వివాహమను కార్యమున బంధనరూపంలో వచ్చిన స్త్రీ భార్యగ బంధువు. స్త్రీ అయినప్పుడు పురుషుడు భర్తగ బంధువు.

ఈ బాంధవ్యమును పురస్కరించుకొని వారి తల్లి దండ్రులు అత్త మామలుగా బంధువులు. తన తల్లితండ్రుల బంధన రూపంలో సంతానముగా తాను సృష్టింపబడినట్లే తాను తన భార్యా బంధన రూపంలో కలిగిన సంతానము బంధువులు. ఈ రీతిగా ప్రపంచ మానవ విధానములో బంధుత్వము మేర్పడి వావి వరసలు కూర్పబడి అది కుటుంబ బంధువులుగా పరిగణింప బడుచున్నది.

ఈ కుటుంబమును గూర్చి విమర్శనలోపెట్టి యెవరు నిజమయిన బంధువులు? అనే ప్రశ్నను తేల్చుకొన గలిగినప్పుడు: తల్లితండ్రులు సోదర సోదరీలు రక్తస్పర్శతో కూడిన బంధన రూపంలో బంధువులైనప్పటికి వివాహరూపంలో అగ్నిసాక్షిగా వచ్చిన పురుషుడయిన స్త్రీ భార్యగా నున్నప్పుడు, స్త్రీ అయిన పురుషుడు భర్తగా నున్నప్పుడు పై రక్తస్పర్శతో కూడిన బంధువులు తన ప్రేమలో అప్యాయతలో వెను

కకు నెట్టివేయబడుచున్నారు. భార్యగావున్న స్త్రీయందే తన ప్రేమా ఆప్యాయతలు ప్రగాఢంగా చూపించ బడుచున్నవి.

తరువాత తన సంతానమందు, మానవుడు తనతండ్రి మొదలు రక్తస్పర్శతో కూడిన బంధువులయందు తాను చూపు ప్రేమ ఆప్యాయతలు వారు సహకరించునట్లు నొకకాలము వరకు నున్నప్పటికి వారి వారి కార్య కళాపములందు వారి వారి అలోచనా విధానంలో ఆ యా వ్యక్తులయందు విరక్తి కలిగినప్పుడు తనకు రక్తస్పర్శతో కూడిన బంధుత్వము మాయింప బడుచున్న విషయము ప్రకృతి యందు సహజము, వారికిమించి తన ప్రేమ ఆప్యాయతలు స్థిరపరచిన భార్యా బిడ్డలందు కూడా, భార్యా బిడ్డలయందుగల బంధుత్వ రక్తస్పర్శతో కూడిన ఆప్యాయత కూడా నొకప్పుడు సన్నగిల్లి వారుకూడా బంధువులనిపించుకోరు.

వీరందరికి మించినటువంటి అవినాభావ సంబధమయిన మైత్రి రూపమునగల మిత్రబాంధవ్యము, యిదియే కాలమునకు విడదీయజాలని అవినాభావ బాంధవ్యము. ఇది నిజమైన సత్య స్వరూపమైన మిత్రత్వమందే గోచరించగలదు. ఇటువంటి నిష్కళంకమైన మైత్రి యేకత్వ ప్రతిపాదితమైన ఆత్మలయొక్క అపురూప స్వరూపము యేకత్వముగ మారిననాడు యింతకంటె సృష్టియందు బంధువులేడు. ఇటువంటి బంధువుకూడా నొకప్పుడు ఒకరి నొకరు విడిచి దూరదేశమందు స్థిరపడినప్పుడు అదికూడా మాయింప బడును.

తనకు తాను విమర్శించుకొని, యే బాంధవ్యము స్థిరమయినది, ఏ వ్యక్తిత్వము బంధువుగా నున్నది అని తన ఆలోచనలో పెట్టిన తన ఆపదయందు స్వామీయని అర్చు ఆర్తానాదమును అది యేదిగా నున్నది అనే విషయమునకు వచ్చినప్పుడు అది తన శక్తికి మించిన శక్తిస్వరూపముగా నున్నదని నిశ్చయించి అద్దానిని తెలుసుకొను నిచ్ఛ కలిగినప్పుడు దానిన తెలియపరచు వ్యక్తి గురువుగా నున్నాడని

నతనిద్వారా తెలిసికొనవలసిన విషయమునకై ఆ గురువును చేరిన ప్పుడు, ఆ గురువుగా యున్న వ్యక్తి సద్గురువై యున్న తన్ను ఆశ్రయిం చిన శిష్యునికి పై చెప్పబడిన తల్లి తండ్రుల దగ్గరనుండి సోదర సోద రీలు, భార్యా బిడ్డలవరకు అవినాభావమయిన బాంధవ్యమున నిరూపించ బడినవారు నొకప్పుడు తనను బాధించినప్పటికి వారిని సమర్థించుకొని సమన్వయము చేసుకొనునట్లు చేసి తన మిత్రరూపంలో ఆత్మీయమైన బంధువుగా మారిన వ్యక్తులను గూడా తనతో సమానమయిన స్థాన మిచ్చి, శత్రు రూపమయిన వ్యక్తి మనసుయందు తన రూపము ఆ శత్రువునకు జ్ఞప్తియం దొచ్చినప్పుడు ఆతడు అతని ఆంతరంగమందు శత్రుత్వము మాని మిత్రునిగా మారునట్లు వూహలు కలిగి శత్రుత్వము మాని శాంతి పడునట్లు చేయగల్గిన యతడే లోకబాంధవుడని ప్రజ వూహించునట్లు యెవరు తననుగూర్చి తన్ను భౌతికంగా, అభౌతి కంగా కాపాడగల్గి ఈశ్వర సంభూతమయిన మహావిషయము తెలియు నట్లు చేయునో అట్టి సద్గురువు బంధువు.

ఆ సద్గురువు తనయందుచూపిన ప్రేమాతి శయము పురస్క రించుకొని తనంతటివానిగా మార్చినప్పుడు తనను ఈశ్వర సంభూత మయిన మహాశక్తియేయని పేర్కొన బడినప్పుడు తన స్థానమయిన విరాడ్రూపము అని నిశ్చయమయిన సంధియందు అనగా మానవుడు ఈశ్వరుడు అనే సంధియందు తనలో చేరగలిగే, తేజస్వరూపమయిన మానవత్వమునకు విరాడ్రూపమయిన రస స్వరూపమే బంధువు.

"అహం బ్రహ్మాస్మి"

అహం = నేను. బ్రహ్మ = ఈశ్వరునిగ, అస్మి = అయితిని ఈ అస్మియను ధాతువును శబ్దంగా మార్చినప్పుడు "నేను" అనే ఆత్మ స్వరూ పాన్ని ఈశ్వరుడుగా మార్చే "అస్మి" అనే ధ్వని రెండింటిని సమన్వయ పర్చేదే బాంధవ్యము. అదే బంధువు.



# నైజము



నైజము స్థావరజంగమాత్మకమైన ప్రతి జీవియందు స్వాభావికమైనది. ఆ యా జీవములవలన పుట్టి దేహధారులైన విషయములో నైజరూపములో వీటి స్వభావము యేర్పడియున్నసంగతి మనము గమనించుచున్నదే. పాషాణములు, వృక్షములు, పులి, ఏనుగు, గుఱ్ఱము, ఆవు, కాకి, హంస వీటినిపోల్చిన మృగాది, పశు, పక్ష్యాదుల నైజమన్నప్పుడు అది స్వభావ సిద్ధమైన వాటివాటి అలవాట్లయందు యిమిడియున్న సంగతి మనము వినడములోను, చదవడములోను, కనులార చూచినప్పుడు, అనుభవములోను గమనించుచున్నాము. వేరు వేరు గణముల నైజములు వేరు వేరు రీతులలో నుండును. అవి వాటియొక్క స్వభావము.

పై వాటి నైజములకు విరుద్ధమైనది మానవ నైజము. మానవులలో మానవునికి మానవునికి మధ్య నైజమువేరు, స్త్రీకి పురుషునకు మధ్య నైజము వేరు. జాతికి జాతికి మధ్య నైజము వేరు. కులమునకు కులమునకు మధ్య నైజము వేరు. దేశమునకు దేశమునకు మధ్య నైజము వేరు. ఖండమునకు ఖండమునకు మధ్య నైజము వేరు.

ఆయా చోట్ల ఆయా దేశములలో, ఆయా జాతులలో, ఆయా కులాలలో, ఆయా మతాలలో, ఆయా వంశాలలో నైజస్వభావములు వేరువేరుగ నుండును. వీటిని గ్రహించదలచిన వ్యక్తి ఆయా చోట్లకు వెళ్ళినప్పుడు వారివారి నైజము లనునవి గ్రహించగలము.

నైజమనునది కేవలం మానవునిలో తల్లి తండ్రి అను దంపతులవల్ల వారి వారి యొక్క స్వభావములనుబట్టి వారి యందు అంతరంగికంగావుండిన వూహలనుబట్టి, కార్యకర్తృత్వములనుబట్టి స్వాభావిక

మైన వాతావరణము నైజముగా నియమబద్ధమై సంతానమునందు రూపించుచున్నది.

ఏ వ్యక్తియందైనా స్వభావము నైజరూపంలో మనకు అవగాహన అయినప్పుడు ఆ తల్లి తండ్రులయొక్క విషయాలను విమర్శనారూపములో తేల్చుకొని తరచినప్పుడు ఆ వ్యక్తియొక్క నైజ స్వభావము తల్లి దండ్రులను సరిపోలినమాట నిజమని తేలగలదు. దీనికి యే మాత్రము విరుద్ధముగను మానవుడు తన నైజమునుండి తప్పించుకొనజాలడు. అది రక్తంలో మిళితమై ఆత్మను ఆవహించి కార్య కర్తృత్వములలో మాటలలో వ్యక్తం కాకమానదు.

కాబట్టి నొక మానవునితో స్నేహ భాంధవ్యములు కల్పించుకొనకముందు ఆతని స్వభావ నైజములనుబట్టి ఆతని తల్లి దండ్రుల వంశ క్రమమునుబట్టి విమర్శనలో తేల్చుకున్న తరువాతనే ఆతనిని తన సఖుడుగా, బంధువుగా నిశ్చయించుకొన వలసియున్నది. కాబట్టి యీ నైజ విధానమును మానవుడు తప్పక పాటింపవలసి యున్నది.

ఇట్టి విషయాన్ని పురస్కరించుకొనియే, ఉపనిషత్కారకులు "ఆత్మావై పుత్రనామాసి" అన్నప్పుడు తల్లి దండ్రుల గుణములతో కూడిన 'నైజ స్వభావములు వారి ఆత్మ స్వరూపమయిన సంతానమందు యిమిడియుండునని వారివాక్కు.

ఏ మానవునితో సంభాషించుచున్నామో ఆతని గుణగణములు వ్యక్తమయినప్పుడు ఆతని తల్లి తండ్రియొక్క రూపము నుండి యీ ఆత్మకు సంక్రమించినవన్న మాట నిజము.



# స్వార్థము

స్వార్థమనునది సృష్టిలో ప్రతీ జీవికి స్వభావికమయినది. ఇది జీవ రూపములోనున్న స్వభావమే కాకుండా, సృష్టి యావత్తు దృష్టిని పెట్టినప్పుడు, ఈ సృష్టియొక్క ఆశయము స్వార్థము.

ఈ సృష్టిని పురస్కరించుకొని స్వభావికమయిన యీ స్వార్థ మును ప్రతీ జీవియందు విమర్శించిన మొట్టమొదట ప్రతీ జీవి తన ప్రాణమును కాపాడుకొనుటలో స్వార్థము తప్పక చూపుచున్నది. స్వార్థమనునది మన దృష్టిలోపెట్టిన, జీవరూపంలో వున్నవాటిని విమ ర్శించిన ప్రతీ క్రిమి, కీటక, పశు, పక్ష్య, వృక్షాది జీవరూపముల దగ్గర నుండి మానవునివరకు, స్వార్థమునకు లోనై, వాటివాటి మనుగడ సాగించుచున్న సంగతి గ్రాహ్యమునకు రాకమానదు. స్వార్థరూప మయిన కార్యకలాపములయందు ప్రాణాంతకమయిన విషయము లేక పోలేదు. క్రిమి కీటకాదులు, లతలు, చెట్లయొక్క లేత చిగుళ్ళను మేయజూచును. వాటిని సంహరించు ఇంకొకజీవి కలదని తెలిపిన విషయములో తన ప్రాణములను తన్ను తాను రక్షించుకొనుచూ, తన మనుగడ సాగించును. వాటితో క్షుత్తునింపుకొని స్వార్థమున పక్షులు ఆకళింపక మానవు. ఈ పక్షులు స్వార్థమున తమ ప్రాణములు కాపాడు కొను పరిస్థితిని ఏ సమయమందును ఏమఱక తమ మనుగడ సాగించు చున్నను వీటిని సంహరించే ఇంకొక జీవి లేకపోలేదు. అటువంటి విధా నములో ప్రతీ జీవిని విమర్శించినపుడు, స్వార్థముయొక్క అంత్యపరిణా మము మానవునిలో దృగ్గోచరమై ఆ వ్యక్తిత్వమందు స్వార్థము యొక్క పరిణామము తేల్చబడుచున్నది.

మానవునియందు స్వార్థము రెండువిధములుగా యున్నది. 1. ప్రకృతి ఆశాబద్ధమయిన స్వార్థము. 2. ఈశ్వర విధానమునముక్తి పొందే ఆశతో కూడిన స్వార్థము.

1. ప్రకృతి ఆశాబద్ధమైన స్వార్థము :— ఈ స్వార్థమున మానవుడు తన యున్న స్థితికిమించి అంతకంటె ఉత్కృష్టమయిన స్థితి పొందవలెనని స్వార్థమున ఆశించడంలో తానుకష్టించి, తాను ఊహిం చిన యశస్సును సంపాదించడము. అట్టి యశస్సుకు రావడమందు క్రమరూపంలో సాధ్యంకానపుడు మోసముననైన సాధించ ప్రయత్నిం చును. ఈ స్వార్థము తన తరువాత తన కన్యంగాయున్న సంతతి విష యములో స్వార్థమును తన ముంగరపెట్టి, వారి యశస్సుకై శ్రమించ డము, ఈ విధముగానే తన ప్రతీ కార్యకలాపమును స్వార్థమును చూపుచున్నాడు. ఇట్టి స్వార్థమును విమర్శించిన ఈ సృష్టిని ఆకలించు వరకూ తృప్తిని బడయ లేకున్నాడు.

2. ఈశ్వర విధానమున ముక్తినిపొందే ఆశతో కూడిన స్వార్థము :— ఈ సృష్టిని తలదన్ని ఈ జీవికి మరణమనునది రాక ముసుపే ఈ మానవ వ్యక్తిత్వము ఖిలంకాని పరిస్థితిలో ఈశ్వర విషయం తెలుసుకొని, తరించి, తిరుగ జన్మ లేకుండా చేసుకొనే ఆశ తోకూడిన ఆశయముకూడ స్వార్థమే. కాబట్టి స్వార్థమనునది ప్రకృతి స్వరూపమయిన ఈ జగత్తుకూడ అట్టి ఆశా సహితమయిన ఆశయము తోడనే ఏగుచున్నది. ప్రకృతి ఆశతో కూడిన ఆశయము స్వార్థరూప మున జడజన్మలకు తీసుకొనిపోయి తిరుగ జన్మలకు పాల్పడినట్లు చేయు చున్నది. గాన ప్రతి మానవ వ్యక్తిత్వము పొందిన జీవి ఈ ప్రకృతి యందు తన మనుగడకు లోటురాని పరిస్థితి యితర దృష్టికి విమర్శనకు పాల్పడ నటువంటి స్థితిని తన జీవితయాత్ర సాగించుచూ, ఈ మానవ జన్మ తిరిగి రానికారణమున ఈశ్వర సంభూతమయిన మహావిషయ

మును సాధించుటయందు ముక్తస్వరూపము పొందు ఆశతో కూడిన స్వార్థమును తప్పక అనుసరించ వలసియున్నది. అట్టి ఖిలముకాని స్థితిని ఈశ్వర సంభూతమయిన మహావిషయముగ గ్రహించడము ఆశయ ముగా గల స్వార్థమే యదార్థమయిన స్వార్థము. లోకమందు పడి కట్టు మాటగా చెప్పు "స్వార్థత్యాగము" కేవలము మాటయే గాని ఎవ్వడూ స్వార్థత్యాగి కానేరడు. నిస్వార్థంగా ఉపకారం చేయడం కూడా స్వార్థంకొరకే- అతడు ముందుకాగల కార్యములకు తోడ్పడ గలడని నిశ్చయించి, అతడు చేయు నిస్వార్థము–స్వార్థముగా మార గలదు. పరిణామము పొందనున్న ప్రతీ జీవికి రస స్వరూప సన్నిభ మయిన ఈశ్వరత్వము పొందుటకు స్వార్థమనునది ఆ జీవియొక్క అంకురము. దీనినే స్వార్థమనక తప్పదు. ఇదియే స్వార్థము.

# స్నేహితుడు

ప్రకృతి సిద్ధమైన పంచభూతాలు నొకదానితో నింకొకటి స్నేహ స్వరూపంగా నుండుటచేత యీ సృష్టి శాంతి స్వరూపంగా 195 కోట్ల సంవత్సరములు గడుపుకున్నది. దానియందు జీవరూపం దాల్చిన ప్రతి స్వరూపము స్నేహసంపత్తి గలవిగ నున్నప్పటికి ప్రకృతి స్వభావమైన ఆహార నియమములనునవి విరోధభావము కలిగించు చున్నవి.

క్రూరమృగములు సాధు జంతువులను విరోధ ఘాతుక రూప ములో తినివేయుచున్నవి. సాధుజంతువులు గడ్డి లతలు పొదలు మొక్కలు చెట్లవరకు విరోధిగ మారి తినివేయుచున్నవి. చిన్న చేప లను పెద్దచేపలు తినివేయుచున్నవి. పక్షులు క్రిమి కీటకాదులను తిని వేయుచున్నవి. ఈ రీతిగా మానవుని వరకు వూహించి విమర్శించిన ఆహారమను విషయమునకు వచ్చి ఆలోచనాపరుడయిన మానవుడు ననేక జీవజాలములను తన ఆహార రూపంలో తనకు తెలియని స్వాతిక విరో ధిగ మారి బక్షణ విధానములో తినివేయుచున్నాడు.

మానవుని యెదలో బుద్ధియొక్క వికాసమునకు ఈశ్వరునివరకు తెలిసికొను ప్రజ్ఞ యున్నప్పటికి స్నేహపాత్రత వచ్చినప్పుడు అది తాను అసాంతము నిర్వర్తించ లేకపోతున్నాడు.

ఈ స్థితిని వూహించిన స్నేహమనునది సృష్టిని మృగ్యంగా యున్నట్లు తెలుసుకొన గలడు. కాని స్నేహమనునది అపురూపమైన త్యాగమున తృప్తితో కూడిన శాంతిస్వరూపమే స్నేహ స్వరూపము. అటువంటి విషయంలో గ్రహించిన అభిజ్ఞుడు (అనుభవనీయమయిన వాడు) మానవాతీతుడు. అతనికి యీ పంచభూతములు జోహారుసల్పి నమస్కరించును. అతను ప్రతి అణువందును స్నేహంతో కూడిన

దృక్కునే చూచును. అతను యెవరికిని విరోధికాడు. అతని అంతరంగిక స్వభావము తనతో స్నేహంగా నుండువారియందు యెంత ప్రీతిని చూపునో, తన తలను ఖండించ సమకట్టిన విరోధియందును తనను ఆశ్రయించినప్పుడు అంత తృప్తిరూపమయిన స్నేహం చూపించును.

అతనికి స్నేహితులతోపాటు యీర్ష్యాపరులైన విరోధులు కూడా నుండుట సహజము. కాని నతడు స్నేహితులుగా వున్నవారిని చూచి పొంగి తబ్బిబ్బు పడుటకాని, బలవత్తరమయిన విరోధిని చూచి జంకుటగాని నతని స్వభావముకాదు.

ఒకప్పుడు యీ స్నేహితుడుగా నున్నవ్యక్తి ప్రాణాంతకమయిన ప్రబల విరోధిగను, బలీయమయిన విరోధరూపమున నున్న వ్యక్తి ఆపదయందు ప్రాణము కాపాడు స్నేహితునిగను మారగలడని ఆతనికి తెలుసు. అది సృష్టియందుగల ప్రకృతి విరుద్ద భావముగనున్న సంగతియందు నాతడు అనుభవజ్ఞుడు.

అతడు తనసాటి ప్రజలకు ఉపకారమే చేయును. అపకారము ఆతని నైజముకాదు. తనవల్ల ఉపకారము పొందిన వ్యక్తి తనకు ఉపకారియో అపకారియో ఆతని కనవసరముగ నుండును.

అతనివల్ల ఉపకారము పొందినవారివల్ల యేవిధమయిన సహాయమును ఆశించడు. అపకారముచేసిన వారిని తృణీకార రూపంలో తూష్ణీకరించి దూషించడు. తాను యెంత కిష్టపరిస్థితిలో నున్నప్పటికి తనను ఆశ్రయించినవారి గుణగణములను విమర్శించక సహాయబడుటయే ఆతని ఆశయము.

ఇటువంటి వ్యక్తిని గ్రహించినవ్యక్తి నతనిరూపంగా మారినవాడు స్నేహితుడు. వీరిమధ్య కళంకరహితమయిన పంచభూతాలలో యిమిడియున్న స్థాయిరూపమయిన పంచశక్తులయొక్క స్నేహరూపం

లోగల కలయిక వారిమధ్య సదా తాండవ మాడుచుండును. ఒకరి ప్రాణాంతక సమయమందు యింకొకడు ముందుగనే తనప్రాణములు బలి చేయును. ఈ విధమైనటువంటి అవినాభావమైన స్నేహ స్వరూపుడయి నటువంటి వ్యక్తి జగదాతీతుడు. పంచభూతాలలోనున్న పంచ మహా శక్తులు నొకదానిలోనొకటి స్నేహరూపంలో అవినా భావముగా నున్నట్లే యీ స్నేహితులమధ్య స్నేహము ప్రగాఢముగా యుండును. ఇట్టి స్నేహితులే జగన్మాన్యులు మృత్యుం జీవులు. వీరికీర్తి దిక్కుంబి కుంభాలనెక్కి నాట్య మాడగలదు. అతనే ఈశ్వర సృష్టియందు మానవ స్వరూపము. ఇతని స్నేహరూపమైన తేజోరూపజ్వాల ఈశ్వ రుని ప్రోల గణనీయపదము దాల్చి నిర్వాణరూపంగా మారి సాయు జ్యము చూరగొనగలడు.

# ఘా త కు డు

స్పృష్టిలో మోసమనునది సర్వసాధారణముగా మానవకోటి యందు కనబడుచున్నది. ఈ మానవకోటియందు మోస స్వరూపం వేరుగానున్న సంగతి తెలియక అమాయకులైన మానవులు నటువంటి మోసంలోపడి బాధలకు లోనగుచున్నారు. అలా బాధలకు లోనైన వారిని చూచుచున్నారు.

ఇందు మోసముయొక్క స్వరూపము తెలిసికొనవలెనన్న కష్ట సాధ్యముగాని మోసమును తలదన్నిన స్వరూపము ఘాతకునిరూపము. ఈ రూపమును తెలిసికొనుట అసాధ్యము. ఆ రూపమును తెలుసుకొన దలచితివేని ఆ ఘాతకుడు తనను చేరదీసిన వానియందు అపారమైన భక్తి విశ్వాసములతో కూడి విన్రముడై సోలిపోయిన న్రమత చూపించును. అతని ముఖవర్చస్సు చూచిన యెటువంటి కఠిన హృద యునికైనను జాలి కలుగకమానదు. నతని మాటలయందుగల సొంపు, తీపి, నాతడు కూర్చి చెప్పు పదములయందు ఆనందము కలిగి, నతని యందు గౌరవరూపమైన ఆప్యాయత యెదిరివారి హృదయమందు పుట్టిపడును.

అట్టివాని పెదిమల దాటి జారిన ప్రతిమాట యదార్థరూపమైన నిజమనిపించును. అతనుచేయు ప్రతికార్యమును మన లాభము కొరకే యనునట్లు నిరూపణ కాగలదు. మన కష్టకాలమందు తన ప్రాణాల సహితము నొడ్డి కాపాడగలడనేటంత నమ్మకము కలుగును. అహర్ని శములు మన పాదాక్రాంతుడయి యున్నట్లు నిశ్చయించగలము. అతని గుణగణములన్ని అతి పవిత్రమైనవిగ తోచును.

ఇటువంటి వ్యక్తిని యే నిమిషమునందును మరువలేని పరిస్థితికి వచ్చి నతనిని యే సమయమందును తనకు దూరంగా యుండునట్లు

చేయలేని పరిస్థితి యేర్పడును. ఇతనినిగూర్చి యితని గతజీవితమందు చేసిన ఘాతుక కృత్యములు తన సన్నిహితులు చెప్పినను నమ్మక వారి మాటలను త్రోసిపుచ్చునంతటి విశ్వాసము అతనియందు కలుగును. ఇట్టిస్థితికి వచ్చిన మానవుని దృష్టియందు అట్టి ఘాతకరూపం తన సహచరునిగ స్థిరపడిపోవును.

ఇటువంటి స్థితికి తీసుకొచ్చిన ఘాతకుడు తనను హృదయపూర్వకముగ విశ్వసించి సర్వము తన పరముచేసి ఆత్మసమర్పణీయుడయిన వ్యక్తిని తన సంపూర్ణ స్వాధీనము చేసుకొని యితని సిరి సంపదలను సంగ్రహించి యితనివల్ల తనకు కలుగు లాభమింక లేదని తెలిసికొన్న వాడయి తన స్వార్థమందు ఆశాపరుడయి తనను నమ్మినవాడు సజీవముగ నుండిన తన ఘాతుకచర్య బయలుపడు సమయమందు తనుగాని యితరునిలో ద్వేషము తెప్పించి నతని చేతగాని తనను నమ్మినవాని కంఠము వుత్తరించుటకు జంకడు.

ఇతని మనస్సునందు కరుణలేదు. విశ్వాసములేదు. జాలియనునది నీతనిచెంతకు చేరదు. చేరలేదు. ఇట్టి ఘాతకుని విస్మరించిననాడు తన కంఠము నుత్తరింపబడే సమయమందు మాత్రమే తప్ప తెలియబడడు. తన కంఠము అరునిచే వుత్తరింపబడే సమయమందు యీ ఘాతకుడు తనచెంతనుండగ ప్రాణాంతక సమయమున తాను దీనతగ యీ ఘాతకునివంక చూచినప్పుడు తనచెంతనుండి తొలగి బలవద్విరోధి రూపముదాల్చి మందహాసియై ఆనందపరవశుడయి పూర్ణ తృప్తుడుగా చూపట్టును.

ఇట్టి ఘాతకునిగూర్చి పైజెప్పిన విషయము తన అనుభవమందు, తన దృష్టికి వచ్చి యితడు ఘాతకుడను సంశయము వచ్చి తన విమర్శనలో పెట్టి నాతని విధానము పరీక్షించుచున్నప్పుడు యేమరక నిగూఢముగా విమర్శించినప్పుడు వాడు ఘాతుకుడని తెలుసుకొనుట

సాధ్యము కాని. అట్టి శ్రమకు పాల్పడకపోయిన యీ ఘాతకుని పాలా షుడు కూడా గ్రహించలేడు.

ఈ వ్యక్తి యేనాటికైన తనను మోసముచేసి ఘాతకుడుగా మారునని నీ ఆత్మ నీకు ధ్వనింపజేసినప్పుడు యిటువంటివానిని తక్షణం ఆతనితో రాష్టురాని పరిస్థితిని నీ నుండి వేరుచేయుము.

ఈ ఘాతుకునియందు చూపిన మంచిగుణగణములు అమాయ కులైన ఆత్మ సమర్పణీయులయందుకూడా చూపట్టును. అటువంటి స్థితిని వారివెనుక జీవితము పవిత్రముగ నుండగలదు అటువంటి వారి యందు అనుమానము తగదు.

ఘాతకుడని తెలిసికొని అతనిని తననుండి వేరుచేసిన తరువాత తన ఆజన్మాంతము తన బలీయమైన ఘాతుక శత్రువుగా నిశ్చయించి తనకెప్పుడైన ఆ ఘాతకుడు యెదురైనప్పుడు "తనను హతమార్చు నేమో" యని భయపడి ఆ ఘాతకుడు తననుండి దూరముగా పోవునట్లు తనయందు కోపదృష్టితో కూడిన గంభీరత తన ముఖవర్చస్సున చూపు వుగ్రరూపమున మార్చుకొనవలసిన అవసరము తప్పక పాటించ వలసి యున్నది.

ఈ ఘాతకుడు తననుండి భయముచే దూరమయినను వెనుకను గోతులుతీస్తూ తన ప్రత్యర్థి సమసిపోవు పర్యంతము నిద్రపోడుగాన యిటువంటి వ్యక్తియందు నీకు ఘాతకుడనే యనుమానము కలిగిన క్షణమందే నాతని త్యజించుట శ్రేయస్కరము, విధి.

# మూర్ఖుడు

మూర్ఖుడనే శబ్దము మానవ గణమందే వ్యక్తమగుచున్నది. ఈ మూర్ఖుని గ్రహించవలెనన్నా సులభసాధ్యమే.

ఏ మానవునిలో మూర్ఖత ఆవహించియుండునో నాతడు తనం తట తానే ప్రపంచాతీతమైన తెలివిగలవాడనని తనకుమించిన తెలివి గలవాడు లేడని తానుచేయు ప్రతికార్యము తెలివిగనే చేసి ప్రపంచాన్ని మెప్పించగలని నిశ్చయించి, నది తనమాటలలో తన భావములో తనకార్య కర్తృత్వములలో ప్రకటింపజేయును. అతను ప్రపంచకమున ప్రజ తనను తెలివిగలవాడనని తోటి మానవులు గౌరవించవలెనని తన చూడ్కులు వేరువైపుకు నిగిడించి తన కనురెప్పలు పడకుండా యేకాగ్రతారూపంలో యెటుచూట్కులు మరల్చిన ఆ విధముగనే యుండునట్లు ప్రయత్నించును. దానివలన ఆయా తావులతో తన తెలివిని వ్యక్తం చేయుచున్నానని తలచును.

తన మాటలలో యెదిరివాని నోటినుండి ధ్వని వ్యక్తం కాక ముందే తాను దానికి తగిన జవాబు చెప్పుచున్నానని అది యెదిరి వానిని లొంగదీయునని తనలో తాను తలచును. తానుచేయు ప్రతికార్యమును కర్తృత్వమును ప్రజల క్షేమము కొరకే చేయుచున్నానని తన మదిలో నిశ్చయించును. తన నడక, నడువడి, తన మనుగడ, తనను చూచి ప్రజలు నేర్చుకొనుచున్నారని లోలోన ఆనందించును. ఒకరు నిర్వర్తించిన కార్యము నతనికంటె ముందుగ ప్రజలలో తనే అది పూర్తి చేసినట్లు కార్యము సాధించినట్లు డంబముగా పలుకును.

ఇతనిని గూర్చి ఆత్మీయతగల వ్యక్తులు గమనించి యితని చేష్టలనుగూర్చి చెప్పినప్పుడు వారికేమియును తెలియదని చెప్పుచు మూర్ఖులని తిట్టును.

ఈ స్వభావము కలిగిన వ్యక్తి నొకరు చెప్పినప్పుడు వినడు. తనకు తోచదు. తనకు తోచి చేయు కార్యములు లోక విరుద్ధములై దూష్యములుగానున్న సంగతి తెలిసికొనలేడు. ఇతను మూర్ఖుడు.

ఇటువంటి వ్యక్తి ఒకనాటికి ఈశ్వర విషయం తెలుసుకొని తరింపజూచు విషయానికి వచ్చినప్పుడు గురువు అవసరము లేదని గురువనే వ్యక్తి తనలాంటి వాడేనని, ఆతడు తెలిసికొన్న విషయాలు తనంతట తాను తెలుసుకొనగలనని, ఈశ్వరుని చూడగలనని అహంలో పడి, ఈశ్వర విషయం తెలియని పరిస్థితిలో తెలిసిన వానినిగా వాదించును. ఆ వాదన అసహ్యకరముగా ఆ అంశములు విననొల్లని తన యెదిరివారు ఇతనితో వాదించుట సమంజసము కాదని మౌనం దాల్చినప్పుడు తాను అతీతమైన అధ్యాత్మిక విషయం వెల్లడించి యెదుటివారి నోరు మూయించి తనని సంతోషంగా గర్విగా తన మూర్ఖ రూపమైన అహమును ప్రకటించును. ఆ స్థితి చూచి పాటివారు లోలోన యితని మూర్ఖతకు నవ్వుకొందురు.

తాను యీ జగమున జగదొద్ధార రూపమున నుద్భవించుటచేతనే నా మహిమవలన యీ జగము యావత్తు యే విధమైన అలజడి లేకుండా సాత్వికముగ నడచుచున్నదని విశ్వయించి ఆనందించును.

మాసిపోయిన అవతారులు, ప్రవక్తలు, నానుండే. నుద్భవించి సమసి నాలోనే లీనమైనారని అహమున గర్వించును .

ఇటువంటి మూర్ఖుడు ఘనకార్యము చేయుటకు తలపడకూడదు. కారణము అతడు చేయు హత్యలకు మేరయుండదు.

నీవు ఆధ్యాత్మిక సాధనా రూపంలో ప్రయాణం చేయువాడవైన యిటువంటి వ్యక్తి నీ జీవితంలో సంభాషణా ప్రసంగాలలో వచ్చినప్పుడు ఆ క్షణమందే ఆ సంభాషణను మాయింపజేసి ఆ మూర్ఖుని బారిమండి తప్పించు కొనెదవుగాక.



# గౌరవము

ప్రతి మానవుడు గౌరవమును సంపాదించి గౌరవనీయుడుగ నుండుట స్వభావము. ఈ గౌరవార్జన యీ సృష్టియందు అనేక విధములై గోచరించుచున్నది. ఒకడు తన బలదర్పములతో యితరులను లొంగదీసి గౌరవింపబడవలెనని నాసించుచున్నాడు. యింకొకడు తన విద్యావైశేషిక ప్రభావముచే గౌరవింపబడవలెనని తలంచుచున్నాడు. మరియొకడు ధనధాన్యాధిక్యతచే గౌరవింపబడవలెనని వువ్విళ్లూరుచున్నాడు. యింకొకడు దానధర్మాది కర్మలచే గౌరవింపబడవలయునని ఆశించుచున్నాడు. ఈలాంటి అనేక విధములయిన విషయాసక్తులతో కూడిన గౌరవము పొందగోరిన వ్యక్తికి వకప్పుడు కాలము వక్రించినప్పుడు బేలపడి అగౌరవమునకు పాల్పడుచున్నాడు.

బలదర్పము :— తనకు గల కండబలిమి అహంకారము యితరులను భయపెట్టగలిగినప్పుడు ఆ దుర్మార్గమునకు పాల్పడి కృత్రిమరూపములో ఆ వ్యక్తిని గౌరవించుచున్నవారు ఆ వ్యక్తియె కాలముసాగి నవనాడులు కృంగింపజేసినప్పుడు బలదర్పములు వుడిగిపోయి నీరసించినప్పుడు తన బలదర్పములకు లొంగి గౌరవింపబడిన వ్యక్తులచే అసహ్యింపబడి యీసడింపబడుచున్నాడు.

విద్యావైశేషికము :— తన విద్యాదర్పముచే పండిత పామరులచే నమస్కరింపబడుచుండి విద్యాప్రభావముచే అష్టావధానములు. శతావధానములు చేసిన వ్యక్తి నోట అసహ్యకరమైన వాగ్విధానము యితర విద్యావంతులను జూచి అవహేళన చేసే నైజమును కలిగినప్పుడు వారు అసహ్యించుకొనడమే కాకుండా తనకంటే అధిక విద్యావంతునితో వాదమున నోడిన అగౌరవము పొంది ఖిన్నుడై సిగ్గుపడవలసివచ్చును.

ధనవాంఛ—: ధనవాంఛ కలిగిన వ్యక్తి కోరినంత ఆర్జించి ధనవంతుడై తన దర్పమును చూపించినప్పుడు అతని ధనమును వాంఛించి దాసులైనవారు నతనిని గౌరవ ప్రపత్తులలో పెట్టి వినయం చూపడము సహజము. ఆ ధనమే కాలవశాత్తు కర్మలడించి నసించి పోయినప్పుడు ధన దాసత్వమున గౌరవించినవారు ధన హీనస్థితి యందు చూచి విరక్తిరూపమున యీసడించక మానరు.

దాన ధర్మములు :— ఒకవ్యక్తి ధర్మరూపమైన దానముచే జన వశీకరము చేసుకొని గౌరవం పొందడములో ఆ గౌరవమునకు తగిన ధనసహాయము లేనికాలమున నతనిని దాన స్థితియందు విడిచి పోవడమే కాకుండా యెదిరి వచ్చినప్పుడు తమ దృష్టిని మరలించి వేరు దారిని మళ్ళిపోవుదురు. పలుకరింపనైనా పలుకరింపరు. ఇట్టి స్థితిని మానవుడు ప్రపంచమందు గౌరవా గౌరవముల కాకరమై కాలహతికి విహతుడై పోవుచున్నాడు.

గౌరవము :— ఏ మానవుడు, విద్యా, ధనము, కీర్తి దర్పము కలిగియుండి తన వాక్కునకు అడ్డులేని పరిస్థితిలో తన జీవితమును పురస్కరించుకొని విమర్శనలో పెట్టి లోకముచేత కాలముచేత గౌరవము పొందిననాడు వినయమను మహాశక్తిని ఆకరము చేసుకొని తన వాక్కునందు నమ్రిత పెదవులపై చిరునవ్వు బాలుని దగ్గరనుండి తన కంటే వయసుమీరినవారు తనను సందర్శించి నప్పుడు, తనకంటే చిన్నవయస్సునందు గలవారియందు ప్రేమ, ఆప్యాయత, తనకంటే వయస్సు మీరిన వారిపట్ల వినయము విధేయత కలిగి అవి సాటిలేని విధానములో నిలుపుకోగలిగిన సమర్థత, దుర్మార్గులు అసహనాపరులు తనను దూషించినప్పుడు, నిరసించినప్పుడు వోర్పుతో కూడిన చిరునగువు సహనమున తన పెదవులపై చిరునగవును తాండవింపజేయ గలుగు సహనశక్తి యెవడయితే కలిగియుండునో నాతని చెంతకు అగౌర

వము చేరదు. అట్టి సుగుణ నిధిని సర్వమానవ కోటియేగాక సమస్త జీవజాలములును ఆత్మీయంగా గౌరవించగలరు గౌరవింపబడును.

అటువంటి గౌరవము శాశ్వితమైనది. తాను సజీవంగా లేక పోయిన తన యశఃకీర్తులు దిగ్గంతి దంతావళుల నెక్కి నాట్యము చేయ గలవు. ఆతనినే మృత్యుంజీవుడని మనము పేర్కొనగలము. అటు వంటి వ్యక్తిత్వము గడించగల తన నడువడియందు ఆగడమందు దృష్టి పెట్టి ప్రతివిషయమును గౌరవ ప్రదమైన విధానముగా తన జీవితమును మార్చుకొనవలయును. అలా చేయగలిగిన వ్యక్తి లోకారాధ్యుడు. గౌరవనీయుడు. గౌరవమన నిదియే.

# ప్రాప్తము

ఈ ప్రాప్తమనునది అపురూపమైనదిన్ని బలీయమైనదిన్ని వూహాకు అందనిదిన్ని అయాచిత సంఘటన యయి యున్నది. దీనిని మానవుడు సుఖములంపుమరచి కష్టనిష్ఠూర నష్టములందు పేర్కొనుచున్నాడు. సుఖము లన్నప్పుడు భోగ భాగ్యములు సిరి సంపదలు సంతానము వీటినుండి తనకు కలిగిన నిర్విచారము. ఇది మానవునికి కలిగినప్పుడు తన ప్రాప్తమున కలిగినదని చెప్పుకొనడు.

పై చెప్పినది నొకదాని తరువాత యింకొకటి జారిపోయినప్పుడు తాను నీరసించినప్పుడు ప్రాప్తమనునది అభౌతికమైనదని తెలుసుకొన లేక తన ప్రాప్తమని పేర్కొనుచున్నాడు. తన ప్రాప్తములో యీలా నున్నదిగాన అలా జరిగిందని చెప్పుచున్నాడు. సుఖమునందు మాత్రము తన తెలివియొక్క ప్రభావముచేత దర్పముచేత చాకచక్యము చేత అదృష్టము కలసి రావడముచేత సంప్రాప్త మైనదని "అహమేవా" అనగలుగుచున్నాడు. కాలము మారి తన విధానము పై విష యాలకు భిన్నమైనప్పుడు. వ్యతిరేకించునప్పుడు లలాట లిఖితమో ప్రాప్తమో యనుచున్నాడు. మిక్కిలి బేల పొందుచున్నాడు. ఇది అజ్ఞానియొక్క తీరువు.

ఈ ప్రాప్తమను మహాశక్తి కాలంతోకూడి మానవుని నడువడి స్వభావములో మేళవించి ప్రకృతియొక్క తలదన్ని నాట్యమాడే మహాశక్తియని యోగిపుంగవుడు తెలుసుకొని యెప్పుడు యెందు యేమార్పు వచ్చిన ప్రాప్తమని నిశ్చయించి దానినుండి పైదొలగు ప్రయత్నములో దాని తలదన్ని దానిపై నాట్య మాడుచున్నాడు. ఆ ప్రాప్తమనునది తనను యెంతటి క్లిష్టపరిస్థితికి తీసుకుపోయినను

యెంతటి సుఖమైనను, హాయి యయినను, కలుగచేయుచోట నిలబెట్టిన యీ రెంటిని త్రాసులోబెట్టి సమానంగా తూచి సమత్వముగా చూచు చున్నాడు. కష్టములు కలిగినప్పుడు హాయిగా యనుభవించుచున్నాడు. సుఖములు కలిగినప్పుడు వాటిని విస్మరించక వాటియందు దృష్టిని పెట్టి వాటి పరిణామము నిరీక్షణ రూపంలో చూచుచున్నాడు.

ఇటువంటి స్థితిలో యే మానవరూపం తృప్తిరూపునిగ నిలబడ గలడో నతడే యీ ప్రాప్తమను బలీయమైన మహాశక్తిని తలదన్నిన యోగి పుంగవుడు.

# కష్ట - సుఖములు

కష్టసుఖములను భాషణములు లోకములో పరిపాటిగయున్న సంగతి అందరకు తెలిసినదే.

కష్టము :— మానవునికి కష్టమనునది మానసికముగను, శారీరకముగను అనుభవంలో తేల్చుకొనునప్పుడు ఆర్ధికముగనో, కష్టనిష్ఠూరములుగనో, కలిగినప్పుడది మానసిక కష్టములుగ మారి దుఃఖార్తుని చేయుచున్నది. తనకు శారీరకముగ కలుగు బాధలు, శ్రమలు, వికలత్వమున తన అవయవములకు కలుగు స్ధితులను గమనించినప్పుడు శారీరక కష్టములని పేర్కొనుచున్నాడు.

సుఖము:— తనకు మానసికంగ కలిగిన హాయికి, తృప్తికి, స్ధిమితమునకు, స్ధిరత్వమునకు, మానసిక సుఖమని తనకు కలిగిన ధన కనక భూవస్తు వాహనములే కాక శారీరక, ఆరోగ్య, సౌష్టవములు కలిగి ఆనందము కలిగినప్పుడు సుఖమని తలచుచున్నాడు.

కష్టసుఖములు మానవునికే కాక స్ధావర జంగమాత్మకమైన ప్రతి జీవికి కలవు. అవే దుఃఖ ఆనందములుగ వ్యక్తమై ప్రకటింపబడుచున్నవి. స్ధావర జంగమాత్మకమైన ప్రతి జీవి దుఃఖమో, ఆనందమో మానవ రూపిగయున్న జీవికి తెలియబర్చలేక పోయినప్పటికి సవి మానవుల వలెనే సుఖ దుఃఖములను పొందుచున్నవి.

మానవ వ్యక్తిత్వము పొందిన జీవి తన హావ భావములలో కష్ట, సుఖముల రూపంలో కలిగిన దుఃఖ ఆనందములు యితర మానవులకు తెలియబడునట్లు తన జీవిత యాత్రలో వ్యక్తపరచుచున్నది. ప్రతి జీవి సుఖమును కోరియే తన జీవితమును పురోగమింపజేయుచున్నది. అది ఆయుష్షు యున్నంతవరకు సుఖములుకోరి దానిని ననుభవించుటకై అహో రాత్రములు పాటుపడుచున్నది. కాని ప్రతి మాన

పుడు దుఃఖమునే యనుభవించుచున్నాడు. చక్రవర్తి యనబడు మానవ వ్యక్తికి తన జీవితము రాజ్యపాలనమున యెంత దుఃఖమయమై కష్ట దాయకముగ నున్నవో జీర్ణ వస్త్రధారియై చెట్టునీడను పడియున్న పేదవానికి అంత కష్ట దుఃఖములున్నవి.

చక్రవర్తిని జూచి చెట్టు నీడను పడియున్న పేద మానవుడు చక్రవర్తి సుఖాన్నిచూచి యెంత దుఃఖించుచున్నాడో పేద మానవుని నిర్విచారమైన సుఖాన్నిచూచి చక్రవర్తికూడా నంతే దుఃఖమును పొందుచున్నాడు.

ఈ స్థితిని మానవ జీవిత అంతరములందు యీ విధముగనే జీవితాలు సాగిపోవుచున్నవి. కాని జీవితమును విమర్శించిన సుఖ ఆనందములుకన్న కష్ట దుఃఖములే మితిమీరినట్లు తెలియక మానదు. ఈ ద్వైవిధీ భావములందు మానవుడు అజ్ఞానియై సుఖ మనుభవించు నప్పుడు నందు సంభవించు ఆనందమును పట్టజాలక తబ్బిబ్బై గర్వియై చేయు కార్యములవలన కలిగే పరిణామము దుఃఖకరమై కష్టతరమైన స్థితికి గొనిపోయినప్పుడు ఆర్తుడై దుఃఖించుచున్నాడు. ఆ స్థితిని విమ ర్శించిన సుఖమునది లిప్తమాత్రమే. అది సముద్రపు అలలమధ్య నిలచిన విశ్రాంతి వంటిది. జీవితమందు దుఃఖమే శాశ్వితము. అయి నప్పటికి మానవుడు కానికార్యములు చేసియయినను సుఖమునే బడయగోరుచున్నాడు. దాని పరిణామము దుఃఖాకరమైయున్న సంగతి నెరుంగజాలకున్నాడు. ఎంతో తృప్తి ఆనందముల ప్రకటించు చిదా నంద స్వాములకైనను మేదో మానసికమైన కలతబెట్టి దుఃఖముననే ముంచివేయుచున్నది. ఇది మానవుడు తెలుసుకొను స్థితియే ఆధ్యా త్మికమునకు పునాది.

సుఖములను ఆశించిచేయు ప్రయాణమునందు కలుగు కష్టముల వలన వచ్చు దుఃఖములను తట్టుకొనలేక చివరకు నిరాశుడై జీవితమున

గర్హించి హాస్యమైన స్థితికివచ్చి ఈశ్వర సంభూతమైన మహాశక్తి స్వరూపమైన శక్తిని గూర్చి ఆర్చి నాలోచనాపరుడై కష్ట సుఖములు దుఃఖ ఆనందముల మధ్య నిలబడి శాశ్వత ఆనందమనునది యేమిటి అను ప్రశ్నకువచ్చి దానిని బడయ గోరుచున్నాడు. అట్టి స్థితిని గురువు నన్వేషించు చున్నాడు. అటువంటి స్థితిలో సద్గురువు లభించిన నట్టి గురువుకూడా శిష్యుడనబరగు వ్యక్తిని దుఃఖ పరంపరల పాలు చేయుచున్నాడు. ఆ దుఃఖములలో మ్రగ్గి ఆస్థితిలో కూడా గురువందు అవిశ్వాసము రానీయక "సన్యాసిచేసిన సామ్రాట్టుచేసిన నీవేస్వామి" అనుస్థితికి వచ్చి నిలిచిన అట్టి భక్తుని గురువుగాంచి ఆశీర్వాద రూపమున సుఖమునందు దుఃఖము, దుఃఖమునందు సుఖమును యే తీరున వచ్చునో వీటియందు దుఃఖమును సహించి ఆ సహనమే ఆనందముగ మార్చు కొను స్థితి గడియించు కొనునట్లు చేయును. అట్టి స్థితికి వచ్చిన శిష్యుడు గురు వంతటివాడు.

ఇటువంటి జీవి దుఃఖానందు డనిపించును. శాశ్వతమైన సుఖ మునే ప్రతిలిప్తయందును యనుభవించును. దానికి కారణము గురువు యొక్క ఆశీర్వాదమున ఆయుష్షు మృత్యువాతపడి ఈ శరీరము నేల రాలి కట్టెయయినప్పుడు ఆ కట్టె సుఖదుఃఖముల కాకరమైయున్నదా? అనుభవించుటకు అర్హమైయున్నదా? అనుప్రశ్నలు అతని యాత్మను మాటి మాటికి మీటుచు తెలుపుచుండును. అది తన హృదయంలో స్థిర నివాసమైనప్పుడు యే దుఃఖము వచ్చిన నందు సుఖమే తొంగి చూచుచుండును. అట్టి సంతృప్తి స్థితికివచ్చిన మానవుడు ఏడ్పులో నవ్వు నవ్వులో ఏడ్పు సమానముగ యనుభవించును. ఈతడే తత్త్వ వేత్త, తత్త్వవేత్త అన్నప్పుడు సదా ఆనందుడే. ఇతనికి దుఃఖములు అంటవు. కష్టములు లేనేలేవు. అతడే సుఖి.



# పాపము - పుణ్యము

పుణ్యము:— మానవ జన్మయొక్క వుత్కృష్టత బుద్ధియొక్క వికాసము తెలివిగా ప్రజ్వలించుటచేతనే అది సార్ధకమైనదని వాఙ్మయమందు చెప్పబడిన విషయము. ఆ తెలివియందు ఆలోచనా విషయము స్వర్గమువరకు సాగినప్పుడు పుణ్యముచేసిన లభించునని నిశ్చయించుకొని పుణ్యము చేయుటయందు సంకల్పసహితుడై అవి యే యే విధులుగ దానిని నియోగింప జేయవలయునో తలపుకు వచ్చినప్పుడు దానమని మొదట వూహించుచున్నాడు. దానముచేసిన పుణ్యము కలిగి నాపుణ్య రూపములో అయిహికమందు భోగభాగ్యములేకాక పరమందును తన కామితములు నెరవేరగలవని నిశ్చయించి దానమునకు గడంగినప్పుడు మొదట నొకానొక అనారోగికి ధనరూపములో దానము చేయవలెనని తరువాత అంగహీనునకు, పేదవానికి వాటిపైని, వీటికన్న వుత్కృష్టమైన దానము అన్నదానమని నిర్ణయించి బీదలకు కబళమునుండి మామూలు అన్నము మృష్టాన్నమువరకు పెట్టుచున్నారు. తరువాత గుడులు, మశీదులు కోవెలలు కట్టించు చున్నారు. వీటివల్ల పుణ్యముకలిగి ఇహమునందు అష్టయిశ్వర్యములున్ను మరణాంతరము స్వర్గము ప్రాప్తించి అందు రంభాది దేవతావేశ్యల సంపర్కము కలిగి సంభోగాది సుఖములు కలుగునని ఆశపడి దాన మాచరించుచున్నారు.

ఈ విషయాలపై మానవ బుద్ధిపోనిచ్చి తర్కించిన కేవలము తన స్వేచ్ఛకొరకే స్వార్థపరుడై నాచరించుచున్నట్లు రూఢికాగలదు. రోగికి దానము చేసినప్పుడు నా రోగియందుగల అసహ్యత దూరము చేసుకొనుటకు దానము చేయుచున్నాడు. వికలాంగునకు దానము చేయుచున్నప్పుడు తనకుగాని తన సంతతికిగాని అంగవైకల్యము కలుగునేమోనను భయం కలిగి దానము చేయుచున్నాడు. బీదవానికి

దానము చేయునప్పుడు ఆస్థితి తనకు రాకూడదని, అన్నార్తునకు దానము చేయునప్పుడు తన కెప్పుడును క్షుద్బాధ కలుగకూడదని సంకల్పములో పెట్టుకొని దానము చేయుచున్నాడు.

గుడులు మశీదులు కోవెలలు కట్టించువారు జీవితమందు చేసిన పాప నికృష్టమైన చర్యలయొక్క ఫలితము నిర్మూలింప జేసుకొనుటకు పై విషయములను పూర్తి జేసిన తొలగునని సంకల్పించి నిశ్చయించి ఆ పాపరూపమైన పంకిలము తననుండి దూరము చేసుకున్నామని నిర్ధారణకు రాగలుగుచున్నారు. ఈ పై వారందరు పుణ్యాత్ములుకారు వారుచేసిన దానము సార్థకముకాదు. యివికేవలము తనకు లంకురించబోయె పాపపంకిలమును దూరము చేసుకొనుటకు చేయుచున్నారు. దీని వలన పుణ్యమురాదు. స్వర్గము లభించదు. పుణ్యము సంగ్రహించ దలచిన మానవుడు తనకుతాను విమర్శించుకొని పాపమను దానిని నంటకుండా తనజీవితమును గడుపుచు యెదిరి ఆత్మలను గ్రహించి యేఆత్మ ఈశ్వరసంభూతమై మహావిషయమైన స్థితికివచ్చి ప్రపంచములో తనకు కలుగు కష్టనిష్ఠూరములకు నోర్చుకొని సహనరూపములో తనబాధలు సమసిపోవునట్లు చేసుకొని తృప్తుడై మంధహాసియైన వ్యక్తి రోగియైన, వికలాంగుడైన, అన్నార్తుడైన వానికన్న యే విషయమును నపేక్షింపక ముగ్ధుడై యుండునో నటువంటి వ్యక్తిత్వమందుగల ఆత్మను గ్రహించి ఆచోట చేయుదానము పుణ్య ప్రదమైనది. భాగవతమందు "భూవరేణ్య యిట్టి పుణ్య ప్రదేశమందు చేయు దానము హరి సహస్రమిచ్చు" వనుమాటను మనము విమర్శించిన ఆ వ్యక్తి నాసించినది ఐహికమందు అష్టైయిశ్వర్యముగాని స్వర్గమందు రంభాది సంభోగ విషయేచ్ఛలుగాని కావు. అతనికోరిక కేవలము నష్కామమై యుండి నటువంటి విషయము లందచేయు దానమువలన హృదయము విశాలమై తన ఆత్మకు నప్పటికున్న శక్తికంటె వేయిరెట్లు ఈశ్వర విషయాన్ని గ్రహించి తరించు స్థితి రాగలుగుచున్నానని తెలుసుకొనగలడు.

ఇట్టి దానశీలుడైనవాడు తనతోడి మానవులకు కలుగు కష్ట నిష్ఠూరములలో పాల్గొని వాటినుండి తొలగించి వారికి స్వేచ్ఛకలుగు నట్లు సహాయపడి సహాయమును పొందినవారిచే మన్ననలబడసి పుణ్య మూర్తియని పిలువబడును. అట్టి స్థితిని కూడా తబ్బిబ్బునొందక గర్వి కాక తనలోతాను తృప్తుడై గంభీరుడై ముగ్ధత ప్రకటించును. ఇది యదార్ధమైన పుణ్యశీలునియొక్క చర్య.

పాపము :— ఈ ప్రపంచమునందు పాపము చేయకూడదు. దానివలన పాపము చేసిన వానికి అష్టకష్టములు కలుగుటయేగాక మరణానంతరమందు పరమందు నరకము లభించునని చెప్పుచు ఆయా పాపములకు ఫలము నరకలోకములో చేసిన పాపాలకు తగిన శిక్షారూప మైన బాధలు ననుభవించగలడని ఆ చేసిన పాపకార్యములకు విధించిన బాధలను వివరించుచు నచ్చట ననుభవించగలడని ప్రబోధముసు భయ పెట్టుచున్నారు. ఆ భయ విహ్వాలములకు లోనై ప్రజలు పుణ్యములనే చేయుదురని ప్రపంచములో వూహలుగానున్న విషయం మనకు తెలిసి నదే. ఇదియునుగాక నటువంటి పాపము చేసినవానికి ఆ పాపకర్మల వలన మరుసటి జన్మలో మానవుడై పుట్టి వాటిని అనుభవించు చున్నా డని నికృష్టియైన జీవితమునగల వ్యక్తిని చూచి నిర్ధారణ చేయు చున్నారు.

ఇటువంటి ప్రబోధము విన్నమానవుడు నికృష్టమైన మానవు లను చూచి భీతావహుడై అటువంటి విషయము తనకు రాకూడదని కొంతవరకు మంచి కార్యములు చేసినా నంతమాత్రముచే తనకు పాప మనే విషయం తొలగి పుణ్యముకలుగునని నిశ్చయింపలేము. కారణము ప్రతిమానవుడు యే జీవికైన హాని కలిగించిన కలిగించక పోయిన పాపము చేయకుండా వుండలేడు కాని తానుచేసినే పాపం తన విమ ర్శనలో తేల్చుకొని పశ్చాత్తప్తుడై [illegible]రుగ నటువంటి పాపము చేయక

ఈశ్వరుని ముందు క్షమాపణ కోరిన నాతడు క్షంతవ్యు డగు చున్నాడు. లోకమును మురిపింపజేయు పుణ్య కార్యములు జేసిన లోకమునిరసించు పాపకార్యములు చేసిన తాను నిస్వార్థియయి చేసిన పుణ్యము, పాపపంకిల పశ్చాత్త ప్తుడైన పాపి యిరువురును నొకేస్థితిలో నిలువగలరు. కాని యే మానవుడు ఈశ్వరరసస్వరూప సముపాసితుడై జగద్రూపిగనున్నాడో అట్టి మానవునియొక్క ఆత్మను క్షోభింపజేసిన. ఆ క్షోభ, రౌరవాది నరకములకు పోవు పాపకార్యములు నాచరించిన మానవునికి పశ్చాత్తాపరూపములో క్షంతవ్యత ప్రాప్తించి సిద్ధినిపొందే యవకాశము కలదు. కాని పైనిచెప్పిన సిద్ధిపొందిన ఆత్మను క్షోభింప జేసిన పరిస్థితిలో పశ్చాత్తాపముపడి క్షమార్పణకోరి తలమోదుకున్నను క్షంతవ్యత పొందలేని పాపియాతడు. అటువంటి యాత్మ నిర్మూలమై నశించి ఆకల్పాంతము వరకు క్షుద్రరూపము దాల్చియుండగలదు.

"మైఖురో, మసహబ్బసోజో, ఆతషందర్ బజన్
సాకినే, బుత్ ఖానబాషద్, మర్దుమాజారి మకున్"

నీవు మధుపానము చేసిన నీ మతగ్రంధమైన ఖురానును చింపివేసిన కాబా మసీదును తగులబెట్టిన. నీ మతవిరుద్ధమైన విగ్రహారాధన చేసిన వీటికి మించిన పాపకార్యములు చేసిన పశ్చాత్తాపపడి ఈశ్వరుని ముందు సాష్టాంగ పడితివేని నీవు క్షంతవ్యుడవు కాగలవు. జగద్రూప ముగానున్న సిద్ధ స్వరూపుడైన అమాయికమైన ఆత్మను క్షోభింప జేసినట్టి వ్యక్తికి క్షమార్పణ లేదు" నిది ఈశ్వర వువాచ.

"జలధిమండిన, జడధారి మండిన నార్పనెవరితరం" మన్నాడు తత్త్వవేత్త"

తత్త్వస్వరూపుడయిన వ్యక్తిని క్షోభపెట్టువాడు పాపాత్ముడు.



# విధి - కర్మ

ఆత్మ మానవ వ్యక్తిత్వము పొంది, జన్మించిన క్షణమందే విధి-కర్మ అనే విషయాలు రెండు ఆ వ్యక్తిత్వమునకు సంక్రమించు చున్నవి. అది ప్రస్తుత కాలమందు జాతకరూపములో నాతని జీవ యాత్ర గడిచే విషయము సాంఖ్య రూపములో లెఖ్ఖలు వేయబడి నతని ఆయుష్షు యిన్ని సంవత్సరములు, యీ యీ సంవత్సరములలో నతని జీవిత విధానము యీ యీ విధముగ మారునని నందులో బాధలు కలిగే కాలము శనికాలమని ఆలాగున భాగ్యములు కలిగే కాలము రాహు కాలమని ఆయా చక్రములలో తిరిగే రాసుల యందు ఆ జన్మించిన నక్షత్రముయొక్క కాలము ననుసరించి, ఆ యా రాసులందు ఆయా నక్షత్రమునవచ్చు సుఖదుఃఖముల మార్పులను వ్రాయించి, ఆ విధంగ మానవ జీవితమందు కలిగే మార్పులకు జాత కము పేరిట లెఖ్ఖల రూపంలో ధృవీకరించుచున్నారు. కొందరు హస్తములలోగల రేఖలను సాముద్రిక రూపంలో లెఖ్ఖలువేసి నతని జీవితమునందు భూత, భవిష్య ద్వర్తమాన కాలములలో జరుగు విషయాలు చెప్పుచున్నారు. కొందరు శరీర అంగసౌష్టవమును బట్టి లలాట రేఖలను తిలకించి వాటిపై ఆ వ్యక్తి యే జాతికి చెందిన వ్యక్తియో నిరూపణచేసి ఆ యా జాతి స్త్రీ పురుషుల జీవితములను అంగ సాముద్రిక మనుపేర వర్ణించుచున్నారు.

పై విధానములో విధియనిగాని, కర్మయనిగాని వేరుచేసి చెప్ప బడి యుండలేదు. కాని అశేష మానవులు పైమాటనే ఆధారము చేసుకొని విధి కర్మలను విస్మరించు చున్నారు. ఉపేక్ష చేయు చున్నారు.

విధి:— "విధివిధాన మలంఘ్యము యెట్టివారికిన్" అన్నాడు తత్త్వవేత్త. సృష్టియందు జీవరూపములో యున్న ప్రతీదిన్నీ విధియను బలీయమైన శక్తికి లొంగియున్నదన్న సంగతి మరచిపోకూడదు. అది ఈశ్వర సంభూతమైన మహాశక్తికి లొంగియున్న సంగతి తథ్యము. ఎవరైనను విధికి మించిపోజాలరు. ఈశ్వర సంభూతమైన రస స్వరూపమునకే విధియని చెప్పవలయుగాన దీనికి మించిన విషయం వేరుగ జరుగబోదన్న సంగతి మనము సుబోధితముగ తెలుసుకొనవలసిన అవసరమున్నది.

మన దృష్టికి కనబడే పంచభూతాలయొక్క ఆగడము వాటియందు మనుగడగా కలిగిన సృష్టి వైచిత్రియము విధికి మించిపోజాలదన్న సంగతి నిక్కము. నటువంటి స్థితిని తెలుసుకొన్న వ్యక్తికి యీ పంచభూతములు విధి ప్రేరితములని తెలుసుకొన గలరు. కావున ప్రతి విషయము మన అనుభవ రూపములో పరిశీలించి విమర్శించిన దాని అంత్య పరిణామము విధి కృతమని తెలియగలదు. కావున మానవ జన్మగా వచ్చిన వ్యక్తిత్వము దాని అంత్యము వరకు జరిగిన మనుగడ విధి విధానముగనే జరుగుచున్నదని నిశ్చయించవలసినది. అదియే నిజము కూడా.

కర్మ:— కర్మయనునది రెండు విధములు ఒకటి వూహా రూపములో జనించి వూహారూపములోనే సమసిపోవును. రెండు వూహారూపములో జనించి అవయవ రూపమైన కార్య కలాపములలో సమసి పోవునది.

ఒకటి ఊహారూపములో జనించి తన దృష్టి ప్రసారముతో సాగి దానిలో నొక అంత్య పరిణామమునకు చేరిన తరువాత ఆగిపోవు కార్య కలాపములు అభౌతికమై సూక్ష్మ రూపమున జరిగి దాని పరి

ణామము తేల్చబడేవి కొన్ని, తేల్చబడకుండా సమసిపోయేవి కొన్ని. యివి ఒకప్పటికి కర్మరూపంలో వ్యక్తం కాగలవు.

ఊహా రూపంలో యప్పటి కప్పు దుద్భవించి ఆ క్షణమందే భౌతికంగా అవయవ రూపమందు వ్యక్తమయ్యే కార్య కలాపములు కర్మ రూపమును దాల్చు చున్నవి. వీటి పరిణామముపై లోక విష యములు సాగుచున్న సంగతి జ్ఞానికి, అజ్ఞానికి తెలిసిన విషయమే. దానికి ప్రతి కర్మకు నొక్కొక్క వుపమానముకూడా కలిగియుండును. అది అయా సమయములలో ఆయా ఉపమానములు స్మరణకు రాగలవు. ఇందు జ్ఞాని ప్రతి విషయమును రస స్వరూప సంభూతమైన ఈశ్వర ప్రేరిత విధి కృత్యమని సహించును. శుభములలో తబ్బిబ్బు పడడు. అశుభములలో యిరికినప్పుడు యేడ్వడు. అజ్ఞాని అయినచో తనకు కలిగిన శుభములకు వుబ్బి తబ్బిబై మిడిసిపడి గర్వించి ఆ సుభము వక్రించినప్పుడు యీసురోమని యేడ్చుచు తాను చేసిన కర్మను మరచి విధిని దూషించును. ఏలాగు ననగా బాలునియందు మేహవ్యాధి, అనారోగ్య రూపమున చూపట్టునపుడు అది పూర్వ జన్మయందు చేసిన కర్మ యీ జన్మలో యీ విధంగా పరిణమించినదని చెప్పు పడికట్టుమాట సర్వాబద్దము. ఆ బాలుని తండ్రిని పిలిచి యీ బాలునికి అంకురించిన వ్యాధియొక్క రక్త కారకుడు తండ్రిగాన ఆ తండ్రిని అడిగినప్పుడు తనయందు యీ జన్మలో చేసిన కర్తృత్వ రూపములో సంక్రమించిన సెగ, సవాయి వ్యాధులే జీర్ణించిన కారణమని ఒప్పు కొనక తప్పదు. ఆలాగుననే విధి కృతముగా జరిగిన కర్మలను అశు భంగా మారినప్పుడు యనగా కష్టములు సంభవించినప్పుడు వాటిని శుభములుగా మార్చుకొనుటకు కళంకితమైన కర్మలు చేయును. ఈ కర్మలు చేయించునది ఈశ్వర విభిన్నమైన భ్రాంతి శక్తియని తెలుసు కొనలేక ఆ కర్మలయందు ్రమగ్గి బూడిదయై నసించును. కాలాన్ని

అనుసరించి చేయు స్వయం కృతాపరాధము వలన ఈ అనారోగ్యాలు కలిగి మరణమువరకు తీసుకొనిపోవును. అంతియేగాని పూర్వజన్మ దుష్కృత ఫలంవలన కలిగినవని భ్రమింపరాదు.

ముక్తి స్వరూపుడయిన సాధకుడు పై విషయములకు అన్యంగా వుండి విధి కర్మల విధానములు తిలకించుచు వాటివాటి పరిణామములను శుభములుగా మారునట్లు తన సంకల్పములో యిమిడిపోయే ఊహలలో నిశ్చయించి తరింప జూడగలడు.

సాధకుడు తన విధి విధానమునుండి కలుగబోయే దుష్కృతములను ముందుగనే గ్రహించి తన తపోశక్తిచే వాటిని మీరి ముక్తి సాధించగలడు.

# కాంత - కనకము



మానవుని యందు జ్ఞానదృష్టిలో యేకాంతముగ యే పర్వత ప్రాంతమునకో పోయి ఈశ్వర విషయాన్ని సాధించినవాడే యోగియని అతనికే సర్వము తెలుసునని అతనిని యనుసరించినపుడు యతని వాక్కునుండి వచ్చుధ్వని ఉపనిషద్రూపమని యతని స్పర్శ తగిలితేనే ముక్తి వచ్చునని నతనికి యీ సృష్టియందు ఆశయనే విషయమునుండ దని నతనిని గ్రహించి యెవరైన భిక్షరూపములో పెట్టిన ఆరగించి కానినాడు సహించి యింతనీరు త్రాగి యుండగలడని చెప్పి ప్రచారము చేయు ప్రచారకులు వేనోళ్ళ చాటుచు నాతడు వాఙ్మయముగ యున్న వాటిని వల్లించి పలికిన పడికట్టుమాటలయందు అపారమైన నిగూఢమైన అర్థమున్నదని నటువంటి అర్ధము కలిగిన మాటలు ఆ నోట రావాలంటే అతనికి కాంతా కనకములయందు బలీయమైన విరక్తియుండి యుండాలి కాబట్టి ఆ పేర్కొన్న వ్యక్తియందు యీ రెండు విషయాలలో చెప్ప శక్తికానంత విరక్తి కలదని ప్రచారము చేసెడివారు చెప్పు మాటలు విని ఓహో! మహానుభావుడని పూజించుచున్నారు. అతని రూప వర్ణన పెద్ద గెడ్డంతో కూడిన జడలల్లిన తల రుద్రాక్ష మాలలు కాషాయ వస్త్రములు నదికాని విధానములో గెడ్డము మీసము లేని బోడిగుండు కలిగి కాషాయ వస్త్రములు ధరించి దండ కమండలధారుడై నిమీలిత లోచనములతో ఈశ్వర విషయం పూర్తిగా గ్రహించిన వాని వలె వారి ప్రసంగములలో వెల్లడించుచు యిలా చెప్పువారి పడికట్టు మాటలకు విభ్రాంతులై వారిని పూజనీయులుగ బ్రహ్మ స్వరూపులుగ కామాది విషయ షట్కములు నిర్జించిన వారిగ నిశ్చయించి అట్టివారి యందు భక్తి విశ్వాసములను వెళ్ళడించు చున్నారు. ఇట్టివారు యీ కాలమునందు యోగులుగను బ్రహ్మ స్వరూపములుగను వెలసి యున్నారు.

"ఏతద్విషయే తత్పూర్వం ప్రాచీనం" ఇటువంటి వారే జ్ఞాన విషయం తెలిసినవారు అవి నిశ్చయింప బోవునపుడు దీనికి పూర్వం జ్ఞానులు మహాఋషులు యిటువంటి విషయములోయుండి గ్రహించి లోకానికి వేద, ఉపనిషదాదిగా గలిగిన మహత్తర జ్ఞాన విషయమును వెళ్ళడించారా? అను ప్రశ్నవచ్చినపుడు అదిఋషియయిన వశిష్ట మహాఋషికి నూర్గురుకుమారులు నతని భార్య అరుంధతి. విశ్వామిత్రునకు శకుంతల కుమార్తె. వ్యాసునకు ధృతరాష్ట్రుడు, పాండురాజు, విదురుడు, శ్రీశుకుడు కుమారులు. యాతీరుననే ప్రతిమాహాఋషి వేదవిహితమైన ప్రతి వాక్కును పలికిన ఋషులయొక్క చరిత్రలు కాంతలుకలిగి యున్నట్లు చెప్పుచున్నది. అవతార పురుషులైన శ్రీరామ, బలరామ, కృష్ణులకు భార్యలు కలరు. ఆదం ప్రవక్త మొదలు మహమ్మదు ప్రవక్తవరకు ప్రతిప్రవక్త సంసారులు. నొక్క ఏసుక్రీస్తు తప్ప ఆనాటి కాలంలో పెండ్లి వయస్సు రాక పూర్వమే ఏసుక్రీస్తును శిలువ నెక్కించుటచేత నాతడు కాంతరహితుడైనాడు ఈవిధంగానే ఉపనిషత్కారకులు కూడా అవి వాహితులు కారు. బుద్ధుడుకూడా సంతానము కలిగినవాడు.

కానీ యీ కాలమందు కాంతా కనకములను విసర్జించినాడని ప్రతినొక్కరిని పేర్కొని వారివారి రహస్యాన్వేషణ చేసినయెడల వారు చేసిన చేయుచున్న దురంతములు. వారు చేయు కామాది విషయగాధలు బయలుపడినప్పుడు ఆ విషయాలు తెలిసిన హృదయాలను ధ్వనింపజేసినప్పుడు తెలియగలదు. వారికి పాదపూజరూపములో గురుదక్షిణ రూపములో లభ్యమైన ధనము తమ శిష్యులచే సంగ్రహింపబడి ఆ ధనము యినుపపెట్టెలోనికి వచ్చినప్పుడు బ్యాంకులలో వేసినపుడుగాని తాకుదురురేగాని మనయెదుట నిరసనరూపంలో ఫుట్టు కొనరు. ఈనాటి కాలమందు కాంతా కనకముల నొల్లని వేషధారులను

సోదా చేసినపుడు వారు గడించిన కనక రూపమైన ధనరాసులు ఎంతవిగా నున్నవో అవి వారి శక్తికి మన లెఖ్ఖకు మించియున్నట్లు తెలుసుకొనగలము. ఇటువంటి వ్యక్తులను కాంతా కనక విరక్తులని మోసపోయి వారిని తమ స్థానములో చేర్చినప్పుడు వారుచేయని దురంతకృత్యములు లెక్కపెట్ట సాధ్యము కానివిగ యున్నట్లు మనము ఆలకించుచునే యున్నాము. కాంతా కనకముల నొల్లని వేషధారణ గజదొంగలకు ఆకరమగుచున్న సంగ నిజము.

యదార్థమైన యోగ రూపములలోయున్న కాంతా కనకముల నొల్లని వ్యక్తి పవిత్రమైన శీలరూపంలోయున్న సంసారి తనపత్నిగా యున్న వ్యక్తియందు తన విషయేచ్ఛలను నిర్వర్తించి ఆ రూపమున వచ్చిన సంతాన పోషణకై శ్రమించిన ఆర్జనపై మోసి ఆ సంతానము కృతార్థులను చేయు భారమును గూర్చి సాధనాపరుడై ఈశ్వర విషయాన్ని గ్రహించిన అట్టివారు యితర కాంతలపై గాని యితరుల ధనముపై గాని అతని మనస్సు పోనివ్వడు, పోదు. అతడే కాంతా కనకములు రహితము చేసికొన్న యోగి.

# అందము

అందమనునది నొక అపురూపమైన అభౌతిక శక్తిస్వరూపము. ఇది ప్రతిజీవరూపము పొందిన వ్యక్తిత్వము. అనగా స్థావర జంగమాత్మకమైన ప్రతిజీవి యందును అందమను మహా స్వరూపము యిమిడియున్నది. ఇది పంచభూతముల యొక్క ఆకారములలో కూడ యిమిడియున్నది.

మన దృష్టి ఆకాశము పైకి పోనిచ్చిన అది పగలుగానున్నప్పుడు ప్రభాతకాలమునుండి సాయం సంధ్యవరకును సూర్యుని వలన కలుగు మార్పు ఆయా చోట్లలో సూర్యుడున్నప్పుడు మన దృష్టి ఆయా చోట్లలో మరలించినప్పుడు, ఆకాశములో కలిగిన మార్పులు అందమునే సూచించుచున్నది.

ప్రభాతకాలమున సూర్యుని రాకకు ముందు వాని కిరణజాలముల యొక్క ప్రకారము వలన రేఖలు కలిగిన ఆ సమయము తూర్పుదిశ అందముతో కూడిన ఆనందమును కలిగించును. మధ్యందిన మార్తాండుడు ప్రజ్వలించినపుడు ఆయా తావులందు ప్రకాశమానముగను వూహించిన అది అందము. సూర్యుడస్తమించినపుడు సూర్యబింబమును తిలకించునప్పుడు కన్పట్టు దృశ్యము అందము. అస్తమించు సమయమందు ఆ సూర్యకిరణములు లతలపై వున్నత సౌధాలపై చెట్లపై అవి ప్రసరింప బడినప్పుడు వాటి వాటియందు కలుగు మార్పులు అందము. సూర్యుడస్తమించిన తరువాత నల్లటి కారు చీకటులయందు ఆకసమువైపు చూచినపుడు కలుగు తారలయొక్క సొంపు అందము, పూర్ణచంద్రుడు వెలార్చు చల్లని శోభాయమానమైన జాజ్వల్యము అందము. ఇత్యాది గలిగినట్టి ఆకాశము అందము.

అగ్ని :— అనేక రూపములుగ తేజోవంతముగా ప్రకాశమానమై సొంపులు నింపు అగ్ని స్వరూపము అందము.

నీరు :— వివిధ చాయలతో కూడి మేఘముగ వర్షించి పిల్ల కాలువలనుండి నదులుగ మారి స్వచ్ఛమై సముద్రములో కలియువరకు యురు వాగులను పరికించినపుడు గల అందము మహా జలాశయముగా మారిన సముద్రము దానితీరు దానిలో సూర్య, చంద్ర మండలములు ప్రకాశమానమై ప్రతిచ్ఛాయగా ప్రజ్వలించు కాంతులు నీటి యొక్క అందము.

భూమి:— పచ్చని గడ్డి సస్యశ్యామలమైన పైరులు వాటిపై ప్రభాతకాలమందు వజ్రముల వలె ప్రకాశించు మంచుబిందువులు, దూరమునుండి నీలమేఘములవలె చూపులకు ఆను పర్వతపంక్తులు. వృక్షజాలములు, పశుపక్ష్య క్రిమి కీటకాది మానవులవరకు వారివారి మనుగడ అందు మానవుని మనుగడయందు ఘాటిమాటికి గల్గు మార్పులు. మానవ బుద్ధివికాసముచేత తీర్చిదిద్దబడిన క్షుగ్రామ, పట్టణ, పురాది, రాజధానుల సొంపు వీటన్నింటిని చూచి ఆనందించు మానవుని వూహలో నిర్మాణమైన చిత్రపటములు భూమి యొక్క అందము.

గాలి:— చల్లని పిల్లవాయువులు పూలవనములనుండి గొని వచ్చు సువాసన ఆయా సమయములయందు వీచు గాలివల్ల కలుగు కదలికలో సృష్టియందు కలుగు మార్పు గాలి అందము.

ఈ పంచ భూతములయందుగల అందము మానవుడు తన భావములో క్రోడీకరించి తన దృష్టిని తిలకించిన అది కేవలము ఈశ్వర సంభూతమైన రస స్వరూపముయొక్క ఆనందమయమైన అందము.

సృష్టియందు మనకు కనపడు స్థావర జంగమాత్మకమైన ప్రతి జీవియందును అందమే కలదు. అది మానవ స్వరూపమునకు వచ్చు

సరికి యీ జీవజాలముల యందుగల యావత్తు అందము సృష్టిస్వరూప మైన మానవునియందు చూడగలము.

ఈమానవ స్వరూపమునందు అందము రెండుభాగములు 1:— స్త్రీ స్వరూప అందము 2 ;— పురుష స్వరూప అందము.

స్త్రీ స్వరూప అందము ;— ఈ స్త్రీ స్వరూప అందమును ప్రతి మానవ వాఙ్మయకారకులు కవులు పండితులు అపురూపముగా వర్ణించి యున్నారు. ఆ వర్ణనలలో పచ్చని చర్మము కలువ రేకులవంటి కన్నులు పూర్ణ చంద్రునివంటి ముఖము, యెఱ్ఱనిపెదవులు, నిడుపైన ముక్కు, శంఖంలాంటి కంఠము బారులుదీరిన తుమ్మెద పంక్తులలాంటి జడ, పర్వ తములబోలు వక్షస్థలము, సూన్యముబోలిన నాభికలిగిన నడుము, అరటి బోదెనుబోలు తొడలు, (జఘనములు) తామర తూండ్ల లాంటి చేతులు గలయట్టి రూపంలో వర్ణించినారు. ఈ పై విషయములను పురస్కరించు కొని నొకచిత్రకారుడు చిత్రించిన ఆ అందము చూచుటకు యెంత అసహ్యముగా వుంటుందో తనదృష్టిలో రూపించుకొను వ్యక్తికి తెలియ బడగలదు.

యదార్ధములో స్త్రీస్వరూపమే అందము. ఆ అందము స్త్రీ అవయవములయందు పూర్తై, ఆ స్త్రీని చూచిన మానవుని యొక్క కంటికి ఆయా అందముగలచోట్లు తనదృష్టికి అనినప్పుడు ఆ అందము అపురూపమైన అప్సరరూపంగా చూపట్టును. ఆ స్త్రీకి కవులు వర్ణించిన తీరువుగాని, చర్మమునందు గోచరించు రంగు భేదములుగాని, అన గత్యము, నల్లని ద్రౌపదిని లోకజాలము మోహించినది.

స్వభావసిద్దంగా భిన్న భిన్న పురుషులకు, భిన్న భిన్న స్త్రీ రూప ములు ఆకర్షణీయమై వలపింపబడును. ఆ వలపింపబడిన అందము విర హమున్నకు కారణమై పురుషుని స్త్రీ యొక్క పాదా క్రాంతునిగా చేయుచున్నది.

పురుషుని అందము :— అందము అన్నప్పుడు పురుష స్వరూపములోనే చూడదగును. సాధారణంగా పురుష రూపము అందమైనది కాదు. పురుషునిలో అందమనునది వర్ణింపవలెనన్న అసాధ్యము. కాని లోకములో నొకప్పుడు అసాధ్యమైన విషయము దైవికముగా సాధ్యమగుట కలదు. అలాగునే పురుష రూపంలో యే నొక చోటనో అందముగ వెలార్చును. అటువంటి పరిస్థితిలో యీ అందమునకు మూలస్థానము పురుష రూపము. ఇది భౌతికమైన ప్రకృతిసిద్ధమైన అందమునకు ఆకరము.

అందము :— అందమనునది అపురూపమైన మహాశక్తి అదిరక్త నాళములను పొంగించి వేడెక్కించి బలీయమైన మహాశక్తి. అటువంటి అందము అనుభవ రూపములో తెలుసుకోవలెనన్న విశాల రూపములో నిష్కళంకమైన తన మనుగడలో, తన మాటలలో తన చూపులలో తన పవిత్ర కార్య కలాపములలో ఇమడి యే మానవునియందు స్త్రీ గాని, పురుషుడు గాని వోర్పులో కూడిన చిరునగవు కలిగిన గంభీర స్వరూపముగల యట్టి వ్యక్తిత్వముయొక్క గంభీర స్వరూపము చూచిన అందు కనబడు అభౌతికమైన అందము చూచిన యెదుట మానవునిలో ఆ అందమునకు జోహారు లర్పించునట్లు చేయును. అది మానవకోటినే గాక సమస్త జీవజాలములను, యీ పంచభూతాత్మకమైన సృష్టిని కూడా జోహారు లర్పించునట్లు చేయును. ఇటువంటి వ్యక్తియొక్క ఆత్మ స్వరూపమే అందము.



# సత్యము

నిజమనునది మహత్తరమైన శక్తివంతమైన ధ్వని. దీని ప్రాతి పదికము సత్తు "సత్" అనగా వున్నది. అను అర్థ మిచ్చు చున్నది, దీనినిబట్టి సత్తుయొక్క పరిణామము సత్యము కారణముగ వున్నది అన్న నిజము తెలిసి తెలుసుకున్నప్పుడే సద్రూపి అనబడుచున్నాడు. ఈ సత్యము సృష్టియందుగల మానవ విధానములో చాల చీకటిని పడి యున్నది. యే యొక వ్యక్తియొక్క అంతరాత్మ అయినను ధ్వనించు ధ్వని నిజము నిర్దిష్టించునట్లు లేదు. తాను ధ్వనించిన ధ్వని అబద్ధ మని తేలినప్పటికి దానిని సమర్థింప జూచుచున్నాడు. అందు అస మర్థ నీయమనేది అబద్ధమనిపించును. దీనినిబట్టి ప్రతి మానవుడు తన నిజజీవిత కార్యాద్యవసరములయందు వాటిని సమర్థించుటకు అస త్యము వచ్చునంత సులువుగా సత్యము చెప్పుట సాధ్యపడుట లేదు. అందుచేత ప్రతి మానవుడు అసత్యమునే పలుకుచున్నాడని చెప్పవలసి యున్నది. కాని అబద్ధములు రెండు విధములుగ నున్నవని చెప్ప నగును. ఒకటి ప్రాణాంతకమైనది. మరియొకటి ప్రమాదము లేనిది. ప్రమాదము కలిగిన కార్యము మానవుడు చేసినప్పుడు నాతడు తప్పక అసత్య మాడవలసి వచ్చినప్పుడు నాతని హృదయము సంశయాత్మక మగుచున్నది. విషయము తాను చేసిన ప్రమాద కార్యముయొక్క రహస్యము తెలిసినవారు తన దృష్టికి వచ్చినప్పుడు భయపడి కృంగి వారిని ప్రతిమాలవలసి యుండును. తాత్కాలికముగ నటువంటి విష యము ఆ యబద్ధము నిజమని న్యాయస్థానమున నిరూపింపబడి నా ప్రమాదమునుండి రక్షింపబడితినని తృప్తిలో నొకవేళ ఆనందించినను నది ఈశ్వర విషయంలో యదార్థమైన నిజము. అది. తప్పక వెల్లడి కావలసిన విషయము వుంది కాబట్టి ఏ కాలానికైన ఆ నిజము వెల్లడి

కావలసి యున్నదిగాన యీ నిజము యెప్పటికిని మన్నుకొట్టుకొని పోవు సావకాశము లేదు. కావుననే నిజం బెప్పుడు మన్ను గొట్టుకొని యేగదు. "మృణాళి కన్నులన్ విప్పక మూసుకొన్న రవి విప్పిన కైవడి విచ్చు చీకటుల్" అన్నాడు తత్త్వవేత్త.

ఒకవేళ భౌతికమైన విషయాలలో అబద్ధమాడినను ఈశ్వర సంభూతమైన విషయములలో నీ యాత్మయందు నీవు చేసిన పాపకార్యములకు నీ యాత్మకు కలుగు బాధాకరమైన వ్యథ జీవితాంతము వరకు అనుభవించుటకంటె నీవు చేసిన పాపకార్యము యదార్థమైన సత్యరూపములో వెల్లడించితివేని దానికి తగిన క్రమమైన శిక్షకలిగి దానియొక్క పరిణామమునకు పోవు విషయమున్నది గాన సృష్టియందు నీవు ఆడు అసత్యమును దానివలన వచ్చే ప్రమాదమును వూహించి విజ్ఞాన రూపివి కాగలవాడవైతే నిజమునే చెప్పి భౌతికంగా అభౌతికంగా నీ ఆత్మకు శాశ్వత ఆనందము తృప్తి కలుగునట్లు చేసుకొనగలవు.

సృష్టియందు జన సమూహములు నిజము అబద్ధము సత్యము, అసత్యము యని పేర్కొనబడి న్యాయా న్యాయములనే విమర్శనా రూపములో మానవ గుణగణాలు విభజింపబడు చున్నవి. నటువంటి సమయములో సత్యము అన్నప్పుడు న్యాయము, అసత్యమన్నప్పుడు అన్యాయమని తేల్చబడుచున్నది. ఇది ప్రపంచకములో భౌతికముగను అభౌతికముగను తెలియబడుచున్నది.

మానవుడు సత్యమను మాటకు చాలా విలువ నిచ్చినను యది యదార్థముగ మానవునియందు యెంతవరకు కలదో తెలియుట కష్ట సాధ్యము. ప్రపంచకములో సత్యమును తేల్చుటకై నియమింపబడిన న్యాయస్థానములందు అసత్యమే సత్యముగ బూటక సాక్ష్యరూపములో బలీయమైన వాదనా పటిమతో నిరూపింపబడుట్లయు నటువంటి

సత్యమును నిజమును తెలిసినవారు గర్హించుటయు చూచుచున్నాము. మానవుడు యెల్లప్పుడు సత్యమునే పలుకుచున్నాడన్నమాట కల్ల కారణము సత్యమను సంగతి భౌతికమైన విషయములలో తెలియ బడుట లేదు. తనను కాపాడుకొనుటకు నిరూపించు శబ్దజాలము సత్యము మీద మోపి యున్నప్పుడు నాతడు చెప్పినదానిలో యెంత వరకు నిజమున్నదని తేల్చుకొనవలసి యున్నది. అది వూహాకు అంద నంత దూరములో నున్నది. ప్రతి విషయము కనులతో చూచి నిరూపణ చేయుట సాధ్యముకాని విషయము కావున సర్వ విధాల చెవులతో వినిన ధ్వనినిబట్టి కనులకు గోదరించు దృశ్యములుగ నిరూపణ జేయ వలసి యున్నది. అటువంటి పరిస్థితిలో మానవుడు యదార్థమున సత్యము గ్రహించగలడని చెప్పువాడు సత్యమునే చెప్పుచున్నాడను నది యిదమిద్ధమకి చెప్పుటకు సాధ్యము కాదు. కాని దానిని గూర్చి యెక్కడ సాధ్యముగా యున్నది యన్నప్పుడు కంటితో చూచుచున్న విషయములు చూచిన వ్యక్తి తన హృదయాంతరాళములలో యధా తధంగా చెప్పినప్పుడు నది సత్యమని చెప్పవచ్చు గాని యే నొకానొక మానవునియందో నది నిరూపణం కావడం తప్ప సర్వ జనీనకంగా సత్య మునే చెప్పువారు లేరు. కాని యే మానవుని కా మానవుడు దోష దూషితమయిన విషయము పరీక్షకు వచ్చినప్పుడు తన యంతరాత్మ యందున్నటువంటి యదార్థమును పురస్కరించుకొని అది తన మన స్సాక్షిగ తనంతట తనకే నిరూపణ యయినప్పుడు దానికి సత్యమన వచ్చును గాని, మానవునిలో కలుగు అశక్తత ప్రమాదించునను భయముచే ఇటువంటి మనస్సాక్షిగ యున్న విషయము వెల్లడించ లేక పోవుచున్నాడు.

ప్రపంచమందు ప్రతి విషయమును నిజమునకై అన్వేషించిన వాదమందు అది నిలువజాలదు. అనుభవముల్లై కాలము జరిగిన

కొలది యదార్థమైన సత్యము నిరూపణయగుట కూడా సాధ్యము. ఇందు భౌతికమైన యీ ప్రపంచమందు మానవ పరోక్షమందు చేయు ప్రతి కార్యము నిజములోపెట్టి విమర్శించిన నవి మానవునకు తనంతట తనకు వాటి నిజరూపము రూపించక మానదు. ఈ సత్య మను ధ్వని ప్రాపంచిక దృష్టిని భౌతిక. అభౌతిక విషయమునందు మోసియున్నదను సంగతి నిరూపింపబడినట్లు తత్వమందు కూడా తెలియబడుటలేదు. కారణము వేదాంత విహితమైన తత్వము మానవుడు తెలుపు విషయమందుకూడా నిజము లోపించుచున్నది. ఆధ్యాత్మిక సిద్ధాంతమును తేల్చు విషయము నిర్ణీత వేష భాషలలోను వాఙ్మయ రూపములో పడికట్టు మాటలలో యిమిడి ధ్వనించే ధ్వనిని మానవుడు సత్యమని నమ్మునట్లు చేయుచున్నారు. అది యెంతవరకు ఆ రూప వేషధారి శ్రమించి సిద్ధాంతీకరించి చెప్పు చున్నాడో అది నిజరూపములో తెలుసుకొనుట కష్టసాధ్యము కాబట్టి వేషధారణలో మణిగిన వ్యక్తి యెదిరి వ్యక్తిని విభ్రాంతునిగ మార్చి మోసము చేయుచున్నాడు. అది అసత్యముగ మన్నదని తెలుసుకొనుట కష్టమైనను ఆ వేషధారి తనంతటతాను తనకెంత వరకు ఈశ్వర విషయము తెలుసునో తన ఆత్మ తనకు సాక్ష్య మిచ్చి నప్పుడు ఖిన్నుడై నప్పటికి ప్రజలను అసత్య రూపమైన మోసము చేయుట మానడము లేదు. ఆ కారణమున యేది సత్యమో యేది అసత్యమో తెలుసుకొనుట ఆధ్యాత్మిక విషయమున కూడా దుస్సా ధ్యముగనున్నది. నొకవేళ నిజమైన తత్వమును వెల్లడిచేసి అనుభవ రూపములో వచ్చునట్లు చేసిన విధానమునుకూడా యెదిరి ఆత్మ నమ్మ జాలని స్థితిలో నుండుటచే "నిజములు చెప్పనేని అవి నింద్యము లంచు దలంతురు".

"ఈ మహాప్రజ కబద్ధ నాటకమె ప్రాయికమైనది" అని తత్వవేత్త నుడివినాడు. ఈ వాక్కును పురస్కరించుకొని సృష్టిలో ఆధ్యాత్మిక విషయము బూటకమైన వేష భాషలలో పడిపోయినదని "సకాలేనేహ మహాతో యోగ నష్టపరం తపః" నిజమైన తత్వమును ప్రజ నమ్ముట లేదుయని శ్రీకృష్ణ భగవానుడు నుడివినాడు.

మానవ దృష్టికి తాత్కాలికమైన మహత్తును చూపించిన అది యదార్థమునకు విరుద్ధమైయున్నను దానినే మానవుడు నమ్మి అనుసరించి సత్య స్వరూపమును మరచిపోయినాడు. దానికి క్షుద్రదేవతోపాసన సమంజసముగా నుండుటచే తాత్కాలికముగ క్షుద్ర దేవతల విధానమైన గారడీలే ఆధ్యాత్మిక విషయమని నమ్మునట్లు చేయుచున్నారు.

అట్టి అసత్య రూపులను నమ్మిన మానవులు భ్రాంతి జన్యములైన చీకటి కూపములోపడి ముక్తి నాశనము చేసుకొనుచున్నారు. కొంతకాలమునకు ఆ మాయా విషయములు అసత్యములని తెలిసిన తరువాత లోలోన వాపోవుచున్నారు. దీనికంతటికి కారణము ఈశ్వర సంభూతమైన వ్యక్తి వేషభాషలలోగాని, వాక్చమత్కృతులలో గాని, నిరూపింపబడి వెల్లడి అగుటలేదు. నందుచే ప్రజల కిట్టి దుస్థితి కలుగుటకు కారణమైనది.

"సత్యము" అన్నప్పుడు ఎప్పుడు ఆ మాట యొక్క అర్థము "సత్" యొక్క రూపమని అనగా ఈశ్వర రూపమని యా ధ్వనియే నిరూపణ చేయుచున్నది.

భౌతికంగాకాని, అభౌతికంగాకాని, వేదాంత విధముగాని యీ "సత్" అనే విషయం తెలుసుకొన్నప్పుడు ప్రతి పరోక్ష అపరోక్ష విషయాలు నిజస్వరూపముదాల్చి గోచరింపక మానవు.

ఇట్టి తరి సృష్టిని తిలకించిన రెండు లోకములు కనబడుచున్నవి. "సత్" "అసత్" అన్నప్పుడు యదార్థము, యథార్థముకానిది, యనే విషయము వచ్చినప్పుడు "ఆస్తి" "నాస్తిక"ములనే రెండు వాదములు ప్రపంచములో కనబడుచున్నవి. నాస్తికులు యీ సృష్టిని చూచి నిత్యమనుచున్నారు. ఆస్తికులు దీనిని సృష్టించిన సద్రూపము నిత్య మనుచున్నారు. యదార్థమయిన తత్వజ్ఞుని దృష్టికి యీ రెండు అసత్యములే అయినప్పటికి ఆస్తిక్యము నిజమని కొందరు, నాస్తిక్యమును నిజమని కొందరు రెండు భాగములుగ మారిన ప్రజ వారివారి దృష్టికి వారివారి వాదములే సత్యములని నిర్ధారణ చేయుచున్నారు.

"అసదన్నా సదుచ్యతే" లేదనిగాని, వున్నదనిగాని చెప్ప కూడదన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. అలాగుననే "లాయిలాహ ఇల్లల్లాహు" లేడుకాని, వున్నాడు. అని ఖురానులో ధ్వనింపబడిన మహమ్మదు ప్రవక్త యొక్క విషయాలను పురస్కరించుకొని సత్యమును గ్రహించిన సద్రూపి తత్త్వవేత్త. ఆతని దృష్టికి ప్రత్యగ భిన్నమై అణువును, నేను అను రూపములో చూచుచున్నాడు కాబట్టి సూక్ష్మాతి సూక్ష్మమైన అణువు మొదలు బ్రహ్మాండమువరకు తనలో నున్న యదార్థరూపము ఆత్మ స్వరూపముననున్న ధ్వనిని ప్రతి అణువందును వినుచున్నాడు. కాబట్టి నతని మ్రోల యావత్తు సృష్టి నేనను ధ్వని యొక్క ఆకారము, తేజస్స్వరూపముగ నున్న విషయమే సత్యమని తెలుసుకొని తెలియరాని నిరాడంబరుడై నున్నప్పుడు నాతని దృష్టి యే ఆత్మయందు ప్రసారమగుచు ఆ యెదిరి ఆత్మను ఆవహించియున్న చీకట్లు తొలుగ తన్ను అన్వేషింపజేయు శక్తి వంతుడుగాన, అటువంటి తన్ను వెన్నాడినప్పుడు సత్యమును నిరూపణచేసి అదియే సత్తుగ యున్నదని నిరూపించ బడినప్పుడు ప్రతి యెదిరి ఆత్మ "సత్" ని పలుకుచున్నది.

సత్యము, అసత్యము అను ధ్వనిని తన ఆత్మలో విమర్శించుకొని దాని యందు కలుగు నిగూఢ సత్యము గ్రహించునట్లు చేసి భౌతికమై నప్పుడు త్యాగములోనూ అభౌతికమైనప్పుడు తన ఆ పరోక్షమైన సాయుజ్యములోను నిరూపణచేయుచున్న సంగతి నతని అనుభవములో తెలియునట్లు చేయు సత్య స్వరూపము సద్రూపము.

అదే "సద్రూపము" అదే "సత్" "సత్తే" సత్యము.

# ఓర్పు

పంచభూతమయమైన యీ సృష్టి యావత్తు సహనరూపమైన ఓర్పుయొక్క పరిణామము. ఇందు ప్రతి భూతముయొక్క అంత్యమును ఉధృత రూపములో విజృంభించి నోర్పు విధానమున శాంతింపబడుచున్నది. ఇది తెలుసుకోవలెనన్న ప్రతి భూతమును విమర్శనకు బెట్టిన కడకు ఓర్పు స్వరూపమైన శాంతియందు యిమిడిపోవును.

పంచభూతములలో నొకటియైన భూమిని మన దృష్టియందు పెట్టి చూచిన నది ఉధృతరూపమును దాల్చి భూకంపమున పగిలి ప్రళయముగమారి ప్రాణకోటిని మ్రింగివేయగలదు. అంతటి ఉధృతమైన భూమిని విమర్శించిన యెంతటి ఓర్పుగలది యను ప్రశ్న వచ్చినప్పుడు మన మనుగడయందు ప్రతి విషయము నా భూమిని గూర్చి విమర్శించిన నది సహన రూపమైన వోర్పును వహించినదనే సంగతి మన అనుభవములో తెలియకమానదు.

గాలి :- సుడిగాలులుగ మారి సృష్టిని భీభత్సముచేసి జీవనాశనమునకు కారణమైన గాలిని విమర్శించిన దాని శాంతి స్వరూపమును దృష్టిలోపెట్టి పరిశీలించిన నది ఎంతటి వోర్పుగలదో తెలియగలదు.

ఆకాశము :- ఆకాశము పగిలి - రాలిన నాశనహేతువైన స్థితి మానవ వూహకు తోచినపుడు నది యెంతటి వుత్కృష్టమైనదో మన మనస్సునకు విశదమైనపుడు భయానకముగనుండును. అది యట్లుకాక ధ్వని రూపములో యెంతటివోర్పు విధానము నవలంభించి శాంతిని యిమిడియున్నదో తెలుసుకొనగలవు.

అగ్ని :- అగ్ని విజృంభించి వ్యాపించి కలుగజేయు మారణ విధానమును వూహించిన నది యెంతటి భయానకమైన భూతమో

మన బుద్ధికి తెలియును. దానిని మన విమర్శనమునబెట్టి ఎంత అణకువతో కూడిన విసయము గలిగి వోర్పున శాంతి స్వభావరూప ములో యిమిడిపోవు చున్నదో తెలియగలదు.

(జలము) నీరు :— జలము ప్రళయాకారము పొందినపుడు సుడి గుండములుగను తుఫానుగను, దాని యాకారమును వీక్షించినపుడు దాని భీభత్సమును వర్ణించ తరముగాదు. ఎంతటి బలీయమైనదాని నైనను మాయింప జేయుగలదన్న సంగతి సువిదము. దానిని విమర్శించిన అది మన చేతులతో యెంత నమ్రతగా యిమిడిపోయి సహన రూపమున, వోర్పున, శాంతియెమున్నదో తెలియగలదు.

వీటియొక్క సమ్మిశ్రితమైన పంచభూతాత్మక స్వరూపమైన వుత్కృష్టమైన జీవరూపమును దాల్చిన మానవునియందు సహజముగ ఓర్పు యున్నది. కాని మానవుని ఆవహించిన భ్రాంతి ఆశాబద్ధ మైన క్రోధము, యీర్ష్యా రూపమైన అసహనము ఓర్పును మాయింప జేసి జీవికి, జీవికి మధ్య కలతలు కల్పింప చేయుచున్నది. మానవుడు తనలో సహజ సంభావ్యముగ అభౌతికముగనున్న ఓర్పును తెలుసు కొనలేక పోవుచున్నాడు. దానిని యనుభవములో పెట్టలేకపోవు చున్నాడు. అది నాకవేల అవసరమని తనకు తోచినను నుపయోగ కారిగ లేకపోవుటచేత దానిని నతి తేలికైన విషయముగ జారవిడచు చున్నాడు. ఇది మానవునిలో నున్న గొప్ప అజ్ఞానముయొక్క పరి ణామము. మానవుని సహజత్వము ఆ జన్మయొక్క నుత్కృష్టత వెలార్చు నది ఓర్పుయని తెలుసుకొన లేకపోవుచున్నాడు.

నీవు "ఓర్పు" అనునది తెలుసుకొను వాడవేని నిర్జన ప్రదేశ మందు యేకాంతముగ కూర్చుని సృష్టివైపు నీ చూపులు నిగుడించిన నమయములో నీకు వచ్చిన వూహలను విమర్శించితివేని నీ దృష్టికి పలుగణములలోగల సహనమును విజ్ఞానరూపములో ఈశ్వర రహస్య

ముమ గ్రహించి బడయగలిగిన మానవత్వము నీ దృష్టికి తీసుకొని రమ్ము. ప్రతివాడు తన చేతలలో చూపించు వక్రతను తిలకించినప్పుడు నవి సహనమునకు వ్యతిరిక్తముగా నున్నప్పుడు వాటిని యే విధానమున మాయింపజేసి మంచిగను యితరుల విమర్శనమునకు లోనుగాకుండా నుండునట్లు స్థిరపర్చుకొనుము. వారి మాటలలో నుండు భాషణములు నీ విమర్శనలో బెట్టి ఆలోచించిన నవి యితర మానవ హృదయమును బాధపెట్టునట్లున్న. అవి హృదయ రంజకము యే తీరున పలికిన సరి పోయి విమర్శనకు లోనుకాకుండునో నిశ్చయించుము. వారి గుణగణ ములను అలవాట్లను కార్యకలాపములలోను వారుచూపు తొందర పాటులో వోర్పు అనునది లోపించిన యే విధానమున వాటిని మార్చిన నీ వోర్పునకు లోపమురాదో ఆ విధముగ మార్చుము. ఇట్టి విషయ ముగ మార్చుకున్నరీతిని నీయందు స్థిరత్వము రానిచ్చి లోకములో ప్రతివాడు తన చేతలతో తన మాటలలో తన కార్య కలాపములలో వోర్పులేని విధానము వోర్పుయొక్క శక్తి తెలియని కారణమున నలజడిపడి. తన చేతలతో తన మాటలలో కార్యకలాపములలో తొందరపడి నష్టపడుచున్నాడు. ప్రతి కార్యమునందు ప్రతిచేతయందు ప్రతి మాటయందు స్వయం నిర్ణయమునకు రాలేకపోవుచున్నాడు. తన మాటలకు తన కార్యములకు. తన చేతలకు భిన్నముగా యున్న ప్పుడు వోర్పును విడనాడి దూషణమునకు గడంగుచున్నాడు. ఈ విష యము నీదృష్టికి వచ్చినప్పుడు, ఆయాచోట నాయా సమయములను ఆయా వ్యక్తులకు ఆత్మయందు కలిగిన పరిణామము నీ యనుభవము నకు వచ్చినప్పుడు తాను వోర్పుగలవాడనని చాలా ఓర్చుకున్నానని అయినప్పటికి తన ఓర్పుయొక్క ఆత్మయువరకు యెదిరివారు తనపై తిరుగబడిన కారణమున ఓర్చుకొనలేక యీ స్థితికి వచ్చుటకు కారణ మైనదని ఖేదపడుచున్నాడు. తిరుగబడి మాటలు రోషదాయకముగ మార్చి తన చేతలలోచూపి కార్యకలాపమునకు తెచ్చి శిక్షార్హు డగు చున్నాడు. బాధలు పడుచున్నాడు.

నీవు వోర్పు కలవాడవేని నొకపరి ప్రపంచరీతులవైపు నీ దృష్టి మరలింపుము, నీ స్వయములో నీకు కలుగు యవాంతరములందు నీవు వోర్చుకున్న విషయము ప్రజాదృష్టిలో యేరీతిగ నున్నదని, తెలుసు కొనుటకు ప్రయత్నించుము. అట్లు నకారణముగ నొకరినొకరు దూషించు కొనువారు, అపవాదములను వేయువారు, కారణము లేకుండా ఘర్షణ పెంచువారు, నొకరి కార్యములకు మరియొకరు విఘ్నములు కలుగజేయువారు యీర్ష్యా అసహనములు కలుగువారు, వాటి వాటిపై వచ్చు అంత్యములు గమనించి సబబులు చెప్పువారు, న్యాయమునకు వ్యతిరిక్తులవలన కలుగు, అవాంతరములకు పాల్పడువారు నీకు గోచ రించెదరు. పై విషయాలలో యే విషయమైనను తనపైబడు అవకా శము ప్రకృతి నీకు కల్పించి నిన్ను ఖేదపెట్టిన నాడు తొలుతనే నిశ్చ యించిన బలీయమైన వోర్పును ఆయుధమును సహనముచే చేబూని అడు గడుగునకు, మాటమాటకు, చేతచేతకు కార్యా కార్యములందు వోర్పుతో కూడిన సహనమును దండమును నీ ముందు నిడి, నతి శాంతి స్వరూపునిగ మారి నీ పెదవులపై చిరునవ్వు రూపింపజేసి నీలో నీవు పడుచున్న ఖేదమును పైకి తెలియనీయక నీ యాకృతిని స్వయం ప్రకాశముగ నున్నట్లు మార్చి నీయంతటనీవు విమర్శించుకొని దాని పరిణామము తేల్చుకొని వాటినుండి వైదొలుగ చూడుము,

అటువంటి ఓర్పు లేనివారిని నీ జన్మలో నీదరికి రానివ్వని పరిస్థితి నిశ్చయించి నీ మనుగడను సాగనిమ్ము. అట్టి నీ నడువడిని చూచి నిన్ను న్యూనత పరచినప్పుడు, అది హేళనగా నున్నప్పుడుకూడా సహించి చిరునవ్వునందు నీ బాధను మేళవింపుము. నీ యందు యీర్ష్యాగల మరి యొక వ్యక్తి "సిగ్గుమొగమునకు చిరునవ్వే అందమ"ను లోకోక్తి నిన్నెత్తి పొడిననప్పుడు నాతనిని గమనించి నీ హృదయములో దాచు కొమ్ము. అటువంటి అవహేళన వచ్చినప్పుడు పై విధానము అవహేళన చేసినవ్యక్తి నీ దృష్టికి గోచరించగలడు. ఆ సమయమున నీవుచూపిన

ఓర్పు నీముందర వచ్చి నిలచి నీకు కలుగు అవాంతరమును తప్పించు కొనగలవు. ఈస్థితికివచ్చిన మానవుడు ప్రజాదృష్టికి తేలికగ మారిన ప్పుడు నీకీర్తి గౌరవమునకు వంశ మర్యాదలకు కళంక మాపాదింప జూతురు. అటువంటి విషయము నీ జీవితమందు కలిగినప్పుడు నీ యం దుండే అహంకారమును దర్పమును సింహగర్జనమున వెళ్ళడించి యెదిరి చులకన చేసినవారి మత్సను మాయింప జేయువరకు నిద్ర పోకుము. నీయందుగల సహజ శక్తి స్వరూపము యెదిరివారిని పాదా క్రాంతులుగ జేసి నీముందర మోకరింపజేయునట్లు చేయుము.

వారు ఆ రీతిని నీకు లొంగిననాడు ఆ స్థితిని నీవు వారిని ఓర్పు రూపమున క్షమించి విడిచిపెట్టుము. కారణము తత్వరూపమున నీవు ఈశ్వర సారూప్యమైన ఆత్మ నిర్దిష్టమునకు రాగల వ్యక్తిత్వము గాన నలజడి జెందక ఓర్పు వహించుము.

జీవితాంతము వరకు ఓర్పుకొని అంత్యమందు తొందర పాటున యెదిరివానిమనస్సును నొప్పింపజేసితివేని ఓర్పుయొక్క గొప్ప తనమును మాసిపోవును. ఓర్పునకు భిన్నముగ ప్రవర్తించిన సృష్టి యొక్క విధానము భ్రాంతి జన్యమైన నాశనరూపమని తెలుసుకొనుము. అది నీవు ప్రయత్నించుచున్న ముక్తికి నడ్డుతగిలి ప్రకృతియందు నీవు పడిపోవునట్లు నీ యాధ్యాత్మిక ప్రయాణమును వెనుకకు త్రిప్పజూచును. యెంతటి క్లిష్టపరిస్థితి నాస్తిక విధానమున భ్రాంతి తెచ్చిపెట్టినను నీవు ముక్తిరూప నిర్వాణము పొందుటకు ఓర్పునందుగల బలీయ మైన శక్తియే కారణముగాన అంత్యము వరకు సహనరూపుడవై ఆధ్యాత్మిక సాధనారూపము సాగించి పూర్తి పరిణామము రస స్వరూపు విగ మారి తరించెదవుగాక!



# న్యూ న త

న్యూనత యన్నది సర్వమానవత్వమునందును స్వభావముగా యున్నది. ఏ సమయమందును యే కార్య కలాపమునందును నొక మానవుడు యింకొక మానవునకు న్యూనత చేయడమనేది యిష్టంతో కాకపోయినన్నటికి ఆయాచితముగా తననోటవచ్చు మాటలలో నొక రిని యింకొకరు న్యూనత చేసినట్లు గమనించగలరు. ఇది యీర్ష్యతో కూడిన వుద్రేకములో కూడా న్యూనతా విధానమైన వాక్కులు రావచ్చును.

న్యూనతగా పలుకబడిన పలుకులు స్నేహరూపంలో ప్రమాదించవు గాని, ఆ స్నేహము భిన్నమైనప్పుడు ప్రమాదాలకు దారితీయును.

న్యూనత అనుదానికి నొకరూపంలేదు. అనేక విధములైన అర్థములతో కూడిన విషయములుగా న్యూనత రూపింపబడుచున్నది. అది భ్రాంతియొక్క కలనములలో నొకటి. అది ఈర్ష్యారూపమున కలిగి అయిష్టతలో వెల్లడి యగుచున్నది. ఇది అజ్ఞానరూపంలో హత్యలవరకు తీసుకొని పోవుచున్నది. జ్ఞానరూపంలో దానిని తట్టు కొనలేక తిరిగి న్యూనత చేయుటకు ఆలోచనా పరుడగుచున్నాడు. అటువంటి పరిస్థితిలో ఆ న్యూనత దురంతములకు పాల్పడకపోయినా జీవహింసగా మారి వుభయజీవులు ఖేదపడకమానరు. ఒకప్పుడు వారి వాక్కులలో వెల్లడై విన్న మానవుల హృదయాలు బాధపడునట్లు చేయును.

ఈ న్యూనత తత్వవేత్త విధానములో వచ్చినప్పుడు యెంతటి న్యూనత విధానమున్నప్పటి సహించి అది యేచోటా వెల్లడించక తనలో తానే విమర్శించుకొని దానికి ప్రత్యామ్నాయంగా తన విధా

నములో శాపరూపం రానియ్యకుండా ఆ న్యూనతను తట్టుకొనగల్గు చున్నాడు.

అటువంటి తత్వస్వరూపునియందు చేసిన న్యూనత అది సహింప రానిదైనను ఆతడు సహించి దానికి మారు వ్యతిరేకశబ్దము శాప రూపమున రానీయకుండుటే తత్వవేత్తయందలి మహనీయతగనున్న గొప్ప విశేషము. ఆతనినే తత్వవేత్త యందురు.

"..........సహనంబతి కష్టము, లేచిపోవగా

సాగదు ప్రొద్దు క్రుంగినది సంకటమేమి ఘటించునో కదా?"

అన్నాడు తత్వవేత్త. సంకటమేమి ఘటించునో యన్నప్పుడు తన హృదయమందు శాపరూపమైన ధ్వని రానీయకుండా జగద్రూపియైన తన గురువును స్మరణ చేసుకొనుచున్నాడని నిశ్చయించవలసియున్నది. అలా కానిచో తత్వవేత్త యననేమో తెలియని స్థానమందున్నాడని చెప్పవలెను.

తత్వవేత్తను తెలుసుకోలేనివాడు న్యూనతరూపములో హేళనా విధానముగా కల్గించిన బాధకు ఆ తత్వరూపమైన ఆత్మ శాపరూప మును ధరించిన

జలధి మండుచున్న జడధారి మండిన
స్మరశరాగ్ని తనువు మండుచున్న
అడవి మండుచున్న ఆర్పులేరెవ్వరు
దాని కదియె పమయుదగునుగాని" అన్నాడు తత్వవేత్త.

కాబట్టి యే ఆత్మ తత్వవేత్త రూపంలో నున్నదో తెలుసుకొనుట అసా ధ్యముగాబట్టి యెవరియందును న్యూనత విధానములో మాటలు జార విడువకూడదు. ఇదియే ఆధ్యాత్మిక సాధనాపరుడైన వ్యక్తికి అవసర మైనదిన్ని, ముక్తిని సాధించు వానియొక్క లక్షణమున్ను కాబట్టి సాధకుడా! జాగ్రత్తగా నీ జీవితమందు నీకు కలుగు అనేక న్యూనత

పరిణామములకోర్చి యే సమయమందును నీనోట శాపమును రానీయ కుందువేని, నీయందు శాంతిస్థానము స్థిరమై అది సార్థకమై ప్రజలచే నీ విధానము అపురూపమైన విషయంగా కొనియాడబడు స్థితికి నీవు రాగల్గుటకు వీలున్నది గావున నీగురువు సద్గురువై నప్పుడు ఆ విషయాన్ని నీకు ప్రబోధించినపుడు ఆ ప్రకారముగ నీవు అనుసరించిననాడు సాయుజ్యుడవై ముక్తిని చూరగొన సుసాధ్యము.

తత్వవేత్త రూపంలో నీకు న్యూనత వచ్చినపుడు తన పెదవు లపై చిరునగవును రూపింపజేసి సహించగలవు.

అట్టి విషయముగయున్న సమయంలో యితరులుగా నున్నవారు హేళనగా నీవంకజూచి లోకువదృష్టితో తనను పలుకరించినపుడు వారి అజ్ఞానమును చూచి వారివంక జాలి పుట్టిపడునట్లు తన చూపులను మార్చును. అటా మార్పు గలిగినవాడే తత్వవేత్త.

ప్రజలు తనను తత్వరూపిగ తెలిసికొనలేక న్యూనత చేసినపుడు ఆ చోటునుండి తను కదలని పరిస్థితి అనగా సహించరానిది, ఆ చోటు నుండి కదిలి వెళ్ళడానికి సావుకాశములేనిది. అర్ధరాత్రి సమయముగ నున్నస్థితిలో ఆ చోట వ్యగ్రుడై శపించుట తప్ప యింకొక గత్యంత రములేని పరిస్థితిగనున్నప్పుడు ఆ స్థితిని ఆ చోట అపారమైన ఓర్పును చూపిస్తూ తన ఆత్మ అయాచితముగ తన్ను న్యూనత జేసినవారిని శాపోపహతులుగ జేయు సమయాన అటువంటి స్థితిని గమనించి భయ పడి తన గురువును స్వామీ! ఈ ప్రజ నన్ను తెలుసుకోలేక షోవడం చేసి న్యూనతచేశారు కావున వారియందు యేవిధమైన శాపరూపమైన ధ్వని నా హృదయమునుండి రానియ్యక కాపాడుమని తన గురువును వేడుకొని ఆతనిని తన స్మరణలో బెట్టును.

"ఆతడే తత్వవేత్త"



# మౌనము

ప్రపంచమందు యోగియనబడు బాహ్య వేషధారులలో మౌనమును మూగతనము తరుచుగా చూస్తున్నాము. ఇది సృష్టిలో నుండే మానవులను మోసముచేయుటకు చాలా నుపయోగకారిగ యుండును. ఇట్టి మౌనము చూచి ప్రజలు స్తోత్రముచేయుట గాంచినప్పుడు యెంతయు గర్హించవలసియున్నది.

సృష్టికి అది మానవత్వము మూగగనే యున్నది. అది బుద్ధి యొక్క వికాసము సౌంజ్ఞగా మార్చినది. ఆ సౌంజ్ఞను ఆకలిగ యున్నప్పుడు తన అయిదు వ్రేళ్ళను నోటిదగ్గరపెట్టి తన యెడమ చేతితో పొట్టను చూపిన నతడు అన్నార్తుడని తెలుసుకొనగలము. ఆ చేయి దొప్పగ పెదవులకు ఆనించినప్పుడు దాహార్తుడని తెలియు చున్నది. ఇటువంటి సౌంజ్ఞారూపములో ఆరంభమై నొక గీతను వక్రింపజేసి వర్ణములుగ దిద్ది ఆ వర్ణములకూర్పు పదములుగ మార్చి ఆ పదములు వాక్యములుగ మారినప్పుడు సౌంజ్ఞారూపమైన మూగతనము పోయి ధ్వనితో కూడిన యిచ్చారూపములను నెరవేర్చుకొని వాఙ్మయముగా మారి ప్రబలి భాండాగారము నిండి వాటియొక్క పరిణామము అధ్యాత్మిక రూపంలో ఈశ్వర రస స్వరూప నిర్ధారణనుసేయగల శక్తి గడించినది. ఈ పరిణామమునకు వచ్చుకాలమునకు ముందు చరిత్ర, చరిత్ర తరువాత రసాయనికమైన తెలివియొక్క వికాసము కలిగిన విషయము లోకమున చంద్రమండలాది లోకములను చూడగలిగే శక్తి సంపాదించినది.

చారిత్రాత్మకంగా సృష్టియందు పూర్వముగలిగిన చరిత్రలు లిఖింపబడి మానవవిజ్ఞానదృష్టిని ఆకాలము వరకు మరలింప జేసి తన దృష్టికి దృశ్యరూపముగ గోచరించునట్లు చేసినది.

మానవునిలో పంచేంద్రియములవలన గలుగు చలనము ఆత్మను అనుగమించి హాయినికలుగ జేయుచున్నది. అందుసుఖము దుఃఖము శోకము ఆనందము కలుగ జేయుచున్నది. వీటన్నిటికి ప్రాతిపదికమైనది కంఠధ్వని. దానిని మాయింపజేయుటకు మౌనమను పేరుపెట్టి జీవికి భరింపరాని హింసపెట్టుచు ఆత్మను నాశనము చేయుచున్నారు. కావున యీ మౌనమను మూగతనము కంఠధ్వని రూపములో ధ్వనించక పోయిన సౌజ్ఞారూపంలో తనకు కావలసిన విషయములు విషయేచ్ఛలు అది వుత్కృష్టములో నికృష్టములో నెరవేర్చుకొనగల సాధ్యముగ నున్నమాట నిజము.

ఈ మౌనధారులు యీ సౌజ్ఞారూపము కూడా మాని కేవలము మౌనధారులైతే సంతోషము. అట్లుకాక యిదే మౌనమని నిశ్చయించి గ్రహణ జ్ఞానేంద్రియములలో నొకటైన నోరు, కంఠధ్వని మాయింపచేసినట్లు తనకండ్లు, వాటిశక్తియైన చూపు (దృష్టి) మాయింపచేయుటకూడా నొక మహత్యముగ వెలిబుచ్చు మౌనితనకండ్లకు గంతలు గట్టిన మౌనమందు తన ఆత్మ యెంతక్షోభ పడుచున్నదో దృష్టిమృగ్యమైనప్పుడు తనకు కలుగు యిక్కట్లుతో పోల్చి ఆచరించు ప్రతివాని ఆత్మకు ఆత్మక్షోభ తెలియగలదు.

ఇట్టి స్థితికి వచ్చి విమర్శించిన వాగఅవయవము బంధించి కంఠధ్వనిని మృగ్యముగ జేయువాని ఆత్మ యెంత క్షోభించునో తెలియగలదు.

మౌనము :- ఏ మానవుడైతే ఈశ్వరవిషయం తెలుసుకొని తరించు నుద్దేశించుచున్నాడో అతడే మౌని. మౌనియన్నప్పుడు అన్ని విషయములు శాంతముగ తిలకిస్తూ వాటియందుగల వుత్కృష్ట నికృష్టములను గ్రహించి విమర్శించి నికృష్ట విషయాలకు పోక, వుత్కృష్ట విషయాలను తనయనుభవములో మార్చి జీవితమును సాధారణ జీవితముగ

గడుపు మానవునివలె తన జీవితము నిరాడంబరముగ గడుప జూచు వాడు మౌనవ్రతుడు.

మానవునికి మానవునికి మధ్య జరుగు ఘర్షణలు తన దృష్టిని పడినప్పుడు ఆ విషయములలో పాల్గొనక తప్పించుకొనువాడే మౌని. తన ఆత్మయందు భావరూపమున నుద్భవించిన వూహలను తనలో తానే విమర్శించుకొని దాని అంత్య పరిణామము తేల్చుకొని దాని యందు కలుగు బాధాకరమైన విషయమును ప్రక్కకు నెట్టువాడేమౌని. ఆ పరిణామములో మంచిగను శుభములుగాను, నిర్ధారణయైన వాటిని తానుపైకి వెళ్ళడించకనే మౌనియై కార్యరూపంలో వాటిని శుభములుగ నెరవేర్చి, ఆ శుభములను లోకదృష్టిని ప్రతిష్టించువాడే మౌని.

ఈ విధమైన విషయాలు తన జీవితాంతమువరకు నెరవేర్చగల్గి తన పరోక్షమందు విమర్శ వచ్చినప్పుడు మానవలోకంలో నాతని గూర్చి ప్రశంస వచ్చినప్పుడు ఆతని పేరు మంచి ఉపమానములో పెట్టి పొగడబడువాడే మౌని. ఆతడే నిజమైన మౌని.

ఒకడు తనను దూషించినప్పుడు నతనిని హతమార్చ సమర్థుడై యుండియు వ్యక్తియొక్క యీ వాక్కుకు చేతకు అడ్డులేని సమర్థత కలిగియుండియు యే అవాంతరమునకునైన తట్టుకొనగలిగి దానినుండి పైదొలగు సమర్థుడై కూడా మౌనము వహించి సహించి ఆ చోటును విడిచి వెడలిపోయిన తరువాత ఆచోట నున్నవారి విమర్శనకు ఆ వెడలిన వ్యక్తియొక్క బలదర్పములు, శక్తి సామర్థ్యత గణనీయ మైనదిగ తెలిసి అటువంటి వ్యక్తిని దూషించిన నీచుని హతమార్చు నతని విధానానికి అడ్డులేకపోయినప్పటికి సహనరూపంలో ఎంతటి మౌనము వహించి వెళ్ళిపోయినాడని ఆశ్చర్యముగ చెప్పుచు ఆ స్థితిలో నతడు చూపిన సహనరూపమైన మౌనమునకే మౌనవ్రతమని పేరు.

ఇప్పుడు యోగరూపమని ప్రకటించుచున్న మహత్తర విషయమని వెల్లడించు నోరుమూసిన మౌనము యెదుటివాని ప్రశ్నలకు తగిన జవాబు యియ్యలేని అశక్తత వెల్లడి కాకుండుటకై పెదిమలు బిగించిన విధానము మౌనమని భ్రమించుచున్నారు. అటువంటి భ్రమకు పాల్పడువారు తాముకూడా అట్టి మౌనము వహించి చూచిన వారి అనుభవములో ఆ మౌన విధానము యెంతటి నికృష్టమైనదో తెలియబడగలదు.

మౌనమన్నప్పుడు సహనముతో కూడిన మహత్తర ఓర్పును తన ఆధీనమందు పెట్టుకొని మితభాషియై, నవ్వుముఖము గలవాడే మౌని. ఇది యొక యదార్ధమైన తత్వవేత్తకే సాధ్యము. తత్వవేత్తయే మౌన స్వరూపుడు. విశ్వరూపి. విశ్వరూపమే మౌనస్వరూపము.

# జీవహింస

ఈశ్వర విషయము తెలుసుకొని తరించుమార్గమునకు తపస్సని చెప్పుచు, అది సాధన రూపంలో అభ్యసించవలెనన్న సంగతికి మానవునియందుగల నిర్దయాసక్తమైన కాఠిన్యమును మాని ప్రతిజీవియందు సాత్విక కరుణ చూపించి సాత్వికుండు కావలెను కాబట్టి తాపసియైన సాధకుడు ఆరగించు ఆహారముకూడా సాత్వికముగ నుండవలెను. గాన ఆ ఆహారము జీవము కలదానికి బాధ కలుగకుండా నుండునట్లుగా ఆ తాపసి తన జీవిత విధానము సాత్వికాహారిగా మార్చుకోవలసి యుండవలయునని కొందరు ధర్మప్రబోధకులు గ్రంథాలు వ్రాసి శిష్యులకు ప్రబోధించుచున్నారు. ఈ శిష్యునిగయున్న వ్యక్తి ఈశ్వరుని తెలిసి జన్మరహితము చేసుకోవలెనను ఆవేదనచే. గురువుయొక్క ఆజ్ఞను శిరసావహించి అనుశ్రుతంగా కులక్రమానుగతంగ తనవారు ఆరగించు ఆహారము మత్స్య మాంసాదులు తానుకూడా అనేక సంవత్సరములు తినియుండి దానియందు ఆసక్తియున్నప్పటికి కూడా అది అతి కష్టముపై మాని ఈశ్వర ధ్యానము చేయ గడంగుచున్నాడు.

అది మానిన గాని ఈశ్వరుడు సాక్షాత్కరించడని తనలో నిశ్చయించు చున్నాడు. కాని తనని బంధువర్గమునందు వివాహాది కార్యములు జరిగినప్పుడు మత్స్య మాంసాది పదార్థములు తన కంటపడినప్పుడు వాటి సువాసన తగిలి జిహ్వాచాపల్యము పోక సతమతపడి లోలోన వికలత్వము కలిగి చికాకు పడుచు తన జీవికి తీరని హింస కలిగించుచున్నానని తెలిసినప్పటికి గురువు ఆదేశ ప్రకారము ఆ గురువుయొక్క సందేశము పురస్కరించుకొని ఆ చోట్లలో కూడా కాయగూరలతి కష్టముపై ఆరగించి సాటి బంధువులలో తాను గొప్ప

తాపసినని, తాపసి జీవహింస చేయడము కూడదని యీ విధమైన సాత్త్విక రూపంలో ఆధ్యాత్మికముగా ప్రయాణము సాధించిననే తప్ప దానియందు యే మాత్రము లోటు కలిగిన ఆ తపస్సునకు భంగము కలిగి జన్మరహితము కావలసిన విషయము పోయి పునర్జన్మలగ పాప పంకిలమైన నికృష్ట జన్మయెత్తి నాశమునకు దారితీయును కాబట్టి అటువంటి జీవహింస మానవలసియున్నదని వుపన్యసిస్తూ అందుచేతనే జీవహింస చేయు ప్రతివాడు ఈశ్వర విషయం తెలుసుకొనుటకు అర్హుడు కానేరకున్నాడు. అటువంటి ఆతడు నికృష్ట జన్మయెత్తి నశించు చున్నాడని, తానట్లు నాశనము కాక ఈశ్వర విషయం తెలుసుకొని తరించనున్నానని చెప్పు మాటలు ఆ వివాహాది కార్యములకు వచ్చిన వ్యక్తులు అతనిని కేవలము మహానుభావుడని ఈశ్వర సాక్షాత్కారి యని భ్రమించి నమస్కరించి గౌరవించుచున్న సంగతి మనకు అనుభవములో తెలిసిన విషయమే. దీనికి ప్రత్యామ్నాయంగ కొందరు యిటువంటి వ్యక్తిని చూచి నొకకాలము వరకు బ్రహ్మణాదులు కాయగూరలు తినే సంఘములు మత్స్య మాంసాదులు తిని మానివేసిన విషయము చరిత్ర చెప్పుచున్న సంగతి తెలిసినదే కాని యీ నాడు వారు మానిన విషయములో వారు పోవు ప్రతిచోటా కూరగాయల వంట నుండుటచే వారికి యితర రుచుల యొక్క రుచులయందు అభిలాష కలుగకుండుటకు కారణ మగుచున్నది. గాని అనేక దినముల నుండి యీ తాపసి తిని యీనాడు గురుబిడ్డనని ముక్తస్వరూపుడనని చాటువాని జిహ్వా చాపల్యము వచ్చినదని చెప్పుట హాస్యాస్పదమని యితను, తిను వంకాయ, బీరకాయ లాది జీవములు గలవాటిని చెట్టు నుండి కోసినప్పుడు ఆ చెట్టు, కోసిన కాయలు కూరకు తరుగునపుడు ఆ కాయలు పడు హింస యీ జీవహింసకన్న ఎక్కువైనది, ఒకప్పుడు జిహ్వాచాపల్యమునకు తాళలేక కాయగూరలు మాని తిరుగ మత్స్య మాంసములను తినువారు కలరని, అట్టివారు పాపమని మాని తిరుగ

ఆ జీవహింసయను సంగతి మరచి మాంసాదులు రుచికరమును మరచి పోలేక ఆరగించినవారు లేకపోలేదని అట్టివారు చేయు కార్యము పాపమని మాని తిరుగ చేయువారు ద్విగుణీకృత పాపము పొందగలరని శ్రీ కృష్ణభగవానుడు తన భగవద్గీతలో పేర్కొన్నాడని చెప్పుచు యీ జీవహింసయని చెప్పు తాపస మానవుని చూచి అపహసించి అవహేళన చేయువారును ఆ విందులో లేకపోలేదు.

పై రీతిగ ఈ తాపసిని గౌరవించుచున్న విషయమును పురస్కరించుకొని "జీవము-హింస" యని విడదీసిన జీవుడు అన్నప్పుడు ఆత్మయొక్క పర్యాయపదము. దానిని శ్రీ కృష్ణభగవానుడు

"యయేనం వేత్తి హంతారం
యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో
నాయం హంతి న హన్యతే" —భగవద్గీత

అన్నప్పుడు ఆత్మ చంపునదికాని చచ్చునది కాని కాదు. అలా అనుకున్నవారు భ్రాంతులే. అన్నాడు తన భగవద్గీతలో శ్రీకృష్ణుడు.

ఈశ్వర విషయం తెలుసుకొనుటకు ఆహార రూపంలో మత్స్య మాంసాదులు తిని మాని సన్యసించిన సన్యాసులు పైని చెప్పిన శ్రీ కృష్ణభగవానుని వాక్కును విమర్శించి తెలుసుకొనుటలేదు.

అభౌతికమైనదిన్ని ఈశ్వరపరమైనదిన్ని భువన బ్రహ్మాండముల నుండి విశ్వమువరకు వ్యాపించినదిన్ని, అయిన ఆత్మ జీవరూపమున దేహధారియై యీ సృష్టిలో యేదో జీవరూపములో మనుగడ సాగించుచున్న దానికి హింసయను పడికట్టుమాట అతికించి జ్ఞానులమని బ్రహ్మబోధకులమని గురువులమనీ చెప్పు మోసపు మాటలకు లోనుగాక

"యేతద్విషయే తత్ పూర్వం ప్రాచీనం" అను నార్య సూక్తము ననుసరించి ప్రాచీన కాలము అనగా వేదకాలమందు యీ సన్యాసులు చెప్పే జీవహింస యను పదమునకు అర్థమేమిటని విమర్శించి నట్లయితే వేదకాలమును మన దృష్టికి తెచ్చిన యజ్ఞమనే బలిపీఠముపై పశువును బలిగొని దాని మాంసమును హోమగుండమందు కాల్చి పులిసిన కల్లులో ఆరగించవలసినదిగ చెప్పబడినది.

ఒకవేళ ఆ యజ్ఞపశువు యే విధముగనో మాయమైతే దాని స్థానే పదహారు కళలు కలిగిన స్ఫురద్రూపియైన పదహారేళ్ళ మానవ యువకుని ప్రాయశ్చిత్త రూపంలో ఆ బలిపీఠంపై ఖండించమని యున్నది.

శ్లో॥ ప్రాయశ్చిత్తం మహాధ్యేత నరం వాపుర్షర్షభ
అనయశ్వం, పశుం శీఘ్రం యావత్కర్మ ప్రవర్తితే

రఘువంశమునకు ఆది పురుషుడైన అంబరీష మహారాజు యజ్ఞం చేయునప్పుడు. యజ్ఞపశువు అదృశ్యమైన కారణమున ఆ యజ్ఞమునకు బ్రహ్మగాయున్న ఋషి ఆ పోయిన పశువునకు ప్రాయశ్చిత్తముగ స్ఫురద్రూపి అంగసౌష్టవముగల యువకుని ఆ బలిపీఠమున ఖండింప వలసి యున్నదని రామాయణమున చెప్పబడి ఆ స్థితి అక్కడ నుండియే రామాయణము ప్రారంభింపబడెను.

ఈ కలియుగంలో సాక్షి ప్రమాణము చేయునప్పుడు రామాయణం నెత్తిన బెట్టుకొని ప్రమాణము చేయమనుచున్నారు. అట్టి రామాయణమునకు పై నుదహరించిన శ్లోకము ఆది సూక్తము. అదే రామాయణములో రఘువంశమునకు గురువైన వశిష్ట మహాముని ఆశ్రమమునకు దూర్వాసముని వచ్చినప్పుడు పరడావును కోసి మాంస ముతో ఆతిధ్యమిచ్చెను. ఇల్వాలుడనే మానవుడు తన తమ్ముడైన

వాతాపిని నరికి ముక్కలుచేసి ఆ మాంసమును తండులంబులతో తైల పచనము చేసి (ప్రస్తుతకాలంలోగల పులావు రూపంలో) అగస్త్యునకు ఆతిధ్యమిచ్చెను. ఆతడు వాతాపి మాంసముతో కూడిన ఆహారము తిని "వాతాపి జీర్ణం" అని తనబొజ్జపై కుడిచేతితో నిమిరినప్పుడు వాతాపి ఆతని పొట్టలో జీర్ణమై పోయెను.

శ్రీ రామచంద్రమూర్తి సీతాదేవి కూడా మత్స్య మాంసాదులు తినినట్లు రామాయణమునందు విమర్శకారుడు తన శీర్షికలో యెత్తి చూపించెను. హనుమంతుడు సీతను వెతుకబోయి లంక చేరుకొని అశోకవనములో అశోకవృక్షము క్రింద సీత ఆసీనమై యుంట చూచి ఆ చెట్టు పై నుండి శ్రీరాముని అంగుళీయము ఆమె ఒడియందు పడునట్లు వేసెను. అది తన భర్త అంగుళీయమైనట్లు గ్రహించినను కనులు పైకెత్తి చూచి చెట్టుపై కొతిని చూచి రామునకు వానరులు అండగా నున్న సంగతి తెలియని కారణమున రక్కసుడే వానరరూపముగ వచ్చి శ్రీరాముని యుంగరము లాంటిది సృష్టించి తాను నమ్మకుండని మోసము చేయుచున్నట్లు ఊహించి హనుమంతుడు చెప్పు మాటలు విశ్వసించక నివ్వెర పోయినప్పుడు ఆమె తన్ను అనుమానిస్తూయున్నట్లు గ్రహించి తల్లి! నేను శ్రీరాముని బంటును, హనుమంతుడను నామముగల వాడను. నీ భర్తయైన శ్రీరాముడు నీవాతని నుండి విడిపోయిన కాలము నుండి యింతవరకు నీ యందుగల ప్రేమ విరహ బాధతో "కల్లు త్రాగడం, మాంసం తినడం మాని వేసెను." అనిచెప్పిన ఋజువును విని తన నిజపతి తరువాత అతి ప్రియంగా ప్రేమించే కల్లు, మాంసము త్యజించినట్లు హనుమంతుడు చెప్పగనే అది ఆంతరంగికమైన విషయం కొబట్టి యితడు నిజంగా శ్రీరాముని బంటని నమ్మి మనసు విప్పి మాటలాడినది.

ప్రజాపతియైన పులస్త్య బ్రహ్మయొక్క మనుమడు రావణ బ్రహ్మ యొక్క పాకశాలను ఆంజనేయుడు వర్ణించినప్పుడు మాంస ఖండములు సారాయి కుండలు వర్ణింపబడినవి. భారత భాగవత పురాణములలో కూడా యిటువంటివి చాలా గలవు. ఈనాడవి జీవహింసగ (మత్స్య మాంసాదులు తినుట) విమర్శకుని దృష్టిలో యే ఋషిగాని యే అవతారిగాని యే ఉపనిషత్కర్తగాని కూడదన్న స్థానము సంపాదించలేదు.

ఈ నాటి కలియుగమునందు ఆంధ్రుడైన మాధవవర్మ యను మహారాజు నరయాగముచేసి స్ఫురద్రూపులైన 18 మంది ఆంధ్ర యువకులను యజ్ఞబలిపీఠాన ఖండించినట్లు చరిత్ర చెప్పుచున్నది.

ఇటువంటి యజ్ఞయాగాది క్రతువులు చేసినగాని స్వర్గమందు రంభాది అప్సరసలు దక్కరనుట సుస్పష్టము.

శ్లో॥ నా హం వేదైర్న తపసా
న దానేన న చేజ్యయ
శక్య యేవం విధో ద్రష్టుం
దృష్టవాన్ నసిమాం యథా........భగవద్గీత

వేదాలు ననుసరించినా యజ్ఞయాగాది క్రతువులు చేసినా ఈశ్వర విషయం తెలియబడదని శ్రీకృష్ణభగవానుడు తన గీతలో స్పష్టంగా పేర్కొనియున్నాడు.

జీవకారుణ్యముపై మోసియున్న బౌద్ధమతమును స్థాపించిన బుద్ధుడు కూడా పొలాంతరములందు రొయ్యలు, పందిమాంసము తినెనని వ్రాయబడియున్నది. తాను ప్రబోధించు ధర్మములయందు బౌద్ధసన్యాసి "భిక్షాటనకు వెళ్ళినప్పుడు ఆ యింటి యజమాని మాంసము వడ్డించినప్పుడు తినవచ్చు" స్పష్టంగా బుద్ధుడు తన ధర్మ గ్రంథములో చెప్పియున్నాడు.

ఇస్లే క్రీస్తుకూడా మాంస భక్షణ చేసినట్లు కలదు. ఈ పై కారణములవలన సన్యాసులు ఆరగించు కాయగూరలయందు యెంత హింస గలదో, మత్స్య మాంసాదులలో కూడా హింస కలదని నిరూపింప బడుచున్నది.

కాయగూరలు కూడా నొక జీవరూపమున నున్న చెట్టునుండి యుద్భవించుచున్న జీవరూపములని అవి కుళ్ళిన వాటినుండి జీవముతో కూడిన పురుగులు గలవన్న సంగతి మనకు తెలియును గాన ప్రతీదీ జీవముతో కూడిన విషయమేనని నిరూపణ యగుచున్నది.

పై విషయాన్ని పురస్కరించుకొని విమర్శించిన మత్స్య మాంసాదులు తినుట జీవహింసయని, కాయగూరలు తినుట జీవహింస కానేరదని చెప్పుట సమంజసము కాదు.

సృష్టిలో చిన్నచేపలను పెద్దచేపలు తినుచున్నవి. మృగాదులు పశు, జంతు, రూపాలను తినుచున్నవి. అందు బలీయమైన ఏనుగు శాఖాహారి. మృగరాజనబడు సింహము మాంసాహారి; సింహమునకు ఆకులు అలమును ఏనుగునకు మాంసము పెట్టిన వాటికి బద్దించదన్న సంగతి సువిదితముగాన కులక్రమానుగతంగా వారివారి కులాచారాలను బట్టి వారి ఆహార నియమములుండవలసినదే కాని జ్ఞానమునకిది అంత రాయము కారాదు.

"మై ఖురో, మసహాబ్బె సోజో
ఆతషందర్, కా బజన్.
సాకినె, బుత్ ఖా న బాషద్
మర్దుమాజారిమకున్"

కల్లు త్రాగిన మాంసముతిన్న తాగిన మత్తులో కాబామశీదును తగలబెట్టిన, పవిత్ర గ్రంధమైన ఖురానును చించి పారవేసిన, నీ మత

విపర్ధమైన విగ్రహారాధన చేసిన ఒక నాటికి నీవు చేసిన పని నీ బుద్ధి తప్పని తోచి ఈశ్వరుని ముందర పశ్చాత్తాపము నొందితి వేని ఈశ్వరుడు నిన్ను క్షమించును కాని ఈశ్వర సంభూతమైన మహాశక్తి ఆత్మగ కలిగిన మానవ వ్యక్తిత్వములో ఈశ్వరుని వ్యక్తం చేసుకొని "స్వయం బ్రహ్మ" కాగల శక్తి జీవరూపంలో నున్న ఆ ఆత్మను హింసించితి వేని. హింసించిన నీవు నీ ఆత్మ ఆకల్పాంతము వరకు హింసను పొందుచునే యుందువని (శ్రీ మహ్మద్ వారి వాక్కు) రౌరవాది నరకములకు పోవు పాపము చేసిన వానికైనా క్షమాపణ యున్నది గాని నొక అమాయక మానవ ఆత్మను క్షోభ పెట్టిన వానికి ఈశ్వరుని ముందర క్షమాపణ లేదు. క్షంతవ్యుడు కాడని శ్రీ మహ్మద్ వారి వాక్కు. జీవ హింస యనబరగు పై విషయమే జీవహింస కాని. ప్రతి పదార్థమందును జీవమున్నది. జీవము లేనిది ఆహారముగ లేదు గాన ఆహారరూపంలో జీవహింస కల్పించిన యే జీవియొక్క మనుగడ సృష్టియందుండదు. గాన అట్టి విషయాలు మాని నీ సాటివాని ఆత్మను క్షోభింపజేయుట జీవహింసగయున్నది. గాన నీ జీవితమందు యెదిరి మానవ ఆత్మను క్షోభింపచేయక నీ జీవిత మనుగడను సాగించిన నీవు సార్థకుడవై జీవహింస పొందని వాడవగుదువుగాక.

# ఆశా - ఆనందము

ఈశ్వరుని ఆనందమయ రూపమే యీ పంచ భూతాత్మకమైన జగత్తు. ఆ కారణముచేతనే ఈశ్వరుడు యీ సృష్టిని తననుండి విడివడ జేసుకొన్నాడు. ఈ జగత్తులో సృష్టింపబడిన 84 లక్షల జీవరాసు లున్నూ ఆనందమయ రూపములే. ఈ జీవరాసులనుండి జన్మ జన్మాంతర రహితము చేసుకొని జీవరూపమున పంచభూతమయుడైన మానవుడు యీ సృష్టియొక్క ఆనందరూపమే. ఈశ్వరశక్తి సృష్టియొక్క రహస్యము మానవునిలో నిరూపింపబడి తిరుగ తన జన్మ స్థానమును చేరునట్లు సంకల్పింపబడి ప్రయత్నించి తనలో చేరుననియే ఈశ్వరుని ఆనందము. ఈ విషయము పురస్కరించి వ్రాయబడిన వాఙ్మయములో ఈశ్వరుడు యీ సృష్టిని యెందుకు సృష్టించాలి? సృష్టిలో నున్న జీవులు నొకదానిచే యింకొకటి బక్షింపబడి బాధలు పడుట యెందుకు కలిగించాలి? మానవజన్మకు పెట్టు కష్టనిష్ఠూరములు బాధలు యెందుకు కల్పించాలి? వీటి నన్నిటివలన ఈశ్వరునికి కలుగు లాభ మేమి? అనే ప్రశ్నలు పామరులు పండితులు తమతమ వాదోపవాదములలో ప్రతి నిత్యము సంశయాస్పదముగ యదార్ధమును విశ్వసించ లేని పరిస్థితులలో కాలము యుగాల తరబడి జారిపోవుచున్నది. ఆనందమనునది చిత్రమైన అపురూపమైన అగాధమైన సత్యమును వెలిబుచ్చు ధ్వని. అందుచే ఈశ్వరునిలో నుండి యీ పంచభూతాత్మకమైన సృష్టి విడువడి దాని పరిణామము మానవునిగా మారు వరకు యీ సృష్టియందుగల జీవరూపమైన స్థావరజంగమాత్మకములు ఆనందముననే అభిలషించి, ఆ ఆనందములోనే సుఖదుఃఖములు కష్టనిష్ఠూరములు బాధలు ఓర్చుకొనుచు పయనించుట ఆనందము కొరకే ఒకజీవి మరొక జీవిని కబళింపజూచుట ఆనందముకొరకే. ఇది ఆశా

బద్ధమైన రూపముదాల్చి బడయగోరు ఆనందము యీ జీవి భౌతిక శరీరము దాల్చిన విధానములో నొకదాని తరువాత యింకొకటి యింకొకదానికి ఆహూయమైన ఆశ ఆనందము కొరకే. ఆ ఆహూతియైన ఆ జీవి యింకొక శరీరముపొంది నూతనజన్మగా మారి, యీ విధముగనే మానవజన్మ పొందగలననే ఆశ ఆనందము కొరకే. ఈ ఆనందమను నది ఈశ్వరునియందు లీనమగునంతవరకు ఆశారూపమున పయనించి ఈశ్వర రస స్వరూపమందు లీనమగుటకు ప్రయత్నించడము శాశ్వితమైన ఆనందము కొరకే. కాన ఈ సృష్టియందు కలిగిన 84 లక్షల జీవరాసులును నొక జన్మ తరువాత యింకొక జన్మకు రావడమనేది ఆశాబద్ధమైన ఆనందము కొరకే. ఈ ఆనందము జీవరూపులో ఆశాబద్ధముగ మార్చి నొక జన్మ తరువాత నింకొక జన్మ ఖిలము చేసుకొరకు, మానవ వ్యక్తిత్వముగ మారే విషయము వరకు కలిగే యీ ఆశాబద్ధమైన కర్తృత్వము మానవ వ్యక్తిత్వము పొంది శాశ్విత ఈశ్వర రస స్వరూప సంభూతమైన ఆనందము పొందుట కొరకే. ఇది ఈశ్వరుని యొక్క చిత్రమైన సంఘటన. యీ సంఘటనయే ఈశ్వరుని యందు కలుగకుండా యుండి పంచ భూతాత్మకమైన యీ సృష్టిగా విడువకుండా యుండి స్థాణు రూపములో ఈశ్వర తేజస్సు వుండిపోయినట్లయితే జగత్తుగా విడిపోయిన ఈ సృష్టి 195 కోట్ల సంవత్సరాలయిన తర్వాత దాని పరిణామము చూచుచున్న మనము దీని పరిణామము సృష్టికి ఆదియయిన కాలము నుండి యింతవరకు విశేషములు విధానములు చారిత్రిక రూపములో తెలుసుకొనుచున్న భవిష్యత్తులో జరుగబోయే విషయములు ఊహించగల సంగతిలో మనకు కలుగు ఆనందము మృగ్యమై యుండును. కాన యింత వరకు మనము గన్నట్టి విషయాలు చిత్ర విచిత్రమైన పరిణామములు ఆనందమయమైన ఈశ్వరు సంకల్పము గాబట్టి, యీ సృష్టి తననుండి విడువడ జేయడము ఈశ్వర విధి.

మానవ రూప పరిణామము మాటి మాటికి వికాసరూపములో గ్రాహ్యమగుచున్న విషయము మానవుడు తెలుసుకొని దానిపై విమర్శించుచున్న సమయమున నుత్పన్నమగు శక్తి ఆనందము. మానవ వ్యక్తిత్వముగా వచ్చిన జీవి చరిత్ర రూపములోను తన జీవితకాలమందు అనుభవ రూపములోను తెలుసుకొనునట్టి స్థితిని మానవునిలో ఆశా శక్తి ఆహూయమానమై, నాతని భావము నందు రెండు విధములైన శక్తులు ఊహా రూపములో నుద్భవించినవి. ఒకటి అయిహిక విషయాశక్తికి సంబంధించినది; రెండవది తన జీవ రహస్య స్థానము ఈశ్వర రస స్వరూపమును పొందవలెనన్నది. ఈ రెండింటి మధ్య మానవాత్మ నిలబడి ఆశారూపముతో ఆనందమునే ఆకాంక్షించుచున్నది. ఈ కారణమున ఆశ మానవ పరిణామమునకు మూల కారణ మగుచున్నది.

ఈ పై విషయమును పురస్కరించుకొని మన ఊహను పోని చ్చిన యీ జగత్తు యెప్పుడు పుట్టినదో యెప్పుడు నశించునో తెలియ కున్నది. వేదవిహితమైన వాఙ్మయమందు నూట తొంబై అయిదు కోట్ల సంవత్సరములకు పూర్వము యిది పుట్టినట్లును, యింకా కొన్ని కోట్ల సంవత్సరములు యీ విధముగనే యుండునట్లు చెప్పబడు చున్నది. ఇతర మత మతాంతరముల లెక్క ప్రకారము యీ సృష్టి చాలా తక్కువ కాలము క్రిందనే నిర్మాణమైనదనిన్ని యేనాడు ధూళియై పోవునో తెలియని స్థితియందున్నదవి చెప్పబడియున్నది.

ఈ జగత్తు కలిగిన తరువాత యిప్పటివరకు తొమ్మండుగురు బ్రహ్మలు (సృష్టికర్తలు) పదకొండుగురు రుద్రులు పన్నెండుగురు సూర్యులు గతించినట్లు ఉపనిషత్తులు చెప్పుచున్నవి. సృష్టికర్తయైన బ్రహ్మ, కాంతి స్వరూపుడైన సూర్యుడు మాయింపబడే ముందు అనగా అదృశ్యమైన తరువాత యుగ సంధియనిగాని ప్రళయమని గాని చెప్పబడలేదు.

మానవుని ఆత్మ పరిణామము తల్లిదండ్రులనే వ్యక్తులరూపంలో సంతానమని గ్రహించకుండా కొన్నాళ్ళు గడచిన తరువాత కొంత వయస్సు వచ్చిన తరువాత ఆ సమయమున మాతా పిత అను గ్రాహ్యమునకే ఆశ యనవలసియున్నది. ఆ తరువాత శైశవావస్థలో మాటలు రాని సమయమందు తాను తన భావమును వ్యక్తపరచ లేని స్థితియందు యేడ్చుచున్నాడు. అదీ ఆశతోనే. ఆ తరువాత లోక విషయాలలో తన చూడ్కులు నిగిడించినప్పుడు తనను ఆకర్షించిన వస్తువులందు యిచ్ఛ చూపునది "ఆశ". మాటలు వచ్చి తన వూహను వ్యక్తపరిచేటప్పుడు తన కవసరమున్న వాటియందు కలుగు ఆకాంక్ష ఆశ. అటు పిమ్మట యెదిగిన కొలది ప్రాపంచిక విషయములలో ఆయాయవస్థలయందు కలుగు ఊహలను కార్యసాధనకు తెచ్చుటకు ప్రయత్నించుచున్నాడు. దీనికి కారణము ఆశ. అటు పిమ్మట ప్రకృతిలోకలిగే మార్పులను చూచి వాటిని అనుసరించదము ఆశ.

ఆశారూపమును భిన్నభిన్న విధాలుగా మారి ఆ వ్యక్తికి తగిన ఆశాబద్ధమైన త్రోవలకు లాగుచున్న శక్తి ఆశ. ఇంతవరకు బాల్యావస్థగ యున్న కారణమున దానిలో కలిగిన మార్పులను వివరించిన ఒకానొకడు విద్యా విషయములో, ఇంకొకడు వ్యవసాయములో మరియొకడు నాటపాటలలో వృథాకాలము బుచ్చుటలోను, యితరులు జార చోర వృత్తులలోను యింకొకడు జూదాది వ్యసనములలోను. వీటికి అన్యుడు తన భావి జీవితములో కలుగు అవస్థలను వూహించు వాడుగను రూపొందుటకు కారణము ఆశ.

ఆశాబద్ధమైన కాలము బాల్యావస్థ దాటగనే మానవునికి యవ్వనావస్థ వచ్చినప్పుడు ఆశకు కూడా దృఢశక్తి కలుగుచున్నది.

అందు మానవుడు తన సంకల్పములను ధృడపర్చు కొనుచున్నాడు. ఆ శక్తి పెరిగినకొలది మానవునిలో వికారములు కలుగుచున్నవి. ఆ సమయములో అరిషడ్వర్గములు అనగా కామ, క్రోధ, లోభ, మధ మాత్సర్యములనే మహాశక్తులను కూడగట్టుకొని సుద్రేకము ఉధృతము చేయుచున్నది ఆశ. అప్పటి నుండి మానవుడు తనలో కలిగిన అరిషడ్వర్గ వికారములకు లోనై ఆశాబద్ధుడగుచున్నాడు.

ఆశ యుక్త వయస్సునుండి మానవునియందు పూర్తిగ ఆవహించి తన శక్తిని విజృంభింప జేయుచున్నది. అట్టి ఆశ మానవుని హృదయమును కలతబెట్టి వేరువేరు మార్గములకు తీసుకొనిపోవు చున్నది.

ఆశ అరిషడ్వర్గములలో విజృంభించి కామరూపిగ మార్చినప్పుడు నతడు ఐహికమైన విషయేచ్ఛలందు మునిగి నాశనమగు చున్నాడు.

ఆశ క్రోధరూపములో వుద్రేకించినప్పుడు నతడు యితరులను హింసించుటలో నిమగ్నుడై కడకు తనకంటే బలవంతునిచేత నోడి దుఃఖించుచున్నాడు.

ఆశ లోభత్వమును వుద్రేకింప జేసినప్పుడు లోభి తనయందు గలుగు లుబ్ధభావములు ఆశకులోనై యితరులనుచూచి హేయపడుచు తనలోతానే లోలోన గర్వించి కాలమను మహాశక్తి వక్రించినప్పుడు తాను కుమిలి కృంగి నశించుచున్నాడు.

ఆశ మోహరూపములో విజృంభించి అది తన స్వరూప ములో చూచినప్పుడు తన జవ సత్వములు హావభావములలో కాలము వ్యర్థపుచ్చుచు సంచరించు కాలమున కాలము వక్రించి తనరూపము మారిపోయినప్పుడు నిస్పృహుడై తనలో తాను అసహ్యించుకొని జీవిత

ముపై విరక్తి పుట్టి అంత్యకాలమందు కంటి తడిపెట్టుకాలము ఖూడి నప్పుడు శోక భరితుడై మరణించుచున్నాడు.

ఆశ మదరూపములో విజృంభించినప్పుడు తన దర్పమును తాను పొగడుకొనుచు యితరులను చులకనచేయుచు పైకి నిగుడించిన చూపులు క్రిందకుదింపుట అవమానమనుకొని తనను తాను గానక భూమ్యాకాశములనే వివక్షత తెలియని క్రొవ్వరమున జీవితము గడు పుచు, ఆ జీవితములో భిన్నత సంఘటించి సుడిగాలికి రాలిన దాబందు వలె రాలి పోవుచున్నాడు.

ఆశ మాత్సర్యముగ ఉద్రేకించిననాడు తనకన్న చిన్న జీవిత ములో నున్నవారిని తూలనాడుచు తనకంటె నుచ్చస్థితిలో నున్నవానిని చూచి సహింపలేక నిముష నిముషానికి వతనియందు మాత్సర్యమున కలుగు వికారములకు లోనై శాంతి లేక తన జీవితమును వృథా పుచ్చు మాత్సర్యరూపమైన యీర్ష్యలో కృసించి నసించుచున్నాడు.

ఇదియంతయు ఆశా కలనమే!

ఆశ మానవ వ్యక్తిత్వమును యెంతవరకు వెళ్ళనిచ్చినదని ప్రశ్నవేసిన నొకడు భూమిని చాపగ చుట్టబోయినాడు. ఇంకొకడు పంచభూతాలలోని శక్తిని కాలమును తన యిష్టానుసారము నడుప నమకట్టినాడు; మరియొకడు ఈశ్వర రస స్వరూపమును నిర్మింపజూచి నాడు. ఒకానొకడు యావత్ ప్రపంచము పరిపాలింపవలెనని తలచి నాడు. ఒకడు మండలములలో దూరవలెనని మరియొకడు మండలము లను దాటవలెనని ఊహించుచున్నాడు. ఇదియంతయు ఆనందమయ మయిన ఐహిక ఆశయొక్క కలనమేగాని ఆశయందుగల ఆనందము పైని చెప్పినంత తేలికగలేదు. ఆశ, ఆనందము మానవులయందే కాదు 84 లక్షల జీవరాశులలోనున్న అభౌతిక మహాశక్తి ఆత్మ ఆనంద

ముతో కూడిన తృప్తి. ఆశ లేకున్న యేజీవికి మనుగడలేదు. మను గడ లేనప్పుడు యే జీవియు నిలువదు. ఏ జీవియు లేనప్పుడు యీ పంచ భూతాత్మకమైన సృష్టి వృథాగాన దానియందు ఈశ్వరుని గొప్ప రహస్యమున్నది. అది ఆత్మ మానవ వ్యక్తిత్వ పరిణామము పొందినప్పుడు దానినిగూర్చి విమర్శ వచ్చుచున్నది.

సర్వ జీవరాసులు ఆత్మయొక్క ఆశాలత, మానవత్వము పొందువరకు వున్నది. ఆ స్థితి వరకు ఆనందముతో కూడిన వుత్సాహము తీసుకొని పోవుచున్నది. మానవాకారము పొందిన ఆత్మ యొక్క ఆశాలత మూడు విభిన్న మార్గములు అనుసరించుచున్నది.

1) ప్రపంచ విషయాలలో ఆనందమును చూరగొనవలెనను ఆశ.
2) జన్మరాహిత్యము కలిగి స్థిరమైన ఆనందము కలుగునను ఆశ.
3) వీటికి భిన్నముగ ఆత్మ తన జన్మభూమియయిన విరాట్టును చేరి ఆశను నాశనము చేసి రస స్వరూపిగ మారి స్థిరమగుట.

ఈతడు సర్వజీవులలో ఉత్కృష్టజన్మగా నున్నటువంటి మానవత్వమును త్యజించి చేరుకొనవపోవు యదార్థ స్థానమింకొకటి యున్న దను సంగతి మరువరాదు.

ఇంతవరకు ఆశాబద్ధమైన విషయమునకు సృష్టిలో రావడము ఆనందమే కారణము. మానవుడు ఆశా స్వరూపుడని తెలుసుకొన లేక పోవుచున్నాడు.

ఆశ భౌతికమా అభౌతికమా యన్న ప్రశ్న ఉదయించినప్పుడు నది రెండు విధములుగ సమర్థనీయమైనది. భౌతికమైన ఆశ లోక విషయాల వైపు అభౌతికమైన ఆశ జన్మ రాహిత్యమునకు ఊహా పరంపరలుగా సాగుచున్నది. మానవుడు భౌతికమైన ఆశనే అను

రించుట స్వాభావికమై యున్నది. కారణము తాత్కాలిక ఆనందము. అవసరమైన సమయానికి యిచ్చునది కాబట్టి భౌతికమైన ఆశవైపునకే మరలుచున్నాడు. కావలసిన విషయములకై సంకల్పములో వూహలుగ ప్రసారమైనప్పుడు నవి ప్రయత్నమునకు లభ్యమైనప్పుడు నవి భౌతికములుగ నున్న సంగతికి వచ్చి ఆ వూహలు యెంతవరకు తీసుకు పోగలవని ప్రశ్న వేసుకొనిన "లోకంబులు లోకేశులు లోకస్థులు" అన్నప్పుడు యీ భువన బ్రహ్మాండములకు స్థానమైన స్వర్గలోకము వరకు తీసుకు పోవుచున్నవి. లోకస్థులన్న దాని స్థానము స్వర్గలోకము గాన నది యభౌతికమై యున్నప్పటికి నది క్రియారూపములో భౌతికమైన విధానములకు సుసాధ్యముగ లభ్యమగునని నిశ్చయించుకొనుచున్నారు. లోక వాఙ్మయములో మానవుడు చేసిన బీభత్స కార్యములు పోనాడు కొనవలసియున్నప్పుడు తీర్థయాత్రలు అన్నదాన భూదానములు ధన కనక దానములు వేద, పురాణ భగవద్గీతలు, పఠన శ్రవణ మనన, నిధి ధ్యాసములు శ్రవణానందముగా వినిన నతని నుండి పాపములు పోయి శాశ్వత ఆనందమున కాకరమైన స్వర్గము లభించునని నిశ్చయించి లోక జాలము ననుసరించు భౌతిక విధానములో క్రియారూపమున బడయునట్లు నుండుటచే తాను ముక్తిని కోరు ఆత్మరూపుడైన మానవుడు అవినీతిని ధనమును ఆర్జించి తనకు లభ్యమైన పాపములు చేయుచు పాపలభ్యమయిన పంకిలమును పోగొట్టుకొనుటకై పైన పేర్కొన్న దానాది పఠనములతో తుడిచి పెట్టుకొని పోబు పుణ్యము లభించునని ఆశతో కూడిన ఆనందము పడుచున్నాడు. కాని శ్రీకృష్ణభగవానుడు తన గీతలోవి విముక్తి నీ జాలవని వీటివలన నీకు శాశ్వతపదము రానేరదని నొక్కి వక్కాణించిన విషయము గమనించదగినది. ఒకవేళ నీవు చేసిన దానాదివిషయములు ఫలము ముక్తిగ లభ్యమగునని ఆశపడి, నీవా తీరున ప్రయాణము

సాగించితివేని నొకకాలమునకు నీ ఆత్మ నీకు నీవు చేసిన పాపకార్య ఫలిత మున నీవు నికృష్టజన్మకు పోవుచున్నట్లు సాక్ష్యమిచ్చును. కాన యీ ఆశ శోకభూయిష్టమైనదని గ్రహించి దుఃఖార్తుడగుట తథ్యము.

ముక్తియను సంగతికి మానవుడు వచ్చి అది భౌతికముగ చేయు దానాది కర్మలకు వచ్చు పుణ్యమువలన లభ్యమగునని తలచక నీలో నున్న అభౌతికమైన ఆత్మయందు భావమనే మహాశక్తి లోకస్థులవరకు సాగినప్పుడు దానిపై నున్న రసస్వరూప తేజస్సునకు మధ్య భ్రాంతి రూపమైన చీకటి కలదని తెలుసుకొన్నవాడవై దానిని తెగటార్చుటకు పైన చెప్పబడిన భౌతిక కార్యరూపకములైన సాధనములకు సాధ్యము కాదని నిశ్చయించి వాటి పర్యవసానము భ్రాంతి శక్తికి లోనై జడ జన్మలకు తీసుకపోయే ఆశాబద్ధమైన ఊహలు కాని ముక్తికి సాధ నముకాదన్న సంగతి తెలుసుకొని విరక్తిపొంది గత్యంతర మేమిటియని క్రిందకు చూడక వాటినిమించి నీ సద్గురూపదేశమున నీ భావము పైకి పోనిచ్చితివేని దానివలన వచ్చు ముక్తియనునది కూడా ఆశయే. ఆశారూపమైన ప్రయాణమున ఆనందము కలదు. అటువంటి ఆశ అభౌతికమైనదిన్ని అవాఙ్మనసి గోచరమైయున్నది గాన అది తెలిసిన సద్గురువు రూపములో తెలుసుకొనుటకు సాధ్యముగయున్నదిగాన నటువంటి వ్యక్తిని నాశ్రయించినప్పుడు ఆ సద్గురువు అనుభవజ్ఞుడై యున్నప్పుడు నీకు భ్రాంతిరూపమైన చీకటి జన్మజన్మలకు తీసుకుపోయి కాలము, ఖిలమయ్యేవరకు యే విధమైన పరిణామము కలిగించుచున్నదో సి దృశ్యములో, అనుభవములో నీకు నిర్ధారణ అయ్యేటట్టుచేసి వాటి యందు విరక్తి కలిగించి ముక్తిపొందాలనే ఆనందమైన ఆశకు తీసు కొని వచ్చి ఆపై తెలుసుకొను అభౌతిక విషయాలను తెలిపి నిన్ను తపోనిష్ఠునిగ సాధనారూపిగ మార్చి ముక్తిని పొందే ఆశను కూడా నివృత్తిచేసి శాశ్వత ఆనందమయునిగ రూపొందజేసి నీ ఆత్మను గుణ రహితమైన తానుగా మార్చి తరింపజేయును. అతడే సద్గురువు.

ఇటువంటి నిరాశాబద్ధమై అవాఙ్మనస గోచరమైన శాశ్వతానందము పొంది తరించగలవు.

మానవుని ఈశ్వరుడు పంచభూతాత్మకమైన ఆనంద స్వరూపునిగ మార్చి సృష్టించినను ఆత్మయందు కలుగు ద్వైదీభావములలో ఆశాబద్ధుడై శోకపరవశుడై జడజన్మలకు పోవు విధానాన్ని యనుసరించి నాశనమగుచున్నాడు. ఆ మానవుడే తనలో నిగూఢముగా యున్న ఆనందస్వరూపాన్ని బ్రహ్మానందముగ మార్చి ప్రతిదానియందు ఆనందము చూచి తృప్తిపడి తాను సాయుజ్యరూపమును పొంది తరించుచున్నాడు.

# నిరాశ

సృష్టియందు జీవముతో గూడిన దేహధారులైన 84 లక్షల జీవరాసులలో నిరాశ నిగూఢంగా యున్నది. అది మన దృష్టిలో పశుపక్ష్యాదులందు, జంతుజాలముల యందు వాటి వాటికి ఆశారూప మైన విషయం లభ్యంకానప్పుడు అట్టి స్థితిలో వాటియందు నిరాశను గమనించుట కష్టసాధ్యమైనను వాటి వైఖరినిబట్టి తెలుసుకొనుట సాధ్య ముగయున్నది. అలాగుననే ప్రతీజీవియందు నిరాశ కలదని నిశ్చ యింప వలసియున్నది. ఇది ఉపమానంగా ఒక లతకు నీరు పోయ కున్న అది వాడిన విషయము చూచి అదిపడు నిరాశ వ్యక్తము చేయు చున్నట్లే ప్రతిజీవియందును నిరాశయున్నదని తెల్లమగును.

మానవ వ్యక్తిత్వము పొందిన జీవియందు మాత్రము నిరాశ యన్నది గమనించి తెలుసుకొనుట సుసాధ్యమయినదని సర్వమానవ కోటికి తెలియును.

నిరాశ స్వరూపమనగా దానిరూపు తెలుసుకొనుట చాలా కష్టము. అది చాలా లోతులో నున్న సంగతిగాన యే మానవున కా మానవుడు తర్కించుకొనిన తన స్వభావములో తెల్పుకొనగలడు.

మానవజన్మ ఆశాబద్ధమైనది. ప్రతి వ్యక్తియందును ఆశను పుర స్కరించుకొని తన మనుగడరూపమైన జీవితమును సాగించుచున్నాడు. కాని అతనికి ఆశారూపమైన ఊహ తనలో నుత్పన్నమైనప్పుడే దానికంటే ముందుగనే నిరాశా రూపము పురోగ మించుచున్నది. ఆ క్షణమందే నిస్పృహకు రాగలుగుచున్నాడు.

మానవునియందు ఆశ యెంతటి స్థాన మలంకరించియున్నదో దానికంటే బలీయమైన స్థానము నిరాశకు కూడా యున్నది. యే క్షణ

మందైనా ఆశను మరువగలడు గాని నిరాశను మరచిపోవడమన్నను మరవురాని పరిస్థితి మాటిమాటికి తన ఆత్మను మీటుచున్న సంగతి ప్రతిమానవునకు అనుభవమే.

తనకు అవసరమైన విషయం పురస్కరించుకొని దానియందు ఆశపుట్టి దానికై ప్రయత్నింపజూచును. అది సఫలీకృతము కాగలదనే దృఢ విశ్వాసమున్నప్పటికి నిరాశారూపము ఆతనిని మాటి మాటికి బెదిరించును.

ఏదైతే ఆసించినాడో అది సఫలీకృతమయి సంతోషము కలిగించిన తరువాత కూడా అందు నిరాశ తొంగి చూచుచున్నది.

ఈ నిగూఢమయిన నిరాశా విషయాన్ని మానవుడు తన నుండి మాయింపజేయడము అసాధ్యము. ఇట్టి పరిస్థితిలో మానవ జీవిత పురోగమనము ఐహికమందే తప్ప ఆధ్యాత్మిక విధానములో యీ నిరాశ మానవుని నుండి తొలుగుటకు సావకాశము లేకపోలేదు.

ప్రస్తుత తాత్కాలిక సుఖమును పొందు మానవుని యందుగల ఆశ నిరాశాబద్ధమగునప్పుడు దానిబారినుండి తొలుగుటకు జీవితమందు యే క్షణమందు సావకాశములేదు. గాన ఆధ్యాత్మికముగా తన ముక్తికై ప్రయత్నించి సాధించుట దుస్సాధ్యమగుచున్నది.

మానవుడు యిటువంటి బలీయమయిన నిరాశను తొలగించుకొని తాత్కాలిక సుఖముకొరకు ఆశాబద్ధమయిన విషయమును నీవు ఆశించు నప్పుడు యీ నిరాశ నిన్ను అడ్డుపెట్టినప్పుడు నీ నిశ్చయము నిరాశ యందే పెట్టి ఆశను పురస్కరించి పురోగమించితివేని నిరాశా నిస్సెహాలు తొలగి ఆశారూపము నీకు లభ్యమగును. ఇది అభౌతికమయిన ఈశ్వర మహాశక్తి నీకు తోడ్పడి నీ ప్రాప్తమందు సంక్రమింప జేసిన విషయమని నీవు తెలుసుకొని ఆనందించెదవు గాక.

ఈశ్వర విషయమును తెలుసుకొని తరించాలనే ఆశ కలిగినప్పుడు నిన్ను భ్రాంతి శక్తి అడ్డుతగిలి నిన్ను నిరాశాబద్ధునిగా చేసి ఈశ్వర విషయమైన ఊహాలకు పోనివ్వకుండా అడ్డుచున్నది.

నీవు ప్రాపంచక విషయాన్ని ఈశ్వర విషయాన్ని ఆశాబద్ధమైన వూహాయందుబెట్టి నీ మనుగడ సాగించుటకంటె క్షణక్షణము నిరాశను పురస్కరించుకొని ఆ నిరాశాజన్యమైన ఊహనే అనుసరిస్తూ నీవు కోరిన ఆశయొక్క పరిణామమునకు ప్రయత్నించితివేని దాని అంత్య పరిణామములో ఆ నిరాశ నిర్మూలమై నీ ఆశాబద్ధమయిన ఐహిక ఆముష్మిక సంకల్పము సంప్రాప్తమగుట నిశ్చయము.

ఈ నిరాశను లోకవిషయాలలోను ఈశ్వర విషయాలలోను దీని అంత్య పరిణామము నీకు జయము సంప్రాప్తమై కృతార్థత పొందించును. ఈ చోటునకు వచ్చిన సాధకునకు గురువు ఎంతటివాడో తెలిసికొనుటకు సావకాశము కలదు.



# ఆ నం ద ము

జీవరూపములో 84 లక్షల శరీరములు పొంది వాటినుండి విముక్తి పొంది, ఆ జీవియొక్క తెలివితో కూడిన వికాసరూపమైన ఆత్మస్వరూపము మానవ వ్యక్తిత్వము పొంది వ్యక్తమై ఆ వ్యక్తమైన రూపము కేవలము ఆనందమయమైనది.

ఈ ఆనందమును తెలుసుకొనగోరు మానవుడు యీ జన్మకు పూర్వము తన ఆత్మ జీవరూపములో పొందిన 84 లక్షల జీవరాసులలో తన దృష్టికి గోచరించిన స్థావరజంగమాత్మకమైన శరీరధారులను చూచి వాటికి మించియున్న తన జన్మను దృష్టిలో పెట్టి విమర్శించిన ఆ జడజన్మలకు కలుగు కష్టనిష్ఠూరములను తిలకించి తనజీవి కూడా నొకప్పుడు యిటువంటి కష్టములకు పాల్పడినట్టి జన్మలను రహితము చేసుకొని కడకు మానవ జన్మకువచ్చి వీటన్నిటికంటె నుత్కృష్టమైనదిన్ని దానికి మించినదిన్ని వేరొక జన్మలేదని తన విమర్శనములో తేల్చుకొన్నప్పుడు ఆ వ్యక్తికి అలౌకికమైన సహజమైన ఆనందమే కలిగి తీరును. ఎట్లన సృష్టియందుగల తక్కువ జీవరూపముల ఆహార విహారాదులతో స్వేచ్ఛా స్వాతంత్ర్యాదులతో సుఖ దుఃఖాలలో తెలివి తేటలతో తన జన్మను పోల్చినప్పుడు తాను ఆనందమే పొందగలడు. అయినప్పటికి మానవుడు దుఃఖపడుటకు కారణమేమిటని ప్రశ్న వచ్చినప్పుడు ఆతడు తనకంటె మించిన స్థితిగతులు ఆహారవిహారములు స్వేచ్ఛా స్వాతంత్ర్యములు ననుభవించువారి జీవిత విధానములతో పోల్చి దుఃఖించుచున్నాడే గాని తనకంటె తక్కువ జీవిత స్థితిగతులు కలిగిన వారితో పోల్చి చూచిననాడు తాను నిస్సందేహముగ ఆనందమే పొందగలడు.

సృష్టిలో మానవరూపము పొందిన యే ఆత్మయైనను ఊహాతీతమైన విషయము నిర్వహించగలిగినప్పుడు తనలాంటి మానవుడే అటువంటి విషయాన్ని నిరూపణము చేసినాడుగాన అది తన ఆత్మ శాంతిదే కావడంచేత నటువంటి విషయం తానుచూచినప్పుడు తనకు తెలిసినప్పుడు కలుగు ఆనందము తానుగానే అనుభవించు మానవ జన్మ ఆనందమైనది. కాని మానవుడు లోకసౌఖ్యములకు దాసుడై వాటియందే ఆనందము సంప్రాప్తమగునని ఆశించి దానికై చేయు ప్రయత్నములతో ఆనందమయమైన తన ఆత్మను ఆ తుది నీచాతి నీచమైన దుఃఖముల కాకరమగునట్లు చేయుచున్నాడు. మానవజన్మ మహదానందదాయకమయినదని తెలుసుకొన్న చార్వాకులు ఆనందము యొక్క పుట్టుక (ప్రాతిపదికము) తెలుసుకొనలేక భౌతిక విషయాలలో పెట్టి శ్రమించి ఈశ్వరవిషయముగనున్న శాశ్వతానందమును పొంద లేక నాశనమైపోయిరి. భౌతికరూపమున ఆనందమును భౌతిక పరిశ్రమ యందు సాధించగలమను ఆశయము వీడనివారి సిద్ధాంతము ఒక నాటికి నాశనము కాక మానదు.

మానవుడు తనయూహలో యీ సృష్టికి అతీతమయిన స్థానములో నున్నట్లు ఊహించి యీ సృష్టిని తిలకించినప్పుడు ప్రపంచమందున్న స్థావర జంగమాత్మకమయిన 84 లక్షల జీవరాసులనుండి నొకదాని తరువాత యింకొక జన్మను రహితంచేసుకొని మానవుడుగ వచ్చి యీనాడు యీ మానవ జన్మయెత్తి బుద్ధియొక్క వికాసమయిన తెలివితో తిలకించే శక్తివంతమయినదిగ యున్న సంగతి తెలుసుకొని జడ జన్మలు తన దృష్టికి లభ్యమయినవాటిని విమర్శనకు తెచ్చి తన జీవి కూడా యిలాంటి జన్మలలో యున్నప్పుడు యిలాంటి శ్రమలకు కష్టములకు లోనై యుంటానని నిశ్చయించి యీ జన్మలోగల స్వాతంత్ర్యమును, హాయిని తన మనస్సుకు వచ్చినప్పుడు యీ మానవజన్మ

సృష్టిపై అధికారము కలిగినదిన్ని ఆనందదాయకమయినదిన్ని అని తెలియక మానదు.

ఇట్టి యీ మానవజన్మ ఆనందదాయకమయి ప్రేమమయ మైనదని తెలియబడగలదు. అలా తెలుసుకొన్న నాతని ఆనందము నకు మేరయుండదు. గాన ప్రతి మానవజన్మ ఆనందదాయకమైనది.

మానవుడు శాశ్వితమైన సహజమయిన ఆనందమయుడు. తాను ప్రాపంచిక జీవితమందు శ్రమించి తన శ్రమకు లభ్యమయిన దానితో తృప్తిపడి సృష్టిని నొకవైపునకు నెట్టి వేసి సుత్కృష్టమయిన విషయము గ్రహించిన మానవ వ్యక్తిత్వముపై దృష్టినిలిపి, తానే ఆ వ్యక్తియని నిశ్చయించు మానవుడు ఆనందమయుడు. ఆతడే పొర షేయ మయిన మానవ స్వరూపుడు. ఆతడే శాశ్విత ఆనందమూర్తి. ఆతడే తత్వవేత్త.

# జ్ఞానము - అజ్ఞానము

జ్ఞానము అన్నప్పుడు మానవ విధానములో నతని యందుగల అభౌతికమయిన సూక్ష్మాతి సూక్ష్మమైన విషయమును తనలో నున్న మహత్తరమయిన ఆత్మ శక్తిచే గ్రహించి దానిని కార్య రూపంలో పెట్టినప్పుడు నది ప్రజాదరణీయముగా నున్నప్పుడు నతని యందుగల బుద్ధియొక్క వికాసమునకు జ్ఞానమని పేర్కొనబడుచున్నది.

ఈ జ్ఞానము తెలివిరూపంలో తన ఐదవ యేట పరికాళమాన మయి విద్యావిధానమున వెల్లివెరిసి ప్రపంచమునందుగల చారిత్రక, రసాయినిక, ఆధ్యాత్మిక, విషయములను పురస్కరించుకొని, ఆయా ప్రకరణములయందు నొక్కొక్క మేధావి తనబుద్ధియొక్క చాకచక్య ములో తెలుసుకొన్న విషయములను లోకమందు వాఙ్మయ రూప ములో విశదీకరించినప్పుడు నా యా ఘట్టములందుగల అపురూపమైన విషయములు ప్రజాదరణ పొంది కార్యరూపం దాల్చుచున్నది.

చరిత్ర :- ఈ చరిత్ర అన్నప్పుడు తన జీవిత కాలములో సృష్టియందు జరుగు చిత్ర విచిత్రములతో కూడిన సంఘటనలు, ప్రాపం చిత తీరువులు యెప్పుడు యేయేచోట యెట్లు యేకాలమున జరిగినవో వాటికి సంబంధించిన వివరములను వర్ణిస్తూ, ఆ వర్ణనయందు పండిత ప్రకర్షణలు, ఘర్షణతోకూడిన యుద్ధములు, లౌకిక వ్యవహారములు, మానవులయొక్క నాగరికత నీతి అవినీతి వీటికి సంబంధించిన వివరము లను వర్ణిస్తూ కండ్లకు కట్టినట్లు తన వాఙ్మయములో నిరూపించగల్గి నట్లు రచించుటలో తన తరువాత కాలములో మానవుడు ఆ చరిత్రను ఆమూలాగ్రము చదివి తన జీవితములో తన యనుభవమందు ఆయా చరిత్రలను చదివి తన జీవిత పురోగమనమునందు వాటిని ఆదర్శముగ

పెట్టుకొని తన జీవితయాత్రను సాగించుకొనునట్లు చేయునదియే చరిత్ర.

రసాయనిక శాస్త్రము :- ఈ రసాయనిక విధానములో మాన వుడు మాటిమాటికి విమర్శనా రూపంలో తన విషయాలను గ్రహించి తనకు పూర్వము చరిత్రగయున్న అభౌతికముగ చెప్పబడిన ప్రశంసలు భౌతికంగా రసాయనిక సమ్మేళనమున కార్యసిద్ధికి తెచ్చి లోకవాసు లను విభ్రాంతులుగా చేసి తన మేధస్సుయొక్క అపురూపమైన రహస్య మును వెల్లడిచేయ సమకట్టుచున్నాడు.

ఆ తెలివియొక్క వికాసము జ్ఞానరూపములో చంద్రుని ఆక రించి చూడగల్గుచున్నాడు.

ఆధ్యాత్మికము :- ఈ ఆధ్యాత్మికము అను విషయము పై రెండింటి విధానములను తలదన్ని యీ సృష్టి సమస్తమునకు యేది ప్రాతిపదికమో యెక్కడ నుండి వెలువడినదో దానిమూలము తెలిసి జన్మరహితమును విషయమును మానవ వ్యక్తిత్వము పొందిన ఆత్మ యొక్క విధికృతమని (హక్కు) విరూపణచేసి దానినిగూర్చి తెలుసు కోవలసిన విషయము. తెలుసుకున్నవ్యక్తి సద్గురువని నిశ్చయించి నాతవిచేరి బడసి కృతార్థతకు రాగలిగే విషయము జ్ఞానమను బుద్ధి యొక్క వికాసమని అది తత్వమసి యను స్థిరత్వమున నిరూపణ యగుచున్నది.

ఇట్టి విధానములో మానవులు వేరువేరు గణాలుగా విభజింప బడి వారివారి విషయములందు పూర్తిపరిణామము పొంది కృతార్థులగు టకే జ్ఞానమని విశ్చయము.

కాని యిందు మానవజన్మ సార్థక్యము చేసికొనుటకు చరిత్ర. రసాయనిక విధానములు తోడ్పడజాలవు.

ఆధ్యాత్మికమయిన భౌతిక అభౌతిక శక్తిస్వరూపములు విమర్శ నకు పెట్టి నందుగల నిగూఢ విషయములను గ్రహించవలసియున్నది.

భౌతికము :– ఈ 84 లక్షల జీవరాసులలో మన దృష్టికి స్థూల ముగను సూక్ష్మముగను, జీవసహితముగను, జీవరహితముగను నుండి పదార్థరూపంలో భౌతికంగా గ్రాహ్యమయినప్పుడు తన్ను వాటితో పోల్చుకొని తన విధానమునకవి అతీతంగానున్నవా? తనకంటె క్రింద నున్నవా? అను అంశముపై మోసి విమర్శించిన, సృష్టియందు ప్రతి పదార్థమును తనకంటె క్రిందుగ నున్నట్లు తెలుసుకొనగలడు. ఇట్టి స్థితిని తానూహించు విషయము బుద్ధియొక్క వికాశమయిన తెలివిలో గలదని తెలుసుకొనినట్టి తెలివి యితర జీవజాలమందు విమర్శనలో పెట్టిన వాటికికూడా తెలివియనునది లేకపోలేదుగాని, దానికి వికాశ రూపంలోనొక అంతరము నుండి యింకొక అంతరమునకు మారి తన వలె నిర్మాణాత్మకమయిన విషయానికి రాలేకపోవుచున్న విధానమును గ్రహించగలడు.

అభౌతికము :- ఈ అభౌతికమయిన విషయముమ సూక్ష్మంగా ప్రతి స్థావర జంగమాత్మకమయిన స్వరూపమందున్న ఆత్మను పురస్క రించుకొని తెలిసికొన్నవాడై నొకానొకప్పుడు సూక్ష్మరూపమున తన ఆత్మకూడా నటువంటి పదార్ధరూపంలోనున్నట్లు స్థిరపరచి యీ నాటికి తనకు కలిగిన తన మానవ జన్మను తిలకించి ఆనందించవలసియున్నది.

ఇందున్న రహస్యము జడజన్మ శరీరధారిగ నున్న తన ఆత్మ యీ మానవ జన్మగ (మానవ వ్యక్తిత్వముపొందిన) వచ్చిన ఆత్మయు నొకటే గాన తన దృష్టికి కనబడే యీ స్థావర జంగమాత్మకమయిన జీవజాలములు నొకనాటికి మానవ వ్యక్తిత్వముపొంది తెలివియొక్క వికాసము విజ్ఞానము రూపముగల మానవుడిగా రాగలినప్పుడు జడ జన్మలుగ నున్న జీవజాలములయొక్క బుద్ధి చాకచక్యములను తెలుసు

కొని విమర్శించినటువంటి జడస్వరూపము తిరుగ తన ఆత్మకు రానీ కుండా వాటినుండి వైదొలగి ప్రకాశమానమయిన శాశ్వతమయిన తేజో రూపంలో నున్న రస స్వరూప సన్నిభమయిన ఈశ్వరత్వము పొందుటయే తన పరమావధియని యే మానవాత్మ నిశ్చయించునో నది జ్ఞాన స్వరూపము.

అజ్ఞానము :- అజ్ఞానమన్న చీకటియని యర్థమిచ్చును. ఇది సృష్టియందున్న జీవజాలములన్నిటిని విమర్శించినప్పుడు, మానవుని కన్యముగానున్న జీవజాలములన్నియు చీకటిలో నున్నవని శ్రీ కృష్ణ భగవానుని వాక్యము.

ఈ చీకటిలోనున్న జీవజాలములు వాటివాటి గుణములను నైజ ములను వేరువేరుగ విమర్శించిన, యే కాలమునందు వాటిని చూచిన వాటియొక్క పరిణామము నొకే విధముగనున్నట్లు తెలియకమానదు. బుద్ధియొక్క వికాసమయిన తెలివి వాటియందు మృగ్యమయిన సంగతి తెలియబడగలదు.

ఇది ఆయా జన్మలరూపంలో నా జన్మ స్వభావ నైజములను తొలగించుకొనలేవు. అటువంటి చీకటిగాయున్న (అజ్ఞానంలోనున్న) జన్మలయొక్క స్వభావము మానవులలోకూడా దృగ్గోచరం కాగలదు. అటువంటి వ్యక్తులను సంబోధించినప్పుడు రాళ్ళను, చెట్లను, పశువు లను, పక్షులందుగల హీనమైన వాటి పేర్లతో సంబోధింపబడు చున్నారు. అటువంటి మానవులు మన అనుభవమందు అప్పుడప్పుడు తారసిల్లినప్పుడు (తటస్థించినప్పుడు) ఆ మానవ జన్మలను చూచి యీ వ్యక్తిత్వాలలో జడస్వరూపములైన ఆత్మలు కలిగియున్న విషయానికి వచ్చి, అవి చీకటి రూపమైన అజ్ఞాన మానవజన్మలని తెలుసుకొన వలసియున్నది.

ఇటువంటి ప్రసక్తి మనయనుభవములో వచ్చినప్పుడు ఆ మానవుల నుండి వెలువడు వాగ్ధోరణి, కార్యకలాపములు తిలకించి

నప్పుడు తన బుద్ధియందు విమర్శించుకొన్న నటువంటి విషయాలకు తాను పాల్పడే సమయము వచ్చినప్పుడు యీ అజ్ఞానరూపము నుండి వెలువడిన విషయాలను జ్ఞప్తికి తెచ్చుకొని వాటినుండి వైదొలగి తాను విజ్ఞానిగా ప్రకటితమగు సంగతికి వచ్చి (విజ్ఞానిగ వచ్చి నిలచి నప్పుడు) జ్ఞానము - అజ్ఞానము అనే వాటి వివక్షత తెలుసుకొన గలడు కాబట్టి

ఓ మానవుడా! నీవు నీ జీవితమందు నీ ప్రాపంచిక దృష్టి యందు మొదట అజ్ఞాన స్వరూపమునుండే నైజకార్యకలాపములను విమర్శించి వాటి అజ్ఞానకృత్యములయొక్క పర్యవసానము తేల్చుకొని ఆ తేల్చుకొన్న విషయము తన మనస్సునందు భద్రపరచి ఆ తరు వాత నీకు జ్ఞానస్వరూలుగ నీ దృష్టికి నిశ్చయమైన వ్యక్తిత్వము లందు యే విషయంలో యెంతెంత జ్ఞానమున బుద్ధియొక్క వికాసము ప్రసారమగుచున్నదో తెలుసుకొని నీవు "జ్ఞాన మజ్ఞాన" ముల మధ్య నిలచి నీ జీవితమందు వచ్చు కార్యకలాపములను విధివిధానములతో కూడిన అంశములపై మోసి యేనాటికిని వాటి పరిణామము "అజ్ఞాన" విధానమువైపు పోనీక జ్ఞాన స్వరూపమైన హర్షణీయమైన కార్య కలాపములయందు నీ తెలివియొక్క వికాసమును ప్రసరింపజేసి యీ సృష్టియందు జ్ఞానస్వరూపుడవై నీ యంత్యము తరువాత లోకములో నీవు చిరస్మరణీయునిగ రూపొంది ప్రజా హృదయములను హత్తుకు పోయి ఆకల్పాంతముదాకా మరపురానివానిగా జ్ఞానిగా మనెదవు గాక!



# మానవ మనుగడ



మానవ మనుగడ అనగా రెండు విధాలు. ఒకటి అది మానవ స్వభావ సిద్ధమైనది. రెండు మానవ జీవితమందు చూపు ఉత్కృష్టత నికృష్టత మానవునిలో ఉన్నప్పటికి పరోక్షమందు ఆ విషయము వాగ్విధానంలో వస్తుందిగాని, సమక్షమందు ఎప్పుడు మానవుని యొక్క ఉత్కృష్టతయే చెప్పబడుచున్నది.

మానవ మనుగడ అన్నప్పుడు తెలిసికోవలసిన విషయాలు చాలా ఉన్నప్పటికి అది ఏవిధంగా తెలిసికోవాలో అతని జీవిత విధానాన్ని మరపించు విషయంగ ఉంటుంది. మొట్టమొదట మానవజన్మ ఉత్కృష్టమైనదనిన్నీ, జీవజాలంలో ప్రాగూపం కలదిన్ని, తెలివియొక్క వికాసరూపంలో, తను తెలిసికొని తెలియబడు విధానంగా నడవడికగా ఉంటుందని చెప్పాలి. కాని యదార్థంలో మానవుడు అన్నప్పుడు నికృష్టమైన విషయాలకు పాల్పడి లోకదృష్టికి అతిహీనమైన జన్మగా పరోక్షమందు పరిగణింపబడుచున్నది. 84 లక్షల జీవరూపం దాల్చిన మానవజన్మ కడపటి జన్మగాబట్టి యీ 84 లక్షల జన్మలలో చేసినటువంటి ఉత్కృష్ట నికృష్టములయొక్క మనుగడయొక్క ప్రాతిపదికము ఆరంభమై మానవజన్మలో రూపొందుచున్నది. అది మానవజన్మ యొక్క స్వభావము (సైజము) అది మనుగడ రూపంలో తెలియబడి, తనలాంటి మానవుని ద్వారా వెలికివచ్చి రూపించుచున్నది. అప్పుడు ఆ మనుగడ యొక్క మానవునిలో రూపించిన యదార్థమును పురస్కరించుకొని అతని చరిత్రగా మారి స్వభావసిద్ధమై తేటతెల్లమగుచున్నది. అప్పుడు మానవ జన్మను విమర్శించిన, యీ 84 లక్షల జీవరాసులలోను మానవజన్మ ఉత్కృష్టమైనదని చెప్పడం హాస్యాస్పదం. కారణం ఏరూపంలో ఆజీవి దేహధారియై వచ్చిందో దానిస్వభావం

తేటతెల్లంగా విడమర్చి చెప్పవచ్చును. మానవ విధానంలో ఒక మానవునికీ యింకొక మానవునికీ రూపభేదాలలో చాలా సున్నితంగా ఉన్నప్పటికి మనం దానిలోనే నైజభేదం విమర్శించినట్లయితే రూపభేదమే కాకుండా అతనిలో ఉండే ఉత్కృష్ట నికృష్ట భేదాలుకూడా స్పష్టమౌతాయి.

ఆ విధానాన్ని నైజ స్వభావాలు మనుగడలో చేర్చి విమర్శించినట్లయితే, అది ఏ జన్మ నుండి మానవజన్మగా వచ్చిందో ఎదుటి మానవుని చేత విమర్శింపబడుతుంది. దానిని పురస్కరించుకొని యోచించినట్లయిన మానవజన్మ అన్ని జన్మలకంటె నికృష్టమైనదిన్ని నీచమైనదిగా తెలియవస్తుంది.

ఒక మానవుణ్ని దృష్టిలోపెట్టి నైజమనుగడలు ఏ విధంగా ఉన్నాయి అని చెప్పి విమర్శించినట్లయితే, నిముష నిముషానికి లిప్త లిప్త కాలానికి మార్పులు గోచరిస్తూఉంటాయి. వాటిని బట్టి తన తీరికలో యోచించినపుడు ఏ జన్మనుండి ఏ జన్మకు యీ జీవి దేహధారియై వచ్చిందో తేట తెల్లంగా తెలిసిపోతుంది. వాఙ్మయములో వ్రాయబడినటువంటి మానవ ఉత్కృష్టత, అతి హీనమైనదిన్ని ఉత్కృష్టత, నికృష్టత అను విషయము వచ్చినప్పుడు అంతకంటె నీచమైనది లేదని తనే నిర్ధారణ చేసికొనగలడు.

ఎప్పుడైతే యితరులను విమర్శించాడో, తనకు తాను విమర్శించుకొన్నప్పుడు తన మనుగడ విధానం నైజస్వభావాల విధానం తనకే తేట తెల్లము కాగలదు. ఆ వచ్చిన అంత్య పరిణామాన్ని దృష్టిలో పెట్టి తన నడవడిక నైజము మార్చుకొన్ననాడు తన మనుగడలో మార్పు వచ్చి ఉత్కృష్ట జన్మ అనిపిస్తుంది. అంతేగాని యితర జీవజాలముల లాగున జన్మతో ఏదైతే దేహం పొందిందో దానియొక్క నైజ స్వభావాలు మానవునిలో మాత్రం రూపించవు. ఈ మనుగడ విధా

నానికి రాకపూర్వం నిమిష నిమిషం లిప్త లిప్త దానిలో మార్పు కనబడుతుందను మాట యదార్థము.

వాఙ్మయంలో మానవ జన్మ చాల ఉత్కృష్టమైనదనిన్నీ అన్నిటి కంటె తెలివియొక్క వికాసముయొక్క విధానం స్వభావంగా కాగలద నిన్నీ, అంతకంటె మించిన దేహధారి లేదనిన్నీ చెప్పడం వ్రాయడం కూడా పరిపాటియైపోయింది. పైన చెప్పినట్లు తనకు ఎదిరి మానవ జీవితం ఏ రూపంలో, ఏ విధానంలో తన మనుగడ సాగిస్తుంది అన్న ప్పుడు దానిలో ఉత్కృష్టమో, నికృష్టమో తేలకమానదు.

ఆ సమయమందు తన మనుగడ దేనిని అనుసరించి దేనిని పోలి దాని యొక్క స్వభావ నైజాలు ఉన్నవో తనకు తానే తెలిసికొని అటువంటి దృష్టి మనుగడ దుష్ట స్వభావం నుండి తొలగడం మానవ జన్మకు సాధ్యంగా ఉంది. కాని మానవుడు ఆ విధానాన్ని చేయలేక పోవుచున్నాడు. ఎందుకనగా మానవుడిలో అన్ని జీవరాసులకన్న తన మనుగడ స్వార్థంమీద మోసియున్నది. స్వార్థరూపంలో తనకు లాభించే విషయంపై మోసి యుంటుంది. అది ఇతర మానవులకు నికృష్టంగా తోచినప్పటికి తనస్వార్థం మాత్రం విడువడు. అది అతనిలో ఉన్న నైజం. అతనిని గూర్చి మనకు తెలిసికొన్నంతవరకు మన బుద్ధికి తోచినంతవరకు యింత బుద్ధి వికాసముగలజీవి యిటువంటి విషయంగా మారినప్పుడు తన మనుగడ ఏ విధంగా మలుపు త్రిప్పినట్లై యితే తనలాంటి మానవుని యొక్క బుద్ధి తనను శ్లాఘిస్తుందో ఆ విధా నంలో తన మనుగడ పెట్టుకొని జీవితయాత్ర నడిపినప్పుడు, అటువంటి స్వభావం తన నైజములో సంక్రమింప జేసికొన్నప్పుడు ఆ వ్యక్తి ఎల్లప్పుడు మానవజీవితం ఉత్కృష్టంగా ఉండవలెనని ప్రయత్నం చేస్తూనే ఉంటుంది. అటువంటి మనుగడ తనకు స్వాధీనం అయినప్పుడు ఆ జన్మయొక్క ఉత్కృష్టత స్థిరముగా లోకమందు ఉండిపోతుంది. ఇది

సంక్రమింప జేసికోవాలంటే అడుగడుక్కీ మాట మాటకీ యోచించి దాని అంత్యపరిణామం స్థిరపరచి పెదిమల వెలికి ఆ ధ్వని వచ్చునట్లు చేసే విధానంగా ఉండే విషయాన్ని పురస్కరించుకొని అది ఉత్కృష్టంగా ఉన్నదా లేదా అని విమర్శించి తన జీవిత మనుగడ దాని పరిణామం పై మోసి తాను తన నడవడికను ముందుకు సాగించాలి.

తన మనుగడ ముందుకు సాగుచున్నప్పుడు భ్రాంతి మహాశక్తి అనేక అవాంతరములు కల్పించి ఆ మానవుడిలో ఉన్న స్వభావం ఉత్కృష్టతకు రానీయకుండా అడ్డుతగులును. అప్పుడు. ఆ అడ్డు తగిలిన విషయం భ్రాంతి శక్తి యొక్క పరిణామమని తెలిసికొని - ఆ చోట ఆగి గురుస్మరణ చేసినపుడు ఆ తరువాత వచ్చిన ధ్వని మంచి విషయం వచ్చేటట్లు చేసే స్వభావం ఏ గురువులో ఉంటుందో అతనే గురువు.

మానవ మనుగడ నేర్చుకోవాలి అంటే (తనలో స్వభావంగా మార్చాలి అంటే) మానవుని కడనుండి ప్రతిజీవి దేహధారిగాయున్న విషయం తెలిసికొని వాటి విషయాలలో ఎంతటి నికృష్టత ఉత్కృష్టత ఉన్నదో, తన విమర్శకు ఏవిధంగా తేలిందో, ఉత్కృష్ట విషయాలు తన నైజ స్వభావంలో మిశితం చేసి తన మనుగడ సాగించవలసియున్నది అన్నప్పుడు, తాను ఏ మానవరూపం ఎదురు పడినప్పటికి అతని స్వభావాన్ని నమ్రతగా మార్చగలిగే జీవిత విధి ఆ మనుగడలో నుంచే మరియొకరికి ప్రపంచములో వెలార్చుతుంది. ఈ మానవ మనుగడ అన్నప్పుడు సృష్టిలోయున్న 84 లక్షల జీవరాసులలో ఉత్కృష్టతపొందిన మానవజాతి ఉపేక్ష చేయుచున్నది. ఆ ఉపేక్షయే మానవునకు ఉత్కృష్టత పొందే విషయం ఉన్నప్పటికి తన నైజ స్వభావానికి లొంగి యుండడం చేత తన స్వార్ధంనకు భంగం రానీయకుండా అది సాగించే ప్రయత్నంలో ఎంత నికృష్టత ఉందో ఎంత స్వార్ధముందో తన మనుగడ ఏ విధానంలో సాగుచున్నదో తెలిసికొనే విషయం వాఙ్మయంలో

చాలా నిగూఢంగా పూర్వపు ఆర్ష విధానంలో ఉపనిషద్రూపంగా వ్రాయబడియున్నది. అదే (ఇన్నేల చెప్పవలయు తన్నేతాను యెరుగు కొరకు, తనకన్యంగా నున్న దంతయు దబ్బర.)

ఆ విషయం ఎందుకు ఉపనిషద్రూపంలో చెప్పవలసి వచ్చిందంటే మానవ మనుగడయందు అంకురింపజేయాలి అంటే మొదటి సాధన, తనలో ధ్వనిస్తున్నటువంటి నేననే మహావిషయం ఎందుకు తెలిసికోవలసియున్నది అన్నప్పుడు, ఎవరి నైజాన్ని స్వభావాన్ని విమర్శించుకొనియే నేననే ధ్వనికి ఆ విషయం ఎంతవరకు అవసరం అనవసరంగా ఉందో అది విమర్శించి, అందలి మంచిని తీసుకొని చెడ్డను విడిచిపెట్టి తన మనుగడకు తీసికోవడానికి ఆ నేనను నది ఉండుటయే అనగా నేనను విధానంలో వ్యక్తం చేస్తున్న అంతర్యాం తనకెంత వరకు ఉపకరిస్తుందో అది తెలిసికొని తన మనుగడలో లీనం చేసు కోవడం కొరకే ఆ ధ్వని బయలుదేరినది. అట్టి మనుగడ సాగించునదే సరియైనది. కానిది దబ్బర-ఇదే మనుగడ. ఇది మానవ జన్మకు తప్పని సరియైన విషయము కూడను.

# ధర్మము

ధర్మ మనునది సృష్టియందు అనేక రూపములు దాల్చినది. ప్రాపంచిక రూపములలో జరుగు ఘర్షణ న్యాయా న్యాయములనే విధానములో వాటియొక్క పర్యవసానము వివక్షత రూపమైన ధర్మమన బడుచున్నది.

నీతి అవినీతి అనే మానవ నైజ కార్య కలాపములందు యిద మిద్ధమని తెల్పునది ధర్మ మనబడుచున్నది. ఒకరికి ఇంకొకరికి మధ్య జరిగిన ఘర్షణకు మధ్య సమతరూపమైన పరిణామము ధర్మ మనబడు చున్నది.

ప్రపంచమందు ధర్మ విరుద్ధమైన కార్య కలాపములకు జీవకోటి పాల్పడి, అది అధర్మముగా మారినప్పుడు అవతారరూపమైన ఈశ్వర సంభూతమైన వ్యక్తిత్వము వచ్చి, ధర్మము స్థాపించు చున్నదని, భగవద్గీత.

ఇక్కడ ఈ ధర్మ మన్నప్పుడు పైన చెప్పిన విషయములేకాక రాజకీయ విధానములు, ప్రకృతి విరుద్ధమైన విషయములను పురస్కరించుకొని వాటియొక్క పరిణామము ప్రకృతి ధర్మరూపములో నుండి అందునుండి వెలువడిన మొలక ఈశ్వర సంభూతమైన మహా విషయము ముక్తిస్వరూపమునకు రాగలిగే విధానము ధర్మ మనబడును.

ఇది ప్రపంచములో న్యాయ, ధర్మ శాస్త్రము లనబడుచున్నవి. ఈ ధర్మమే మతములుగా మారినది. మతములన్నప్పుడు దేశ కాలాను గుణ్యంగా నున్న సృష్టి స్వరూపాన్ని పాలనా రూపంలో న్యాయచట్ట రీత్యా నియమబద్ధమై వెలయుచున్నది. ఇది లోకధర్మము.

పైవాటికి తలదన్ని ఆధ్యాత్మికరూపమైన ఈశ్వర విషయము తెలుసుకొని తరించు ఉపనిషద్రూపమైన అభౌతికమైన విషయము వెల్లడియై అది సాధనారూపమున ఆత్మకు అంకురింప జేసినప్పుడు వచ్చిన పరిణామము ఆ యా మత ధర్మములలోగల ధర్మము.

కేవలం ఆధ్యాత్మికముగా ప్రయాణముచేయు సంస్థలకు ధర్మములని వారివారి గురువులు నిర్మించిన సంస్థలు ధర్మములని, కూటములని, పీఠములని, సమాజములని మానవ విధానములో వేరు వేరు ధృక్పథములలో ఈశ్వర విషయాలను తెలిపి, శిష్యులుగా యున్న వ్యక్తులను సాయుజ్యులుగా మార్చుచున్న విషయములకు ధర్మములు అని పేరు. ఈ ధర్మకర్తలు ఈ పీఠాధిపతులు వారివారి ప్రబోధములందు ఆయా ధర్మముల నిర్వర్తించి, వారియందు ఈశ్వర తత్వమును హత్తుకున్నట్లుచేసి, సాయుజ్యుడుగా మారగలడని చెప్పుమాటలు వారి వారి ధర్మ ప్రబోధములుగా ఆయా ధర్మములను ఆశ్రయించిన వ్యక్తులు సాధనారూపంలో వారి గురువులు చెప్పిన ధర్మములను తప్పక ఆచరించు చుండుట మనకు సువిదితము.

పైన చెప్పిన ధర్మములలో నిజానిజములు ఏ తీరువు నున్నప్పటికి మానవుడు తన అంత్య ఊహగా నిశ్చయించిన విషయము ముక్తస్వరూపమైన పరిణామమునకే ధర్మమని చెప్పవలసి యున్నది. ఇట్టి ధర్మము ప్రపంచమున భిన్నభిన్నములుగా యున్నసంగతి ఆయా ధర్మములవారు ఒకరి నొకరు వాగ్వాదముల వెల్లడించినప్పుడు వినువారికి ఇంపుగానుండి వారి వాక్చాతుర్యము తిలకించినపుడు వారి వారి ధర్మముల యందుగల ప్రవీణత తెలియక మానదు. అది తన ఆత్మ విశ్వా

సమునకు ఎంతవరకు అనుగుణ్యముగా యున్నదో తనకుతాను విమర్శించుకొనిన తేలగలదు.

మానవుడు ధర్మస్వభావిగానున్నట్లు ఒకనిశ్చయానికి వచ్చిన తరువాత ఆతడు తన రూపాన్ని విమర్శించినప్పుడు మానవస్వరూపమే ధర్మస్వరూపమని తెలిసికొనగలడు. కారణము తనదృష్టికి గోచరమైన ప్రతిజీవియొక్క కార్యకలాపములు, వాటియొక్క ధ్వని నిరూపణమును బట్టి విమర్శించిన దానియందున్న యదార్థవిషయము తన మనస్సునకు సాక్ష్యమిచ్చును. అది కృత్రిమ కపటరూపము కాకుండా విశాలమైన దృక్పథములో పెట్టి విమర్శించిన, ఆ ధ్వనియందుగల న్యాయబద్ధమైన విషయము తనకు రూపించక మానదు. ఆ రూపమే ధర్మము. ఈ ధర్మస్వరూపము జ్ఞానికి అజ్ఞానికి ఒకే విషయంగా సాక్షాత్కరించగలదు. కాని వారివారి వూహాలలో కల్గిన కుటిల కపటత్వములను బట్టి ఆ ధర్మమందున్న రూపము మారిపోవును. అటువంటి కుటిల కపటములను మాని, నిష్కపటిగా ధర్మరూపమును గ్రహించినప్పుడు తన ఆత్మ యొక్క నిగూఢమైన సత్యము అదేయని చెప్పగలడు. అటువంటి ధర్మరూపమైన పరిణామము ఏ వ్యక్తి నోట వచ్చునో అతడు గురువు. ఆ గురువు నోటవచ్చిన విషయములు నీ యాత్మయందు ధ్వనింపజేసినప్పుడు అవి నిజమై నీ ఆత్మ నీకు సాక్ష్యమిచ్చినప్పుడు అది ధర్మము. అటువంటి ధర్మమందు నీ ప్రాణములు డిగినా మానకూడదు. అటువంటి సాక్ష్యమియ్యని ధర్మప్రబోధము ప్రమాదములకు కారణము కాబట్టి తక్షణం విడచి వేయవలసియుండును.

అభౌతికమైన విషయములయందును భౌతికమైన విషయముల యందును నీ గురువు నీకు ప్రబోధించిన విషయములు నీ కలతలనుండి నీ కష్టనిష్ఠురములనుండి తొలగింపజేసి, నిన్ను ఒక నియమ బద్ధమైన స్వరూపునిగ మార్చి ఏ సమయమందును నిన్ను భ్రాంతి జన్యమైన కుండలిని శక్తికి లోనుగాకుండా చేయు సమర్థత కల్గిన ప్రబోధకుడు గురుస్వరూపమున వెల్లడించు వాక్కు, దానియందుగల శక్తియే ధర్మ స్వరూపము. ఇదియే ధర్మము.



# వేదములు - వేదాంతము



వేదములు అన్నప్పుడు యివి ప్రస్తుత హిందూమతమునకు వేదవిహితమైన మత గ్రంథములు. ఇవి ఈశ్వరవాణిగా ఋషి ప్రోక్తమున వేలాది సూక్తముల కూడికను నాలుగు విధాలైన పేర్లతో వేదములు సృష్టిని అవతరింపబడినవి. అందు మొదటిది ఋగ్వేదము. ఇది ఆర్యులు మధ్యయేసియానుండి భారతదేశమునకు వచ్చే సమయమున ఋషులచే పూరింపబడినదవి చరిత్ర. ఇందు ఈ ఋగ్వేదము ఆర్ష రూపమైన ఈ భారతదేశమందే ఆర్యఋషుల వలన పూరింపబడనదని యింకొక వాదము. ఋగ్వేద, యజుర్వేద, సామవేద. అథర్వణ వేదములని ఈ నాలుగు వేదములకు పేర్లు.

ఋగ్వేదము :- ఇందు ఈశ్వరుడు హవిర్భుజ. జాతవేదన, యింద్ర, అగ్ని వరుణుడాదిగాగల పేర్లతో ఉచ్చరింపబడిన విషయము 1017 సూక్తములతో కూడిన 82 పన్నాలుగా పూరింపబడినవి. ఇది అదిని ఈశ్వరసంభూతమైన మహాశక్తి స్వరూపము. దానినుండి వెలువడిన సృష్టి, ఆ సృష్టికి కలిగిన మార్పుల వివరములుగలది.

యజుర్వేదము :- యజ్ఞయాగాది కర్మలను గూర్చి చెప్పబడు వివరములు గలది. కృష్ణయజుస్సు, శుక్లయజుస్సులని యిందు 40 అధ్యాయములు, 1886 శ్లోకములు గలదిగాయున్నది.

సామవేదము :- ఈ వేదవిహితమైన సూక్తములను ఉదాత్త అనుదాత్తములనే హెచ్చుతగ్గింపులతో కూడిన స్వరయుక్తములను నిరూపణ చేయు విధముగాయున్నది.

అథర్వణవేదము :- యజ్ఞయగాది కర్మలందు ఎవరు ఏయే విధములైన కర్మలు ఆచరించవలయునో అట్టి విషయములే కాక శత్రు

రూపమున ప్రయోగింపబడిన శాక్తేయ. క్షుద్రదేవతోపాసకుల శక్తిని నిర్జించగల మహత్తర శక్తివంతములైన ధ్వనులతో కూడిన ఋక్కులు నిరూపణ చేయునది.

పై వాటినుండి బ్రాహ్మణములని కర్మిష్ఠిరూపమున్న కర్మలను ఆచరించు విధానము తెలుపు విషయములు వేరుచేయబడినవి. వాటికి బ్రాహ్మణములందురు.

ఈశ్వర విషయాన్ని తెలుసుకొని తరించు మార్గమును తెలుపు వాటిని అరణ్యకములని, నిర్జనమైన స్థలమందు ఆశ్రమ వాటిక ఏర్పరచుకొని ఈశ్వర జిజ్ఞాసచేసి అభౌతికమైన విషయమును గ్రహించి నిరూపణ చేయబడినవి అరణ్యకములు. వీటినుండి ఉపనిషత్తులు విడదీయబడినవి. అవి 108 ఉపనిషత్తులుగా విడదీయబడినప్పటికి ప్రస్తుతము 12 మాత్రము కన్పడుచున్నవి. మొదటిది ఐతిరేయ ఉపనిషత్తు 2. కేషితకము. 3. బృహదారణ్యము. 4. ఈశావాసము, 5. కేన 6. ముండక 7. మండూక 8. తైత్రియ 9. ఖట 10. శ్వేతాస్వతరము, 11. ఛాంధోగ్యము 12. అష్టావక్రము, యివి ముఖ్యములు. ఇవి సృష్టియందు ఈ నాటికే కాకుండా యే నాటికిని ఖిలముకాని పరిస్థితులలోనున్న విషయము సువిదితమే.

వేదాంతము :- ఈ వేదములకు అంత్యమందు ధ్వనితూపమున వినబడిన వాక్కులు 4. 1. తత్వమసి 2. అయమాత్మ 3. ప్రజ్ఞానం బ్రహ్మ 4. అహంబ్రహ్మాస్మి. వీటి పరిణామము స్వయం బ్రహ్మన్న సందేహ.

తత్వమసి : అన్నప్పుడు తత్ = అది. త్వం = నీవు. అసి = అయితివి. దీనినిబట్టి నే ననేది తెలియరాని విషయమైనట్లు చెప్పబడుచున్నది. అప్పుడు అదిఏది అను ప్రశ్న రాకమానదు.

పరీక్ష—అది ఏలాగునయున్నది? అయమాత్మ—అయమాత్మ అన్నప్పుడు అయం = అది. ఆత్మ—ఆత్మ స్వరూపముగా యున్నది. అన్నప్పుడు ఆ ఆత్మస్వరూపము ఏలాగునున్నదో తెలుసుకోవలసిన అవసరమున్నది. ప్రశ్న :— ఆత్మను ఏవిధంగా తెలుసుకోగలము? ప్రజ్ఞానం బ్రహ్మ — పరిజ్ఞానం బ్రహ్మయన్నప్పుడు సాధనరూపమున తెలియబడు జ్ఞానస్వరూపమే. అనగా ఆత్మ స్వరూపము. బ్రహ్మగా నున్నది. అన్నప్పుడు దేనిని బ్రహ్మ అనవచ్చును. అనే ప్రశ్న రాక మానదు. ప్రశ్న:— ఏది బ్రహ్మగాయున్నది? అహం బ్రహ్మాస్మి. అహం = నేను. బ్రహ్మ = ఈశ్వరుడు. అస్మి = అయితిని. అన్న ప్పుడు తనలో ధ్వనించు నేనను శక్తిస్వరూపమే బ్రహ్మ కాబట్టి అది నాలోనుండుటచేత నేను బ్రహ్మను అని చెప్పగలుగుచున్నాడు. అట్లు చెప్పగలిగినప్పుడు నేను బ్రహ్మ అను రెండు రూపముల బేదాభి ప్రాయము కలిగించుచున్నపను ప్రశ్న రాక మానదు. అప్పుడు అదే సర్వమని చెప్పవలసిన విషయము వచ్చినప్పుడు ప్రశ్న— ఈ అహం ఏమైనది? స్వయం బ్రహ్మ న సందేహ అనగా నే ననునది బ్రహ్మ స్వరూపము అన్నప్పుడు తానే బ్రహ్మ.

ఇవి పై నాల్గు విషయములు నొకదాని తరువాత యింకొకటి పురస్కరించుకొని సద్గురు ప్రబోధమున విడమర్చి తెలుసుకొన్నప్పుడు యివి అన్నియు తనలోనివే అను సమాధానము రాక మానదు. అప్పుడు ఆ వ్యక్తిత్వము స్వయం బ్రహ్మన సందేహ అని చెప్పగలడు. ఇది వేదాంతముయొక్క మూలము పరిణామము కూడాను. దాని నిగూఢ శక్తి తెలుసుకొన్నవాడే సద్గురువు.



# అరిషడ్వర్గములు



మానవులలో ఈశ్వర విషయము తెలుసుకొని తరించవలెనను ఆశాభావము స్వాభావికముగ అంకురించియున్నది. అది తెలుసుకొనవలెనని ప్రయత్నించువారు ఆ రహస్యము తెలుసుకొనిన వ్యక్తియని నిర్ధారణ యయిన యప్పుడు ఆతని దరిజేరి గురువుగా నిశ్చయించి ముక్తి విషయము. దాని రహస్యము తెలుపవలసినదిగ కోరినప్పుడు గురుస్వరూపముగ నిరూపణమైన ఆ వ్యక్తి తన శిష్యునకు ఉపదేశించిన తరువాత కొన్నాళ్ళకు శిష్యునియందు వుద్భవించు వూహలను గూర్చి ప్రసంగము వచ్చినప్పుడు ఆ వూహలు సాయుజ్యమునకు భిన్నముగా యున్నప్పుడు వాటిని వుద్రేకింపచేయు శక్తులు ఆరు గలవని వాటిని అరిషడ్వర్గములని అందురని. అవి కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములుగానున్నవని. యివి శత్రు రూపములుగా యుండి మానవుని సాయుజ్యునిగా మారనివ్వక శత్రువులవలె అవరోధము కలుగచేయుచున్నవి గాన వాటిని నిర్జించినగాని అనగా ఖండించినగాని నీవు ఈశ్వర విషయము తెలుసుకొనుటకు అర్హుడవు కావని చెప్పి వాటిని నిర్జించు మార్గములు తెలుసుకొని వాటిని నీలో నుండి వేరుచేసినగాని నీవు ముక్తి పద స్థానమునకు చేరలేవని చెప్పచున్నాడు. కాని యీ అరిషడ్వర్గముల రూపములేమో వాటిని శత్రువులుగ గ్రహించి వాటిని ఖండించుట యేలాగునో వాటి ప్రశంసయే లేకుండా అవి శత్రువులుగ మానవులుగ నున్నట్లు చిత్రించి చెప్పుటలో శిష్యునిగయున్న వ్యక్తికి అవగాహన కాక తబ్బిబ్బయి తనకు సాధ్యము కాదని అది గురుమహాశయునికే సాధ్యపడినట్లు నిశ్చయించి అంధుడు కళ్ళున్న వానిని వెండాడినట్లు గురువుగాయున్న

వ్యక్తిని వెంటాడుచున్నాడు. యథార్థమునకు ఆ గురువు కూడా అంధుడే యని తెలుసుకొనలేక అనుసరించుచున్నాడు. జీవిత కాల మంతయు గురువుగాయున్న వ్యక్తిని వెంటాడినప్పటికిని తనలో నున్న అరిషడ్వర్గముల రూపములు అవగాహన కాక తబ్బిబ్బయి తానొక నికృష్ట జీవినని తనకు ముక్తి సాధ్యముగాదని నిశ్చయించి వాపోవు చున్నాడు. కాని గురువుగావుండి ప్రబోధము చేసిన వ్యక్తికి అరిష డ్వర్గములననేమో అవి మానవునిలో యే విధముగ యున్నవో అవి వుద్రేకించి మానవుని యెంత నికృష్టస్థితికి తీసుకుపోవుచున్నవో వాటి నిజస్వరూపము విమర్శించి చెప్పుటకు తెలియని పరిస్థితిలో ఆ గురువు వున్నాడని తెలుసుకొన లేకపోవుచున్నాడు.

మానవుడా! నీవు వుత్కృష్టమైన జన్మగా జన్మించితివి, ఉత్తమ మైన జీవివి, సర్వ ప్రపంచమునకు శ్రేష్టుడవు, నీకు మించినదేదియు లేదు. నీకు లొంగనిదే శక్తినైనా అవలీలగ స్వాధీనము చేసుకొన గలవు. సృష్టి సమస్తము నీ యధీనమందున్నది. కాని నీలో ఆవ హించిన అరిషడ్వర్గములనే మహాశక్తిస్వరూపములు వుద్రేకించి వాటి యొక్క విజృంభణ పురస్కరించుకొని మిడిసిపడి అజ్ఞానతిమిరమనే కాండ పటమున కప్పల అభౌతికమైన నీ శక్తిని కృంగదీయు బలీయ మైన అరిషడ్వర్గములను గూర్చి ఒకదాని తరువాత నొకటిగ స్వాను భవములోనికి తెచ్చుకొని నీకు నీవు విమర్శించుకొంటివేని నీ వెంతటి నికృష్టజీవిగా నుంటివో నీవు ఆశ్రయించిన గురు స్వరూపముగ విశ్వ సించుచున్న వ్యక్తి యెంత శూన్యుడో నీవు నీపరీక్షయందు నీవే తేల్చు కొన గలవు. నీవు ఆశ్రయించిన వ్యక్తి సద్గురువు అయినప్పుడు నీలో స్వభావములుగ ఆవహించియున్న కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములను మహా బలీయమైన శక్తులుగా మారి నిన్ను అజ్ఞాన తిమిర కూపమున పడద్రోసి జడ జన్మలకు తీసుకొని

పోషించుచున్న విషయము నీ అనుభవరూపములో నీకే తెలియబడునట్లు చేయబడిననాడు నీ గురువు సాయుజ్యుడు. నీవు సాయుజ్యమునకు అర్హుడవు.

1. కామము:- ఇది నీ ఆయుః ప్రమాణములో 16 వ యేట పుత్పన్నమైన 18 మొదలు 21 వ యేట పుద్రేకించుచున్నది. ఎప్పుడో యితే నీలో కామము పుద్రేకించినదో అట్టితరి స్త్రీకి పురుషునియందు పురుషునికి స్త్రీయందు యిచ్ఛారూపమైన కామము పుద్రేకించి భావములో మార్పు వచ్చుచున్నది. అందులో అనేక యిచ్ఛారూపములు పుట్టి నీ నిద్రావస్థలో దృశ్యముగ మారి నీ యెదుట తాండవ మాడుచు లోకమును మరపించి మానవ మర్యాదను అతిక్రమింపజేసి నీకు నీవే సాటివనిపించి నీవు చేయు ప్రతి కార్యమునకు అడ్డులేదనిపించి నిన్ను ఉన్మాదునిగ మార్చి తాండవ మాడించి ఆ పరిస్థితికి నిన్ను లొంగదీసి యితరుల దృష్టికి నిన్ను ఏవగించునట్లు మార్చి, నిన్ను నికృష్టమైన వానిగా చేయుచున్నప్పుడు అది నీకు తెలియని పరిస్థితిలో నిన్ను అధోలోకమునకు గొనిపోవుచున్నది. నీవు నికృష్టమైన, హీనమైన జీవిగ రూపొందుచున్నావు.

2. క్రోధము :- ఇది సదహంకారము దురహంకారమను రెండు రూపములు దాల్చియున్నది. అవి నీ విమర్శనకు వచ్చినప్పుడు నీవు అహంకారిగా నున్నప్పుడు నీకు నీ రూపమును తెలియనివ్వడం లేదు. తెలుసుకొన లేకపోవుచున్నావు. నికృష్టజీవిగ మారునిన్ను దురహంకార రూప మావహించి ఆ దురహంకారమునకే లొంగిపోయి అహంభావమునకు తావిచ్చి దానిని విషవృక్షమును పెంచునట్లు పెంచుచున్నావు. ఆ దురహంకారము ఆవహించినప్పుడు పూటలలో క్షణ క్షణమునకు వచ్చు మార్పులను విమర్శనమునకు తీసు

కొనివచ్చి దానినుండి విడి సమర్థించుకొనుటకు తావియ్యక ముందునకు ఆ శక్తి నడిపించుచున్నది.

దురహంకారమును ముందుపెట్టి ప్రపంచమును తన ఆధీనము చేసుకొనవలెననే అహం గర్వరూపమైన దర్పమున సృష్టిని లొంగదీయ వలెనను ఊహలకు లోనై దానిని తోడి మానవునియందు ప్రయో గించినప్పుడు అది క్రోధరూపము దాల్చినప్పుడు గర్వియై మిడిసిపడి రొమ్ము విరచి కావరమును రేకెత్తించి తన నడవడిని మార్చుకొన నియ్యని కారణమున దుర్జనుడవై మానవ పీడితుడవయి ప్రజాదృష్టికి హీనమైనవానిగా మారి శత్రుత్వము పొంది అనేక బాధలకు చిక్కు లకు లోనై కడకు ప్రాణత్యాగమో శత్రు నిర్జనరూపములో హత్యా కాండకు పాల్పడి కారాగారవాసమో, అటువంటి విషయము నుండి తప్పించు కొనుటకు కానల దాగుటయో దేశాంతరములకు పోయి అచ్చోట దాగి ప్రవాసియై నికృష్ట జీవితము గడుపు కాలము ఆసన్న మైనప్పుడు హేయమైన జీవితమును గడుపవలసిన స్థితికి వచ్చు చున్నావు.

3. లోభము :— మానవుడు సృష్టియందు వొక విశాలమైన భావ పరిణామము. అటువంటి మహత్తరమైన నీవు నీలో ఆవహించిన లోభత్వమునకు లోనై లోభివయి ప్రపంచకమందు అనుభవించగల సుఖ సముదాయములను అనుభవించుటకు అడ్డుదూరు నీలో ఆవహిం చిన లోభత్వము ప్రపంచేచ్ఛా విహారమునకు అడ్డుదూరి నీ జీవితము నీ మనుగడ నీచాతినీచముగా మార్చి హీనునిగా పరిగణింపజేసి. నీవు సంఘమునకొక పురుగులాంటివానిగా రూపింపచేయుచున్నది. అయి నప్పటికి నీలో నీవు నీయొక్క ధన కనక వస్తు వాహనాది సముదాయ ములు చూచుకొని ధనహీనుని చూచినప్పుడు నీలో నీవు అపహాస్యము చేసుకొనుచు నీ జీవితమును సాగించుచున్నావు. అట్టి నిన్ను చూచి

సంఘము పరిహాసించడమే కాక నిన్ను నీచముగ చూచునప్పుడు గ్రహించలేక నీ ధనమును చూచి మురిసిపోయి సంతృప్తి పడినను విశాల విశ్వములో నిన్ను గూర్చి పరోక్షమందు చెప్పుకొను కథలు కర్ణాకర్ణి కముగ ఆలకించినప్పుడు నీలోనున్న లోభత్వము నిరూపణము చేయుచు నీముఖస్తమున అనెడి మాటలు విని సహించలేక ఖేదపడి తేరుకొనలేక శాంతిలేని పరిస్థితిని నీవు నీ జీవిని నికృష్ట పరుచు చున్నావు.

4. మోహము :- మోహమనునది మానవునిలో అభౌతిక మైన మహాశక్తి, బలీయమైన దివ్యస్వరూపము. మోహము భౌతిక ముగ రూపొంది నిన్ను బలిగొనుచున్నది. నీలో యిమిడియున్న కామేచ్ఛ నిన్ను దానినుండి పైదొలగ నీయకున్నది. నీవు నీ యూహ లలో మోహరూపముగ నిర్మాణమై నిన్ను ఆహ్వానించి ఆహూయ మానమైన శక్తి నీ మీద ప్రసరింపజేసి నీయందు యిచ్ఛ కలిగించి మోహింపజేసిన రూపము భౌతికముగ నొక వ్యక్తిలో యిమిడి నీ యెదుట కనబడి సౌంజ్ఞరూపములో ఆహ్వానించినప్పుడు దానివి వెంబ డించి నిద్రాహారములు మాని కలతపడి ఊహాపరంపరలు నిన్ను తోచ నియ్యని స్థితి వికారములైన చేష్టలు నీ యందు నుద్భవింపజేసి నీ సర్వ స్వము కోల్పోవునట్లుచేసి కడకు ఊహించరాని హీనస్థితికి గొనిపోవు చున్నది. అట్టి స్థితి నీ పూర్వపు ప్రతిష్ట నీ గణనీయమైన గుణగణములు నీ వంశమర్యాద భంగపడి శక్తి వుడిగి ఆరోగ్యము చెడి జీవితము గడపు తెరవుగానక ఊహించరాని మాయా కర్మలకు లోనై ఆ కర్మలలో చేయు కార్యకలాపములు నీచములని ప్రపంచము నిన్ను దూషించినను పెడచెవినిబెట్టి ప్రపంచమున నీచునిగ తలపపడునట్లు చేయుచున్నది. కడకు స్మశానమునకు చేర్చి బూడిచేయుచున్నది.

5. మదము :- నీలో మదమనునది చాలా నిగూఢమైన స్థితిని మణగియున్నది. అది నీ ప్రతి నరములోను, ప్రతి రక్తబిందు

వులలోను, ప్రతి మాంస కండరములలోను యింతయే ప్రతి ఎముక యందును మణగియున్నది. దాని బలీయమైన శక్తి ప్రతిలిప్తకాలము నిన్ను తీవ్రించి వ్యథ పెట్టుచున్నది. నీ కండ కావరములయందు నుద్రేకించి నెదుటివానిని హింసించుచున్నట్లు ప్రేరేపించుచున్నది. ఇట్టి స్థితిలో నొకప్పుడు నీ బుద్ధికివచ్చి యిది దుర్మార్గమని తెలిసి దీనినుండి నీవు తొలగదలచుకొందువు. ప్రయత్నము చేసి అటువంటి విషయములు వచ్చినప్పుడు దానిని నిర్జించగలనని ధైర్యము కలిగినప్పటికి అయాచితమైన సంఘటనలు వచ్చి నీలో మణగియున్న దర్పమును వుద్రేకింపజేసి నీ పరిజ్ఞానమును మాయంజేసి అజ్ఞానమను మహా చీకటిలో పడద్రోసి నిన్ను కన్నుగాననీయని కాడాంధకారమున బడియున్న నీవు బోర్లపడి నానా హింసలకు లోనై నిన్ను హీనజీవిగ మార్చి ప్రజాదృష్టిలో నీవు నొక నీచ దుర్మార్గునిగ దలంచబడునట్లు చేయుచున్నది.

6. మాత్సర్యము :- మాత్సర్యమునందు ఘోరతి ఘోరమైన అపరాధము నిండియున్నది, అది యెటువంటి జ్ఞానరూపుడైనప్పటికి అఖౌతికమైన స్థితిని ఆవహించి యీర్ష్యారూపమున ప్రజ్వలించుచున్నది. ఇది యెదిరివాని మంచినిచూచి సహించ నియ్యని పునాదిపై మోపి యీర్ష్యా సౌధములను నిర్మించుచున్నది. ఇది నొక విద్యావంతునిజూచి తనకన్న అధికమైన విద్యాధురీణత నాతనియందు పొడగాంచినప్పుడు యేవగింపు పుట్టించి ఆతనికి వాదమందున నోడించి తన ప్రజ్ఞ చాటించవలెనని ప్రేరణ చేయును. యెదిరివానితో నోడినప్పుడు మాత్సర్యము పెరిగి హత్యవరకు ప్రేరేపించును. పేరు ప్రతిష్టలు కలవానినిచూచి నాతని ప్రతిష్టకు భంగము కలిగించి మాయింపచేసి ఆ ప్రతిష్ట తాను పొందవలెనను యీర్ష్యాళుడై యెదుటివానిమచ్చ మాయింప జూచును. కలిమి కలవానిని చూచి సహించలేని ఆవేదనపడుచు వికారజ్వాలలు అతని శరీరమును దహింపచేయునట్లు

చేసి వానిని తనతో సమానముకాని స్థితిని ఆ భాగ్యవంతుని దూషింప సమకట్టి మోసమున అతని కలిమి హరింపజేయ ప్రేరే పించును.

తనసంతతికన్న యెదుటి సంతతి విద్యాసంపన్నులుగ నున్న వారిని చూచి వారియందు కళంకమాపాదింప జేయునట్లు యితరులను ప్రోత్సహించుచు లోకమందు తనచే బలీయమైన పన్నాగములు పన్నించును. యెదిరివాని సుఖసౌఖ్యములు విద్యాయశస్సులు నిపుణతను చూచి నిన్ను దుఃఖాక్రాంతునిగ చేయడమే కాకుండా నానా విధములైన నూహలకు లోనుచేసి అనేక విధములై నదుష్కృత్యములు చేయించుచు ప్రజాదృష్టికి వచ్చినప్పుడు నీ వాతి నీచునిగ పేర్కొన్నట్లు చేయడమె కాకుండా నిన్ను వ్యధల పాలుచేసి పాతాళమునకు దింపి సమయింప చేయుచున్నది.

ఈ పై రీతిని అరిషడ్వర్గములు నీయందు ఆవహించి యున్న సంగతి నీ యనుభవమందు తెలియ వచ్చినప్పుడు జ్ఞానరూపివగు ఆత్మ యొక్క పరిణామము. వాటికి అంటని ప్రశక్తిగా నున్నప్పుడు ప్రతివిష యము నీ విమర్శనకు వచ్చును. నీలోనీవే ప్రశ్నించుకొని చర్చించి దాని అంత్యపరిణామము తేల్చుకొని, ఆ పరిణామము ప్రమాదముగా యున్న పుడు సహనమను రూపమున వాటిశక్తి నీ ఆత్మకు ఆవహింప కుండు నట్లు చేసుకొని వాటినుండి వచ్చు మంచినే ఆశ్రయించి లోకమందు నుత్కృష్టమైన జీవిగ మనెదవుగాక.

ఇవి మానవునితో శత్రువులుగా పరిగణింపబడు చున్నవని ఆధ్యా త్మిక విషయముగ చెప్పు వేదాంతుల మాట వీటిని నిర్జించ వలసినదని (సంహరించమని) చెప్పు పడికట్టు మాటలకు అర్థము చేసుకొనలేక నిరాశ పడక ప్రతివిషయమును ప్రతిఘట్టమందు ఓర్పుతోకూడిన శాంతమందు

యోచించిదానినుండి వచ్చుమంచినే యనుభవమునకు వచ్చునట్లు చేసుకొనిన నీకు యీ సృష్టియందు యేవిధమైన కళంకములుగాని బాధలు గాని దుర్యశస్సుగాని కష్ట నిష్ఠురములుగాని రావని నీకునీవే యను భవములో నిర్ధారణ చేసుకొనగలవు.

పంచభూతములనగా, నిప్పు, నీరు, గాలి, భూమి, ఆకాశము, వీటిలోనున్న శక్తి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు యివి నొకదా నిలో నొకటి సమ్మిశ్రితమై ప్రతియొక్క భూతములో యీ యైదుశక్తులు ఆత్మరూపముగ విరాజిల్లు పంచభూతాత్మక మనబడుచున్నట్లు యీ అరిషడ్వర్గములలో యున్నశక్తులు కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు మానవాత్మయందు అభౌతికమైన శక్తి స్వరూ పములు నొకదానికొకటి సంబంధముకలిగి శత్రురూపములలో విజృం భించి మానవుని నికృష్టజీవిగ మార్చి వేయుచున్నవి. ఎప్పుడైతే మానవునిలో కామేచ్ఛ కలిగినదో అదికార్యసిద్ధికి రానప్పుడు దానిలో నుండి క్రోధముతప్పక పుట్టి తీరును. ఎప్పుడైతే క్రోధము ఉద్రేకించి నదో లోభరూపమైన స్వార్థ మాతనిని ఆవహింప మోహదేవతా మంత్రముగ్ధుడై చలించిన క్షణమందే దర్పమను మహాభూతము కౌగిలించి యీర్ష్యారూపమున హత్యలవరకు తీసుకొని పోవును. గాన మానవజన్మ సార్థకముజేయ ప్రయత్నించు నీవు వీటి నన్నింటిని అతి సూక్ష్మాతి సూక్ష్మముగ విమర్శించి పరివర్తన తేల్చుకొని వాటి బారినుండి పైదొలగు మార్గము తెలుసుకొందువుగాక.

ఈ పై విషయములలోనుండి తొలగిన విషయము తెలుసుకొన్న వ్యక్తియే జ్ఞానసాధనకు అర్హుడు. ఇది జ్ఞానికి పునాది.



# అరిషడ్వర్గముల స్థాయి

అరిషడ్వర్గములను కామ, క్రోధ, లోభ, మోహ, మద మాత్సర్యములను అభౌతికమైన మహాశక్తులకు లోనై వాటిధాటికి లొంగిపోయి మునిగి తేలలేక, నొక్కొక్కప్పుడు నీలో నీవే విచారించు కొని తేల్చుకొనలేక మీన మేషములు లెక్కపెట్టుచు వాటి ప్రభావ మున, నీవు చేసిన పాపకార్యములు అకృత్యములు జ్ఞాపకమునకు రాగా నొకదాని తరువాత నింకొకటి స్మరణకు వచ్చును. అవ్యవధిగ కంటతడిపెట్టుచు భోరున ఏడ్చుచు, నికృష్టజీవినని తలపోయు స్త్రీజన్మను చూచి నీలో నీవు అసహ్యించుకొనుచున్నావు. కొంతవడికి తేరి తెప్ప రిల్లి. పూరటపడి నా జన్మ యిలా పోవలసియున్నది. కాబోలునను కొని ఘటన తప్పి ఎవ్వడు నడువలేడు. ప్రకృతివిధానము విధికన్న బలీ యమైనదని నిశ్చయించి మరుజన్మలోనైనా పుణ్యముచేసి పుణ్యలోక ప్రాప్తమను ముక్తిని పొందవచ్చునని స్థాయిపడి యీ జన్మ సాఫల్యము నేరక ఐహికమునకు వదలి అస్వతంత్రుడవై అజ్ఞానిగ మారి పాలలో నున్న జ్యోతి నశించునట్లు నాశనమగుచున్నాడు.

ఇట్టి స్థితికి వచ్చిన నీవు నీలోవున్న జన్మ సాఫల్యము చేసుకొను వాంఛ నీ వూహకు తెచ్చుకొని విమర్శించితివేని నీలో నీవు స్థాయిపడి యోచించితివేని అభౌతికమైన ఆత్మశక్తి ప్రబోధరూపంలో నీవు వేటి ఉధృతములచేత ఈ పాపకళంకమైన కార్యములకు పాల్పడితివో అవి అరిషడ్వర్గముల విధానమున నున్నవని తెలుపుతూ వాటిని స్థాయి చేసుకొన్న తిరుగ మంచిమార్గమునకు వచ్చి సాయుజ్యము పొంద గలవని మనస్సు చెప్పక చెప్పును.

జన్మరహితము కోరే మానవజన్మ అది తెలుసుకొనవలెనను సంకల్పముతో ప్రయాణించు వ్యక్తిని అట్టి విధానము ప్రబోధము

చేయు గురురూపములో నున్న వ్యక్తులు నీలో కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములనెడి మహాశక్తులు గలవని వాటియొక్క దుష్కృత్యముల వలన నీవు యేనాటికి ముక్తిపొందలేవని అందుచేత మొట్టమొదట నీ జ్ఞానసాధనా ప్రయాణమును అవరోధించు షట్శతృవు లను నిర్జించు విషయములు తెలుసుకొని వాటిని నిర్జించినగాని నీకు ఆధ్యాత్మికములో స్థానములేదని యిది ముక్తికై ప్రయత్నించు జ్ఞాన సిద్ధికి మొదటి ఘట్టమని చెప్పి వాటిని యే రూపములో యే విధముగ నాశనము చేయవలెనో చెప్పువానికే తెలియని కారణముచేత యేవో పడికట్టుమాటలుచెప్పి నమ్మింపజేసి అవి తెలుసుకొనే కాలము నిర్ణ యించినంతవరకు అనేక విధముల సేవలు చేయించుకొని ఆ నిర్ణీత కాలము పూర్తి అయిన తరువాత నీలోనున్న అరిషడ్వర్గములు తొలగి పోయినవనియో, యింకా తొలగలేదనో, ఆ సమయపరిస్థితికి సరిపోవు నట్లు చెప్పి తప్పించుకొనుచున్నారు. యదార్థమునకు యీ అరిష డ్వర్గములు ఖడ్గమునకు బలియగు భౌతికపదార్థములవలె ముక్కలు కానేరవు. ప్రబోధరూపమున మంత్రము సాధించిన సాధకుని విడిచి పెట్టిపోవుననిగావు. అవి దుస్స్వభావ సుస్వభావములుగ మానవుని యందు స్వాభావికముగ అంతర్లీనమైయున్నవి. అవి వూహా రూప ములో విజృంభించి కార్యరూపమునకు వచ్చిననాడు అది దుస్స్వభావ మయిన విషయము, హత్యలవరకు వచ్చుచున్న సంగతి వెనుకటి ఘట్ట ములో చెప్పబడినది. వీటిలో మొదటిది కామము.

కామము :— ఇది కోరికయని కోరికల పరంపరగాయున్నదని ఆ కోరికలు సమయింపజేసినగాని యిది నిర్జింపబడదను మాటలు కేవ లము అభాసములు, కామమనునది కోరికలకంటె బలీయమైన సంభోగ రూపమైన కామేచ్ఛ. దానిని యే మానవుడు యేలాంటి పరిస్థితిలోను దూరము చేయవలెనన్నా దానినుండి తొలగవలెనన్నా సాధ్యముకాదు.

అది ఖండించుటకుగాని సమయింప జేయుటకుగాని సాధ్యముకాని అభౌతికమైన మానసిక శక్తి. దానిని ప్రపంచములో స్థాయి చేసుకొనుటయే యేకైక మార్గము. నీవు నీ జీవితములో కామము వుద్రేకించు వయస్సున నీలోవచ్చు వూహలను విమర్శించి (సంభోగేచ్ఛా విషయములో నీవు పురుషుడవైనచో స్త్రీ రూపమునుండి, నీవు స్త్రీ వైనచో పురుషరూపములో కలుగు వూహలు) ఆ సమయమందు నీ అంతర్యమున రూపించిన స్త్రీ రూపమును వూహించి ఆమె అన్య స్త్రీగా యున్నప్పుడు ఆమెయందు భోగేచ్ఛయయిన తృష్ణతీర్చుకొనవనెనవి ఆశించి ఆమెను ఆశించినప్పుడు నీకు సాధ్యముగాని విషయంగా పరిణమించినప్పుడు ఆ స్త్రీ యొక్క ఆత్మీయులు నీయందున్న దుష్టయూహను గమనించినప్పుడు నీ స్థితి యేవిధముగ పరిణమించునో ఊహాంతమందు తెలుసుకొనిన నీ గౌరవమునకు భంగము కలుగుటయేగాక నీ యసువులకు ముప్పువాటిల్లుట సంభవించునని నిశ్చయించి ఆ విషయము తేల్చుకొన్నవాడవై నీవు అగ్నిసాక్షిగ పరిగ్రహించిన వ్యక్తియందు ఆ తృష్ణ తీర్చుకొనిన ఆ కామవిషయము స్థాయికి రాగలదు. ఈ విధముగనే స్త్రీ కూడా అన్యపురుషుని వాంఛించుటయందు కలుగు యిక్కట్లను అగచాట్లను ఊహకు రానిచ్చి దాని పరిణామము తేల్చుకొని అగ్నిసాక్షిగా వచ్చిన భర్తను ఆరాధ్యదైవంగా ప్రేమించి పూజించినచో స్త్రీయందు కామము స్థాయికి రాగలదు.

క్రోధము :- ఎప్పుడయితే దుర్మార్గదర్శియై కామాంధుడై పోవు మానవుడు తన తృష్ణ తీరనప్పుడు ఆ కామశక్తియందుండే క్రోధము అహంకార రూపమున స్వాభావికముగ కలుగుచున్నది. ఇది మానవునియందు రెండు విధములు. ఒకటి సదహంకారము. రెండు దురహంకారము. సదహంకారమనునది మానవునిలో పట్టుదల అనే సద్విషయమైన జిజ్ఞాస. అతని జీవితమును వుత్కృష్టమైన స్థితికి

తీసుకొనిపోయి ప్రపంచమందు ప్రఖ్యాత పురుషునిగ పరిగణింపజేసి ఖ్యాతి వెలార్చునొక దివ్యసాధనము.

దురహంకారము :- ఈ దురహంకారి కామతృష్ణయందేగాక లోకవిషయములలో తనకు సంబంధములేని విషయములలోకూడా కల్పించుకొని యితరులచే దూష్యునిగ ఉచ్ఛరింపబడి పలుయిక్కట్లకు పాల్పడడమే కాకుండా దుర్మార్గుడనే హీనస్థితికి దిగజారి తన జీవితమును నాశనము చేసుకొనుచున్నాడు. కావున తనలో క్రోధరూపమున జనించిన వూహను చక్కగా విమర్శించి దాని అంత్యము విష పరిణామముగయున్న సంగతి గ్రహించి నీ పరోక్షమందు నీ నామము మంచి ఉపమానములో పేర్కొనబడునట్లు ప్రయత్నించి బడసివేని యీ దురంహకార రూపమైన క్రోధము సదహంకార రూపమైన పట్టుదల అనే సాధనములో స్థాయిస్థితికి రాగలవు.

లోభము :- లోభమనునది మానవునియందు కానరాని భిషగ్వర్యులకు లొంగని మహావ్యాధి. దానిమూలమున లోకములో అపఖ్యాతి వచ్చుటయే గాక హేళనచేయువారి పలుకులు ఆలకించినప్పుడు నీవు నీ మనస్సులో పడువ్యథ యింతయని కొలచి చెప్పుటకు వీలుండదు దానిని నీలో నీవు స్థాయిచేసుకొని నీకున్న ధనఘనత లెక్కించుకొని మురిసి తబ్బిబ్బయి లేని ఆనందము తెచ్చుకొని సంతసింపజూచెదవు. కాని నీలో అది కొంతసేపుండి సమసిపోవు విషయము చూచి నిన్ను గూర్చి లోకులు చెప్పుకొనుమాటలు తలపునకు వచ్చి ఖేదపడక నుండ లేవు. అట్టి సమయమున నీ మనస్సులో నీ మరణము తరువాత భూ ధనరాసుల గతియేమిటియని వూహించితివేని వాటి పరిణామము నీవు తెలుసుకొనుటకు సాధ్యముగాదని అదా తెలుసుకొనుట కల్లయని నీ మనసు నీకే సాక్ష్యమిచ్చును. గాన నీవార్జించి కూడబెట్టిన ధనము నీ దారా పుత్రాదుల జీవన పరిణామమునకు ఉపయోగించి దానికి

మించినది యితరుల దృష్టికి మంచికార్యముగ తోచుదానియందు ధారాళముగా ఖర్చుచేయుము. అది నీ శక్తికి మించనీయకుము. నీ ఆర్జనలో దానమునొక ముఖ్యవిషయముగ పెట్టుకొని యేచోట దానము చేసిన పుణ్యము జన వశీకరణ కలుగునో ఆ చోట నీ ధనమును తగిన రీతిగ ఖర్చుచేయుము. ఖర్చుచేసేముందు దాని అంత్యపరిణామ మేమిటో తెలుసుకొని అది నీ యశస్సుకు దోహదమిచ్చునట్లున్నప్పుడు నీ శక్తికి మించకుండా దానము చేయుము. నీవు చేసిన సహాయసంభూతమైన దానము పొందినవారి ఆత్మలనుండి వచ్చిన ఆశీర్వాదము నీ ఆయుష్షును భాగ్యమును, సంతతిని మంచియశస్సుతో కూడిన ఘనతకు వచ్చుటయే కాక, నిన్ను సంఘము గౌరవాతీతమునబెట్టి నీకనేక విధాల తోడ్పడ గలదు. నిన్ను ధర్మాత్మునిగ నీ పరోక్షమున ప్రజలచే కీర్తించబడి పొగడబడ గలిగిన నుత్కృష్టమైనవాడవుగా కాగలవు.

మోహము :- మోహమనునది అభౌతికమైన దివ్యశక్తి. దాని దుష్టవర్తన మానవునిలో అపురూపమైన ఊహాజన్యము. అతని దృష్టికి యీ సృష్టియావత్తు నొక ఉవిద (స్త్రీ) గ రూపించి కనులకు చీకట్లు కమ్మించి నిన్ను మదాంధునిగ మార్చి సర్వస్వము కోల్పోవు స్థితికి దిగజార్చి జీవితమును మరపించి మురిపింపజేసి అధోముఖముగ ప్రయాణము చేయించి నాశన స్థితికి గొనిపోవు దుష్టదేవతాశక్తి. ఈ స్థితినుండి మానవుడు మారవలెనన్న సృష్టియావత్తు అగ్నిసాక్షిగ ప్రతి గ్రహించిన భార్యయందే నిరూపణచేసి ఆమెయందు ప్రేమతోకూడిన ఆప్యాయత అపారమైన ఆనందము వెదజల్లునట్లు ఆమెయందు చూపించిన ఆమెను శీలవతిగ మార్చుడమే గాకుండా తానుకూడా శీలవంతుడై మానవదృక్పథమందు అపరదేవతగా పూజింపబడు స్థితికి రాగలడు ఆ వచ్చిన ఉచ్ఛస్థితిని స్మరణకు తెచ్చుకొంటూ ఆ జీవితమునకు నీచ స్థితి అంటకుండా చేసుకొనుటకు ప్రయత్నించును. ఆతని యందు

భక్తితోకూడిన విశ్వాసము ప్రపంచములో తనకు, సంభవించడమే కాకుండా యీ మోహమందుగల హీనస్థితిని విమర్శించుకొంటూ వాటినుండి తొలగు మార్గము అన్వేషించి సాయిజ్యమును పొందు మార్గమును వెదకుటకుగల అవకాశమును కల్పించుకొని బడయుకోరిక జనించును. ఈ స్థితికి వచ్చిన వ్యక్తియందు దుష్టమోహము సమయింపబడు ఈశ్వరవిషయము తెలుసుకొని తరించు స్థాయికి రాగలదు.

మదము :— దీని ప్రభావము మానవునియొక్క కండరములందు, నర పటుత్వమునందు, రక్తపు బిగియందును, ఎముకల ధృడత్వముపై మోసి మానసికమైన అహంభావమును గ్వరముపై మోసియున్నది. దీనియందుగల సౌష్టవము మానవునిలోగల అరిషడ్వర్గములన్నింటి శక్తులను ఆహూయమానము చేసుకొని ఉద్రేకించి యెదిరి విషయమునకు తనకు లోబడునట్లు చేసుకొనవలెనను నూహాశక్తి. ఇది మానవునియొక్క బుద్ధి జడత్వమును ఆకరముచేసుకొని యితరులపై ఉద్వృత ప్రభావమును చూపసమకట్టును. ఈ విధమైన దేహబలమును చూసి తనకన్నా తక్కువ బలముగలవారిని ఓడించినప్పుడు తాను పొందు ఆనందమునకు మేరయుండదు. కాని తనకంటె బలముగల వ్యక్తిని నొకప్పుడు ఎదుర్కొని ఓడినప్పుడు దుఃఖాక్రాంతుడై కృంగి ఈర్ష్యాళుడై నాతనిని సమయింప సమకట్టి హత్యాకాండవరకు పోయి అది నెరవేరిన తరువాత తనకు కలిగిన న్యూనతలో మ్రగ్గి నశించును. నీవు ఈ దర్పమను మహాభూతమునుండి తొలిగే సంకల్పమున్న దర్పరూపములో నీకు కలిగే వూహలన్ని నొకదాని తరువాత యింకొకటి విమర్శించి యీర్ష్యారూపములో నీ మనస్సునందు హత్యలవరకు రానిచ్చి ఆ చోట నీ జీవిత పరిణామమును విమర్శించితివేని నీకంటె బలవంతునిచేత నిర్జింపబడుటయో హత్యచేసిన విధానములో ప్రభుత్వశాసన నురికంబమునెక్కుటయో జరుగునను విషయమునకు

వచ్చినప్పుడు ఆ పరిణామము నీ కన్నులకు కట్టినట్టుల గోచరించక మానదు. కావున ఆదిలోనే నీవు చేయు సమకట్టు ప్రతి విషయము దాని పరిణామము తేల్చి అట్టి పరిణామ స్థితి రాకుండా నుండునట్లు నీ జీవితమును మలచికొందువేని నీ దర్పమను మహాభూతమును నీకాళ్ళ క్రింద త్రొక్కి సమయింపచేసి శాంతిని పొందెదవు.

ఇట్టి శాంతి రావలెనన్న మదము ఉద్రేకించుటచే కలుగు మంటలను ఓర్పు అను జలముచే నార్పుము. నీకు నష్ట పెట్టునప్పుడు. నీకు కష్టపెట్టినప్పుడు అహంకారముతో కూడిన రక్తము మదముతో కూడి నిన్ను దౌష్ట్రునిగ మార్చు స్థితి కలిగినప్పుడు నీవు నష్టపడి నప్పుడు ఈశ్వరుడు యిచ్చువాడున్నాడని తలపునబెట్టి కృషి చేసికొంటివేని దాని ప్రభావము నీవు నష్టపడిన దానికంటె పలురెట్లు లాభము అబ్బగలదు. నీకు కష్టము కలిగినప్పుడు కష్టపెట్టినవానిని పరమాత్మ దండించునని స్థాయిరూపములో నోర్చుకుంటివేని యే హానియు లేక నీ జీవితము సుఖముగ నుండి నీ మనుగడ తొందరపాటు చెందదు. నిన్ను కష్టపెట్టినవాడు ఈశ్వర కృపచే నింకొకనిచేత బలీయమైన కష్టమునకు పాల్పడును. నిన్ను కష్టపెట్టినవాడు అతనికన్న దురాత్ముని చే కష్టపడి మడసిపోవును. ఈ విషయము నీ అనుభవములో చూచినప్పుడు నీ ఆత్మ శాంతియుతముగ చల్లని చూడ్కులతో వీక్షించును.

ఈ పరిణామమును గని లోకులు నీ వోర్పునుజూచి హర్షించెదరు. నీ మదముయొక్క స్థాయిని తిలకించి నీ వానందించెదవు.

మాత్సర్యము :- మాత్సర్యము యీర్ష్యా రూపముననున్నది. ప్రతి మానవునియందును స్వాభావిక సంపత్తిగనున్నది. తనకంటె ఆధిక్యము యెదిరివానియందు కనపడినప్పుడు అది స్వాభావికముగ నుద్రేకించుచున్నది.

తనకంటె వున్నతస్థితిని చూచినప్పుడు, తనకంటె సుఖభోగ మైశ్వర్యము లనుభవించు వారిని గన్నప్పుడు, తనకంటె మించిన విద్యా పాండిత్యాది ప్రతిభావంతులను డాసినప్పుడు, వారు తనకంటె వున్నత స్థితియందున్నారని మాత్సర్యము తన ప్రభావము చూపి నిన్ను యీర్ష్యాళునిగ మార్చి అశ్రువులను రాల్చునట్లు చేయు చున్నది.

అటువంటి మాత్సర్యమును మాయింప జేసుకొను తలంపుగల వాడవేని ప్రతివిషయము పై చెప్పిన విధముగ విమర్శించి దుష్కీర్తికి పాల్పడజేయు మాత్సర్యమునకు భయపడి ఖేదపడుటకంటె యీర్ష్యను పట్టుదలగ మార్చి నీ మనస్సుకు రానిచ్చి తన దృక్పథములోనున్న నొక ధనికుని జూచి బాధపడుటమాని అతని జీవచరిత్ర తెలిసికొని యేరూప మున యేతీరున నతడు ధన, కనక, వాహన సంపత్తిగల వాడైనాడో తెలుసుకొని ఆ రీతిగ తన స్థితికి తగిన విధానములో ప్రయత్నించి నప్పుడు నీవుకూడా అటువంటి స్థితికి వచ్చుటకు సావకాశ మున్నదన్న సంగతి తేల్చుకొనగలవు.

ఒక పేరు ప్రతిష్టగల వ్యక్తివైపు నీ చూడ్కులు మలిపినప్పుడు నీవు ఆతడు ప్రకృతిలో యే కార్యము యే సహాయము చేయుటచే ప్రజాలోకములో నటువంటిపేరు ప్రతిష్టలు వచ్చినవో తెలుసుకొని నీవు కూడా నా విధానాన్ని యనుసరించిన నిన్నుకూడా ప్రజాలోకము కొనియాడగలదు. నీకు విద్యాధురీణుడైన పండితుడెదురైనప్పుడు దానివలన నాతనికి కలిగే గౌరవమర్యాదలు నీ దృష్టికి వచ్చిన యతనిని చూచి మత్సరుడవై బాధపడుటకంటె నీవుచూడ ప్రయత్నించిన సఫలీకృతుడవుగాగలవు.

నీ వయస్సు మించి నీకు విద్యనేర్చుకొనుట సాధ్యముగాకున్న ఆ బలీయమైన ఊహా చెదరనీక నీ సంతానమందు అశ్రద్దచూపించిన

వారు మేధావులై బుద్ధిగలవారై యున్న వారియందు ఆ విద్య జ్ఞాన రూపములో ప్రవేశించి వారిని విద్యాధురీణులుగ మార్చినప్పుడు వీరికి తండ్రిగాయున్న నీకు విద్యావాహినుల తండ్రియను నామము ప్రజలలో కలుగును. ఆ సమయమున ఆ విధమైన ఈర్ష్య తొలగిపోవును.

ఇట్లే సంతాన ధన కనక వస్తు వాహన సుఖ భాగ్యాది విషయాలలో నీకు కలిగే ఈర్ష్యను పట్టుదలగ మార్చి అవి నీవు బడయుటకు నేర్చితివేని నటువంటి పట్టుదల నెరవేరినప్పుడు నీ యీర్ష్యాశ్రువులు ఆనందాశ్రువులుగ మార్చి మాత్సర్యము సమసి పోయిన స్థితికి రాగలవు.

ఈ అరిషడ్వర్గములయొక్క మహాశక్తులు ప్రతిసమయమందును మానవునియొక్క బుద్ధివికాసమైన తెలివిని కలతబెట్టి నొకదానికొకటి అనుసరణీయమై దుష్కీర్తికి పాలుసేయు సమయమున పై విషయాలు జ్ఞప్తియందుంచుకొని తనలో ఆసాంతముగ విమర్శించి నీ జీవితము ఆదర్శప్రాయముగ మార్చి నిన్ను యోగ్యునిగ ప్రజలు కొనియాడు స్థితికి రాగలవు.

# మ త ము

అది మానవత్వములో మతమనునదిలేదు. జాతీయత మాత్ర మున్నది. ఆది మానవులు యే యే భూభాగములకు చెంది నివసించి చుందురో ఆయా భూభాగముల పేర్లతో జాతీయతగ ఏర్పడి, యీ నాటికి అదేవిధముగ జాతీయతగ పిలువబడుచున్నది. ఆయా ప్రాంత ములలోనున్న మనుష్యకోటి సమానముగ నుండి బుద్ధియొక్క వికాస మును తెలిసి పరిణామము పొంది ఉత్కృష్టనికృష్టములకు విభాగములు సంఘములుగ మారి ఆ సంఘసమూహములపై అధికారము సంపా దించిన వ్యక్తి నాయకునిగ యేర్పాటై ఆ యా ప్రాంతములను నొక రాజ్యముగ పరిపాలనా పద్ధతులకు లోబడి, ఆ రాజ్యాంగ విధానమునకు కావలసిన హంగులు సమకూర్చబడి అవి శాసనములుగమారి పరి పాలనా రూపములో కాలము సాగిపోవుచున్నది. ఆ సమయమందే యాజమాన్య, బానిస విధానము ఏర్పడినది. ఈలాంటి పరిస్థితిలో కాలము మారి హద్దులుఏర్పడి ఆ హద్దులు రక్షించుకొను భారము చక్రవర్తియో, మహారాజోయనబడు వ్యక్తియొక్క భుజస్కంధము లపై మోపబడి యున్నది. యీలాంటి పరిస్థితిలో మానవుని యందు ఈశ్వర విషయమును తెలుసుకొను ఆధ్యాత్మికచింత మొలకెత్తి ఆ అభౌ తికమైన మహాశక్తియొక్క పరిణామము దాని ప్రాతిపదికము తెలుసు కొన ఆవేదన కలిగిన కాలమందే వేదరూపమున ఈశ్వరవాణి మానవ రూపమున ధ్వనింపబడెను. ఆర్యులనే మానవ శాఖారూపములో భారతదేశమున స్థిరపడి ఆర్యవేద విహితమైన మతమనే పేరున స్థిర పడినది.

మతమనగా మానవుని బుద్ధియొక్క చైతన్య నిర్ధారణయే. ఆ తరువాతనే భారతదేశమందు రాజ్యాంగరూపములో యజ్ఞ

యాగాది క్రతువులు, బలులు యేర్పడి కార్యరూపము దాల్చినవి. ఆ కాలమందు ఆదిభారతీయులందుగల శాక్తేయమతము (క్షుద్రదేవతోపాసన) ను కాపాలికమతముకూడా క్రమక్రమముగా వేదమతముతో పాటు వృద్ధిపొంది ఈ ఉభయమతాలు విగ్రహారాధన రూపంలో ఆరాధించు ఆచారము కలిగినది, ఇది యావత్తు సృష్టి ఆయా దేశములను యనుసరించి ఈశ్వర, పైశాచిక మతములుగమారి విడిపోయి రెండుభాగములుగ ఏర్పడినవి.

పైశాచిక రూపమైన శాక్తేయమత విగ్రహారాధకులకున్ను, ఈశ్వరయేకత్వ ప్రాతిపాదితమైన మతములకున్ను, మధ్యయుద్ధరూపమున హత్యాకాండ జరుగుచుండెను. కాలము గడచినకొలది భారత దేశమందు అవతారరూపములోను, అరబ్బుదేశమందు ప్రవక్త రూపములోను యీ పైశాచికశక్తి ఆరాధనను నాశనముచేయ సమకట్టిరి.

భారతదేశ చరిత్రయందు దశావతారములయొక్క చరిత్ర భాగవత వాఙ్మయమందు తెలుపబడినది. ఇప్పటికిని భారతదేశమందు వేదవిహితమైన ఈశ్వరవాణి చిరస్థాయిగనుండి హిందూమతముగ మారి, తాత్విక ఈశ్వరరూప విగ్రహారాధనములో మిళితమై ఆరాధనారూపంలో ధ్వనించబడుచున్నది. అది హిందూమతమనబడుచున్నది.

అరబ్బుదేశమున ఈశ్వర యేకత్వ ప్రతిపాదితమైన మతము ప్రవక్తలరూపంలో ఈశ్వరవాణి ధ్వనింపబడి చాటబడినది. నలుగురు ప్రవక్తలు ఆయా మతములకు కారకులైయున్నారు. అందు జబ్బూరు దావీదు ప్రవక్తనోటను, తౌరాయత్ మోసే ప్రవక్తనోటను, ఇంజీలు క్రీస్తునోటను, ఖురాను శ్రీ మహమ్మద్ వారినోటను ఈశ్వరవాణి ధ్వనింపబబడినది.

దావీదు కాలమునాటి "జబ్బూరు" గ్రంథము యిప్పటి కాలములో కనబడుటలేదు. (ప్రచారములోలేదు) మోసేనోట ధ్వనింపబడిన "తౌరాయతు" యూదుల మతముగ ప్రపంచములో యీనాటికి యున్నది. క్రీస్తు, అతనియనుచరులచే చెప్పబడిన "ఇంజీలు" (బైబిలు) క్రైస్తవ మతముగ విశ్వవ్యాప్తముగ నున్నది. శ్రీ మహమ్మద్ ప్రవక్తనోట ధ్వనింపబడిన ఈశ్వరవాక్కు "ఖురాను" ఇస్లామ్ మత రూపములో సృష్టిని ఆవహించియున్నది.

ఆయా మతస్థులు వారిలోవారు కలహించుటయేగాక నొక మతము వారు యింకొకమతము వారిని ద్వేషిస్తూ మహామారణ యంత్రములతో మనుష్యనాశనము చేయుచున్న విషయము ఆయుష్షు రూపంలో జీవించియున్న మనము కండ్లారా చూచుచున్న సంగతి పరమ సత్యము.

సర్వమానవ రూపములను దృష్టిలోపెట్టుకొని విమర్శనా రూపములో చూచిన రంగులబేధముతప్ప రూపనిష్పత్తి, అంగసౌష్టవము సమానముగనే యున్నది. ఇందు కలహరూపమునకు కారణము కేవలము మతబధిరత్వము, అజ్ఞానము. అదేవిధముగ రెండు విభిన్న జాతీయతలతో కూడిన దేశములు తమ దేశహద్దులను అతిక్రమించుట కూడా కలహకారణముగనుండి మారణ హోమములను కల్పించి మానవ నాశనమునకు కారణమగుచున్నది.

మతమనగా అర్థమేమిటి? అను ప్రశ్నవచ్చినప్పుడు మానవ వ్యక్తిత్వమునకు మించిన యింకొక మహాశక్తి యున్నదని, అది తెలుసుకొనుటకు చేయు ప్రయత్నము కలిగించిన పర్యాయాణరూపమైన బాటకే మతమని పేరు. దానిని గూర్చి చెప్పు సూక్ష్మ రూపమైన అభౌతికమైన వాణి ఋషులరూపములోను, ఋష్యాతీతమైన అవతారరూపము

లోను, ప్రవక్తరూపములోను ఆ, పయనించు బాట యేర్పడియున్నది. ఇందు యే వ్యక్తి యొక్క మతికీ యేది స్థాయి కల్పించినదో అదే యతని మతము. దానికి విరుద్ధముగ భ్రాంతిజన్యమైన కాలమహాశక్తి భావ రూపములో వేరువేరువూహలకు పోనిచ్చి కలహకారణియై యున్నది. ఏ మానవునికా మానవుడు తన స్వయములో ఈశ్వర విషయాన్ని తెలుసుకొని తరించుటకు ప్రయత్నించి సర్వమతముల యందు తన దృష్టినిపెట్టి విమర్శించిన ఈశ్వరయేకత్వమును అన్ని మతములు ప్రతిపాదించి ప్రబోధించినట్లు అవగాహన కాకమానదు. ఉపమానరూపములో పర్వతారోహణచేయువారు యే త్రోవను అధి రోహించినను శిఖరమనుచోటు చేరినప్పుడు అందరూ సమానులే. ఆ చోటు చేరిన తరువాత దానికి మించిన విషయములో తనచూడ్కులు పైకి నిగిడించిన ఆ అందరికి గోచరించునది శూన్యరూపమున నున్న ఆకాశము. ఆ పైని మానవాతీతమైన శక్తి సద్రూపమని తెలియబడు చున్నది. దానిని గూర్చియే వేరు వేరు విధానములలో తెలుపబడిన మతములయొక్క విధానము అన్వేషణా రూపములో నుండిపోయినది. దాని అంత్యము తెలుకొనుటయే మతి అనునప్పుడు తనయొక్క తెలివిలోని వికాసము, దాని పరిణామమే సద్రూపము. అది తాను గానే యున్నాడని తెలుసుకొనగలడు. కాని శిఖరాగ్రమందు నిలచిన శూన్యము వారికి యెదురైనప్పుడు ఆచోట ఈశ్వర విషయము ఒప్పించ గలిగే విధానము సాధ్యముగాని పరిస్థితిగ నుండుటచేత పురుషవాచక మైన ఈశ్వరుడు అను నామము నిరూపించి (రస స్వరూప సంభూత మైన శాశ్వతమైన తేజస్సు) సర్వవ్యాప్తంగా నుండే సర్వాధికారముగల రూపంగానుండే అధికారిగామారి పాపపుణ్యములనే సూక్తులను విశదీ కరించి స్వర్గనరకాలనే లోకాలను సృష్టించి దాని కనుగుణ్యమైన సేవలను పేర్కొనినొక అభౌతికమైన భువన బ్రహ్మాండ సామ్రా

జ్యము ప్రజల దృష్టికి వచ్చి దానియందు ప్రజలకు విశ్వాసము కలుగు నట్లు నిరూపింపబడినది. ఆ మానవ విధానంలో తెలివియొక్క వికాసము విజ్ఞానరూపంలో ద్వైదీభావం వచ్చి స్వేచ్ఛావిహారమైన ఐహికము వైపు మళ్ళే స్వభావము ఉండుటచేత, నాస్తికంగా మళ్ళే ప్రమాదం ఉండుటచేత దానినుండి తప్పించుటకు రెండేరెండు విధానములు కలవు. 1. భయము 2. భక్తి. అతని మతిని మరల్చి ఈశ్వరునివైపు త్రిప్పుటకు భయరూపంలో నరకమును, నరకమనే వర్ణన అవసరము. భక్తి స్వరూపము ఆశగా వున్నది కాబట్టి, తనకు సుఖంకలుగు ఆశను భక్తితో అర్థించు స్వభావముండుటచే, స్వర్గసౌఖ్యమనే సుఖదాయకమైన ఆశా స్వరూపం సృష్టించి, మానవుని ఈశ్వరశక్తి స్వరూపునిగ మార్చుటకు యీ స్వర్గ, నరకాలు పేర్కొనబడినవి. ఈశ్వర మాయా తమో రాసిలో పైజెప్పిన ఈశ్వర రాజ్యాంగవిధానమయిన స్వర్గ నరకాదుల విషయములు సూక్ష్మరూపంలో నిరూపణ కాగలిగే విషయము గమ నార్హము. అది సూక్ష్మజగత్తులో అతిసూక్ష్మమైన విధానములో అది విరాడ్రూపంగ మాయాసంభూతమైన విషయంగ వున్నదని తెలుసు కొనగలము. అందుచేతనే శ్రుతి "తన్మాయా శబళీత బ్రహ్మ" అని విరాడ్రూపము పేర్కొనబడినది. పై విషయాలు విరాడ్రూప మాయా సంభూతమైనవని తెలుసుకొని జన్మరహితమనే ముక్తికి ఆ స్థానములు క్రిందుగమండుటచే వాటికి శాశ్వతమైన తన స్వరూపము నకు మధ్య భ్రాంతియుతమైన పెంజీకటి (భ్రాంతిరూపమైన మాయ) ని యెవరు నిర్జించి దాటశక్యులో అనగా ఈశ్వర తేజస్సుగా మారునో ఆతడే సాయుజ్యుడు.

పై విషయాలు తార్కికబుద్ధికి సరిపోని కారణమున నాస్తికులు ఈశ్వర సన్నిభమైన మహాశక్తిని బూటకమని విమర్శింప సమకట్టినారు.

అందు భౌతికముగ శిల్పరూపమున ఈశ్వర రూపంగ రూపించు విగ్రహ ప్రతిష్టాపన నాస్తికుల విమర్శనకు చాలా తోడ్పడుచున్నది.

మానవజన్మ తత్వరూపములో మౌఢ్యమున పడిపోయిన కారణమున అటువంటి వ్యక్తుల మతిమరలించుటకు నిర్వచించిన స్థితియే విగ్రహారాధనయని తెలుసుకొనవలసియున్నది. మహమ్మద్ ప్రవక్త చెప్పినట్లు "అల్‌రాయ తెరబ్బి బెరబ్బి" వేదవిహితమైన వాఙ్మయం "స్వయం బ్రహ్మన సందేహ" ఈ రెండు మతములందుగల ధ్వనుల యేకీకరించి శూన్యమందు నిలబడిన మతప్రవక్తలు, తమలోతాము ధ్వనింపజేసుకొని తనదృష్టి తనవైపు మరల్చినప్పుడు సర్వము తానుగా నున్న విషయము తెలియబడును. ఇది తెలిసినవారే తత్త్వవేత్తలు. యుగపురుషులు, అవతారులు, ప్రవక్తలు, ఋషులు.

ఈ స్థితికి వచ్చిన వ్యక్తి మతసమ్మతమునకు వచ్చిన వ్యక్తి.

"ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" (ఇది వేదవాఙ్మయ శ్రుతి). అనగా బ్రహ్మ ఒక్కడేకాని రెండు కాదు. అట్లే ఇస్లామ్ మతమందు "వహదహు లా షరీక్" (ఇది ఖురానుసూక్తము) ఈశ్వరుడు ఒక్కడు తప్ప రెండని చెప్పకూడదు.

పై వాక్యములనుబట్టి ఉభయమతాలు సమన్వయించిన, ఒకడే ఈశ్వరుడని తేల్చి చెప్పినవి.

ఇది తెలియక మత బధిరత్వమనే మహాచీకటినిబడి కలహకారకులై నశించుటకంటె వారివారిమతముల యందుగల ఈశ్వరయేకత్వమైన విషయములు తెలుసుకొని ఇతరమతములలోగల ఈశ్వరయేకత్వమునకు పరిపోల్చి మానవాతీతమైన, ఈశ్వరసంభూతమైన ప్రాతిపదికము

తెలుసుకొని మతాతీతుడై సహనసంపత్తిగ మారిన మతిని గడియించి ప్రతిప్రత్యగ భిన్నమైన అణువుతో సహితంగా ఈశ్వరనిష్పత్తియేనని చాటునో వానిదే మతము. అట్టి స్థితికి రాగలిగిన మానవత్వమే మానవత్వము. ఆతడే ఋషి, ఆతడే యోగి, ఆతడే తత్త్వవేత్త ఆతడే ప్రవక్త, ఆతడే అవతారి. ఆ స్థితికి వచ్చిన పరిణామమునకే మతమని చెప్పవలెను.

అదే మతము. ఆతనిదే మతము. ఇదిలోక కళ్యాణదాయకము. ఇదే యావత్తు సృష్టి శాంతికి కారణభూతము.

# పునర్జన్మ

ఈ పంచభూతాత్మకమైన జగత్తు ఆదిని అణురూపంలో ఈశ్వర తేజస్సునుండి విడువడిన తరువాత పంచభూతాత్మకంగ ఆవరించునటు వంటి యీ జగత్తు జీవరూపాలుగ గణవిభజన చేసిన సాంఖ్యరూపంలో 84 లక్షల జీవరాసులు కలిగినవనిన్ని, నొక జన్మకంటె యింకొక వుత్కృష్టజన్మగ మారిమారి 84 లక్షల జన్మలు పొంది కడపట మానవ రూపము పొందినట్లు వాఙ్మయంలో చెప్పబడిన విషయము మనకు తెలిసినదే. మానవరూపము పొందిన తరువాత తిరుగ మానవ జన్మగ పుట్టునను చెప్పు వాఙ్మయము యంతవరకు యదార్థమని విమర్శకు వచ్చినప్పుడు కపిలుడు సాంఖ్య సిద్ధాంత రూపములో మానవ వ్యక్తిత్వము పొందిన జీవి మరణ రూపములో శరీరము ఖిలమైపోయిన తరువాత 25 వేల సంవత్సరములకు మరల మానవుడుగ జన్మించుచున్నాడని చెప్పియున్నాడు. "శ్రీ మతాంగేః యోగభ్రష్టోభిజాయతే" సాధకుడు పరిణామము పొందకుండగనే మరణించినట్లయితే శ్రీమంతుల గర్భాన పుట్టునని "భగవద్గీత". ఈ విషయముపై మోసి మనము ఊహించినప్పుడు వాఙ్మయమందు ఆగామి సంచిత ప్రారబ్ధములనే విధానములో నొక్కొక్క జన్మలో చేసిన పుణ్యపాపములు పరిశీలించినప్పుడు పుణ్య మధికముగ నున్న ఆ జన్మకంటె మంచిజన్మగ పుట్టి ఆలాగుననే అనేకమారులు చచ్చి నొకజన్మకంటె యింకొక జన్మలో అధిక పుణ్యముచేసిన విధానములో కొన్నిజన్మల తరువాత ప్రారబ్ధ రూపములో నిర్వాణముకలిగి నతడు ముక్తి పొందుచున్నాడని చెప్పుచు నొక మానవునియందు మార్పు కలిగినప్పుడు పూర్వజన్మయందు ప్రారబ్ధ రూపములో చేసిన కర్మ యీ విధముగా ఫలించినదని, ఆలాగుననే పాపము అధికమగ చేసినవ్యక్తి జన్మ నికృష్ట

జన్మగ వచ్చినదని యీ పూర్వజన్మ సుకృత ద్రుష్కృత కర్మ ఫలము లని నందుచేత యీ ప్రారబ్ధము కలిగినదని జ్ఞాన ప్రబోధకుల దగ్గర నుండి అజ్ఞానుల వరకు చెప్పుకొనెడి తీరు మనకు తెలిసిన విషయమే. ఎవరైనా దీనిని భిన్నముగ వాదనరూపంలో వాదించ గడంగి పూర్వ జన్మలో ఆ ప్రారబ్ధజన్మ ననుభవించేవానిని పిలిచి దీనికి ముందు జన్మలో మానవునిగ నుండి యేపని చేశావు. ఆనాడు నీవు స్త్రీ వా పురుషుడవా యని ప్రశ్నిస్తే. అది కొన్నాళ్ళవరకు మానవ దేహ ధారి కాక మునుపు జడజన్మలో నుండుటచేత తెలియబడదని నిశ్చ యించి అతనియొక్క ప్రస్తుత జీవిత విధానాన్నిబట్టి పూర్వజన్మలో చేసిన సుకృత దు్రష్కృతములయొక్క ఫలితము చెప్పలేదని కాక పోయినట్లయితే మానవ రూపములన్ని సమానముగ యున్నప్పటికి కలిమి లేములు సుఖ దుఃఖములు ఆరోగ్య అనారోగ్యములు యెం దుకు కలగాలని ప్రశ్నించుట మనము వినుచున్నాము. అటువంటి విష యము వచ్చినప్పుడు పూర్వపుజన్మ తెలియని అజ్ఞాన రూపంలో పాపమో పుణ్యమో సుకృతమో దుష్క్రృతమో తెలియకపోయి నప్పటికి ఆలాగున చేయడంచేత యిటువంటిబాధలు కలగడం కారణ మని నిరూపణ చేయదగిన యీ జన్మ ఆయుష్షు రూపంలో మరణ మాసన్నమైఖిలమై పోయిన తరువాత నీ జీవి నీవుచేసిన పాపపుణ్య ములు సుకృత దుష్క్రృతములు నీయంత నీవు విమర్శించుకొనిన తెలుసుకొనగలిగిన జ్ఞానరూపంలో యీ జన్మ తరువాత నీకు యే విధమైన జన్మ యుండునని ప్రశ్నించినప్పుడు ఆ ప్రశ్నకు నిరుత్తరుడై పోవుచున్నాడు. ఈ కారణ ము చేత మానవజన్మ తరువాత మానవ జన్మగనే పుట్టునను విషయము సర్వకల్ల. అయినప్పటికి కొందరు విత్తనములు భూమిని నాటినప్పుడు ఆ విత్తనము యే చెట్టునుండి వెలు వడినదో ఆ వృక్షముయొక్క లేతదనము మొలచినప్పుడు కనపడి

విస్తరించి ఆ చెట్టులాగునే వుంటుంది కాబట్టి మానవుడుకూడా చనిపోయిన తరువాత యీ విత్తనములవలెనే మానవుడుగా పుట్టుటకు సాధ్యమున్నదని చెప్పుమాటలను నమ్మువారు కొందరున్నారు. అది కేవలము నొక అజ్ఞాని యింకొకనిని అజ్ఞానిగ మార్చే పరిస్థితిలో ఒప్పించదగిన మాటలుతప్ప యదార్థములో యే మానవుడైతే సంసార రూపములో తన సంతానము తన రూపములాంటిదే కలుగుట చూస్తూ తాను చనిపోయిన తరువాత యేమగుచున్నాడను సంశయముమీద తనలోనున్న జీవరూపాన్ని ఈశ్వరతేజస్సుగా మార్చుకొనుటకు ప్రయత్నించుటకే ఆధ్యాత్మికమని పేరు. అలాగుననే విత్తన రూపములో చెట్టుయొక్క సంతతికి వుద్భవించి చెట్టురూపంగా మారుట సహజము. అంతియేకాని యీ చెట్టుయొక్క జన్మ యేమగుచున్నదని విమర్శకు దృష్టిలోపెట్టి ఆ చెట్టును నరికి మానవుడు మరణరూపములో పడిపోయిన వాని శవమును కాల్చివేసిన లేక భూమిలో పాతినట్లయిన అట్లే ఆ చెట్టును కాల్చి బూడిదచేసిన ఆబూడిదగాని చచ్చి యెండిపోయిన చెట్టునుగాని పెరికి తిరుగ భూమినిపాతి తిరుగ ఆ వృక్షమే పుట్టుచున్నదాయని నిరీక్షించుచునప్పుడు ఆబూడిదనుండి ఆ వృక్షము యొక్క రూపము నుద్భవించుటలేదు. అలాగుననే మానవ వ్యక్తిత్వము పడిపోయిన తరువాత తిరుగ మానవ రూపముననే పుట్టుచున్నాడని అతడు చేసిన కర్మ అనుభవించు చున్నాడని అనడం శుద్ధ పొరపాటు.

కొన్ని మతములందు కాల్చి దహనముచేసి దేశదేశాల నదులయందు కొండలమీద నిమజ్జన అయ్యే స్థితిలో విసిరివేయుచున్నారు. దానివలన దేహము బూడిద అను విధానములో పలుచోట్ల విసరి వేయుటచేత ఆ దేహము పునర్నిర్మాణము కాని పరిస్థితిలో ఆత్మ (జీవుడు) ముక్తి పొందగలడని చెప్పు విషయము చాలా అజ్ఞానముతో

కూడిన విషయము. కారణ మేమన ఈ నిమజ్జన చేసిన బూడిద పంచ భూతాలు దాటిపోలేని స్థితిని సర్వ వ్యాప్తంగానున్న ఆత్మ సృష్టి యావత్తు నుండుటచే ఈ బూడిదను ఎక్కడ పారవేసినా ఆకర్షించి దానికి కల్గు జడజన్మ పరిణామము పొందక మానదు.

సాధనా రూపంలో యావత్తు సృష్టి తానుగా యున్న సంగతి తెలుసుకొని అది ఆత్మతో సమానమైన తానుగానున్న యీ జగత్తు తేజస్సుగ నున్న సంగతి తెలుసుకొన్నప్పుడు అదియే ఈశ్వరుని నుండి తెగినదని నిర్వాణమునకు వచ్చినప్పుడు కలిగే ముక్త స్వరూపమును యీ విధముగ సృష్టించుట అజ్ఞానియొక్క లక్షణము. ఇటువంటి చోటే "భౌతికా భాస రస స్వరూప సముపాసకు డోడె కృతార్థు డన్నిటన్" ఈ భౌతికమైన జగత్తులో స్థూలముగనున్న తన శరీర ముతో సహా ఆభాస రూపంలో తేజస్సుగ నున్నదని తెలుసుకొన్న రస స్వరూప సముపాసకుడు ఈశ్వర సంభూతమైన మహా తేజస్సుతో సమానముగా నున్నానని గురు ఆశీర్వాదమున నెవడు తెలుసుకొన గలడో ఆతడే ముక్తుడు.

లోకములో పునర్జన్మ విషయములో విడ్డూరములుగ ప్రకట నలు జరుపబడుచున్నవి. ఒకవ్యక్తి తల్లిదండ్రియనే వ్యక్తులయొక్క సంతానముగ పుట్టి వేరొకచోట తన పూర్వజన్మయందున్నట్లు వారి యొక్క ఆనవాళ్ళు చెప్పినప్పుడు సరిపోవుట చూచిన మానవునకు పునర్జన్మ యున్నదని నమ్మునట్లు ప్రకటనలు చేయుచున్నారు. అది కేవ లము మూర్ఖత కారణము. "భూతాని యాంతి భూతేజ్య" సృష్టిలో భూతజన్మలున్నవని భగవత్ గీతయేకాక సైతాను రూపములో మహమ్మ దీయ క్రైస్తవ మతములుకూడా భూతజన్మ లున్నాయని ఒక్కొ క్క మనిషికి నొక్కొక్క భూతము చొప్పున యీ భూతములు భ్రాంతి యనే అభౌతికమైన మహాశక్తి ఆకరములని అవి ముక్తి పొం

దుటకు అర్హత గలిగిన మానవజన్మలను భ్రాంతివైపు మరలించి ఈశ్వర త్వము పొందు భావమునకు విముఖత్వము కలిగించి జడజన్మలను పంపు టయే వాటి పరమావధి కాబట్టి ఆయా వ్యక్తులను బాల్యమందు ఆవహించి జ్ఞానావస్థలో సవికల్ప సమాధివంటి మైకము తీసుకొచ్చి యింకొకచోటనున్న దృశ్యము అనుభవములో నున్నట్లు చేసి పలి కింపజేయుచున్నది. అదే వ్యక్తి బాల్యరూపములో చెప్పిన యదా ర్థము కొంతకాలము వయస్సున గడచిన తరువాత చెప్పలేకపోవుచు న్నాడు. కారణము ఆతనిని ఆవహించిన భూతము లోక పరిజ్ఞానము కలుగుచున్న వ్యక్తిత్వమునుండి సడలిపోవుటయే. అంతమాత్రాన ప్రజలు ఓహో! యని ఆనందించుట కేవలము నికృష్టతయే.

నా అనుభవములో నాకు 9 మాసముల వయస్సులో మాట లాడి నడకకూడా నేర్చితినట. ఒక కాలములో అప్పటి ప్రపంచ పరి జ్ఞానమును చెప్పినప్పుడు నా తల్లి ఆశ్చర్యపడి సంవత్సరంలోని పిల్ల వాడవు నీకెలా జ్ఞాపకమున్నది యని అడిగినప్పుడు అది సంవత్సరము లోపు పిల్లవానిగ నున్నప్పుడు చెప్పిన విషయము. ఒకనాడు పెద్ద వడగళ్ళవాన కురిసింది. మాతామహుని యింట అంగణమున వడ గండ్లతో నిండినప్పుడు నా తల్లితో సహితము మా మాతా మహుని కుటుంబములోని వారందరు వడగండ్లను యేరి నా వడిలోనున్న గ్లాసులో పోసిన విషయము అది నీరుగా మారిన తరువాత మా మాతా మహుడు ఆ నీటిని బూడిదను కలిపి సీసాలోనింపి తన మందులగదిలో వ్రేలాడగట్టుట. నాకు యుక్తవయస్సు వచ్చి అక్కడి సీసానుగూర్చి ప్రశ్నించినపుడు మా అమ్మమ్మ నీ చిన్నతనంలో పడిన వడగండ్ల నీటిని బూడిద కలిపి నీ తాతయ్య యిక్కడ వ్రేలాడగట్టినారని యిది పరిణామ సూలకు అమోఘంగ పనిచేయునని చెప్పినది.

ఈ విచిత్ర సంఘటన యేమంటే అంతటి చిన్ననాటికాలమందే నాకు లోక పరిజ్ఞానరూపము జ్ఞాపకముండుట చిత్రము.

అటువంటి నేను నాకు 3, 4 సంవత్సరముల వయస్సులో నా తల్లి నా మేనత్తలు మా అయ్యమ్మ వారందరు కూర్చుండియుండగా అక్కడ నా పరిజ్ఞానములో కనబడిన దృశ్యాన్ని చిత్రించి వారితో చెప్పిన విషయమేమంటే, పెద్ద పెళ్ళిపందిరి దానిని లతలతో అలంకరణ నొక చిన్న నిలువెత్తున్న చింతమొక్కకు కాగితము బుట్టవలె నిరూపించి దానిపై లతలు పాకించి అటునుండి పెండ్లిపందిరిపైకి పాకించి అద్భుత అలంకరణ. ఆ పెండ్లిపందిరిలో కూర్చున్న వ్యక్తులరూపాలు అక్కడ పెండ్లి సభలో నాట్యముచేయుచున్న భోగపు మేళతాళములతో సహా పెండ్లికుమారుని రూపు రేఖలవర్ణన నేను ప్రాకుతూవున్న సమయములో ఆ పెండ్లి విషయాలు చూచానని చెప్పిన వృత్తాంతము విని అక్కడి మనవారు ఆశ్చర్యచకితులై అందులో మా మేనత్త నొకతె చెళ్ళు మనునట్లు నా చెంపపై నొక లెంపకాయ కొట్టి ఓరి! భడవా? ఆవర్ణన మీనాన్న పెండ్లిరా! మీ నాన్న పెండ్లి అయిన రెండు సంవత్సరములకు నీవు పుట్టి నీవీనాడు ఆ పెండ్లి చూచినట్లు చెప్పుచున్నావు నోరుముయ్యి అని కొట్టి గద్దించినది. ఆ సంగతి యీనాటికి నాకు జ్ఞాపకమున్నది.

నేను పుట్టకపూర్వము నాతండ్రియొక్క వివాహ విషయము తూ. చా. తప్పకుండా యదార్థముగ చూచినట్లు చెప్పిన విషయము అభౌతికమైన భూతశక్తి ఆవహించి ఆ విషయాన్ని నా నోటపలికించినదేకాని పునర్జన్మకాదు. అలాగుననే పునర్జన్మలో మానవుడు వచ్చి తెలియజేసేవిషయము క్షుద్ర భూత ఆహూయమానమై అదిపలికించినదే తప్ప వేరుగ పూర్వజన్మలోనుండి పునర్జన్మలు తెలుసుకొని చెప్పిన విషయం మాత్రము కాదు.

పూర్వజన్మ యందున్నటువంటి విషయము యిప్పుడు యీ జన్మలో చెప్పగలిగినచో ఆ వ్యక్తి పూర్వజన్మలో మరణించి యీ జన్మకు రావడములో మధ్య కొంత వ్యవధి యున్నది. గాన ఆవ్యవధిలో నాతడు యేచోట యేవిధముగనుండి తిరిగినాడో తాను తిరిగి మానవ జన్మగావచ్చిన విధానములో తండ్రిలో ఏ విధముగా ప్రవేశించినాడో. తల్లిగర్భములో యే విధముగనున్నదీ తాను గత జీవితములో జరిగిన విషయాలు తెలుపుటకు సాధ్యపడిన పరిజ్ఞానము తల్లి కడుపునందు తానున్నప్పుడు ఆత్మకు పరిజ్ఞాముని వుండాలి గాబట్టి ఆ విషయము చెప్పగలిగినప్పుడు సైన్సు రూపంలో నిరూపణ చేయడం అవసరము. అలా నిరూపణ చేయజాలని పక్షముతో అది అబద్ధమే అవుతుంది. ఆ పిల్లవాడు బాల్యావస్థ కాలములో పొగడబడే విషయాన్ని వేరొకచోట నున్నవారి విషయం నేర్పించి చెప్పించడమే, లేదా పైని చెప్పినట్లు భూతము ఆహూయమానమై పలికించడమే నిజము. ఈ పిల్లవాని మీద ఆవహించిన భూతమునకు భూతకాల విషయములు తెలియును కాబట్టి, ఆ విషయములు ఆ పిల్ల వాని నోట పలికింపజేసినది. ఇట్టితరి పలికించిన విషయము భూతశక్తి యని నిశ్చయించవలసి యున్నది.

"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా" భగవద్గీతలో

చెప్పినట్లు మానవత్వము పొందక ముందు యీ ఆత్మ 84 లక్షల జీవ రాసుల చీకటి అనే అజ్ఞాన పరిధిలో క్రమ్మగ్గి వ్యక్తంచేసుకొనే జన్మయన తన జన్మభూమి ఈశ్వరస్థానాన్ని తెలుసుకొనకుండా పోయినట్టయితే అది జడజన్మగా మారి అజ్ఞానమనే చీకటిలో పడిపోవుచున్నదని అనగా తిరుగ జడజన్మల నెత్తు చున్నదని శ్రీ కృష్ణభగవానుడు పలికినాడు.

"మాకాన ఫిహాజ ఆమ

ఫహువా ఫిల్ ఆఖరతిల్ ఆమ"

అని శ్రీ మహమ్మద్‌వారు. ఈశ్వర విషయము తెలుసుకొని జన్మరహితము చేసుకోగలిగే వ్యక్తిత్వము పొందిన ఆత్మ మానవరూపంలో ఆత్మ పరిణామముపొంది జన్మరహితం చేసుకొనకపోతే ఆకల్పాంతము జడజన్మలలో క్రమగ్గవలసినదేయని స్థిరీకరించిన తీరులో దీనికి భిన్నంగా పునర్జన్మ కలదనుట కేవలము వున్మత్తుని ప్రలాపన. పై రీతినిబట్టి మానవజన్మ ఆత్మకు ఒకేసారి కలుగుచున్నదని స్థిరీకరించవలసియున్నది.

# దేహము - జీవుడు

ప్రతి జీవరూపముదాల్చిన దేహము గడ్డి మొదలు మానవుని వరకు మన దృష్టికి గోచరించుచున్నది. ఈ విషయాన్ని విమర్శించి నప్పుడు జడపదార్థమైన స్థూలరూపము దేహముగను అందు యిమిడి యున్న చలన చైతన్యము కలిగించు శక్తిస్వరూపము జీవుడని వేదాంత రూపంలో ప్రబోధించు కాలమందు పదార్థరూపమైన దేహము వేరు శక్తిస్వరూపమైన ఆత్మయందు జీవుడు వేరు యను ప్రాతిపదికముపై మోసి వారి వేదాంత విషయము బోధనా క్రమమున ప్రబోధించుచు దేహరూపమైన పదార్థము యీ సృష్టియందే దిగ బడిపోయి ఆత్మ (జీవుడు) ఈశ్వర తేజస్సులో కలసిపోవుచున్నదని నిర్వచించుచున్నారు.

ద్వైతరూపములో దేహము యీ భూమియందు నిమజ్జనమై పుణ్యము చేసిన ఆత్మ స్వర్గానికి, పాపము చేసిన ఆత్మ నరకానికి పోవు చున్నదని ద్వైయితులు నిరూపణ చేయుచున్నారు.

ఈ పై విషయాలను పురస్కరించుకొని విమర్శనలో పెట్టిన మన దృష్టికి కూడా దేహమువేరు, జీవుడు వేరని, గడ్డి మొదలు క్రిమి కీటక పశు పక్ష్యాది జీవజాలములును వాటికి అంత్య పరిణామమైన మానవుని వరకు యీ జీవ దేహముల గూర్చి విమర్శించినప్పుడు జీవుడు వేరు దేహము వేరుగనే మన దృష్టికి గోచరించుచున్నది. ఏ దేహ ధారియైన జీవియైనను మరణమను అంత్యస్థితికి వచ్చినప్పుడు స్థూల రూపములో నున్న దేహము జడపదార్థముగ భూమిపై కూలిపోయి దానియందున్న జీవరూపమునయున్న ఆత్మ కనబడని పరిస్థితిలో దేని యందో లీనమై పోవుచున్నది. దీనినిబట్టి దేహము వేరు- జీవుడు వేరు.

అను హేతువాదము మిక్కిలి సమర్ధనీయముగ నుండుటచే ప్రతి విమర్శ కునకు పై విషయము నిజముగనే తోచుచున్నది.

కాని యిది నిర్వాణ కాలమందు కనబడేస్థితి అనగా అంత్య కాలమందు రెండుగా విడిపోవుచున్నట్లు కనబడు విషయము నిజమని నమ్మి దేహము వేరు జీవుడు వేరు అని చెప్పువారి ప్రబోధములు అజ్ఞాన బంధురమైనవి. కారణం యీ విమర్శనా విధానములో దాని యొక్క ఆదినిమాని కేవలం అంత్య విషయము మీదనే మోపి నొక నిర్ణయానికి వచ్చుటయే. ఏ జీవినైనా విమర్శించినప్పుడు దాని అంత్య మును మాని దానియొక్క ఆది జననరూపము యేవిషయముగ యున్నదని ప్రశ్న వచ్చినప్పుడు అది అపరోక్షమునుండి పరోక్షమునకు అనగా అవ్యక్తమునుండి వ్యక్తమునకు వచ్చినప్పుడు అది జీవసహిత దేహధారిగనే వ్యక్తమగుచున్నది. అది మానవునియొక్క జనన రూపము పురస్కరించుకొని విమర్శించిన సంతాన రూపములో వచ్చిన ఆ శిశువు దేహరూపమున ఆపాదమస్తకము ఆవహించిన జీవసహి తుడై తల్లి గర్భమునుండి యీవలకు వచ్చుచున్నాడు. అది జీవ సహితమైనప్పుడే శిశువని చెప్పబడుచున్నది. ఆ దేహమందు చల నము లేనప్పుడు జీవుడు లేడని కట్టెయని అవతలకు త్రోసివుచ్చు చున్నాడు. ఈ జీవసహిత మయినటువంటి శిశురూపములోనున్న దేహము మానవునిచే గౌరవింప బడుచున్నది. దీనినిబట్టి విమర్శించిన దేహము విడిచి జీవుడుగాని జీవుని విడచి దేహముగాని నుండబోదని రూఢము.

ఈ జీవుడు దేహదారియైనప్పుడు ఆపాదమస్తకం విండియుం డును. కాబట్టి యే దేహమును యనుసరించిన జీవి యేజీవిని యను సరించిన దేహము ఆకల్పాంతమువరకు విడిచిపోవుట అసాధ్యము.

ఈ సృష్టి యావత్తు భిన్నభిన్న అణువులుగా ఊహించి ఆ ప్రతి అణువు ఆత్మయను తేజస్సుతో నిండియున్న సంగతి "అణో రణీ యాన్ మహతో మహీయాన్ యేషోఽణురాత్మా" ఈ సూక్తము పుర స్కరించుకొని నిర్ధారణచేయ గల్గినప్పుడు ఈ అణువులయందుండే అనగా ప్రతి అణువునందుగల పదార్ధాన్ని ఒక గ్లాసుగా ఊహించి అందున్న ఆత్మను 'నీళ్ళుగా నిశ్చయించినప్పుడు మరణరూపమున దేహమునుండి వెలికివచ్చిన ఆత్మను గ్లాసునుండి వెలికివచ్చిన (బోర్ల పడిన గ్లాసునుండి జారిన నీరు) నీళ్ళను పోల్చినప్పుడు అది పాతగ్లాసును విడిచి క్రొత్తగ్లాసును ఆవహించు చున్నదనే పారిభాషికము సరియైన దని కాదని నిరూపించుటకు నీటితోనున్న యీ గ్లాసులో ఒలికి పోయిన నీరు నిండియున్న మరియొక గ్లాసును (ఖాళీగా యేగ్లాసులేదు జీవరహితముగ యే అణువున్ను లేదు. కారణం, "అణో రణీయాన్ మహతో మహీయాన్ యేషోఽణురాత్మ" యను శూక్తినిబట్టి ఊహిం చిన) ఆశ్రయించినప్పుడు అది దానిలో యిముడుటకు అస్కారము లేదు. గావున తిరిగి ఆ పాతగ్లాసునే అనుసరించవలసిన విషయం ఉన్నది గాబట్టి వేరు గత్యంతరము లేదు. కాబట్టి పై విధానాన్ని అన్ని అణువులలో నిండియున్న ఆత్మరూపమైన జీవుడు దీనిని ఆవహించిన పదార్థము నొకదానికొకటి వీడని కారణమున దేహము లేకున్న జీవుడు లేడు జీవుడులేకున్న దేహములేదు. ఈ రెండింటికిన్నీ అవి నాభావము. ఇట్లే ఈశ్వరుడు లేకున్న జగత్తులేదు. జగత్తు లేకున్న ఈశ్వరుడు లేడు.

మనదృష్టి సృష్టివంక మరల్చిన యే పదార్థ రూపమయినను యీ సృష్టియందు ఈశ్వర రూపమైన ఆత్మస్వరూపము సమ్మిళితమై యుండబట్టే ఈశ్వరుడు జగద్రూపమనిపించ బడుచున్నాడు. ఇది సృష్టి యొక్క రహస్యము. ఇది తెలుసుకొనిన జీవియే ముక్త స్వరూపము.

"తనువు మీరే, మనము మీరే,
కనులలోపల పాపమీరే
తను నెరింగిన తత్వమందు
తనకుతానై దెలియచుండ
తనువువేరే బాయనేరదు" అన్నాడు తత్త్వవేత్త.

తనువు వేరు, జీవుడు వేరు అను రెండువాక్కులమధ్య వున్న శూన్యమే భ్రాంతి. తల్లి గర్భములో శిశువుగ నున్నప్పుడు నొకటే ఆత్మగ పరిగణింపబడి ఉద్భవించిన తర్వాత ఊపిరిరూపంలో గాలి పీల్చి కేరు కేరు, మని యేడ్చుచున్నాడు. అప్పుడే ఆ సమయమందే యతనియందు భ్రాంతి ఆవహించి ద్వైదీభావము యేర్పడుచున్నది. ఈ భ్రాంతి వదలినచో తనువు జీవుడు ఒక్కటే. ఇది తెలియబరచు గురువు దొరికినప్పుడు అతని ఆశీర్వాదాన తాను గురువంతటివాడై నప్పుడు తనే విశ్వరూపుడనని చెప్పగలడు. ఆతనికి జీవుడు దేహము నొకలాగునే గోచరించును. ఇదే జీవ దేహముల రహస్యము.

ఇది సూక్ష్మాతిసూక్ష్మంగా విమర్శించినప్పుడు ఆ విమర్శన పంచ భూతాత్మకమైన సృష్టిని, యీ సృష్టికిమించిన యేకత్వరూపమైన తేజస్సు తెలుసుకొనగలిగే స్థితికి వచ్చినప్పుడు యీ జీవునికి దేహము నకు ఆదిస్థానము విరాడ్రూపమని అవగాహన చేసుకొనగలడు. ఈ స్థితిని జీవమే దేహమని, దేహమే జీవమని చెప్పగలడు.

చనిపోయిన పిమ్మట మానవ దేహము అనేక నదులయందు నిమజ్జనచేయుటద్వారా పునర్జన్మ కలుగదని చెప్పడం మనము గమ నించుచున్నాము. ఆ నిమజ్జన పంచభూతాత్మకమైన యీ సృష్టికి అవ్వల కాదు కాబట్టి సృష్టి అంతా నిండియున్న ఆత్మకు దానిలో నిమజ్జనరూపములో పంచబడిన దేహము దూరము కాదుకాబట్టి మరు

క్షణమందే అపరోక్షమందు యేకమై దానికి ఆకరమైన భూమిని యేదో ఒక జడరూపముపొంది జన్మకు వచ్చుచున్నది.

జన్మ రహితమైన వ్యక్తికి జీవ దేహములు వేరు కావు కాబట్టి అట్టి దేహసహితమైనజీవి ఆత్మగమారి విశ్వరూపమై పోవుచున్నది. అట్టి స్థితిని అధిగమించిన వ్యక్తిత్వమే మానవ వ్యక్తిత్వము. అట్టి మానవవ్యక్తిత్వము తనే విశ్వరూపమని చెప్పగలడు.

పై విషయాలుగ మారిన వ్యక్తిత్వము అభాసరూపమైన విశ్వ రూపమైన ఈశ్వర రూపము.

# మరణము

ఈ సృష్టియందు ప్రతీ జీవరూపముననున్న పదార్ధము ఒక నాటికి ఆయుష్షు రూపములో జీవరహితమై ఖిలమై పోవుట తథ్యం. ఆస్థితిని ఈ సృష్టిని దృష్టిలోపెట్టి విమర్శించిన ఈ సృష్టియొక్క నియమబద్ధమైన, కాలాంతమందు యిదికూడా ధూళియై నాశన సహితమునకు పాల్పడవలసి యుండును. అటువంటి పరిస్థితులలో ఈ నాశనమనేది పదార్ధమునకేగాని, జీవమునకున్నదా! అనే ప్రశ్న వచ్చి నపుడు అది సంశయాస్పదముగాయున్నది.

ఈ పదార్ధసహితమైన విషయము మనదృష్టికి మానవరూపం పొందిన ఆత్మ స్వరూపములో మరణమనే ధ్వని ఇతర మానవకంఠ ములనుండి ధ్వనింపబడుచున్నది. ఈ మరణమన్నది మానవునిలో యున్న ఉసురు (ఊపిరి) ఉచ్ఛ్వాస, నిశ్వాస. కుంభకములలో ఏచోట స్థంభించిపోయినను, ఈ మానవశరీరము నేలరాలి, కళేబరమనిపించు చున్నది. దీనినే తోడిమానవుడు ఈ వ్యక్తి మరణించినాడని చెప్పు చున్నాడు. అట్టి దృశ్యము మన దృష్టికి గోచరమైనప్పుడు మనము కూడా ఆ వ్యక్తి మరణించినట్లు నిశ్చయించు చున్నాము. ఇది గీతా వాక్యరూపములో సరిపోదు. జీవి పాత దేహమును విడిచి క్రొత్త దేహమును దాల్చుచున్నదన్నవాక్కును అబద్ధమనిపించును. కొబట్టి ఈ ఖిలమైపోయిన దేహము, ఇంకొక జీవికి ఆకరమైయుండునని, అర్ధ మిచ్చును. అపుడు దేహరూపమైన మరణధ్వని యదార్ధముకాదని నిశ్చయించవలసియున్నది. ఇట్టి స్థితిని మరణమనునది దేనికి? అను ప్రశ్నరాకమానదు. మరణించినదన్న దేహములో నున్న జీవికి ఇంకొక దేహము ధరించే దేహముతో సజీవరూపంలోయున్న ఆకారమున్న

ప్పుడు, ఆ జీవి యింకొకరూపములో దేహధారి అయియేయున్నది. "జీవి శాశ్వితమైనది దేహము నశించునది" అనుగీతోక్తి సరి అయినదిగాలేదు. ఈ స్థితిని దేహము నశించడంలేదు. ఆత్మ నాశ నము కానిదని, ఉపనిషత్తులు ఒప్పుకొనుచున్నవి. ఇక మరణము దేనికి అనే ప్రశ్న వచ్చినప్పుడు ఈ జీవదేహములు ఎక్కడివి? జీవ దేహరూపములో వచ్చిన వీటికి ఒకనాటికి స్థానము ఎక్కడున్నది? అనే ప్రశ్న వచ్చినప్పుడు ఈ జీవదేహములు ఆదిలో ఈశ్వరునిలోనివే అని ఒప్పుకొనక తప్పదు. ఏనాటికైనా ఈ జీవికి మానవజన్మ సంక్రమించి, ఈ జీవసహితమైన దేహము ఈశ్వర సంభూతమైన ఆభాసరూపంగామారి తేజస్వరూపమయిన జీవి సాక్షీ స్వరూపమున ఈశ్వరత్వమున కొచ్చినప్పుడు ఆభాసరూపముగామారిన ఈ శరీరముతో సహితం సర్వసాక్షి స్వరూపంలో ఈశ్వరునిలో లీనమైపోయే విషయం నిశ్చయము, అట్టి స్థితికి వచ్చిన మానవత్వము సార్థకమైనది.

సృష్టికి అంత్యజన్మగాయున్న మానవజన్మ సార్థకంకాని పరిస్థితిలో ఏనాటికిని ముక్తస్వరూపంగా మారలేని జీవికి కలుగు పరిణామము జీవనాశనము. అలాగున గతించిన జీవికి కలుగు పరిణామమే మరణము. కావున భౌతికరూపమైన దృష్టితో తిలకించబడుచున్న మరణము మరణముకాదు. ఆకల్పాంతమువరకు మానవరూపము పొంది, ముక్తి పొందజాలని జీవి నాశనసహితంగా ఆకల్పాంతమువరకూ జీవరహితమైనదానినే మరణమని చెప్పవలసియున్నది. ఏ దేహ రూపం పొందకుండా జీవి మురిగిపోయిన పరిస్థితికే మరణమని పేరు. కావున మరణమన్నది జీవికిగాని దేహనికిగాదు. ఇదే మరణము. భౌతిక దృష్టితో చూచే దేహ రూపమైన మరణము మరణము కాదు.

అణువు అన్నప్పుడు శక్తి పదార్థములతో కూడిన విషయము జీవదేహములు ఒకటేనని ధ్వనిస్తున్నది. జీవుడన్న దేహమువుంది. దేహంవున్న జీవుడువున్నాడు. ముక్తి అనే విషయం అణుసముదాయమైన జీవదేహములు ముక్తిపొందినపుడే సార్థక్యం పొందును. దానికి భిన్నంగా జీవుడు ముక్తిపొందుననేది పడికట్టుమాట. ఇది విమర్శించిన ముక్తిపొందని జీవము మరణరూపమున నాశనమగుచున్నది.

# మరణానంతరమున జీవి ఏమగుచున్నది



మరణమనునది ప్రతిభౌతిక దేహము దాల్చిన జీవికి తప్పనిసరి. మరణమును గూర్చిన ప్రసంగము వచ్చినప్పుడు "జీవి" అననేమి దానికి శరీరము యెట్టి అగత్యము, జీవికి శరీరమునకు గల అవినాభావ సంబంధము లెట్లున్నవి అన్న ప్రశ్న రాకమానదు.

ఇది ఇతర జంతుజాలములు అనగా స్థావర జంగమాత్మకమైన జీవశరీరమున కతీతమై మానవునిలో మరణమను విషయమునకు శ్రద్ధ తీసుకొనబడుచున్నది.

ఇది అణుసముదాయముగ నున్నదన్న సంగతి తెలుసుకొనవలెను. అణువునందు రెండు వస్తువులన్న సంగతి శక్తి పదార్థముల మిశ్రితము లని తెలియబడుచున్నవి.

మరణమనగా పదార్థమునుండి శక్తి వేరగుటయేనని శాస్త్ర వేత్తలయొక్క ఉద్దేశ్యములు కాని మృతదేహమునందు కూడా జీవాణు వులున్నవి. వాటిలో తెలివియొక్క వికాసము, ధ్వని, మృగ్యముగ యున్నవి. అవి కొంతసేపటికే అంతరించి మట్టయిపోవుచున్నవి. మరణమునకుముందు మానవుని దివ్యత్వమును విచారించవలయును. ఇది ఆదిలో ఈశ్వర రస స్వరూపమునుండి విడివడినట్లు కనబడు చున్నది.

ఆ విడిపోయినదే శక్తి, పదార్థ రూపమైన సృష్టిగా పంచ భూతాలుగను వాటియందున్న శక్తి ఆత్మగను యున్న సంగతి తెలుసు కొనవలయును.

పదార్థ రూపము పంచభూతాలు మానవునిలో పంచగ్రహణేం ద్రియములుగను వాటిలోనున్న పంచశక్తులు జ్ఞానేంద్రియములుగను

తెలయబడుచున్నది. ఈ విషయము వేదాలలోను. ఖురానులోను రూఢమగుచున్నది.

పంచభూతములన ఆకాశము, నిప్పు, నీరు, గాలి, భూమి వీటి యందుగల శక్తి, "ఆత్మ". ధ్వని, తేజస్సు, రుచి, స్పర్శ, వాసన (గంధము)లుగ నున్నవి.

పై విషయాలు మానవుడు గ్రహణేంద్రియములవల్ల పరిజ్ఞాన రూపములో తెలుసుకొని "నేను తెలుసుకొన్నా" ననుచున్నాడు.

దీనినిబట్టి పరికించిన మానవ శరీరావయవములు యీ సృష్టి యొక్క పంచభూతములకు సంబంధించియుండి జ్ఞానేంద్రియముల ద్వారా వాటియొక్క శక్తిని గ్రహించిన విషయము నేను గ్రహించి నాను, నేను తెలుసుకొన్నాను అనుచున్నాడు. కావున నేననునదియే శక్తి స్వరూపమైన ఆత్మగ స్థిరీకరించినప్పుడు గ్రహణేంద్రియ సమూహ మైన అస్తి మాంస వసావికారమైన శరీరమునుండి "శక్తి" విడిపోయిన సమయమునకే మరణమని చెప్పి ఆత్మ తొలగిన దేహమును భూమి యందు ఖననము (పాతిపెట్టుట) చేయుటయో లేక అగ్నిని సంస్కరించ డమో చేసి దానిని కనుమరుగు చేయుచున్నారు.

ఆ కనుమరుగు మనదృష్టికి తప్ప పంచ భూతాలుగాయున్న యీ సృష్టికి కాదు. మట్టిని పాతిన దేహము, కాలిన బూడిదయు ఈ పంచ భూతాత్మకమైన సృష్టికిమీరి లేవు. కావున మృతదేహ రేణువులు నొకదానిలో నింకొకటి మిశ్రితమైన యీ పంచ భూతాల యొక్క ఆవరణలోనే యుండి ఆత్మగయున్న దానిలోని శక్తి తిరుగ మృతరేణువులుగనున్న వాటిలో కలిసి యే జడజన్మగనో మరల నుద్భవించుచున్నది. అలా మొలచుటకు సాధ్యముగనున్న భూతము భూమిగా నుండుటచే మృతదేహము గడ్డిగ మొలిచే ముందు దానిని

ఆకర్షించిన ఆత్మ జీవరూపములో దానిలో రీసమై మొలచి పెరుగ నారంభించి అది నాశనమై యింకొక జడజన్మగ మారుచు యీ విధముగనే నొకదాని తరువాత యింకొకటిగా యీ సృష్టియందు ఎనుబది నాలుగు లక్షల జీవరాసులుగ పరిణమించి కడపటి దేహము అస్థి మాంసవసావికారమైన మానవాకారమైన దేహమును పొంది ఈశ్వర విషయము తెలిసికొనక తిరుగ జడజన్మలకు పోయి క్రమగ్గుటకంటె జన్మ రహితము చేసుకొనవలెనను భావము (ఊహ) కలుగుచున్నది. అది వ్యక్తమయ్యే కాలము మానవునిగ నున్న తనకుకష్టమో బాధయో కలిగినప్పుడు యీ 84 లక్షల జడ జన్మలు యెత్తి రహితము చేసుకొని నుత్కృష్ట జన్మగయున్న తెలివియొక్క వికాసముగ యున్న సృష్టియందతీతమైన విషయాలు గ్రహించగలిగిన శక్తివంతమైన బలీయమైన ఆత్మస్వరూపముగయున్న మానవ వ్యక్తిత్వము మరణించిన తరువాత యేమగుచున్నది? అను ప్రశ్న మానవ దృక్పధములో ఆదినుండి నిబిడీకృతమై యున్నది. అది తెలుసుకొనుటకు ప్రయత్నము చేసిన వారలలో ప్రవక్తలు, అవతారులు, ఋషులు, తమతమ విధానములలో స్వర్గ నరకాలు సృష్టించి పాప పుణ్యములనే కర్మ కలాపములలోపెట్టి పూర్తి చేసిన వాఙ్మయమును బట్టి చూచిన జన్మ స్వర్గ నరకాలు యనుభవించిన తరువాత వస్తూయున్నట్లు కొన్ని మతాల వారు, ఆ కల్పాంతముదాక అనగా ప్రళయ కాలమనే భువన బ్రహ్మాండములు ఖిలమయ్యేవరకు ఆయా చోటులలోనే యుండునట్లు కొన్ని మతాలవారు పేర్కొన్న విధానము సరిపోవడం లేదు. స్వర్గ నరకాలనుభవించి మానవజన్మగ జన్మించినాడనే వాదముగల మతములోని వ్యక్తిని పిలిచి నీ ముందు జన్మలో యెవడవు? యే స్వర్గమునుండి లేక యే నరకమునుండి నీవు యీ జన్మకు వచ్చితివి, తరువాత యే జన్మకు యే స్వర్గ నరకమునకు పోనున్నావని ప్రశ్నించిన ఆతని నుండి జవాబు రావడము లేదు. మరణించిన తరువాత తిరిగి మానవ

జన్మగా వచ్చితినని నా పూర్వ జన్మలో ఫలానాచోట ఫలానావారు నావారని ఫలానా చోటనున్న ఆస్తులు నావని చెప్పువారలున్నట్లు తెలిపినవారిని గాంచి నీ ముందు జన్మలో నీకున్న బంధువులు ఆస్థి పాస్తులు తెలిసియున్న నీవు చచ్చిన తరువాత తిరుగ యీ మానవజన్మ యెత్తువరకు యెక్కడున్నావు? నీవా చోటులలో గలిగిన యనుభవము లేమి. ఆ తరువాత ప్రస్తుతము నీ తల్లిదండ్రులనే వారి సంతానముగ వచ్చినప్పుడు యే విధానమున తండ్రియందు ప్రవేశించితివి. ఆ తరువాత తల్లి గర్భములో ప్రవేశించునప్పుడు నీ తీరేది ఆ గర్భములో నున్నప్పుడు ఆ చోటనున్న విశేషములెవ్వి అని యడిగిన ప్రశ్నలకు నిరుత్తరుడై బేలపడి పలుకలేక పోవుచున్నాడు. కావున పై విషయాలు వాదమున వీగిపోవుచున్నవి.

మరణాంతరమున కొందరి జన్మలు భూతములైనట్లు అట్టివారి నామములు భూతములు పేర్కొన్నప్పుడు వారిని దూషించి భూత జన్మ యెత్తినట్లు నిశ్చయించుచున్నారు. ఈ లోకములో భూత గణాల జన్మలున్నవి గాన మానవుడు మరణించిన తరువాత భూతములు అవడమనే విషయము సత్యదూరము. మరణించిన వ్యక్తియొక్క పేరుతో భూతము పలుకుచున్నదేగాని మానవుడు భూతముగ మారలేదు. కొన్ని మతాలలో "సైతాను" అనే వానియొక్క అనుచరులు పై విధముగ పలుకుచున్నవని చెప్పుచున్నారు. "భూతాని యాంతి భూతేజ్య" భూతశక్తిని ఆరాధించినప్పుడు ఆ శక్తి మానవుడు సంగ్రహించగలడు. ఈశ్వరుని ఆరాధించినప్పుడు ఈశ్వరశక్తి వస్తుందని "భగవద్గీత"లో శ్రీ కృష్ణభగవానుడు పేర్కొని యున్నాడు. పై విషయాలు మరణాంతరమున ఆత్మ యేమగుచున్నదన్న ప్రశ్నకు సమాధానములుగ సరిపోవడము లేదు.

"మరణానంతరమున మానవజన్మ యేమగుచున్నది"
"అందున్న ఆత్మయొక్క పరిణామమేమి"

సృష్టికాకముందు ఈశ్వరుడే రస స్వరూపమైన తేజస్సుగా కలడనే నిజమును యెవరైనను యే కాలమందైనను కాదనలేరు. ఈ సృష్టి ఈశ్వరాదేశమున కలిగినదని చెప్పకతప్పదు. ఈ సృష్టి పంచభూతాత్మకముగనున్న సంగతి అందరు చూచుచున్నది కాదన లేని సత్యము. ఈ సృష్టిలో మానవుడు మొట్టమొదట సృష్టించ బడినట్లు (జన్మించినట్లు చెప్పబడలేదు) ఈ సృష్టి ఈశ్వరవిధానమున కలిగిన తరువాత ఆదం ప్రవక్త రూపముతో మొదటి మానవునిగ జన్మింపచేసినదని "ఖురాను" "బైబిలు" మొదలైన పవిత్ర గ్రంధ ములలో ఈశ్వరవాణి ధ్వనింపబడినట్లు పేర్కొనబడినది. వేదవిహిత మైనవాణి వైవస్వతమనువుగా ఏడవ మన్వంతరమున మొదటి మానవ రూపము లోకములోనికి వచ్చినట్లు దానికి ఈశ్వరవిషయము తెలిసి కొనే పరిజ్ఞానము కలిగినట్లు భగవద్గీతలో ఉపనిషద్గ్రంధములలో తెలుపబడియున్నది. దేవదూతలకంటె మిన్నగ తెలివియొక్క వికా సము ఆదము ప్రవక్త (మనుష్యునకే) కలదని, అదేఈశ్వర రహస్యము తెలిసికోగలదని ఖురానులో చెప్పబడియున్నది.

వీటిని అనుసరించినప్పుడు పంచ భూతాలుగయున్న, ఈశ్వర సన్నిభమైన ఈ సృష్టిలో మానవునికంటె ముందుగ గడ్డిగ పుట్టినట్లు వాఙ్మయమున తెలియబడుచున్నది. ఆత్మ ఆ తరువాత అనేక రూప ములు పొంది కొన్నిలక్షల సంవత్సరముల తర్వాత మానవ జన్మగా మారినట్లు తెలిసికొనిన విధానములో ఉపనిషద్రూపముగా చెప్పిన తత్త్వవేత్త యొక్క సందేశములో

ఉ॥ ఆదినిగల్గ దొక్క యణువైనను తేజముదక్క దానిలో
నాదముపుట్టి యాకళను నాకము, జీవులు భూతకోటియై''

నదన్న ప్రవచనములకు తార్కాణము నాదము.

నాదము యనిన అభౌతికమైన "నేన" ను ధ్వని పుట్టినది. అదియే "ఆవిరాట్టునుండి ఆనాడు తెగిపోయి ఆవిర్భవించి మర్త్యాకారము పొంది" అన్నవిషయమునకు వచ్చి ఆదిలో మానవరూపమైన నాదము "నేను" "అహం" ఈశ్వరుని నుండి పంచభూతములుగా మారి వాని అంత్య పరిణామము తిరుగ మానవుడుగా నిర్మాణమైన ఏ నాదము ఈశ్వరుని లోనుండి తెగి మానవరూపము పొందిననోట "నేను" ను ధ్వని ధ్వనించ బడుచున్నది. అదియే "ఆత్మ" అను సత్యమునకు తార్కాణము.

నాదముయన్న "నేన"ను ధ్వని పుట్టినది. అదియే ఏ అవతారి, ఏ తత్త్వవేత్త, ఏ ప్రవక్తయైనను చెప్పిన "నేన" ను ధ్వనిని తెలుసు కొన్న ఈశ్వర రహస్యము తానుగ యున్నదని నిరూపించిరి. అదియే ఏసుక్రీస్తు "నన్ను" "నేన" ను నది తెలుసుకొన్న ఈశ్వరుని తెలుసు కోగలరన్నాడు. శ్రీ మహమ్మద్ వారు తమ "మెహరాజ్" విష యమును చెప్పుచు "ఆల్‌రాయ తెరబ్బి బెరబ్బి" నేను ఈశ్వరుడనై ఈశ్వరుని తెలుసుకొన్నానన్నారు. వేద వాఙ్మయములో ఋష్యాది యవతారులు "అహం బ్రహ్మాస్మి" అన్నారు. పై వాక్యములను బట్టి నేనే ఈశ్వరుడని తెలుసుకోవలసినదిగా యున్నది.

"నేను" అను నాదము పంచభూతాలుగా మారి దానిలో ధ్వని "నేన" ను నదే ఆత్మయయి తనకు తన జన్మభూమి యయిన విరా డ్రూపము పొందుటకు ప్రయత్నించు చున్నది.

పంచభూతాత్మకమైన ఈ సృష్టిని ఉపమానంగా నొక మామిడి చెట్టును పోల్చిన, ఈ వృక్షము మనము పుట్టకపూర్వయే యుండియు న్నదని అది పుట్టుకకు ఏది కారణమై యుండి యుండునన్న విషయమును విచారించిన తెలియడములేదు. కాని వసంతఋతువు వచ్చినప్పుడు ఆ చెట్టు పూసి అది కాయయై ముదిరి పండై క్రిందపడిన ఆ పండును చిదిపి చూచిన దానిలో టెంక కనబడుచున్నది. అదియే తిరుగ

భూమిని పాతిన మొలకలెత్తి మొక్కయై కొమ్మలు కలిగి విస్తరించి ముదిరి ఒక కాలమునకు తిరుగ వసంతకాలమున పూసి కడకు పండుగా మారినప్పుడు దానియందు పూర్వము భూమిని నాటిన టెంకయే కన బడుచున్నది. అలాగుననే ఈశ్వర రసస్వరూప తేజస్సునుండి విడివడిన మానవరూపముయొక్క అంశమున మిళితమైన తేజస్సు ఈ పంచభూ తాత్మకమై విస్తరించి జగత్తయి తిరిగి మానవ వ్యక్తిత్వమైన సంగతి ఈ వృక్షముయొక్క ఉపమానమునుబట్టి తెలుసుకొనగలము. ఏ చోటు నుంటి తెగినదో అదేచోటుకు చేరి అదిగా మారవలెనన్న సంకల్పము నకు సరిపోవుచున్నది. శృతిలో "అణోరణీయాన్ మహతో మహీ యాన్ ఏషోఽణురాత్మ" ప్రతి ప్రత్యగ భిన్న సూక్ష్మాణువులుగా యున్న ఈశ్వరతేజస్సు ఆత్మగా యున్నది. అదియే జగత్తని చెప్పి అది తెలుసుకొన్న ఈశ్వరుడే తాను, తానే ఈశ్వరుడన్న సంగతి శ్రీ కృష్ణభగవానుని విశ్వరూపమున తెలియబడున్నది. ఆ విశ్వ రూపముగాయున్న ఆత్మ మానవ వ్యక్తిత్వము భిన్నమై జగత్తై వెలసి తిరుగ శ్రీ కృష్ణుని రూపమున మానవ వ్యక్తిత్వముగా నిర్మాణమైన సంగతి భగవద్గీతలో తెలుపబడినది. అట్లే "మెహరాజ్" లో శ్రీ మొహమ్మద్‌వారి వ్యక్తిత్వము తెలియబడుచున్నది.

పై విషయము తెలుసుకొనవలెనన్న తత్త్వవేత్త చెప్పినట్లు "తనువు మీరే మనము మీరే కనులలోపల పాప మీరే తను నెరిం గిన తత్త్వమందు తనకుతానై తెలియుచుండ తనువు వేరే బాయ నేరదు" అలా సర్వ దేహముతో సహా "నేనన్న" శక్తి సంపదగా యున్నప్పుడు మానవ వ్యక్తిత్వముతో సహా ఆత్మగా ఈశ్వర తేజ స్సుగా మార్చగలిననగిప్పుడు ఈశ్వరుడు తానుగా యున్నాడుగాన అటువంటి అలౌకిక విషయము తెలుప గలుగు "సద్గురువు" దొరికి దానితో సమానమైన విషయమునకు వచ్చిన ఆత్మ ఈశ్వర తేజస్సు

తో కలసిపోయి జన్మలకు రాదు. దేహము పంచభూతాలుగా స్థిరమై పోవును. అలాకాక తెలుసుకోలేని ఆత్మ సృష్టిలో బడజన్మలుగా స్థావరజంగమాత్మకములైన రూపములు దాల్చి ఆకల్పాంతము వరకు వుండిపోవును.

విరాడ్రూపమునుండి విడినధ్వనియే "నేన" ను పంచభూతాలుగ అనగా ఆకాశము, భూమి, నీరు, నిప్పు, గాలి వీటిలోనున్న శక్తి ధ్వని, వాసన, రుచి, తేజస్సు, స్పర్శ ఖువి మానవునిలో గ్రహణేంద్రియ ములు అనగా చెవులు, ముక్కు, జిహ్వ, కన్నులు, అస్థిమాంసవసా వికారమైన చర్మములనునవి. జ్ఞానేంద్రియములనగా వీటియందుగల శక్తిని ఆఘ్రాణించునవి, చెవులవల్ల ధ్వని, ముక్కువలన వాసన, జిహ్వ వలన రుచి, కనులవలన తేజస్సు అస్థి మాంసవసావికారమైన దేహమును కప్పియున్న చర్మమువలన స్పర్శయు తెలియబడు చున్నది.

పై విషయములు ఒక మానవునుద్దేశించి యిది ఎవరు ఆఘ్రాణించి తెలుసుకొనుచున్నారని ప్రశ్నించిన "నేను" అను చున్నాడు. వాస్తవమున సర్వమతాలు సర్వజాతులు యింతయేల సర్వమానవకోటి ఆ ప్రశ్నకు జవాబు యివ్వవలసి వచ్చిన "నేను" అనే ధ్వనిని ధ్వనింపజేయగతప్పదు. కావున యీ "నేను" అనేదే ఆత్మ యీ "నేను" అనేదే ఆదిని యీశ్వరుని నుండి తెగినధ్వని అది ఆవిర్భ వించి పంచభూతాలై ఆదిని సృష్టి అనిపించి ఆ సృష్టిలో గడ్డిమొదలు మానవునివరకు 84 లక్షల జీవగణాలలో ధ్వనించి కడకు మానవజన్మ గావచ్చి తిరుగ తన ఆదిస్థానము విడిపోయినచోటు విరాడ్రూపము పొందుటకు అధ్యాత్మికముగా యీకీలు తెలిసిన "సద్గురువు" ను (గుణరహితమైన) ఆశ్రయించి అఖౌతికమైన ఆముడి తెలుసుకొని తరించుటయున్న ఆ రసస్వరూపములో, చేరిపోవుట అలా చేరజాలని

ఆత్మలు లోకములో ఏదోయొక జడజన్మగాయున్న పదార్థరూప దేహధారిగా వాటిలో యిమిడి ఆకల్పాంతముదాక (ప్రళయము) యుండి ప్రళయకాలముతో బాటు యీ పంచభూతాలు నశించు చున్నవి. నశించిన సృష్టితిరుగ ఆ విరాట్టులో కలసిపోవుచున్నది. కావున సాయుజ్యము పొందిన మానవాత్మ తన సహజ జన్మస్థానమైన రసస్వరూపములో కలసి తిరుగ జన్మకు రానేరాదు. అలా పొందని ఆత్మలు జన్మ జన్మాంతరములు జడజన్మలుగా పుట్టుచు గిట్టుచు ఆకల్పాంతముదాక మొలకెత్తవలసియున్నది. అటువంటి జన్మలే యీ చెట్లు, చేమలు, జంతువులుగాయున్నవి. అందుచేతనే మానవవ్యక్తి త్వము పొందిన ఆత్మ తనకు కష్టమో, బాధయో వచ్చినప్పుడు స్వామీ నాకీజన్మ ఎందుకిచ్చావని అర్చుచున్నాడు. "సహజ మాకర్షకముగాదే జన్మభూమి" ఆత్మ విరాడ్రూపములోనిది కాబట్టి తన స్థానమును మాటిమాటికి కోరుచున్నది. సాయుజ్యము పొంది మరణానంతరము ఆత్మ ఈశ్వరునిలో కలియుచున్నది. కానివి యీ లోకములోనే ఏదో జడజన్మలుగా యుండిపోవుచున్నవి.



# ఆ ర్థిక ము



ఆత్మ మానవ వ్యక్తిత్వము పొందిన తరువాత అతనిలో వచ్చే వృద్ధాప్యమనే మార్పు చాల శోచనీయంగా ఉంటుంది. అతనిలో యవ్వనమనే విషయం వచ్చినప్పుడు తన సంసార విషయం నిర్వర్తించవలసిన విషయం, బాధ్యత అతని భుజస్కంధములపై మోసియున్న సంగతి ప్రతి మానవజీవికి అనుభూతిలోవున్న విషయము.

ఈ కాలంలో తాను తిలకిస్తున్న విషయం సంసార బాధ్యతాయుతంగాయున్న ఆలుబిడ్డలను పోషించేభారం తనపై నున్నదనే విశ్వాసంతో శ్రమపడవలసియున్నది. ఈ సంసార వ్యవధిలో సంతాన విషయం సంభవించి, తన జీవితంలో క్రొత్తమలుపు మార్గం అనుసరించి అన్వేషించవలసి యున్నది. అది ఆర్థికవిధానంలో సరిపోతుందని ధన మార్జించడము కొరకు గడంగుచున్నాడు. తనకు కలిగిన సంతానము భవిష్యత్తులో ప్రజ్వలంగా ఉండులాగున ఆకాంక్షించు చున్నాడు. వారియొక్క అదృష్ట ప్రజ్వలనలో తాను కూడా భాగస్తుడై ధన మార్జించుటలో ప్రయత్నము చేయుచున్నాడు. ఆ ప్రయత్నము సఫలీకృతమయితే సంతసించు చున్నాడు అవి సార్థకం కాకపోతే విచారించుచున్నాడు. ఒక కాలానికి అతని జీవితంలో వృద్ధాప్యం దాపురించక మానుటలేదు. వృద్ధాప్యమూలమున తన శరీరమునకు అంకురించిన నికృష్టతను ఆలోచించి, చూచి, ఖేదపడుచున్నాడు ఒక తత్త్వవేత్త ఏమన్నాడూ అంటే తన జీవిత మనుగడలో ముందుగా యౌవ్వనంలో సంసార బాధ్యతాయుతుడై తన జీవితం, సంసార విధానంపై దృష్టి పెట్టి తన ఆర్థిక విధానం ఏ విధమైన పరిణామంలో వున్నదో యోచించి తన మనస్సుత సాగించమన్నాడు.

(అనగా) (శతాయుః పురుషః) వంద సంవత్సరముల ఆయుష్షులో తన అదృష్ట భాగ్యవిశేషం పది సంవత్సరములే వున్నది. గాన దానినే దశ అని పిలుస్తున్నారు కాబట్టి ఆ దశ తన కంకురించే సమయం నుంచి దానిపై దృష్టిమోపి తన జీవితాన్ని చాలా జాగ్రత్తగా పరిశీలనా రూపంలో తన జీవిత విధానం గడపవలసి వుంటుందని తెలిసికోవలసిన విషయం ముఖ్యమైనది అన్నాడు.

ఎప్పుడైతే తన జీవితంలో దశ అను విషయం అంకురించిందో వచ్చే విషయాలపై తబ్బిబ్బు పడక తను ఆర్జించిన ఆర్జనలో చెరిసగము సంసార కుటుంబ పోషణార్థమై వినియోగిస్తూ, మిగిలిన అర్ధభాగంలో సగం తన సంతానం భవిష్యత్తున్ను గురించి వినియోగిస్తూ, కడమ సగం తన సంతానమునకు తోడ్పడునట్లు మూలముగాచేర్చి జాగ్రత్త పెట్టమన్నాడు. ఈ పది సంవత్సరముల ఆర్జన భాగ్యాభివృద్ధిలోనూ నీకు వృద్ధాప్యమనేది ఉంది కాబట్టి నీ భాగ్యదశకాలంలో 3 సంవత్సరములు నీవనుకొనే దానికంటే ఉత్కృష్టముగా భాగ్యము కలుగుచున్నది కాన, నీకు వచ్చే వృద్ధాప్యాన్ని గడుపుటకు ధనావసరం ఉంది కాబట్టి ఆ విషయానికై తోడ్పడు నట్లుగా విపరీతంగా ధనార్జన కలుగు కాలంలో ఆర్థిక వ్యవస్థలు అన్నీ సమకూడగా, మిగిలిన ధనము నీ వృద్ధాప్య విధానంలో నీకు ఉపయోగపడు విధానంగా సమకూర్చవలసి యున్నది గాన అది నెరవేర్చగలవు. అప్పుడు ఆ ముసలికాలం వచ్చినప్పుడు యీ మూడు సంవత్సరములు నీకు అంకురించిన ధనముమ పోగై యున్నరీతిని, ఒకర్ని లక్ష్యపెట్టక నీ జీవితాన్ని నీవు గడుపుకోగలవు కాబట్టి ఆ వార్ధక్యాన్ని దృష్టిలోవుంచి ధనార్జన చేయుదువుగాక.

కాని మానవునిలో బలీయమైన అశక్తత ఏమిటంటే యీ భాగ్యదశ వచ్చే మూడు సంవత్సరములలో నీకు కలిగే అపారమైన ధనములో ఆర్జనరూపంలో చూచి తబ్బిబ్బై మిగిలిన జీవిత కాలమంతా స్థిరీకరించి, యీ రీతినే కాలము గడచునని నిశ్చయించుకొని గర్విమై,

తన తోడి మానవులను చులకనచేసి, తన జీవిత మనుగడ విధానం మరచి కడకు సర్వవ్యాప్తియైన యీశ్వరుని విస్మరించి కాలము గడుపు సమయములో నీకు ముసలికాలము ఆవహించుట మానుటలేదు. అటు వంటి కాలము దాపురించి నపుడు తన సంతానము దరి చేరుచున్నాడు. ఆచోట వారివారి సంతానమును పురస్కరించుకొని, నిన్ను చులకనగా చూచినప్పుడు వారియొక్క నిర్లక్ష్యమును చూచి వారిని నిరసించి నపుడు, వారు తన్ను అనరాని మాటలు అన్నప్పుడు విన్నవారి దారా పుత్రాదులు నిన్నుచూచి అసహ్యించుకొని నీ వైపు తీసికొనివచ్చు అవాంతరములను వారి తండ్రితో (అధిపతితో) చెప్పినప్పుడు తన తండ్రి యైనప్పటికి, తన అహంకారము ఆ తండ్రిపై చూపి, ఆ సంతానం తన్ను యిల్లు వెడలగొట్టి నప్పుడు, ఆ ముసలి కాలంలో తాను అను భవించు నికృష్ట కష్టాలకు, ఇతరులచే ఆడబడిన మాటలకు తాను ఎంత కష్టములకు పాల్పడుచున్నాడో అతనికే విదితము ఇదే నరకము.

ఆర్థికవేత్త చూపించిన విధానము నీవు తప్పక అనుసరించవలసి యున్నది. నీ యవ్వన ఆర్జన సమయములో నీకు కలుగు ధనములో రూపాయలో పదహారు అణాలు ఉన్నాయని నిశ్చయించి, నీవు లక్ష్య పెట్టక వ్యయము చేయునప్పుడు, ఒక అణా తరువాత ఒక అణా తరిగి అంత్యమందు సూన్యమే మిగులుతుంది. అలా కాకుండా ఆ యౌవ్వన ఆర్జన విధానము గౌరవించి, ఆ ఆర్జించిన రూపాయలను ఖర్చుపెట్టక ఒక అణా తరువాత ఒకఅణా చేర్చిన అదే 16 అణాలై రూపాయకు రూపాయి పెరుగుచున్నది. కాన ఆర్థిక విధానఖర్చుకిన్ని, ఒబ్బిడికిన్నీ హస్తిమ శకాంతం అనగా భూమ్యాకాశాలకు ఉన్న తేడా వున్నది కాబట్టి, ఒబ్బిడి విధానము అవలంభించి ఇతర దృష్టికి నికృష్టత అనిపించ కుండా సార్థకుడవై, సంతోషివై నీ జీవితకాలము ఆనందపరవశుడవు అవుదువు గాక-నీవు చేర్చుకొన్న ధనమును చూచి ఆ ముసలికాల మున తోడ్పడినందుకు హర్షించెదవు గాక.

# గు రు వు

మానవుని భావము ఈశ్వరుని తెలుసుకొనవలెనని అది తెలుసుకొనకపోయిన మానవజన్మసార్ధకము కాదని తిరిగి జన్మజన్మాంతరములు యెత్తవలసియున్నదని యిటువంటి జన్మలు యెన్ని యెత్తినప్పటికి జీవ రహస్యము తెలుసుకొని జీవజడత్వము రహితము చేసుకొని జడస్వరూపమైన జీవరూపములోనున్న ఆత్మను ముక్తిస్వరూపము అనగా ఈశ్వర తేజస్సుగ పరిణామంపొందిన విషయమునకు రాకపోతే జన్మ రహితమైన స్వరూపునిగ (సాయుజ్యునిగ) మారలేదు గాన అటువంటి పరిణామమురాని కారణంచేత అది యెన్నోసార్లు మానవజన్మలు యెత్తినప్పటికి సాధ్యంకాదని ఆ ముక్తి, ఆ సాయుజ్యము నేను అన్నదిగా యున్నదని ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు చెప్పుచున్నారు. ఇదియే "భాగవతమందు" "తన్నెరుంగక కర్మతంత్రుడై కడపట ముట్టడు భవశతములకైన" నేను అనునది తెలుసుకొనక ప్రాపంచిక కర్మ రూపములైన విధానములో నిమగ్నుడై ఆయుస్కాలము పూర్తియై మృత్యువాతపడి నశించిన యిటువంటి మానవజన్మలు వేయి యెత్తినప్పటికి తిరిగి జడజన్మలు పొందవలసి యున్నదిగాన "నేన"ను ధ్వనియొక్క ప్రాతిపదికము తెలుసుకొని తరించుమార్గము వెతికి సిద్ధిని పొందవలసిన అవసరము ఎంతయుకలదని పై వాక్యముయొక్క భావము.

ఈ విధంగ జన్మరహితము చేరుకోవలెనను ఊహ మానవులలో స్వాభావికముగ నున్నది. అది మానవునిలో కష్టమో బాధయో కలిగినప్పుడు "స్వామి! నాకీజన్మ ఎందుకిచ్చావు" అని అర్చుచున్నాడు. ఈ మానవజన్మయొక్క ఆకారము మానవాతీతమైన బ్రహ్మ, విష్ణు

మహేశ్వరుల ఆకారములతో సరిపోలియున్నది. ఆ విధానములో పరికించిన మానవాకారమున కతీతమైన ఆకారము యింకొకటిలేదని స్థిరీకరించవలసియున్నది. అటువంటి ఆకారమునందు వెలువడిన ధ్వని "నేను" అని ఆ యాకారములోనుండి ధ్వనింపబడుచున్నది. దానిని తెలుసుకోవాలని ప్రయత్నముచేసి ఆ ప్రయత్నము "తెలిసిన సద్గురుని" వలన ప్రాప్తమగునని ఋష్యాదులు చెప్పిన విషయమును పురస్కరించుకొని జన్మరహితము చేసుకొనవలెనని యభిలాష కలిగిన వ్యక్తులు అటువంటి గురువులను ఆశ్రయించవలెనని ప్రయత్నమునకు గండగుచున్నారు. అటువంటి విధానమునకు వచ్చిన వ్యక్తులలో ప్రయత్నించువారు యదార్థమయిన సద్గురువును ఆశ్రయించలేకపోవుచున్నారు. కారణము బాహ్య వేషధారణలో గురుస్వరూపం చిత్రించబడుటయే. ఇప్పుడు మనకు గోచరించు గురువులు కాషాయవస్త్రధారులు దండకమండల రుద్రాక్షలు ధరించినవారు తలను మట్టిపాలతో పెద్దజడలుగ మార్చిన జడధారులు గడ్డముగాని రోమరహితమైన బోడిగుండుగాని కలిగి ఏ ఉపనిషత్ శ్లోకములో, వేదసూక్తులో భాగవతాది గ్రంధముల లోని పద్యరాజములో ఆధ్యాత్మిక కందార్థములో వల్లించి ఉపమానములిస్తూ, భగవద్గీతను ఆమూలాగ్రంగా పఠిస్తూ గీతాసారము యావత్తూ తమకు తెలుసుననీ నిమీలితలోచనులై ప్రబోధించుచున్నారు. వారు పుట్టిన కాలమందు వారి తలిదండ్రులు పెట్టిన పేరును వదలివేసి గగనానంద, ప్రణవానంద, తీర్థులు, తీర్థస్వాములు బాబాలనే పేర్లుగ మార్చుకొని కొన్ని పడికట్టుమాటలు నేర్చుకొని అపర పరమాత్మ స్వరూపులుగ నున్నవారమని కొంతమందిని ప్రచారకులుగ నియమించి దేశ నలుమూలలకు పంపించి ప్రచారము చేయించుచున్నారు. అట్టి విధానము మానవ స్వభావములో ఈశ్వర విషయము తెలుసుకొని తరించాలనే ఆవేదన ఆ ప్రచారకుల పొగడ్తలతో కూడిన మాయా

ఆధ్యాత్మిక రూపుల పడికట్టు మాటలను నమ్మి వారు చెప్పిన గురువు లనబడువారిచోట్లకుపోయి తరించు మార్గములను తెలుపవలసినదిగ అర్థించి వారివలన ఉపదేశింపబడిన మంత్రమును మననముచేసి వారి ప్రబోధములను విని తమ ఊహలకు అందని పరిస్థితులలో వారి పద జాలముండుటచే అట్టివారు గురువులుగ యున్నప్పుడు వారు కేవలము పరమాత్మ స్వరూపులని నమ్మి వారిని నిజగురువులుగ నిశ్చయించు చున్నారు.

అటువంటి విషయంగయున్న యా తత్వరూపములను (గురువులు) వారి నిజస్వరూపము జ్ఞానశూన్యులని బూటక వేషధారులని వెల్లడి కాగానే ఆయాచోట్ల నుండి విరమించి పలాయనమగువారు కొందరు మోస వేషమని వెల్లడియయినప్పుడు జనవ్యాప్తంగా దూషణగ నిరశించినప్పుడు ఆ న్యూనతకు పాల్పడువారు కొందరు.

ఈ గురుస్వరూపాన్ని యింగిత రూపంగా మార్చి ప్రజా దృష్టిలో హీనస్థితికి తీసుకొనివచ్చి నాస్తికులు అవహేళనచేసే దురవ స్థకు తెచ్చి యీ ఆధ్యాత్మిక తత్వస్వరూపమైన ఈశ్వర యేకత్వ ప్రతిపాదనలను నొక దూష్యమయిన విషయంగా మార్చినారు.

"గురువు" అన్నప్పుడు ఆ నామమును ధరించి తనయెదిరివాని నోట ఉచ్చరింపబడినప్పుడు ఆగురువుగా నియమితమయినవ్యక్తి తనకు తాను విమర్శించుకొన వలసియున్నది. తాము విమర్శించుకొని, విమర్శనా రూపములో మొదట తను ప్రశ్నించుకొనవలసిన విషమయి ఉన్నది. అట్టిరూపంలో తనకు తాను ప్రశ్నించుకొన వలసిన ప్రశ్నలు.

1. తాను గుణరహితమైన సర్వసాక్షిగా నున్నానా?
2. తనశిష్యుని దృష్టికి తాను యేవిధమైన పరిణామము కలుగ చేయ

గలనని అది భౌతిక, అభౌతికముగా నున్నప్పుడు యిది గురువు యొక్క ఆశీర్వాదమని శిష్యులు తెలుసుకొనునట్లు చేయగల తన ఆత్మీయమైన శక్తి సమర్ధనీయమైనదిగ నున్నదా?

3. నిజముగాతాను సద్గురువైయున్న తాను పయనించిన తత్త్వరూప మయిన బాట తన శిష్యుడు తెలుసుకొని, గ్రహించి నాతడు కూడా ఆ విధానమైన బాటను యనుసరించి ప్రయాణము చేయు చున్నానని తెలుసుకొనునట్లు ఆతని ఆత్మ సాక్ష్యమిచ్చునట్లు న్నదా?

4. తన శిష్యునకు వచ్చిన ఆపదలందు తాను భౌతిక, అభౌతికములుగ తోడ్పడ గలుగుచున్నానా?

5. భ్రాంతిజ్యనమైన వూహలు తన శిష్యునకు కలిగినప్పుడు తాను గ్రహించి తన అనుభవములో ఆ భ్రాంతిశక్తిని యే విధముగా నిర్జిం చినది తెలిపి, యెవరైతే సాయుజ్యముకోరి ప్రయాణము చేయు చున్నారో అట్టివారి మతిని మార్చి ఈ భ్రాంతి శక్తి లోక విష యాలప్రక్కకు త్రిప్పి జడజన్మలకు దారితీసి తాత్కాలిక సుఖము లకు దాసునిగ జేసి క్రింది మెట్లకు తీసుకొనిపోయి జడజన్మలుగ మార్చుచున్న సమయాన తాను అభౌతిక శక్తిగా మారి అటువంటి స్థితిని నిల్చి తాను సాక్షాత్కరించి శిష్యరూపమున నున్న వ్యక్తిని జన్మ జన్మాంతరములకు తీసుకపోవు భ్రాంతియను చీకటికూపంలో పడనీయకుండా భౌతికంగా, అభౌతికంగా తాను శిష్యునకు సాక్షా త్కరించి తాను చేయిచాచి కాపాడిన ఆ స్థితిలో కాపాడిన వ్యక్తి తన గురువేయని శిష్యుడు గ్రహించగలుగునట్లు నిరూపించ గలుగుచున్నానా!

6. ఈ కృత్రిమయోగులు చెప్పే భౌతికమైన శరీరమునుండి ధ్వనించు "నేను" అనునది ప్రకృతి సిద్ధమైన జడభావమునకు దారితీయు

నదిగా తెలిపి, ఆది శ్వాసగా చెప్పబడు వూపిరి ఆగిపోయినప్పుడు సమసిపోవునదని తెలిపి, యదార్థమైన "నేను" అను ధ్వని దృశ్య రూపమున ప్రకటింపబడు సూక్ష్మ శరీరమునుండి వచ్చిన ధ్వనియని అది అభౌతిక శ్వాసతో కూడిన మహాశక్తి స్వరూపమైన ఈశ్వర సంభూతమైన రస స్వరూపముగా యున్న క్షీణమైన తేజస్సుగ నిరూపణ చేయగల శక్తివంతుడనై యున్నానా?

7. ఈ తెలిపిన నేను జగద్రూపివి, విశ్వరూపంగా నున్నానని తానై తన శిష్యుని నా స్థితిగ మార్చగలనా?

8. తనముందు యెదుటవ్యక్తి తనను సందర్శించినప్పుడు తనయందు శాంతము, సుహృద్భావము, వోర్పుతో కూడిన ప్రశాంతత కల్గి యున్న చిరునగవులతో కూడిన వ్యక్తిత్వముగ యెదటివాని దృష్టికి తన ముఖారవిందమందు గోచరింపబడుచున్నానా?

9. తనలో అహంకార సన్నిభమయిన వ్యాకులత్వము వచ్చినప్పుడు తాను నిరూపించు అహంకారము ప్రజాదృష్టికి సమంజసమయిన దని తోచుచున్నదా?

10. తనను యితరులు న్యూనతచేసినప్పుడు, అదిసహించి శాపరూపము తనహృదయములోనుండి వెలికి ధ్వని రూపముగగాని ధ్వనిరహిత మయిన భావమునగాని రానియ్యక నొకరికి అపకారము కలుగ నట్లు సమర్థించుకొను సమర్థుడనేనా?

పై ప్రశ్నలు వేసుకొని అవి తన అనుభవమందు స్థిరమయి ఆ విధంగా మారిననాడు అటువంటి వ్యక్తి గురువు అని క్షర రహిత మయిన రెండక్షరములు ధరించి నిరూపణ చేయుటకు అర్హుడు.

అటువంటి వ్యక్తిని వెదుకుట అవసరము. అటువంటి వ్యక్తి లభ్యమైనప్పుడు ఆతనియందు యీ పై విషయాలు నిరూపణమైనప్పుడు

ఆతనిని ఆ(శయించి ప్రిదోధింపబడి మాటిమాటికి వచ్చిన సంశయ ములను ప్రిశ్నించునప్పుడు ఆ గురు స్వరూపమునుండి వచ్చు సమాధాన ములను శిష్యరూపములోనున్న ఆత్మ (గహించి అధ్యాత్మికముగ నొక స్థితినుండి యింకొక స్థితికి మారి మారుచున్నట్లు శిష్యరూపమున తెలుసు కొన్నప్పుడు తనకు కలుగు ఆనందమున సాయుజ్య స్థానము నకు తాను పయనించునట్లు నిర్ధారణయయి ఆసమయమున కలుగు ఆనందము వ్యక్తం చేసి తృప్తిని స్థిరీకరించ గలిగినటువంటి స్థానము అలంకరించిన అట్టి స్థితికి తీసుకు రాగలిగిన వ్యక్తి నిజముగా "సత్" యే గురుస్వరూపమని తెలియబడగలదు. అటువంటి గురుస్వరూపము త్రిమూర్త్యాత్మకమైన బ్రహ్మ విష్ణు మహేశ్వరులకు మించి "స్వయం బ్రహ్మ" యని శృతినిరూపణ చేసినది. ఇటువంటి వ్యక్తిత్వముగల గుణరహితమైన గురువునే సద్గురువు అనవలెను.

ఈ స్థితులలో నిర్ధారణ కాబడినవాడే గురువు. అతడే గురువు విశ్వరూపి. అవతారి. ఇట్టి గురువును ఆశ్రియించ గలిగినవారు, సాయుజ్యము బడయగలరు.

# సద్గురువు

అధ్యాత్మికం అన్నప్పుడు మానవశక్తికి (మానవాత్మకు) అతీతంగా ఉండే మహాశక్తి ఉందని తెలియపరచే విషయంగా ఉన్నది. "ఏతద్విషయే తత్పూర్వం ప్రాచీనం" ఏ విషయమైతే మానవత్వం ఉందో దాని పూర్వరూపంలో యీ ఆధ్యాత్మికం ఏ రూపంలో నిరూపింపబడినది? అని ప్రశ్న వచ్చినప్పుడు ఋషిప్రోక్తమైన ఋగ్వేదాది అంతమందువచ్చిన అభౌతికమైన ధ్వని మీద మోసియున్నది. వేదాలనుండి నాలుగు విధములైన ధ్వనులు వచ్చాయి. ఆ ధ్వని ఏవిధంగా ఉంది అన్నప్పుడు మానవవ్యక్తిత్వం యీశ్వరవిషయంగా మారే విధంగా ఆనాటికే నిరూపణ అయిపోయింది అదే ఏవిధంగా ఉందన్నప్పుడు 1) తత్వమసి 2) అయమాత్మ 3) ప్రజ్ఞానం బ్రహ్మ 4) అహం బ్రహ్మాస్మి యీ నాలుగు వాక్యాలు వేదముల యొక్క అంతమందు వచ్చేయికాబట్టి యీ ఆధ్యాత్మిక విధానానికి వేదాంతం అని పలుకు తున్నారు. తత్వమసి = అది నీవు అయితివి ఏది నీవు అయితివి? అను ప్రశ్న వచ్చినప్పుడు అయమాత్మ = అది ఆత్మపరిణామంగా ఉంది. ప్రజ్ఞానం బ్రహ్మ = అది జ్ఞానసాధనా స్వరూపంలో బ్రహ్మను తెలిసికొనే విధానంగా ఆత్మయొక్క పరిణామరూపంలో ఉంది. అలా తెలిసికొన్నప్పుడు, ఏది యీశ్వర విషయమైన బ్రహ్మగానున్నదని తెలిసినప్పుడుఅహం బ్రహ్మాస్మి = అహం = నేను, బ్రహ్మ = బ్రహ్మను అస్మి = అయితిని అన్నప్పుడు, యీ అస్మి అను ధాతువున్ను నిరూపించు కొన్నట్లయితే వచ్చేపరిణామం ఏమిటంటే "స్వయంబ్రహ్మన సందేహః" తానే బ్రహ్మనని, యిదిమానవవ్యక్తిత్వం, ఏ రూపంతో ఎలాగ తెలిసి కొందని ప్రశ్నవచ్చినప్పుడు తత్వవేత్త ఏమిప్రవాసాడంటే "ఆ విరాట్టు

నుండి ఆనాడు తెగిపోయి, ఆవిర్భవించి మర్త్యాకార మందగ" విస్తరించి పొందిందన్నప్పుడు మానవాకారమైన అణువు సృష్టిగా విస్తరించింద న్నాడు అదే బ్రహ్మస్వరూపం, అనగా తనేబ్రహ్మ స్వరూపంగా నిరూపణ అయ్యింది.

పంచభూతాత్మకమైనటువంటి ఆత్మస్వరూపం శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు. ఇవి తత్వవేత్త చెప్పినట్లు మానవుల్లో ఆఖరున బ్రహ్మస్వరూపంగా వ్యక్తమౌతుంది. అలా పరిణామం పొందని ఆత్మకు అది వ్యక్తమౌతున్నంత మాత్రాన మానవరూపంగా జన్మవచ్చినంత మాత్రాన, మానవ పరిణామం రాలేదు.

ఈ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు వంటి పంచభూతాల్లో ఉన్నఆత్మీయమైన స్వరూపం మానవునిలో వ్యక్తమైనా వాటిపరి ణామం విస్తరింపజేసి అభౌతికంగామారి పంచభూతాలలో మిశితమైన ప్పుడు దానియొక్క లీనమే విశ్వరూప పరిణామము. అదే శ్రీకృష్ణ భగవానుడు, మహమ్మదు ప్రవక్త రూపాలు. ఆ విధానంగా మారిన వాడే మానవుడు. ఇది విరాడ్రూపంనుండి మానవరూపమైన అణువుగా విడిపోయిన తరువాత విస్తరించి మానవరూపంగా వచ్చే వరకు 84 లక్షల జీవరాసులుగామారి, రహితం చేసుకొని మానవునిగా వస్తేగాని, ముక్తిలేదని, ఏకాగ్రతగా యీ జన్మలన్నీ ఖిలంచేసుకొని మానవుడుగానున్న విషయం ఓంకారంగా ఉంది. అందుచేతనే తత్వవేత్త ఓంకారమే జీవమని నమ్మమన్నాడు. ఓంకారరూపమైనధ్వని తల్లిగర్భములో అండరూపమైన విషయం పిండరూపంగామారి, బయటకు వెలువడే సమయమునందు (జననమందేకాలమున) యీ ఓంకారముచుట్టును శూన్యరూపమైన పరిధి భ్రాంతిరూపంగా ఆవహించి వెలువడి, జననమై, పెరిగినకొద్దీ అవ్యక్తిత్వరూపంలోవచ్చు ఊహా రూపములు ద్వైదీభావం పొందుచున్నవి. ఇటువంటి వ్యక్తిత్వం

1) యీశ్వర విషయం వ్యక్తంచేసికోవలెనని 2) భ్రాంతిరూపమైన ప్రాపంచిక విషయాలలో ఆశాబద్ధమైన భావరూపంలో నిమగ్నమై తనముక్తిని నాశనము చేసికొనుచున్నది. ఈఆత్మ మానవవ్యక్తిత్వం పొందడానికి కారకులైనవారు తల్లిదండ్రులు. వారితపస్సు ఫలియించి వారివల్ల ఆత్మ మానవవ్యక్తిత్వం పొందినది కాబట్టి, వారితపః ఫలము వలన ఆత్మకు మానవవ్యక్తిత్వం సంప్రాప్తమైనది. అది యీశ్వర విషయాన్ని వ్యక్తం చేసికొనేస్థితిలో యున్నది గాబట్టి అది అత్యజన్మ. దానికి కారణమైన తలిదండ్రులు చిరస్మరణీయులు సదా వందనీయులు.

శ్రీకృష్ణభగవానుడు ఏం చెప్పాడంటే "అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత-అవ్యక్త నిధినాన్యేవ తత్రికా పరిదేవనా" జడ జన్మలలోనుండి తెలిసికొనే జన్మగా మానవజన్మ ఎత్తేవు కాబట్టి యీ జన్మలోనే మానవత్వంలో యీశ్వర విషయం తెలిసికోకుండా పడిపోతే (చనిపోతే) తిరిగి జడజన్మలకు పోవుచున్నావు ఓ అర్జునా అని అర్జునుని లాంటివానికి చెప్పాడు. పంచభూతాత్మకమైన లరుడైన అర్జునుడు, రసస్వరూపమైన శాశనమైన తేజస్సైన అవతారరూపియైన నారాయణు డైన శ్రీ కృష్ణభగవానునిగా మారవలసినదిపోయి, నరుడుగానే జడ జన్మలకు పోయాడు. అటువంటి విషయంగా ఉన్న మానవజన్మ యింకొక జన్మ వుంది అని భ్రాంతిపడి ప్రస్తుతమానవ జన్మను, సార్థకం చేసికోక మరియొక జన్మమీద ఆధారపడి ఆశకులొంగి నాశనమై జడజన్మలకు పోవుటకు కారణమౌతుంది.

కాబట్టి మానవుడా! నీకు మానవజన్మ వచ్చింది అంటే నీ ఆత్మీయమైన అణువు పరిణామంపొంది యీశ్వర తేజోరూపంగా మారి ఎప్పుడూ ఖిలంగాని పరిస్థితిలో శాశ్వితమైన తేజోరూపంగా మారవలసిన విధంగా ఉన్నప్పటికి, అటువంటి జన్మను ఖిలంచేసికోవడం భావ్యంకాదు. కాబట్టి నీ ఆత్మకు సద్గురువుగా నిరూపణ అయ్యేవ్యక్తిని ఆశ్రయించి

దాని రహస్యం తెలిసికొని నీవు గురువంతటివాడవై తెలిసికోవాలంటే ఆ సద్గురువుచేసే ప్రబోధము జగస్వరూపాన్ని అంటే సృష్టిని మంత్రంలో యిమిడ్చి మంత్రమే గురువుగా రూపించే విధంలో ఎవడైతే మార్చ గలడో ఆతనే సద్గురువు.

సత్ అన్నప్పుడు ఉన్నది. ఏదైతే యదార్థంలో ఉన్నదో అది గుణరహితంగా ఉన్నది. ఆ గుణరహితమైన విషయం మంత్ర సమ్మిళిత మైన జగస్వరూప పరిణామంగా తేజోరూపంగా ఉన్నదనే విషయం తెలిసికొని తాను ఆదిగామారి తన శిష్యుని ఆ విధానంగా మార్చే వ్యక్తిని సద్గురువు అంటారు కాబట్టి మీమీగురువులు అటువంటి పరీక్ష విధానమైన విషయానికి సరిపోతారో లేదో మీ ఆత్మమీకు సాక్ష్య మిచ్చినపుడు తెలిసికొని తరించెదరు గాక.

# శిష్యుడు

ప్రపంచమున ఒకానొకవ్యక్తిని విద్యారూపంలోను, కళారూపం లోను, వ్యాయామరూపంలోను, లౌకికరూపంలోను రకరకాలైన మానవులు ఆయా విషయములను అనుసరించినపుడు ఆయా విధమైన శిష్యులని పేర్కొనుట సువిదితమే.

పై వాటికి భిన్నంగా ప్రతి మానవవ్యక్తి ఈశ్వర విషయం తెలుసుకొని తరించాలనే ఆశ కలిగి ఆ ఆశ తనస్వార్థమందు స్వాభావి కంగా నుండుటచేత, అది తాను తెలుసుకొనే స్థితిలోనుండుటచేత, ఆ ఆధ్యాత్మికమైన శక్తి ఈశ్వరసంభూతమైన నిగూఢమైన తత్వ రూపమున నుండుటచేత అది తెలిసిన వ్యక్తి ఆధ్యాత్మికగురువని, తత్వవేత్తయని ప్రకటనచేయుచు వారి వాగ్వేష అభినయములబట్టి శుశ్రూష రూపంలో గురువును అనుసరిస్తూ, భక్తి స్వరూపులై మెలగుచు, తమ గురువులవద్ద నేర్చుకొనిన ఆధ్యాత్మిక విద్య తన కన్యమైనవారి సమక్షమున చెప్పుచు, ఆ చెప్పినప్పుడు వారి భావ ప్రకటన వారికున్న భక్తి విశ్వాసము చూచిన వ్యక్తులు అభినందించుట లోకతీరువులో ప్రతివారికీ తానొక భక్తునిగ తాను కూడా మారాలని ఆవిషయములను తెలుసుకోవాలని ఆవేదనతోకూడిన ఉత్సాహమును చూపుచున్నారు.

పైన పేర్కొనిన ఆధ్యాత్మిక భక్తులలో అనేకులు ప్రాపంచిక ఆశాబద్ధములైన తమకు లాభకరమైన విషయములను కోర్కెలుగ మార్చి గురు ఆశీర్వాదమును కాగలవని నిశ్చయించి ఆవిధంగా కూడా భక్తులుగ మారువారు కలరు. ఈ విధానంలో యిటువంటి కోర్కెలు నెరవేరనప్పుడు ఆ వ్యక్తులు, గురువులను వదలిపోవుదురు.

గురువను నామము ధరించి తాను కేవలము ఈశ్వరసంభూతుడ నని ప్రకటించుకొనిన నాతని జీవితమందు కళంకము కానవచ్చినప్పుడు నటువంటి గురువును వదలిపోవు భక్తులు కూడా కలరు. అంధుని అంధుడు అనుసరించునట్లు ఆ గురువునకు స్వానుభవంలో యే విషయము తెలియకపోయినప్పటికి నతనిని అనుసరిస్తూ భక్తులమని చెప్పుకొనువారు కలరు. కొందరు తామనుసరించుచున్న గురువునకు అధ్యాత్మిక శక్తి లేకపోయినప్పటికి శిష్యులనేవారు వారి వాగ్రచనలయందు ఆగురువును గొప్పగ పొగిడి యితరులను ముగ్ధులుగచేసి తమతోపాటు వారినికూడా చేర్చి సంఘబలము వృద్ధియగుటకు, లేని మైకావస్థలను చూపించి యితరులు తమను ఆకర్షించునట్లు చేయువారును కలరు. ఈలాంటి విషయాలు కలిగిన సంస్థలు, ధర్మాలు, పీఠాలు, వాటిని దృష్టిలో పెట్టి కాలవ్యవధిని విమర్శించినవారు యే రూపమైన భక్తులో తెలుసుకొనుట సుసాధ్యము.

ఉప్పునీటి బావిని దాని ఆవరణకు రంగులువేసి అలంకరించి దానియందుగల నీరు విచిత్రమైన తీపినీరని చెప్పుచు యేకరువు పెట్టు వారినిజేరి ఆ నూతిలోని నీరు రుచిచూచినప్పుడు ఉప్పగా కటువుగా వారి జిహ్వానుభవములో తెలిసినప్పుడు తుపుక్కున ఉమ్మిచేయుటయే గాక ఆ నీటిని త్రాగించిన వ్యక్తులను చూచినప్పుడు ఆ రుచిచూచిన వారియొక్క మనస్సు యెంత అసహ్యించుకొనునో పై విషయం కూడా అలాగుననే అసహ్యకరంగా తేలగలదు. ఆదే మంచినీటి బావిగ నున్నప్పుడు దాని కేవిధమైన ఆవరణ, అలంకరణగాని లేనప్పటికి దాహార్తుడైనవాడు యే విధానముననైన ఆ నీటిని సేకరించి త్రాగినప్పుడు ఆ నీటియొక్క రుచి తనదాహాన్ని తీర్చినప్పుడు ఆతని ఆత్మ ఆ తీపియందు యెంత విశ్వాసము ఆనందము కలిగించునో తన ఆత్మకు తానే సాక్షి. అటువంటి విషయంలోనున్న గురువును యే శిష్యుడు విడనాడలేడు.

యదార్థములో శిష్యుడన్నప్పుడు కేవలం భక్తస్వరూపుడు. ఆ భక్తిని అనుసరించి తనలోతాను తన ముక్తిని ఆశించి ముక్తస్వరూపిగ మార్చు సద్గురువు లభించవలెనని తనలోతాను తపించుచుండును. అది తపస్సుగామారి తేనేటీగ తేనెగల పూవును ఆశ్రయించినట్లు సుదూరమున యీతని తపన ఫలించేకాలమువచ్చి సద్గురుస్వరూప పుష్పంగాయున్న వ్యక్తిని ఆశ్రయింపజేయును. అటువంటి సద్గురువును జేరి ఆశ్రయించి తన మనోభావము చూపకముందే గురుని దృష్టి యీ భక్తునిపై ప్రసరించబడి నవనీతునిగ మార్చును. అటువంటి గురువు సందర్శనమందు చేరిన శిష్యుడు తనంతటతాను భక్త స్వరూపునిగ మారునట్లు యతని ఆత్మ నతనికి ప్రబోధము చేసినప్పుడు తనంతట తనకే అవగాహనమై ఆ గురువునందు అతీతమైన అచంచలమైన, విశ్వాసము ఆతనిలో స్థాపితమైపోయి ఆగురువను వ్యక్తియే సమయమందు గోచరించినప్పటికి ఆత్మీయంగా నమస్కరించ యఖిల షించును. అంతటి విషయంగా మారినవ్యక్తికి మంత్రి ప్రబోధ సమయమందే ముక్తి ప్రాప్తించగలదు. నటువంటి స్థితియందుగల వ్యక్తియందు యేనాటికిని భక్తి విశ్వాసములు సడలక స్థిరమై నతని జీవితకాలమందు ఆ గురువును విడనాడలేడు. కాని కాలరూపమున భ్రాంతిమహాశక్తి ననేకవిధములైన కష్టముల పాల్చేయ సమకట్టినప్పుడు నట్టిస్థితిని ఆ సద్గురు మహాశక్తి భౌతికంగా సాక్షాత్కరించి ఆ భ్రాంతి మహాశక్తికి లొంగకుండునట్లు చేసి కాపాడుచుండును. అది తెలుసుకొన్న శిష్యరూపముననున్న వ్యక్తి ప్రకృతిరూపములో యెన్నో కష్టనిష్టూరములు వచ్చినను తనగురువునందే భారమని ఆకష్ట నిష్టూరములను లెక్కచేయక ఆగురువునందుచూపే భక్తి విశ్వాసములు నతనిని చూచిన వ్యక్తులు గ్రహించినట్లు తెలుసుకోగలరు. దీనినే సోలిన భక్తియని, ప్రమాన్పడిన భక్తియన్ని, రాలిన భక్తియని నిరూపణ యైనటువంటి విధంగా మారగలిగిన వ్యక్తియే శిష్యుడు, ఆ స్థితికి తీసుకు

రాగలిగి, కేవలం భక్త స్వరూపునిగ నిరూపణ చేసిన వ్యక్తియే ఆ శిష్యునికి గురువు.

ఈ స్థితికివచ్చిన గురుశిష్యులు, శిష్యగురువులు యనగా గురు వంతటివాడు శిష్యుడు శిష్యుడంతటివాడు గురువు.

ఈ విధానంగా మారినవారికే ఆధ్యాత్మిక భక్తస్వరూపమైన శిష్యులని పేర్కొనవలసియున్నది.

గురువే శిష్యుడు శిష్యుడే గురువను స్థానమునకు వచ్చిన తర్వాత తన గురువు మానవాతీతుడని తన ఆత్మ తనకు ప్రబోధించినప్పుడు ఆగురునియందు ఈ శిష్యునియొక్క భావంలో వ్యతిరేకత వచ్చి భ్రాంతిశక్తికి ఆకరమైన అవిధేయతతో కూడిన నిరసన తనభక్తి విశ్వాసమందు యేమాత్రము కళంక మాపాదింపబడినను ఆ శిష్య రూపంలో యున్న ఆత్మ పాతాళమునకు రాలి వినాశనమునకు కారణమై పోవుచున్నది.

"అవిద్యా తత్వ మర్మంబు మాకరములందిడుకొంట
నెరుంగరెవ్వరున్"

శిష్యరూపములోయున్న ఆత్మయొక్క ఆటకట్టు సద్గురుని ఆధీనములో నున్నది.

ఇదియే యోగవాశిష్టములో వశిష్టునియొద్దకు శిష్యరూపంలో నున్న శ్రీ రామచంద్రమూర్తి వెళ్ళి సందర్శించి "స్వామీ" నేను భువనబ్రహ్మాండములు నిండిన వెలుగును చూచితిని నేను అపర వశిష్టుడనై పోతినని తన గురువుతో చెప్పినప్పుడు, ఆ వెలుగును చూచి నుప్పొంగిపోయిన శ్రీ రామచంద్రమూర్తిని చూచి "నీకు పూర్తి పరిణామము రాలేదు యింకను తెలుసుకొనవలసిన విషయాలు చాలా గలవని భ్రాంతియుననేమో తెలుసుకొనునట్లు నేలుగురు విపశ్చిత్తుల వృత్తాంతమును తెలిపి మందలించినాడు.

ఇటువంటి విషయములో శ్రీ రామచంద్రమూర్తి యంతటి వానికే కృతార్థతరానికాలమున్నప్పుడు సద్గురువందు ఏంతటి విశ్వాస ముండవలెనో తెలుసుకొని కృతార్థత చెందవలసియున్నది.

గురు సాన్నిధ్యములో శిష్యరూపంగా వచ్చిన వ్యక్తిని వజ్ర పరిక్షాకారకుడు యేది వజ్రమో యేదిగాజుగాయో పరీక్షించి తెలుసుకొనునట్లు గురువు తన దృష్టి ప్రసారములో ఎవరు నోలిన భక్తుడో యెవరుకారో ఆ క్షణమందే తెలుసుకొనగలడు. వజ్రి రూపంలోఘున్న శిష్యుడు యెటువంటి క్లిష్టపరిస్థితిలోనైనను ధర్మ మునుగాని, గురువునుగాని విడవకుండను.

ఇదే భగవద్గీతలో శ్రీ కృష్ణభగవానుడు నొక్కి వక్కాణించి నాడు.

"స్వధర్మేనిధనం శ్రేయః
పరధర్మో భయావః

తాను అనుసరించుచున్న ధర్మము యదార్థమైనదని తనకు నిర్ధారణ అయినప్పుడు అందు నాశనము వచ్చినను చలించనివాడే భక్తుడు నిజమైన శిష్యుడు. ఇటువంటి వ్యక్తియే సాయుజ్యుడు. ముక్తస్థాన మున కర్హుడు.

# బ్రహ్మచర్యము

ప్రపంచమందు బ్రహ్మచర్యము అనునదివాస్తవమునకు అది అనుభవ రూపములో యున్నప్పటికి మానవదృష్టికి అది అతీతమైన విషయంగా మార్చి మానవదృష్టికి ఒక మహనీయమైన అసాధ్యమైన సంగతిని సాధ్యమైన విషయంగా మార్చి అనుభవములో చూపించ గల్గే మహత్తర యోగరూపిగా విలసిల్లి కాషాయాంబరధారియై మాన వుని దిగ్భ్రాంతునిగా జేసి, అపురూపమైన ఈశ్వర విషయాన్ని తెలుసు కొని తరించిన వ్యక్తిత్వ స్వరూపమును విరూపణ రూపము లోకము నందు చలామణి అగుచున్న సంగతి మనకు సువిదితమే.

ఈ బ్రహ్మచర్యము నాలుగు ఆశ్రమములో నొకటి. అది బాల్యమునుండి 18-24 సంవత్సరములవరకు. దీని వయఃపరిమితి ఆ వయస్సు మించిన తరువాత గృహస్థ రూపములో వివాహమాడి తన యందు కల్గిన కామవికారమును అగ్నిసాక్షిగా భార్యగావచ్చిన ఒక స్త్రీ యందు స్థాయి పరచి, లోకమున సంసార రూపములో తన మను గడ సాగించుస్థితి గార్హ్యస్థమనబడి 60 సంవత్సరములు సాగిన తర్వాత లోకవిషయములను స్థాయిపరచి ఈశ్వర విషయాన్ని తెలుసుకొనే ఊహకు వచ్చి. ఆ విషయమును తెలుసుకొని, ప్రయత్నరూపమున సాగించుకాలము వానప్రస్థ మనబడి ఆ స్థితిని ఈశ్వరత్వ మనబడునది తెలుసుకొనుటకు తపించే, ఆ కాలము సాగుచున్న సమయమున ఈ లోక విషయాలను సంసార విషయాలను ఒకస్థాయికి చేర్చి వాటి యందు విరక్తినిపొంది ఈ సంసార నిబద్ధమైన విషయమును తనసుండి వైదొలగినట్లు తనలో నిశ్చయమున స్థిరపరచి ఆ తరువాత సన్యాస మన్నునది తెలుసుకొని ఆ స్థితిని ఈ ప్రకృతిని ఈ ప్రకృతియందుగల్గు సంసార రూపమైన ఘర్షణలను ఆ తరువాత మానవ విధానమందు

చింతన రూపమున ఏ స్థానమైతే తాను వీడి వచ్చినాడో ఆ స్థానమును సంగ్రహించుటకు ఉద్రిక్తుడై బడయగోరు విధానము సన్యాసత్వమున గ్రహించి నేర్చిన వ్యక్తి కృతార్థుడని చెప్పబడు లోకోక్తి ఈ పై జెప్పిన నాల్గు ఆశ్రమములు 1. బ్రహ్మచర్యము, 2. గార్హ్యాస్థము, 3 వాన ప్రస్థము, 4. సన్యాసము అని చెప్పబడుచున్నవి.

ఇదే ప్రకృతి రూపములో బ్రహ్మచర్యము అస్సునప్పుడు లోక పరిజ్ఞానమే కాకుండా తెలివియొక్క వికాసరూపమైన విజ్ఞానమునకు దారితీయు విద్యావిధులను తెలుసుకొను కాలమునకే వర్తించుననియు ఆ తరువాత గృహస్థు రూపములో కామ వికారములను అణచి. స్థాయి చేయు విధానము విషయేచ్ఛలయందు యితర దృష్టికి విమర్శనకు పాల్పడని విషయేచ్ఛలయందు కాలము గడపి అ తరువాత కాలము ఈశ్వర సంభూతమైన విషయము తెలుసుకొని. ముక్తి స్వరూపము దాల్చి కృతార్థత పొంది ఆ తరువాత మరణమును ఆశించి, తన జన్మను సార్థక పరచుకోదలచిన అవసరమున్నదని ఉపనిషత్తు. "శైశవాభ్యస్థ విద్యానాం యవ్వనే, వార్ధక్యే మునివృత్తినాం త్యజిత్యంతే కళేబరం విషయైషిణే."

పై విషయములనుబట్టి బ్రహ్మచర్యము అనునది లోకపరిజ్ఞానము కలిగి ఈశ్వర విషయాన్ని తెలుసుకొనేటట్టువంటి తెలివియొక్క వికాసరూపమైన విజ్ఞాన రూపంతో కూడిన స్వ స్వరూపాన్ని గ్రహించుటకు ప్రాతిపదికమే బ్రహ్మచర్య వ్రతము, ఇందు మొలచిన మొలక మరణమనే విషయమునకు వచ్చు స్థితికి వచ్చిన వ్యక్తిత్వము సంసారాది సుఖదుఃఖములను బడసి, వాటియందుండే కష్టనిష్టురములు సుఖదుఃఖములు నీతి, అవినీతులు ఆదిగా గల్గిన విషయములు తన అనుభవమునకు తెచ్చుకొని వాటినుండి పై దొలగి విరక్తి రూపమైన సన్యాసము అనగా లోకవిషయాలలో విరక్తి కలిగి ఈశ్వర విషయమును గ్రహించే మానవత్వము యొక్క స్వరూపమే బ్రహ్మచర్యమనబడును.

ఇటువంటి స్థితిలోనుండి ప్రస్తుత ప్రపంచమున కాషాయవస్త్ర ధారులు. సన్యాసరూపం దాల్చిన సంసారరూప విధానమున తన అనుభవమందు తెలుసుకోవలసిన విషయాలను మరచి కేవలం ఈశ్వర సంభూతుడనే ప్రగల్భరూపమున ఢంబములాడుకొనే విషయానికి వచ్చి ప్రకృతి మానవులను దిగ్భ్రాంతులుగాజేసి జడస్వరూపులుగ మార్చు చున్న ఈ వేషము కేవలం మానవ వ్యక్తిత్వమును నశింపజేయు చున్నది ఈ బ్రహ్మచర్య విధానము.

ఈ రూపాన్ని పురస్కరించుకొని అందుండే అంతరంగిక దుష్కృత్యములను విమర్శించి మహాయోగులని, బాలయోగులని స్వాములని, బాబాలని, తీర్థులని, వారిని పొగడుచు ప్రచారము చేయు మానవులను చూచిన నవ్వు వచ్చును. కారణము లోకమందు ఏ జీవియైనా కామ వికారమునకు లోబడని జీవస్వరూపము లేనేలేదు. విరాగియై చిదాభస్మము పూసుకొని స్మశానవాటికలలోయున్న శివునకు పార్వతి, గంగా స్వరూపములు, భార్యలుగా యున్నప్పటికి, విష్ణు స్వరూపము మోహినీ రూపమున తనముందు తారసిల్లినపుడు తనకు కామోద్రేకము కల్గి వెంటాడిన విషయము లోకవిదితమే.

ఇటువంటి పరిస్థితిని బ్రహ్మచర్య వ్రతాదిరూపులైన ఈ సన్యాసులకు సుందరరూపులైన స్త్రీలు ఆహారపానీయాదులు సమర్పించి చేయు పరిచర్యలు మనము తిలకించిన విమర్శనా రూపములో వారు (ఆజన్మాంతము బ్రహ్మచర్యవ్రతం దాల్చిన వ్యక్తులు) సుందరరూపులైన ఈ స్త్రీలను చూచినపుడు వారు ఎంతవరకూ తమ కామవికారాన్ని అణచియుంచుకొనగలరో వారి నేపథ్యమున రహస్య రూపముననున్న వారి జీవిత చర్యలను తెలుసుకొనగల్గే స్థితికి వచ్చిన వ్యక్తికి సన్యాస రూపములో క్షుద్రరూపం దాల్చిన పాషండుడని నిరూపణ కాకమానదు. ఆహారపానీయములు మాని కేవలము వాయుభక్షణచేసి, జీవిస్తున్నా

దన్న విషయము ప్రమాదమని బూటకమని అటువంటి వ్యక్తిని నిరాహారదీక్షలో బహిరంగ ప్రసక్తిలో పెట్టినపుడు వాయుభక్షణయొక్క నిజస్వరూపము తేలగలదు.

ఈ బ్రహ్మచర్యము అనునది శ్రీకృష్ణభగవానుని జీవిత చరిత్ర పురస్కరించుకొని అతనిని ప్రతీ విషయమందును విమర్శించిన అతని జీవిత పరిణామము భగవద్గీతగా పాడిన పాటయందు అతనియందున్న బ్రహ్మచర్య వ్రతదీక్ష తేటతెల్లము కాకమానదు యదార్థమున భగవద్గీత ఎట్టినోట ధ్వనింపబడునో ఆ స్థితికి వచ్చిన వ్యక్తిని ప్రశ్నించిన శ్రీకృష్ణభగవానుడు తప్పక అస్ఖలిత బ్రహ్మచారి అని చెప్పబడును. అట్టి జీవితచరిత్రను అనుసరించు వ్యక్తియే బ్రహ్మచారి. అతను లోకమందు చూపించిన మహత్తర విషయములు సంసారరూపిగా మహారాజుగా, రాజకీయవేత్తగా, ఈ సృష్టిని ప్రకంపితము చేసి వాటి యందు తాత్కాలికమైన, ఇచ్ఛారూపమును విరక్తిరూపమున మాయింపజేసి, తాను వీటి అన్నింటినుండి వైదొలగి ఏకాగ్రచిత్తుడై స్వస్వరూప సంధానుడై, రసస్వరూప సంభూతుడై వెలసినాడు. ఇతడే అస్ఖలిత బ్రహ్మచారి. రాజసూయ యాగమందు నిర్మించిన మయ సభలో ఏబదిఆరు చక్రవర్తుల మధ్య బ్రహ్మచర్యవ్రతము పట్టి శపథము చేసినట్టి కురు పితామహుడైన భీష్మాచార్యునకు అగ్రతాంబూల మివ్వబోగా, శ్రీకృష్ణభగవానుని విరోధియగు శిశుపాలుడు కూడ ఆ సభలోనుండగా ఆ యగ్రతాంబూలమునకు తనకంటే శ్రీ కృష్ణభగవానుడే అస్ఖలిత బ్రహ్మచారి యని నిశ్చయించి భీష్మాచార్యులే స్వయముగా శ్రీకృష్ణభగవానుని కందజేయగా "అహమేవ" తగుదునని శ్రీకృష్ణ భగవానుడు ఆయగ్రతాంబూలము స్వీకరించెను. (మహాభారతము)

ఈ విధముననే తన జీవిత గాధయందు ఒక సామాన్య మానవునిగా తన జీవితము గడపి, ఈశ్వర సంభూతమైన మహా విషయము ఖురాను రూపములో తననోట ధ్వనింపజేసిన మహమ్మదు ప్రవక్త అస్ఖలిత బ్రహ్మచారి.

పై వారి జీవితములనుబోలి ఎవడైతే తన జీవితమును నడుపగల్గునో అతడే బ్రహ్మచారి.

# ఏకాగ్రత

ఆధ్యాత్మిక రూపంలో తత్వవిధానం సాధనలోపెట్టి ఈశ్వర విషయాన్ని లక్షించి దాని పరిణామమును తెలుసుకొను విధానమునకు ఏకాగ్రత కావలయునని గురువులైనవారు తమ శిష్యులకు ప్రబోధించు చున్నారు.

ఈ ఏకాగ్రత అను విషయమునకు సాధకునకు ప్రబోధించడ ములో స్నానం చేసి శుభ్ర వస్త్రధారణ చేసి తాను ఒకచోట నియమ బద్ధమైన విషయమును పురస్కరించుకొని పీఠము ఏర్పరచి ఆ చోట ఆసన రూపములో ఆసీనుడై సర్వాంగములను స్వాధీనమందుంచుకొని నిమీలిత లోచనుడై మనస్సునందు వృత్తి పుట్టనీయక ఊహాలు తనలో నొరనీయక నిశ్చయుడై తన గురువు చెప్పిన మంత్రమందు తన లక్ష్యముంచి ఆ సాధకుడు మంత్రము నుచ్చరించుట కుపక్రమించి దానియందు ఏ కళంకము రానీయకుండా యుండు లక్ష్యమునకు ఏకాగ్రత అవసరమని ప్రబోధించుచున్నారు.

ఏ మానవుడు పై స్థితికి పాల్పడి ఆ రీతిని కార్యకలాపములను నెరవేర్చి నిశ్చయుడై ఏకాగ్రతతో కూడిన దృష్టిని నిలుపు సమయమును మనము విమర్శించిన పై ఏకాగ్రత రూపంగా చెప్పిన గురువుల వాక్యా అబద్ధమని తేలగలదు.

మానవుడు ఈశ్వర విషయమును తెలుసుకొని తరించే సంక ల్పముతో గురువును చేరి మంత్ర ప్రబోధితుడై ఆయా గురువు చెప్పే ఆసన రూపములను నిర్వర్తించుచూ తన ఏకాగ్రతయందు తన లక్ష్య మును నిలిపి సాధన చేయు సమయమందు ఆ సాధకునియందు కల్గు అని శ్చలత ప్రమాణరూపమున నిజము చెప్పవలసి వచ్చినప్పుడు ఏకాగ్రత రూపమైన నిశ్చలతపోయి పై చెప్పిన అనిశ్చలత దాపురించి గురు

పబోధ రూపమైన మంత్రమును మరచి తన యిచ్ఛారూపమైన ఊహలు విజృంభించి తన ఊహలయొక్క లక్ష్యం ఏ చోటునకో తీసు కొనిపోయి ఆచోట ఆయా కార్యకలాపములయందు నిమగ్నునిగా చేయుచున్న సంగతి నిజమని ఒప్పుకొనక తప్పదు. ఆ సమయమందు ఆతని భౌతిక శరీరము అతనినోట ఉచ్చరింపబడు గురు ప్రబోధిత మంత్రము మంత్రోచ్చారణ పీఠ సమక్షమున ఆసీనుడై తాను ఉన్నాడేకాని తనయందు తన మనస్సు లక్ష్యంగాని లక్ష్యంతో కూడిన ఏకాగ్రత సాధ్యంగాలేదని ఆ సాధకుడు ఒప్పుకోక తప్పదు.

ఏకాగ్రత అన్నప్పుడు ఏవిధమైన పరిస్థితులలోను ఎటువంటి సమయమందును తన గురువుచెప్పిన మంత్రము లక్ష్యమందు పెట్టి ఎట్లు ఏకాగ్రత దాల్చవలసి యున్నదో తెలుసుకొను సాధకుడు తెలి యని పరిస్థితులలో తన మనస్సుయొక్క వికలత్వమును పురస్కరించు కొని చీకాకుతో కూడిన శ్రమకు లోనై ఏందుకూ పొందని పరిస్థితివి తానున్నట్లు తెలుసుకొనగల్గుచున్నాడు. బాహ్య రూపమందు మాత్రము తాను ఒక ఏకాగ్రరూపి అయిన సాధకునిగా నిరూపణ అయినట్లు తన బాహ్యజీవితం నిరూపణ చేయుటకు పాల్పడు చున్నాడు.

ఇట్టిస్థితిలో యున్న మానవత్వమునకు ఏకాగ్రత అబ్బినగాని ముక్తి లేదని చెప్పుగురు వాక్యములను పురస్కరించుకొని తన జీవి తాంతమువరకూ ప్రయత్నించి ఫలసిద్ధి గాంచకపోయినవారు లేకపో లేదు. మనస్సు చంచలమైనది వానిని కట్టుట అసాధ్యమైనది అను నిశ్చయమునకు వచ్చినవారుకూడా కలరు.

ఏకాగ్రత అన్నప్పుడు తన దృష్టినిపెట్టి విమర్శించిన అది మానవ దుస్సాధ్యమని తేలగలదు. అట్టి దుస్సాధ్యమైన ఏకాగ్రతను

తాను వశం చేసుకొని ఆధ్యాత్మికముగా ప్రయాణము సాగించు సాధకుడు తన జీవితమందనుసరించు కార్యకలాపములందే ఆ ఏకాగ్రత యొక్క గోడు కలదని తెలుసుకొనవలసి యున్నది. ఉపమానరూపములో మనము విమర్శించినపుడు బాహ్య కార్య కర్తృత్వములు ఆచరించుచున్న సమయమందు మనదృష్టి ఆ కార్య కలాపములయందు లగ్నమై యున్నప్పుడు మన మనస్సు అంతర్లక్ష్య రూపములో యింకొక విషయం ఆలోచనారూపములో ఊహాలుగామారి అంతరంగికమైన ఆయావిషయములు అభౌతికమైన విషయములని నిశ్చయంకాబడుచున్నది.

పై విషయాన్ని ఉపమానముగా పెట్టుకొని తాను సాధించు మంత్రము తనమనస్సు వికల్పరూపమైన విషయములందు పోవుచున్న విధానములో ఈ లక్ష్యముతోకూడిన మంత్రమును ధ్వనింపజేసిన అయాచితంగా ఏకాగ్రత కుదిరి తన బాహ్యదృష్టి అంతర్ముఖమై తన మనస్సునందు ఊహలను ఆ మంత్రధ్వనిగా మార్చి అపురూపమైన సాయుజ్యమును తీసుకొనిపోవు దారిని నడచి ముక్తస్వరూపునిగమారకలిగే స్థితికి రాగలుగుచున్నాడని నిశ్చయించగల్గు స్థితియే ఏకాగ్రత.

ఇట్టి ఏకాగ్రతకు వచ్చిన మానవుడు కొన్ని సమయములందు విశ్వమునే మరచి భౌతిక ప్రపంచ కార్యకలాపములను విడచి అభౌతికమైన ఈశ్వరసంభూతమైన మహాతేజస్సును దృశ్యరూపమునగాంచి ఆనందించగలడు. అట్టి స్థితికే ఆ సమయమునకే అట్టి అంతర్లక్ష్యమైన దృష్టికే ఏకాగ్రత అని నిశ్చయము. అదియే ఏకాగ్రత.



# ఆసనము - ధ్యానము - పూజ

సృష్టియందు ఈశ్వరవిషయం తెలుసుకొని తరించుటకు అనేక మతములు ఆధ్యాత్మిక ధర్మములు కూటములు వారివారికి అనుగుణ్య మైన విధములో పూజావిధమైన ధ్యాననిరతి ప్రబోధించుచున్నారు. ఇందు ముఖ్యముగా ఆసనరూపమైన విధానములో ఈశ్వరుని ధ్యానించవలెనని కొందరు సిద్ధాసనము, పద్మాసనము ఆ చేయవలసిన కూర్చుండవలసిన విధాన క్రమము తెలుపుతూ పూజా ద్రవ్యములు సమకూర్చి నుంచిన విషయములో తన గురువు ప్రబోధించిన మంత్ర మును నియమం ప్రకారము కొన్నిగంటలలోనో కొన్ని వేల సారులో ఆమంత్రము జపిస్తూనొక్కొక్క పర్యాయమునకు నొక్కొక్క పత్రము తాను ధ్యానించు దైవము ప్రమోల విసరుచు అక్కడ తాను నిష్టగా కూర్చుని యున్నానని నిశ్చయించి నిష్టాపరుడై ఆచరించు కార్యకలాపమునకు ధ్యానముతోకూడిన పూజ అనిచెప్పబడుచున్నది.

మతమతాంతర రీతులలో ఆలయములలో విగ్రహములకు ఈశ్వరరూపమును సంక్రమింపజేసి ధ్యాననియుక్తుడై స్తోత్రముచేయు పూజావిధానములుకలవు. అది కూడా ధ్యాననిరతితో కూడిన పూజ అనబడుచున్నది.

మశీదులలో మహమ్మదీయులు నిరాకారమైన ఏకత్వోపాసన వారి మతరీతిని అనుసరించి ఒక నియమిత పద్ధతిలో ధ్యానరూపమైన నమాజు (పూజను) నిర్వర్తించుచున్నారు. ఈ విధమైన విషయాలు నీ దృష్టికి తీసుకొని దృష్టిలోపెట్టి విమర్శించిన ఇది యెంతవరకు సాధనా రూపములో పూర్తి ర్ణతగలదిగా యున్నదని ప్రశ్నవచ్చినప్పుడు అటువంటి విషయములో నిమగ్నత అయినప్పుడు మనకు అనుభవరూపంలో మనం గమనించినప్పుడు అచోట మనస్సు లగ్నమై నిష్టారూపంలో

యేకాగ్రతకలుగు విషయమును ప్రముగ్యమైనట్లు తెలియగలదు. కారణము ఆసమయమందే తనకు అవసరమైన విషయములు రూపించి తనమతిని ధ్యానమునుండి వేరుచేసి వున్నచోటునుండి యోజనాల కొలది దూరము తీసుకొనిపోబడుచున్నది. కాని పై విధంగా ఆచరించు మతస్థులయందు ఆయా విధానములలో ఆయావేళలలో తాను సల్పు సాధనాక్రమము ధ్యాననిష్టలో యేకాగ్రత కల్గిన ఆత్మపరిణామము పొంది ఈశ్వర రస స్వరూప సన్నిభమైన నిర్వాణపదమును పొంద గల్గుట సాధ్యముగానున్నది కాని అటువంటి స్థితి ప్రతి మానవుని యందును సంక్రమించుట అసాధ్యము. అసాధ్యమును సాధ్యపరచు స్వాధీనునిగ మారినప్పుడు సాధ్యము స్వాధీనపరచుకొను వ్యక్తిత్వమున బడును.

యదార్థమైన ధ్యానము, పూజ అనుదాని అర్థము మానవ పరిణామము. అటువంటి విషయమును తన గురువు సద్గురువై తాను సద్రూపముగా మారిన మంత్రమును తన శిష్యునకు ప్రబోధించినప్పుడు అతడు తన గురువంతటివాడుగ మారేవిషయమును సాధనారూపమైన ధ్యానము, పూజ, దానికి వేళగాని స్థలముగాని నియమిత కాలముగాని దేహాది శుచి నియమములుగాని వుండవు.

ఆ సద్గురు ఆశీర్వాదమున తాను తనశీలమును దృష్టిలోపెట్టి తన శుచిత్వము స్థిరపరచి తనయందు ఉత్పన్నమైన జన్మరహితమును (ముక్తికి) సంకల్పమును స్థిరీకరించి యే సమయమందైనను యే వేళ యందైనను యే చోటనందైనను యే స్థితినైనను ఆనందముతో కూడిన హాయిని తాను తన అనుభవరూపంలో పొందినప్పుడు తన గురువు ప్రబోధించిన మంత్రమును యెవడైతే ఆ స్థితిని, ఆ సమయ మందు పొందగలునో ఆ సమయమందు అతడున్న స్థితియే ఆసనము.

ఆ సమయమందు పొందుచున్న స్వాభావిక యేకాగ్రతయే నిష్ఠ. అదే ధ్యానము. అట్టితరి సాగిపోవునదే పూజ.

అది ప్రకృతికార్యకలాపములకు అడ్డని పరిస్థితిలో తన జీవితము సాగించుచూ నౌకరి విమర్శకు గురికాకుండా పయనించుటయే ధ్యానము, పూజానిరతమైన నిష్ఠ.

# తపస్సు

మానవుని ఈశ్వర విషయము తెలుసుకోవాలనే యిచ్ఛ స్వాభావికముగాయున్నది. అదియే జన్మరహితమునకు ఆకరము గాన దానిపై నతడు అప్రయత్నంగా ప్రయత్నించుచున్నాడు. అనగా అభౌతికమైన మహాశక్తియైన రసస్వరూపమునకు ఈశ్వరుడని చెప్పుచూ సద్రూపము (సత్-ఉన్నది.) అన్నప్పుడు నిజరూపము, ఆ నిజరూపమును తెలుసుకొనుకోరికను సఫలీకృతము చేసుకొను ప్రయత్నమునకు తపస్సని లోకములో ఆధ్యాత్మిక తత్త్వవేత్తలని, గురువులని ప్రబోధకులని యేర్పడి వారివారికి తోచిన విధానములో శిష్యకోటిని ప్రబోధించిన మంత్రములు సాధనప్రయత్నమైన ఆచరణకు తపస్సని పేరిడి ఆ రూపములో ప్రయత్నించవలసినదని చెప్పుచున్నారు. ఆ విధమైన సాధనారూపమే తపస్సను భ్రాంతిలో సతమతపడి శ్రమలకోర్చి కష్టించి ఆ గురువు చెప్పిన మంత్రము మననముచేసి చివరకు యేదియు తన అనుభవములో, సాధనారూపములో నిరూపణ కాని కారణమున దిస్సపోవుచున్నారు.

"తపస్సన త్యాగ మారయన్" అన్నాడు తత్వవేత్త. త్యాగమని ధ్వనించు శబ్దము లోకములో యిచ్ఛను మాయింపజేయుటకు చెప్పే అర్థముగయున్నది. త్యాగమనునది సంతటితో సరిపోవు విషయముకాదు. అది వాఙ్మయమందు చెప్పబడిన ఈశ్వరుడని సంబోధించిన నామరూపాత్మకమైన శక్తిని కూడా త్యజించగలిగినప్పుడు గాని త్యాగమనునది అర్థముగాదని "ఇన్నేల జెప్పవలయు, తన్నె తానెరుగు కొరకు తన కన్యంగా గన్నదంతయు దబ్బర" అన్నాడు రామస్తవరాజములో శ్రీరామచంద్రమూర్తి తన్ను స్తోత్రించు ఆంజనేయులతో.

"నేన" ను నది తెలుసుకొనగలవాడివేని నేనను ధ్వనికి అన్యం బైన దంతయు త్యాగరూపములో వదలివేయమన్నాడు. ఇది వద ల్చుకో గల్గుటయే త్యాగము. దీనికే తపస్సని పేరు.

ఈ విషయము తెలియక ఆసనములు, మంత్రజపములు దానిని యనుసరించు మాటలతో ఆచరణలో ప్రజలను శ్రమపెట్టు చున్నారు.

తపస్సనగా తపించుటయన మానవునికి అష్టైశ్వర్యము లున్న ప్పటికి నాతడు భోగభాగ్యములలో తులతూగుచున్నప్పటికి తనకు తలి గిన ఐశ్వరమందు హంసతూలికా తల్పముపై పరుండియున్నను ఈశ్వరవిషయం గూర్చి ప్రయత్నించు తాపసి తపించుట యున్నప్పుడు నాతని మనస్సునందు ఈశ్వరవిషయం తెలుసుకొని జన్మరహితం చేసుకోవాలనే ఆవేదన మంటతోకూడిన జ్వాల ఆహంసతూలికా తల్పమందు పరుండి యున్నప్పుడున్న సుఖమును మరపింప జేయ వలయును.

ఈ విషయం తన అనుభవములో తెలుసుకో దలచినవ్యక్తి తాను సాధించు మంత్రములోగల ధ్వని నిరూపణ అయ్యే స్థితికి రావలెనన్న నతని అంతర్యమందు తానొక యజ్ఞపశువని యీ ఆశా బద్ధమైన ప్రపంచమును స్వచ్ఛమైన నిష్కళంకమైన ధవళ దీప్తిగల బలిపీఠముగ మార్చి ఆ బలిపీఠముపై తెగనున్న పశుస్వరూపము తానుగా నున్నట్లు నిశ్చయించి తనదృక్కులో ఆ విధమైన దృశ్యమును నిర్మాణము చేయవలసినదిగ తత్వవేత్తయొక్క వుద్దేశ్యము.

ఇదియే స్వరూపము తెలుసుకొను పునాది. అంతేకాని ఆల యాలకుపోయి విగ్రహము ముందు సాష్టాంగపడుటగాని, మశీదులో నేలకు నొష్ట ఆనించిగాని, క్రైస్తవాలయములో ఆర్చనగాని సాధ్య

పడదు. నీదృష్టిలో యజ్ఞపశువు రూపములో సృష్టియనే బలిపీఠ ముపై యజ్ఞపశువుగా నున్న నీవు యే క్షణముననేని ఆయుష్షురూప ములో తెగి రావవలసిన నీవు. నీ యంతరంగములో వూహించిన యెం తటి త్యాగివై తపస్సు ఆచరించవలయునో తెలుసుకొందువు.

అది వూహకుమించి మానవునికి అందనిస్థితిలో నున్నదని స్థిర పడును.

అలాంటిస్థితికి నీవు వచ్చినప్పుడు నీవు గురువుగా నిశ్చయించిన వ్యక్తి సద్గురు వైనప్పుడు నీ ఆత్మను ఆశీర్వాదమున తన నిజస్వరూప మందు లీనముచేసుకొని నీకు అనుభవములో తపస్సునది తెలియునట్లు చేయవలయును.

"..........మూర్ఛలదేల్చు బాహ్య ప్రపంచ
గరిమ ప్రేమానురాగంబు పరిఢవిల్ల"

నీయందు అపారమయిన ప్రేమతో నిన్ను నాతడుచేయు ఆశీర్వాద మున బాహ్య ప్రపంచమును మూర్ఛలలో మాయించునట్లుచేసి మహా అగ్నికి ఆజ్యమట్లు మంటలలోబెట్టి నిన్ను తీసుకొచ్చిన అనుభవములో

"ఎవని దేహేంద్రియంబు లైహికము మరచు
ఎవని చైతన్య మిట్టె నిర్జింపబడును
ఎవని జీవాణువులు స్థంభించిపోవు" అన్నాడు తత్వవేత్త.

ఆ సద్గురువుయొక్క ప్రబోధము నీవు ఆలకించు సమయాన నీ దేహేంద్రియములు సృష్టిని మరచిపోవును. చైతన్య సహితమైన జీవాణువులు స్థంభించిపోవును. ఆ జీవసహితమైన అణు సముదాయ ములోగల తేజస్సు యేకమై—జాజ్వల్యమాన మానితతమై కాంతి—నీ యనుభవములో నీకు తెలిసినప్పుడు—యీ భువన బ్రహ్మాండములు నీ కాంతిలో యిమిడి పోయినట్లు—నీవు గ్రహించగలవు.

ఈ స్థితికి వచ్చువరకు నీవు నీ గురువాజ్ఞను మీరకుంటే నీ నిశ్చయమును దాటకుండగ నీ ప్రతిజ్ఞను నతిక్రమించకుండా నుండగలిగితి వేని అట్టిస్థితి నీయందు రూపొందిన దీని పరిణామమునకే తపస్సని పేరు.

త్యాగమైన రూపమే తపస్సు.

తాపసులమని తపస్సుగూర్చి వెలిబుచ్చు తపస్సు తపస్సేకానని తపస్సునందుగల మర్మము "ఆపోజ్యోతి" రూపములో మహాగ్ని జ్వాలగా యున్నసంగతి తెలిసిన దానిమర్మము నేనుగాయున్నదని ఆ తెలిసికొన్న వ్యక్తిత్వము ఆనందస్వరూపుడై ఆనందమనే సముద్రిమున దేలు బ్రహ్మానంద స్వరూనిగ మారిననాడు నేనన్న నిజ రూపము "సత్" గ యున్నసంగతి తెలిసినవాడు తాపసి. ఇదియే తపస్సు.

# సాధన

సాధన రెండు విధములు. లోకవిషయాలలో సంపాదనా రూపంలో తన మనుగడకు, దారాపుత్రాదులపోషణకు ఆర్జనరూపంలో కార్యకలాపములు చేయు ప్రయత్నం ఫలించేవరకు చేయు క్రమమునకు "సాధన" అనగా సాధించుట అని పేర్కొనబడినది.

మానవుడు ఏ ఉద్యోగిగనో, వ్యాపారిగనో, కూలివానిగనో, వ్యవసాయదారునిగనో. కృషి కల్పించుకొని ఆయా విధానము ననుస రించి తానుసాగించు జీవయాత్రలో అనేక మార్పులు చెంది కడకు వొక స్థితికివచ్చి స్థాయిపడి తృప్తి పడవలసియున్నది. అది ప్రతి విషయమును అనగా ఉద్యోగినిగూర్చి, వ్యాపారివిషయంలోగాని, వ్యవసాయ విషయముగాని పురస్కరించుకొని, విమర్శించిన అది విమరస్మారూపంలో తనకుతాను యేవిధానంలో జీవితం గడుపుచున్నాడో ఆ విషయం నొక అంతరం తరువాత మరియొక అంతరం అభివృద్ధిచెందే విషయం కొరకు ఊహలు పెట్టుకొని సఫలీకృతమయ్యేవరకు తన ప్రయత్నం విడువక ప్రయాణం సాగించుటయు సాధనమే.

2. ఈశ్వర విషయం తెలుసుకొని ముక్తిపొందాలను విషయమును పురస్కరించుకొని చేయు అభౌతిక ప్రయాణము సాధన. ఈ సాధన మానవుని అంతర్యమున ప్రశ్నపరంపరలు ఊహారూపంలో కలుగు చున్నవి. ఆ ఊహలలో మానవుడెవరు? ఈశ్వరుడంటే ఏమిటి? మానవునికి ఈశ్వరునికి గల సంబంధమేమి? అది తెలుసుకోవలసిన అవసరము మానవునికెందుకు? ఈశ్వరవిషయం తెలుసుకోవాలనే నిశ్చయం మానవునిలో యెందుకు ఉత్పవించుచున్నది? దానివలన సార్థకమేమి? అది ప్రతిమానవుడు యీ విషయాన్ని పురస్కరించుకొని

ప్రయాణము చేయుచున్నాడా? అను ప్రశ్న పరంపరలు తనలో తనకే కలుగుచున్న సంగతి మానవజన్మ యెత్తిన ప్రతియాత్మకు తట్టుచున్న విషయమే!

పై విషయాలు ఊహకువచ్చి సాధించి తెలుసుకోవాలనేది ఆధ్యాత్మికమని చెప్పబడుచున్నది. ఇది మానవునిలో కష్టమో, బాధయో కలిగినప్పుడు స్వామీ! నాకీజన్మ ఎందుకిచ్చావని అర్చుచున్న సంగతికి వచ్చి స్వామీ! అన్నప్పుడు ఆతడు ఎవరు? తనను కాపాడగల శక్తివంతుడా? అని చింతించినప్పుడు తెలుసుకోవాలనే నిశ్చయమునకు పునాది ఆధ్యాత్మికమైన సంగతిని ఆ స్థితికివచ్చినప్పుడు "తత్వం" తత్ = అది త్వం = నీవు అనే ధ్వని వినబడుచున్నది. ఈ ధ్వని విరూపణకే ఆధ్యాత్మికమైన వేదాంతమనబడి అది అభౌతికమైన విషయమని, "తత్" అన్నప్పుడు ఈశ్వరపరమైనదని "త్వం" అన మానవ వ్యక్తిత్వము పొందిన ఆత్మయని, ఈ రెంటికి అవినాభావసంబంధం వుండి ఆదిలో యీ "త్వం" అనేది "తత్" అనే ఈశ్వరునిలోనిదని చెప్పబడి ఆదిలో మానవత్వము సంఘాలుగమారి సంఘములు మతములుగా మారి మత ప్రాతిపదికము రెండు శాఖలై కర్మయనబడు కర్మిష్ఠిరూపము, రెండు వేదాంతరూపమైన ఆధ్యాత్మికము.

1. కర్మిష్ఠియనగా తన నడువడియందు వాక్కునందు జీవిత మనుగడయందు శుచిత్వముపొంది ఈశ్వరనామ సంకీర్తన జపము అనే విధానములో అనగా మంత్రపఠనలో "త్వం" నీవు "తత్" ఆ ఈశ్వరుని సాక్షాత్కరించుకొనగలనని కర్మబద్ధులై సాధనచేయు వారి విధానము.

2. వేదాంతమనబడు ఆధ్యాత్మిక విధానములో కర్మతో సంబంధములేదని దాన్నిని విస్మరించి కేవలము మానసిక స్మరణయే సరియగునని, స్మరణ అన్నప్పుడు మననము, యీ మననమనే విషయ

ద్వారా ధ్యానరూపంలో వారి గురువులచే ప్రబోధింపబడిన మంత్రము అది గురుముఖతావిని గురువు ఆజ్ఞను శిరసావహించి ఆ గురువు నియమించు క్రమబద్ధమైన ఆసనములువేసి దానియందు యీ గురువు చెప్పిన మంత్రమును మననము చేసిన ఈశ్వర తేజస్సు బడయగలవని వారివారిగురువులచే చెప్పబడి ఆ విధంగా నాచరించు శిష్యులు ఆసనములు వేసి గురుమంత్రమును మననము చేసి ఈశ్వర రహస్యం సాధించగడంగుచున్నారు.

ఇందు అజప గాయిత్రియన గాయిత్రీ మంత్రమును అనుకొనకుండానే యెల్లప్పుడు తనలో ధ్వనింపజేయ వలయునన్న సాధనా క్రమములో మననం చేయకుండగనే శ్వాసలో కొన్నాళ్ళు ఆగాయిత్రి మంత్రము మననంచేసిన శ్వాసకు ఆ మంత్రము స్వాధీనమై అనుకొనకుండగనే శ్వాస ఆ మంత్రముగ మారి ఈశ్వర తేజస్సు సాక్షాత్కరించునని దానికి స్వర సాధనయని శ్వాసరూపంలో సాధించు క్రమము వారివారికి తోచిన విధంగా తన శిష్యునకు ప్రబోధ రూపంలో చెప్పుచున్నారు.

ఈ స్వరసాధన అనే విషయం అర్థతెలియని పరిస్థితిలో నుంచుటచే ఆ సాధనలు గాలి రూపంలో ఉచ్ఛ్వాస నిశ్వాసలుగ ఊపిరితిత్తులవరకు పోయి తిరిగి రావడంలో క్రమబద్ధం లేకపోవడంచేత అందులో పలుకబడే పదములు ఆ శ్వాస అనబడే ఊపిరికి అడ్డుకొనుటచేత గాలి సౌమ్యమైన రీతిలో ఊపిరితిత్తులవరకు పోకపోవడంచేత ఆ ఊపిరి మధ్య మధ్య అడ్డుచుండుటచేత ఆ ఊపిరితిత్తులలోని రక్తము వేడెక్కి ఊపిరితిత్తులు చెడి చెడిన తిత్తులనుండి శుభ్రపడని రక్తము గుండెలో ప్రవేశించి ఆ ప్రవేశించిన చెడు రక్తము కార్జము రక్తనాళములకు మొదలైస్థానములకు పోయి అక్కడ స్వచ్ఛతను నిర్మూలింపజేసి కుళ్ళి. కుళ్ళినరక్త ప్రసారమైన దేహము చెడి ఆ వ్యక్తి దుర్మరణానికి కారణమగుచున్నది.

ఇట్లే కపాలాసనము చేయువారుకూడా క్రమబద్ధములేని కారణమున ఆ రక్తము మెదడును కుళ్ళింపజేసి నాశనమునకు హేతువై దుర్మరణమునకు పాల్పడునట్లు చేయుచున్నది.

ఈశ్వర విషయం సాధనా విధానమున మానవుడు తెలుసుకొని తరించిన గాని జన్మరహితము కానేరదనే యదార్థమునకు రాగలిగినప్పుడు సర్వసాధన దాని పూర్తి అర్థం తెలిసిన, దానిని సాధించిన, తన జన్మరహితము చేసుకొన్న సద్గురువు చెప్పు విషయము పై విధము గాదు.

స్వరము అన్నప్పుడు ధ్వనితో కూడినది. అది గాలిగా పీల్చే ఊపిరిలో గాదు. దృశ్యరూపంలో యీ ఊపిరితో సంబంధములేని సూక్ష్మ వ్యక్తిత్వములో ధ్వనింపజేయు స్వరముయొక్క ప్రాతిపదితము శ్వాసపై మోసియున్నది.

భౌతిక శరీరమునకు కదలిక, స్వరము, మనుగడ కలుగవలెనన్న శ్వాస అనబడు గాలి ఊపిరితిత్తులలోనికిపోయి తిరుగ వెలికి (పైకి) వచ్చుచున్న విషయము గమనార్హము. ఆ వూపిరి ఉసురులో మానవ మనుగడయున్నదనిన్ని, అది ఊడిన మానవ మనుగడతో కూడిన ధ్వని శరీరమున అదృశ్యమై కట్టెయనబడి స్మశానమునకు గొనిపోబడు చున్నది. దానిలా ధ్వని మృగ్యమైపోవుచున్నది.

దృశ్యరూపంలో మానవ వ్యక్తిత్వము భౌతికముగ సజీవముగా యున్నా, లేకపోయిన తరువాతనైనా, సూక్ష్మశరీరంగాయుండే వ్యక్తిత్వమునకు ధ్వనియున్నది. కదలికయున్నది. అచ్చట గాలితో కూడిన ఊపిరియున్నదా? అనే ప్రశ్న వచ్చినప్పుడు మానవుడు భౌతికముగా సజీవముగానుండి ఊపిరితోనున్నప్పుడు పలికినట్లే తాను ప్రస్తుతమున్న స్థానమునకు అన్యమైన స్థలములో తనవంటి రూపమునే తన దృష్టికి

తన బుద్ధికి తెలియబడుచున్న సంగతి విమర్శనకు తెచ్చిన నీ భౌతిక శరీరముగల చోట నీ నిద్రలో జాగ్రదవస్థలో నున్నవారు నీ కన్యంగా వున్నవారు నిన్ను చూచినప్పుడు నీవనుకొన్న శ్వాసగయున్న గాలి (ఊపిరి) నీ శరీరమందు ఆడుచునేయున్నది. అది యితరులతో జాగ్రదవస్థలో వారితో సంభాషణలో లేదు కాని నీ దృశ్యంలో నున్న వ్యక్తితో సంభాషించుచున్నది. కాన నీ భౌతిక శరీరము కన్యంగా నీవు చూచుచున్న నీ రూపములో నీ శరీరములోనున్న శ్వాసగా నీవనుకొన్న గాలి, భౌతికమైన గాలిరూపంలో లేదని నీవే తెలుసుకొనగలవు.

ఆ దృశ్యములో నీవు గాంచిన నీ రూపము నీవు భౌతికశరీరంతో జాగ్రదవస్థలో నున్నప్పుడు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు యేలాగున నీవు నీయాత్మీయతగా గ్రహించుచున్నావో ఆదృశ్యమందు కూడా అదే విధముగ నీ యనుభవములో అనుభవించుచున్నావు. అనుభవించుచున్నట్లు తెలియగలవు.

భౌతికమైన విధానంతో గాలిపీల్చి కుంభించి విడిచిపెట్టు విషయం అందులో స్వరము అనే ధ్వనిని సాధించుటమాని సూక్ష్మ శరీరంలో వున్న ధ్వనిని (స్వరమును) సాధనారూపములో పెట్టితివేని నీకు మంత్ర ప్రబోధకుడైన నీ గురువు సద్గురువై యుండి నీకా విషయము తెలిసేటట్లు చేసినచో ఆ "స్వరము" సహ-అహం "సోహం" లేక "యాహు" అనే ధ్వని ఆ శ్వాసలో అభౌతికముగ ఆడుచున్నదని నీకు తెలియగలవు.

ఈ "సోహం" అనే ధ్వనిలో నీకు సద్గురువు చెప్పిన మంత్రము ధ్వనింపజేయు విధానము నీకు తెలియజేసియున్న, నీకు తెలిసియున్నప్పుడు ఆ ధ్వని నిజమైన శక్తివంతమైనప్పుడు "సోహం" గాని "యాహు" అనే ధ్వనిగా మారి నీ నిజగురువు చెప్పిన మంత్రధ్వని ధ్వనించ

గలదు. ఈ ధ్వని ఉచ్ఛ్వాస నిశ్వాసల రూపంలో పాడు చోటుకే కుంభకమని పేరు. అంతేగాని గాలిరూపంలో లోపలకు ఊపిరితిత్తుల వరకు పీల్చి ఆవతలకు విడిచిపెట్టుటకు మధ్యగల ఖాళీ కుంభకమని చెప్పు మాటలు యదార్థమునకు దూరము.

ఈ ఊపిరిగయున్నగాలి ఊపిరితిత్తులవరకుపోయి తిరిగి వచ్చు చున్న దానిపై మోపి జ్ఞానము ప్రబోధించుట కేవలము నిరర్థకము.

"సహ-అహం" సోహం, "యాహూ" ధ్వని అభౌతికమైన మానసిక రంధ్రమందు సూక్ష్మముగా యున్న నీ దృశ్య శరీరమందు ఉచ్ఛ్వాస నిశ్వాస రూపంలో రాపాడినప్పుడు "సహ-అది", అహం = నేను, "యా = అది, హూ = నేను" అనే ధ్వనిలో నీ గురువు ప్రబోధించిన మంత్రము కూడా అదే శక్తివంతమైన అర్థమిచ్చినప్పుడు సహః = ఈశ్వరుని (రస స్వరూపము) అహం = నేను "ఆత్మశక్తి" తాకినప్పుడు ఈశ్వరజ్వాల ఆత్మ తేజస్సును ఆకర్షింపజేసికొని తనవలె మార్చి ఏకమైపోవును. దీనినే సర్వసాధనయని చెప్పవలసియున్న నిజార్థము.

"మూర్ఛలదేల్చు బాహ్య ప్రపంచ గరిమ"

పై విధముగ తన స్వరము సాధించిన సాధకునికి బాహ్యప్రపంచము మృగ్యమగును. అట్టివాని దేహేంద్రియములు ఐహికము మరచిపోవును. అతని చైతన్యము నిర్జింపబడిపోయి జీవాణుసముదాయమయమైన యేకత్వములో ఆత్మయొక్క ఉనికి తెలిసే సమయమది.

అట్టి స్థితికి వచ్చిన తాను భౌతికమైన దేహముతో బాహ్య ప్రపంచమున నున్న తాను తనలో ధ్వనించిన భౌతికమైన "నేను" పోయి నిజ "నేను" ఆత్మ ఈశ్వర తేజములో లీనమైయున్న ధ్వనితో

కూడి అది తన తేజమని గ్రహించగలడు. అదే స్వయం బ్రహ్మన్న సందేహః

ఇది తను స్వయంగా తెలుసుకొనవలసిన అనుభవైక వేద్యము. ఇది మాటలకు వాజ్మయమునకు లొంగునది కాదు.

తానున్నచోటు జన సమ్మర్ధముగ నున్నప్పటికి, ఆ మధ్యనున్న తాను నిర్జరారణ్యంగా మార్చి తాను చేయుచున్న సాధన తన ఆప్త లకుకూడ తెలియని విధంగా సాధన చేయువాడే సాధకుడు.

# సమాధి

మానవుడు ఈశ్వర విషయం తెలుసుకోవాలనే యభిలాషియై సాధనా క్రమమందు ఆయాధర్మ ప్రబోధకులైన గురువులుచెప్పు సాధనలో సమాధి అవస్థ మానవునికి భౌతిక దేహ చైతన్యముపోయి నప్పుడు వచ్చు అవస్థకు సమాధియని చెప్పుచున్నారు. అది రెండు విధాలుగ ఉన్నదని చెప్పబడినది. 1. నిర్వికల్ప సమాధి 2. సవికల్ప సమాధి. వీటిని మానవుడు తెలుసుకోనవలసిన అవసరమున్నదని చెప్పుచు. నిర్వికల్ప సమాధియన్నప్పుడు దేహములోనున్న చైతన్యము తప్పి కొరడుబారునని ఆ కొరడుబారు శరీరము జీవములేని కట్టెవలె భూమిపై పడిపోవునని అందు జీవరూపములోనున్న ఆత్మకు తేజో రూపమైన ఈశ్వరత్వమునకై అతనుచేయు ప్రయాణమునకు యేకత్వ ప్రతిపాదనవచ్చి ఆ సమయములోనే మనస్సు కట్టునని చెప్పు చున్నారు. కాని నటువంటి చైతన్యరహితమైన విషయంగా మారినప్పుడు, ఆవ్యక్తిని ప్రశ్నించినప్పుడు ఆతనిలో ఆ సమయములో వచ్చిన విషయాలతో కూడిన జడజన్యమైన ఊహలుండనని పైనిచెప్పిన యేకాగ్రతవచ్చి మనస్సు కట్టినదని అతను పైకి చెప్పినను అంతరంగమందు లోకవిషయ మైన ఊహలు వాటియందు ఆశాబద్ధమైన విషయాలుండకమానవు. అవి తనకుతాను ప్రశ్నవేసుకొన్నప్పుడు విషయాలతోకూడిన ఊహ లున్నవో లేవో తనకు తానే తెలుసుకోనగలడు.

అటువంటి కొరడుబారిన విషయం చూచి ఇతరులు నాతనినికొక మహత్తరమైన వ్యక్తియని నిశ్చయించి, ఆతడు కేవలం ఈశ్వర సంభూతుడని నతనిగూర్చి స్తోత్రము చేయుచున్నారు.

2. సవికల్ప సమాధి :— పై దానికంటె యీ సవికల్పసమాధి కొంచెము కష్టసాధ్యమైనది. మానవునికి ఆచరింప సాధ్యముకాని విషయమనిన్నీ అది తనకు తాను మరచిపోయినప్పుడు వచ్చుని దానిలో శరీరావస్థ ప్రపంచమనే దృష్టికార్యకలాపనభావజన్యమైన ఊహాలు అన్ని జాగ్రిదావస్థలో ఉన్నట్లుండి వీటన్నింటిని భిన్నమైనస్థితిని చిత్తరువు చూచు చున్నట్లు యింకొకలోకంలో తాను విహరిస్తూ వుండి విషయం గ్రహిస్తూయున్న విధానాన్ని తన తెలివిలో తాను తెలుసుకొనుచున్న విషయమని, అది శరీరమునకుగాని జగత్తులోనున్న చైతన్యమునకుగాని తాను సంకల్పించి చేయు కార్య కర్తృత్వమునకుగాని సంబంధించి యుండని కారణమున ఆ సమయములో తనస్థితియున్నప్పుడు అది సవి కల్ప సమాధియని చెప్పుచున్నారు.

వీటిపై వ్యాఖ్యానాలుగ అనేక విషయాలుమీద మోసి చెప్ప వచ్చునుగాని అవి వాఙ్మయములో కానరావడములేదు. ఈ రెంటి విషయము ఆధ్యాత్మిక రూపంలో చెప్పబడి, ఆ స్థితిలోనే సాధకుడు జ్ఞానియై ఈశ్వరుని తెలుసుకొనుటకు సమర్థుడగుచున్నాడని ఉపనిషదాది వేదాంత గ్రంథాదులలో చెప్పబడినది. కపిలుడు సాంఖ్యరూపములో సమాధులనేకమని చెప్పినప్పటికి పై చెప్పిన రెండు విషయాలు తప్ప అనేకములను వాటిపై తన అనుభవరూపములోగాని ఊహాలరూపంలో గాని చెప్పియుండలేదు.

పైని చెప్పబడిన సవికల్ప నిర్వికల్ప సమాధులేకాక సమాధి యవస్థలు మానవునిలో అనేకమున్నమాట నిజము.

నిర్వికల్ప సమాధినిగూర్చి ఆధ్యాత్మికంగా పయనించు సాధ కునిలో నిరూపించబడిన పైన చెప్పబడిన విషయాలు నిజంకావు. కార ణము నిర్వికల్ప సమాధి యన్నప్పుడు కొరడుబారిన శరీరమువలె మానవుడు తన ఊపిరి బిగించి యింద్రియములను స్థంభింప జేసినప్పుడు

శరీరము కొరడు బారినట్లుండుట సహజము. అంతమాత్రాన నిర్వికల్ప సమాధియని నిశ్చయించరాదు. కారణము ఆ స్థితియందున్న వ్యక్తికి కంటియందు కారముగాని శరీరముపై కత్తికోతగాని పెట్టినప్పుడు తప్పక చైతన్యము కలిగి కేకలు వేయగలడు. ఇది లోకసామాన్యంగా పైన పేర్కొనబడిన నిర్వికల్ప సమాధి.

యదార్థమైన నిర్వికల్ప సమాధియన్నప్పుడు శ్వాసతో కూడిన వూపిరి స్వయంగా దానంతట అదే ఆగిపోయి సాధనారూపములో కొరడిబారిపోవును. ఆ సమయంలో కండలు కోసినను నాతనికి తెలియని పరిస్థితిలో నుండును. సృష్టియన్నది, దానిలోనుండి, యే ఆకర్షణీయ మైన విషయము ప్రేమరూపంలో, స్మరణ యుండదు. ఆ స్థితిలోనున్న వ్యక్తిని గూర్చి పరీక్షించినప్పుడు కండ లొలచినను ఆ వ్యక్తి నుష్షన కూడదు. తలనుఖండించే స్థితికి వచ్చినప్పటికి ప్రేమరూపమైన తన ఆసక్తిని వెల్లడించరాదు. అట్టి జీవసహితమైన నిర్జీవమునకే నిర్వికల్ప సమాధియని చెప్పవలసియున్నది. దానిలో ఏకత్వప్రతిపాదనశక్తి వచ్చి అతనియందు మానవుని ఊహకు అందని మహత్తర విషయాలు వెల్ల డింపసాధ్యమగును. ఇది నిర్వికల్ప సమాధి.

సవికల్ప సమాధి :— ఇది ప్రతిమానవుని యందును అనగా సాధకుడైనను, అసాధకుడైనను, జ్ఞానియైనను, అజ్ఞానియైనను సర్వత్రా ఒకే శక్తిగాయుండుటచేత యీసవికల్ప సమాధి సహజంగా కలుగును. ఇది చైతన్య సహితమై భౌతికమైన జగత్తులో కర్తృత్వ రూపములో తాను ఆచరించుచున్న కార్యకలాపములు తనకు తెలియుచున్నప్పటికి తాను సంకల్పించని, సంకల్పములేనివి అభౌతికమైన విషయాలు నాతని యేమరియున్న దృష్టికి గోచరమగుచున్నవి. అది ఆధ్యాత్మిక విధానములో ఈశ్వర విషయము తెలుసుకొనవలెనన్న

సాధకుని దానిలోనున్న విషయం అర్థముచేసుకొని తెలుసుకోగలిగిన శక్తి జనించుచున్నది. దానిని అజ్ఞాని, పామరుడు ఉపేక్ష రూపములో విడిచివేయుచున్నాడు. సాధకుడు దానిని గమనించి తప్పక తెలుసు కొనవలసిన విషయాలు తనంతట తనకే అర్థమైనప్పటికి అవి గురు ముఖతా నిశ్చయించబడేవరకు విశ్వసింప వీలులేదు. కారణం పామ రునికి సాధకునికి నొకేవిధమైన సమాధి రూపములో కానబడిన విష యాలు భ్రాంతి జన్యములు గా నుండవచ్చును.

ఇది తన దృక్కుమారి కనబడుచున్నదని సాధకుడు తెలుసు కొని నిశ్చయించవలసియున్నది. ఈ స్థితిలో సాధకుడు సాధనా విధా నములో ఈశ్వరుని తెలిసి తానుగాయున్న విషయంగా మారి "అహం బ్రహ్మాస్మి" అనగలడని తత్వరూపంలో చెప్పుచున్నాడు. ఇంతమాత్రాన్ని ఈశ్వర విషయము తెలుసుకొన సరిపోదు.

కపిలుడు చెప్పిన సమాధులను విషయము వాటి రెండింటి యందున సాధకుడున్న సంగతి అవగాహన చేసుకొని దానికి భిన్నంగా ఉన్న విషయము జాగ్రిద స్వప్నావస్థలలో దృశ్యరూపములో తాను గన్నట్టి చిత్రమైన సన్నివేశము సమాధి విధానములోనే యున్నది.

కాని పై విషయములు తత్వరూపమునకు లొంగవని నిశ్చ యించి "యదృశ్యం, తన్నశ్యం" దృశ్యరూపము మాయింప బడినట్టి దిగయున్నదని నిశ్చయించి ఆధ్యాత్మిక వేదాంత అర్థము చెప్పుచు న్నారు. భౌతికమైన జగత్తుకూడా దృశ్యములాంటిదే కాబట్టి యిది కూడా నశించునని చెప్పుచున్నారు.

పై జెప్పిన రెండు విధములైన సమాధులకు అతీతమయిన సమాధి యవస్థ దృశ్యమందు పొందుచున్నాడు. ఇది అనుభవ యోగ్యము.

సాధకుడు అది స్వప్నావస్థలో నున్న జాగ్రదావస్థలోనున్న తన దృక్కు దృశ్యముగా మారినప్పుడు జీవచైతన్యము భౌతికమైన జగత్తులో తన శరీరావస్థను మాయింపజేసిన స్థితిని దృశ్య జగత్తులో ప్రవేశించి అక్కడకూడా భౌతిక జగత్తునందుండు స్థూలశరీరముతో సంచారము జరుగుచున్నదన్న విషయము గ్రహించగలడు. ఇది సూక్ష్మావస్థలో స్థూలశరీరముగా మారిన సమాధియందు చూడబడే విషయాలు రెండు ఒకటి :— భౌతికమైన జగత్తునందు యే చోటనో జరుగు విషయములు తన దృశ్యరూపములో గాంచుట ఇది నొకప్పుడు ఆ చోటు తనకు లభ్యమైనప్పుడుగాని యే యితరమైనవారివల్ల తెలుసుకొన్న విషయాలుగా తెలుసుకొన్నప్పుడుగాని తానుగన్న దృశ్యము జ్ఞాపకమువచ్చి ఆ దృశ్యము నిర్ధారణ చేయుట. దీనినే అభౌతికమైన దూరదృష్టి అన్నారు. వినబడిన దానిని దూరశ్రవణము అన్నారు. ఉపనిషత్కారకులు.

రెండు :— ఇందు ఎవరి స్థూల దేహము సూక్ష్మమైన విషయములో చూడబడే భౌతిక జగదాతీతమైన దృశ్యము తన దృక్కున గాంచుట యనునది అభౌతికమైన తన ఆత్మయొక్క పరిణామముకూడా అయియున్నది.

అది ఊహలకుగాని వాఙ్మయమునకుగాని వాక్కునకుగాని అందక స్వయం నిర్ణయములో తన ఆత్మ తనకు సాక్ష్యమిచ్చి సాక్షియై అది నా సద్గురువు ముఖతః నిర్ధారణ చేయబడినప్పుడు తాను ఈశ్వర యేకత్వ ప్రతిపాదితమైన విషయము గ్రహించి ప్రయాణము చేయగల ఘట్టములోని విషయమునందుండును.

ఈ స్థితికి వచ్చు సాధకుని దృశ్యాలలో భ్రాంతి మహాశక్తి గురు రూపము దాల్చి తానుమాపు శక్తివంతమైన మహత్తు నరకాలవరకు తీసుకుపోవును. అక్కడ స్వర్గమునిపించునట్లు రూపించి సర్వము తానే

అయియున్న సద్గురువు తానని ఆత్మగాయున్న మహాశక్తి తనలో నిదేనని చెప్పి పెడదారికి త్రిప్పి జడజన్మలకు పంపును. ఇట్టి స్థితి సాధకుని అగ్నిపరీక్ష.

ఇట్టి స్థితిని "నగుర్లో రధికం" అను ధ్వనిని ఆశించి ఆర్చిన సాధకుడే కృతార్థుడు.

అట్టి సాధకుని తనతో పయనింపజేసి భ్రాంతిశక్తి బారిని బడకుండా చేసి సద్గురువు తానని, తనంతటి వాడవుగ, నీవున్నావని ఆత్మగాయున్న మహాశక్తి సాక్షి రూపంలో సర్వసాక్షిగ మారి స్వయం బ్రహ్మ న సందేహమని చెప్పగలుగునట్లు చేయగలిగినప్పుడు శిష్యుడు తనంతట తాను స్వయం బ్రహ్మ న సందేహమని చెప్పగలడు.

ఈ స్థితికి వచ్చునప్పుడు సాధకుడు అనేక ఘట్టాల రూపంలో అనేక సమాధుల తీరును గ్రహించగలడు.

ఈ స్థితికివచ్చి అనేక సమాధులు సాధకుడు తాను స్వయంగా మారి ఆ విధానములో ప్రయాణము చేసి కృతార్థుడైన సద్గురునిచే తెలియపర్చబడి తెలుసుకొనవలసినదే తప్ప మాటలలో ఈ సమాధి అవస్థలు యెప్పుడు సాధ్యముగాదు.

ఈ పైె తీరువులో సమాధుల విధానములో సమాధులనేకము లున్నవన్న వాక్కు నిజము.

గురు రూపంగా మారిన సమాధులు విజ్ఞాన సమాధులు. అట్లు కానివి భ్రాంతి శక్తి కల్పించిన జడజన్మలకు తీసుకొనిపోవు సమాధులు—అని తన విజ్ఞానములో గురు నాశీర్వాదమున పరీక్షారూపములో తెలిసికొనవలసినదే.



# దృశ్యము

మానవ దృక్పథమునందు భౌతికదృష్టి నొకటి అంతర్లీనంగా వుండే అభౌతిక దృష్టి మరియొకటియున్నట్లు ప్రతివానికి తెలిసిన విషయమే. భౌతిక శరీర మనుగడనుండి అవయవములుగాయున్న పంచేంద్రియములందు నొకటిగాయున్న కన్నులలో పంచభూతా లనబడు దానిలో నొకటియైన అగ్నియనుశక్తి తేజస్సును గ్రహించునది గ్రహణేంద్రియమైన అవయవము కన్నుగా యున్నది.

భౌతిక ప్రపంచమును యే విధముగా చూచుచున్నాడో అదే విధముగా తన ఆంతర్యమునందు అభౌతికమైన సూక్ష్మ జగత్తును చూచుచున్నది. ఈ చూపు భౌతిక జగమునందు నొకటే యనబడిన అభౌతికమైన సూక్ష్మ విషయమందు రెండుగాయున్నది. ఒకటి స్వప్నము (కల) రెండు దృశ్యము.

స్వప్నము (కల):—ఇది నిద్రావస్థయందు తాను జాగ్రదావస్థయందున్న విషయంగా భౌతిక జగమున నున్నట్లు చూస్తూ అందులో తానా సమయమందు తన చింతనలో నున్న విషయములు, యింతకు పూర్వం తన జీవితములో ఆ సమయమునకు పూర్వము జరిగిన సంగతులు ఆయా సమయాలలో సందర్శించిన వ్యక్తులు గోచరించి భౌతికమందు యే విధముగ కార్యకలాపములు జరుగుచున్నవో అదే విధముగ ఆ స్వప్నమందు కూడా తన భౌతిక శరీరముగ అనుభవించుచున్నట్లు తెలుసుకొనుచున్నట్లు నిశ్చయించుచున్నాడు. అందులో తాను యను కొను విషయములు గాక ముందు జరుగబోయే విషయములను అందు కనబడిన వ్యక్తులు తనకు తెలిసినవారు, దూరదేశమందున్న సంగతి మరచి ఆ సమయమునకు తగినరీతి వారితో సంభాషించిన విషయము

యిత్యాదిగ తాను పరున్న చోటునుండి తన కన్యంగాయున్న చోటులో చూడగల్గుచున్నాడు. లేచి అవి జ్ఞాపకమువచ్చి ఆ సంగతి తనవారితో చెప్పుచు కలగన్నానని అంటున్నాడు. ఇది అభౌతికమైన స్థూల దృష్టిని తాను చూచిన విషయ మొకప్పుడు భౌతిక విధానములో నిజమైనప్పుడు నా కల నిజమైనది అనుచున్నాడు.

దృశ్యము :— దృశ్యమన్నప్పుడు ఆధ్యాత్మిక సాధనారూపములో ప్రయాణము చేయు సాధకునికి తన గురువు తనను తన దృష్టిలో పెట్టి జన్మరహితమను స్థానమునకు గొనిపోవు ప్రయాణమునకు గన్నట్టి విషయములు దృశ్య మనబడుచున్నది.

ఈ దృశ్యమందు సాధకుడు మొదట విమర్శకుడై భౌతిక జగమునన్న శరీరమునకు దృశ్యమందున్న శరీరమునకు యే విధమైన వ్యత్యాసము లేనట్లు తెలుసుకొనవలసియున్నది. అందు తాను ఈశ్వర విషయము తెలుసుకొని నేనుగా మారి జన్మరహితుడై జగద్రూపియై ఈ భౌతిక జగత్తులో కలిగే జడజన్మ జన్మాంతరములనుండి విముక్తుడై చేరు స్థిరమైన స్థానము రసస్వరూపమున అనగా తాను తేజస్సై శాశ్వతమైన అది అంతములేని తేజస్సైన రస స్వరూపములో లీనమగుట ఈ గమ్యస్థానమునకు చేరుకొనుటకు చేయు ప్రయాణము సద్గురు ప్రబోధమైన మంత్రమను ధ్వని దానిలోనుండు అంతరములు ఘట్టాలుగా నొక సోపానము తరువాత మరియొక సోపానము అధిరోహించుచున్నట్లు తనకు తాను తెలుసుకొనగలడు.

దృశ్యము రెండు విధములుగా నుండును. కలవలెనే స్వప్నావస్థయందు చూచే సూక్ష్మ జగత్తు అక్కడకూడా తాను నిద్రపోయిన చోటుగాక సృష్టియందు వేరొకచోటు తానెప్పుడు కనివిని యెరుగనటువంటిచోటు ఆ చోట తనకు యెదురుపడు వ్యక్తులుకూడా తా

నెప్పుడు యెరుగనివారు. ఆయా దృశ్య సమయమందు గోచరించు కళా ఖండములు, సౌధములు, ఉద్యానవనములు, అడవులు, నదులు, నగరాది నివాసస్థలములు, నొకప్పుడు తాను ప్రయాణముచేసి ఆయా చోట్లకు వెళ్ళినప్పుడు అవి భౌతిక జగత్తునందును గోచరింపగలవు. ఇది నిద్రావస్థయందే కాకుండా భౌతిక జగమందు భౌతిక శరీరముతో నీవు కార్యకలాపములలో నున్న సమయమందు నీ బాహ్యదృక్కు మారి అంతర్లక్ష్యమైన విషయములో వేరొక జగత్తు అయాచితముగా గోచరించు చున్నది. అది నీవు భౌతిక జగత్తునందున్న శబ్దాది కార్య కలాపమైన విషయము నీ పంచ జ్ఞానేంద్రియములతో గ్రహించు చున్నప్పటికి అది నీవు తెలుసుకొను చున్నప్పటికి వాటియందు నీ బుద్ధి ప్రసరించు చున్నప్పటికి ఆ సమయమందు నీ అంతర్లక్ష్యమందు చూచుచున్న జగత్తు అందు శబ్దస్పర్శాది కార్య కలాపములతో కూడిన వివిధ విషయముల భౌతిక జగత్తునందు చూచు విధముననే చూచుచున్నావు. భౌతిక అభౌతిక జగత్తులందుగల విషయములు స్థూల సూక్ష్మ శరీరములతో గ్రహించగల శక్తి దృశ్యమని విశ్చయము.

ఇది యోగవాసిష్టమందు శ్రీరామచంద్రమూర్తికి వశిష్టుడు యోగసాధన తెలుపుచు అందలి ఘట్టములను వివరించుచు తాను సాధకునిగా ప్రయాణముచేసిన విధానములో తన శిష్యుడైన శ్రీరాముని ఆ ప్రయాణములో వచ్చునట్లు చేసి అది గ్రహించిన విషయానికి వచ్చినప్పుడు చాలా సంతోషించి తరువాత ఘట్టముసంగతి ప్రశ్నించి నప్పుడు రామచంద్రా! నేను యేదైతే దృశ్యరూపములో సూక్ష్మ శరీరముతో అనుభవ రూపమున తెలుసుకొంటినో ఆ విషయాలు నొకదానితరువాత యింకొకటి నీ యనుభవములో సూక్ష్మ శరీర రూపంలో గ్రహించునట్లు ప్రబుద్ధినిగ చేయుచున్నాను.

శ్లో॥ "అస్మదా దేర్జనస్యైత త్ప్రత్యక్షం నానుమానికమ్
శుద్ధబోధశరీరేణనాధి భౌతికరూపిణా."

శ్లో॥ "ఏషతేనకధితః సర్వో దృశ్యానుభవన్రకమః"

అని చెప్పి అతడు జగద్రూపియైన విశ్వరూపిగా మారువరకు తన దృష్టి యందుపెట్టి అవతారమూర్తిగా మార్చినట్లు యోగవాశిష్టము చెప్పు చున్నది. అటువంటి వ్యక్తి సద్గురువు.

ఆ విధానము యే కాలమందైన తన శిష్యుని తాను గ్రహిం చిన జన్మస్థానమునకు (నిర్వాణస్థానము) గొనిపోవు ఘట్టములను దృశ్య రూపమున చూపిస్తూ అందువచ్చు అవాంతరములనుండి భ్రాంతి మహాశక్తి కలిగించు అగచాటులనుండి తప్పించుచు సద్గురువైన తాను భౌతికంగా అభౌతికంగా స్థూల సూక్ష్మ రూపియై సాధకునికి కలుగు అవాంతర ఘట్టములయందు గోచరించి ఆతని సాయుజ్య ప్రయా ణమునకు అవాంతరము కలుగకుండ నడిపించు బాధ్యత సద్గురువుదై యున్నది.

ఇట్టి స్థితికివచ్చిన తన శిష్యుని సంశయములందును ఆర్భాట ములయందును గురువు ఓర్పువహించి తన శిష్యుని సాయుజ్యునిచేయు తలంపున ప్రేమ ఆశయమునందు అపారమైన త్యాగం చూపించి అతనిని తన స్థితికితెచ్చే సమయము త్యాగరూపమున ఇద్దరికి అగ్ని పరీక్ష.

కలగాని దృశ్యముగాని బాహ్య ప్రపంచమునకు సంబంధించిన కన్నులతో గ్రహించు దృష్టితో సంబంధములేదు. సాధకుడైనా కాక పోయినా అతనియందు అంతర్లక్ష్యముగాయున్న దృష్టి గ్రాహ్యరూప ములో గ్రహించ గలుగుచున్నది. అటువంటి వ్యక్తికి సద్గురువు లభిం చిన అతనికి జన్మరహితము కరతలామలకము.

సాధకుడు కాకపోయినా, కలలుగన్న విషయముగాక అతనికి దృశ్యరూపమైన సూక్ష్మజగత్తులు, కనబడును. కాని గురుసాన్నిధ్యము లేని విధానములో దృశ్యములన నేమో తెలియని కారణమున విస్మరింప బడుచున్నారు.

సద్గురు సాన్నిధ్యము పొంది అతనియందు అపారమైన భక్తి విశ్వాసములు చూపి అతడు నడిపించు త్రోవలందు నిస్సంశయుడైన వానికి ఆ సద్గురువు అన్నివిధాల తోడ్పడి సాయుజ్యునిగ జేయును. అలాంటి శిష్యుడు ధన్యుడు.

దృశ్యము :- దృశ్యవిధానంలో అనేక జీవాణువుల సముదాయములు జలరూపమైన నీలిరంగు తేజస్సులో కదలాడుతూ, కొంత సేపటికి ఆజీవాణుసముదాయమంతా జలరూపమైన నీలిరంగు తేజస్సులో లీనమై అంతా జలరూపమైన నీలిరంగు తేజస్సుగా తళతళలాడుతూ గోచరించు చుండగా.

అది ఎలాచెప్పాలో అర్థంకాని పద్ధతిలో డోలాయమానమై ఆశ్చర్యచకితుడనై వుండగా "ఇది చూచుచున్న దెవరూ?" అని ధ్వని వినరాగా అప్పుడు నా అంతట నేను చూచుకొనగా నేనుకూడా అక్కడ ఏవిధమైన రూపంలో కనబడుటలేదు. దానిని వూహించుటకు వూహ కాని, వర్ణించుటకు భాషగానిలేదు. దానికి పరిధిలేదు. అదికాక ఇంకొకటి ఏదీలేని పద్దతిలో అంతాజలరూపమైన తేజస్సుగా నున్నది.



# దృశ్యము - దృక్కు - ద్రష్ట

ఈ ద్రష్ట దృక్కు, దృశ్యము అనే విషయము భౌతిక ప్రపంచ మందొకవ్యక్తి, ఈ తీరువును గమనించి, దానివిషయము విమర్శనా రూపంలో తెలిసికొన్న విధానమునకు ద్రష్టగాయున్న తను, దృక్కుగా నున్న అతని చూడ్కులవల్ల గ్రాహ్యమైన విషయమునకు దృశ్యమని చెప్పబడుచున్నది. ఇది స్థావర జంగమాత్మకమైన ప్రతి జీవియందును అంకురింపబడిన విషయమైనప్పటికి అది ఈ సృష్టిని గూర్చి ఎంతవరకు తెలిసికొనుటకు సాధ్యముగా నున్నదో చెప్పసాధ్యం గాదు. మానవ వ్యక్తిత్వము పొందిన జీవికి తన బుద్ధి వికాశమందు ఈ సృష్టిని ఒక దృశ్యరూపములో చూచి అందనేక విషయములను గ్రహించి, వీటి పరిణామమును అవగాహన చేసుకొని, తన జీవయాత్రలో మనుగడ సాగించుచున్న విషయము మానవులందరికి తెలిసినదే.

ద్రష్ట, దృక్కు, దృశ్యము అన్నప్పుడు మానవ రూపములో ద్రష్టగానున్న తను, దృశ్యరూపముగానున్న ఈ ప్రపంచమును దృగ్గ్గో పమున చూచి తన గ్రాహ్యమునకు తెచ్చుకొనుచున్నాడని విశదమగు చున్నది. ఇది భౌతిక ప్రపంచమందు ప్రతిమానవుడు ఈ మూడు విషయములుగానున్న తన జీవితమును గ్రాహ్యరూపములో గ్రహించు చున్నాడు. ఈ మానవుని సుషుప్త్యావస్థను స్వప్న రూపమున యిం కొక జగత్తు కనబడుచున్నది. ఆ జగత్తులో భౌతిక జగత్తువలనే కార్య కలాపములు సాగుచున్నట్లు భౌతిక అనుభూతిరూపంలో గ్రహించి నట్లే అక్కడకూడ గ్రహించుచున్నాడు. కాని స్వప్నమందు గ్రహిం చిన వ్యక్తిత్వమును అక్కడ తాను తెలుసుకొనుచున్న దృశ్యరూప మైన జగత్తు అస్తిమాంస వసావికారముతో కూడిన మానవత్వము కాని భౌతిక పదార్థరూపమైన వస్తువాహన సముదాయంకాని కాదు.

అది సూక్ష్మమైనదనే విషయం సువిదితమే. ఇవి ఆధ్యాత్మిక రూప మైన గురుమంత్రి ప్రబోధితుడైన సాధకునియందు అతని గురువు సద్గురువైనపుడు అతని సాధనారూపంలో దృశ్యవిషయం విమర్శకు వచ్చినప్పుడు అందు ద్రష్ట, దృక్కు, దృశ్యములు ఉన్నట్లు గ్రహించ గలడు. ఈ సాధకుని పరిణామమందు ఆత్మ సాక్షాత్కారమనే స్థితి ఈ సాధకునికి కలిగినపుడు అందు తన దేహ స్వరూపమునుండి అటు వంటి నిజస్వరూపముగాయున్న ఆత్మ స్వరూపము వెలకివచ్చి దేహ మనునది విడిపోయిన విధానము గ్రహించ గల్గుచున్నాడు.

ఈ స్థితికివచ్చిన సాధకుని దృశ్యములో దృక్కు, దృశ్యము తప్ప ద్రష్ట కనిపించుటలేదు. అటువంటి దృశ్యము చూచినవ్యక్తి తన గురువు ముందు దృశ్యవిషయము చెప్పినప్పుడు జీవ దేహములు విడిపోయిన విధానం సూక్ష్మమైన దృశ్యరూపములో తానుగన్న జీవ దేహములు విడువడిన తీరువును చెప్పినప్పుడు తన సూక్ష్మ దేహమునుండి తన ఆత్మలాంటి యింకొక దేహము విడువడినదని చెప్పుచున్నాడు. ఈ విషయం పురస్కరించుకొని విమర్శించిన దృశ్యమందు చూచిన తన సూక్ష్మశరీరమునుండి జీవరూపమైన ఆత్మ విడువడి వేరుగాయున్న విష యమును నేను చూచితినని గురువుతో చెప్పిన విధానమున యింకొక శరీరధారిమైన ద్రష్ట ఆ దృశ్యమందు లేదు. ఈ స్థితిని విమర్శించిన దృశ్య దృక్కులు మాత్రమే గ్రాహ్యమునకు రాగల్గుచున్నవిగాని. ద్రష్టగాయున్న విషయము ఏది? అనే ప్రశ్న వచ్చినప్పుడు చెప్పుటకు అసాధ్యముగా యున్నది. ఈచోటనే మానవునియొక్క ఆధ్యాత్మికమైన పరిజ్ఞానం వెల్లడి అయ్యేస్థితి అని గ్రహించవలసి యున్నది.

దృశ్యమందు దేహమునుండి వెలువడిన తన స్వ స్వరూపమే తన ఆత్మగా యున్న విషయం ద్రష్టరూపంలో చూచినది ఏది? అన్నప్పుడు ఆ స్థితిని భౌతికంపలెనున్న సూక్ష్మ శరీరము ఆ సూక్ష్మ

శరీరమునుండి వెలువడిన ఆత్మ స్వ స్వరూపము వీటి రెండిని చూచిన ద్రష్ట, నేనను ధ్వనిస్వరూపమని చెప్పవలసియున్నది. ఈ ధ్వని స్వరూపము దేనిని అనుసరించి యున్నది. అనే ప్రశ్న రాకమానదు. ఈ ప్రశ్నకు ఆ కుహనా గురువులనుండి సమాధానం రావడంలేదు.

తన గురువు సద్గురువైనప్పుడు దృక్ దృశ్యములను తెలిపి అది జీవ దేహములు విడిపోవు విధానమని తెలుపుతూ ధ్వని రూపములో యున్న ద్రష్ట అది కేవలం నే ననే ఈశ్వర సంభూతమైన మహాశక్తి ధ్వనిరూపమున ధ్వనించిన విషయం అది తనలోనిదేనని నిరూపణ చేయగలడు. ఆ నిరూపణ చేసినవ్యక్తి సద్గురు స్వరూపమని చెప్పవలసి యున్నది.

రూప నిష్పత్తి లేని ఆ ధ్వని ఎచ్చోటనుండి పల్కుచున్నది? అనే ప్రశ్నవచ్చినప్పుడు ఈ యావత్ సృష్టిలోనున్న ఈశ్వర సంభూతమైన ధ్వనియే అది. ఆ ధ్వనిని ఆధారము చేసుకొని సాధించిన, అది రస స్వరూప సన్నిభమైన ఈశ్వరునివరకూ ప్రయాణము చేయు మార్గమని తెలియబడగలదు. ఇట్టి స్థితికి వచ్చినవాడే దృగ్రూపమైన దృశ్యమును ద్రష్ట రూపములోనున్న తాను ఈశ్వర సంభూతుడై తెలిసికొనగలడు.

ఆ ఆత్మ స్వరూపమే సాక్షి, అది నే నను ధ్వని స్వరూపముగా మారినప్పుడు సర్వ సాక్షి యని శిష్యరూపములోనున్న వ్యక్తి చెప్పగలడు. దీనినే ఋషులు తమ ఉపనిషత్తులలో "స్వయంబ్రహ్మ న సందేహ" అని చెప్పిరి.



# స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరములు

మన దృష్టికి గోచరించుచున్న యీ భౌతిక జగమందు ప్రతి వస్తువు స్థూలరూపమున పదార్థముగ మన అధీనమైన విషయంగ ప్రతి విషయాన్ని గమనిస్తూ యున్నాము. (పంచభూతాలుగయున్న యీ జగత్తు, ఆకాశము, నిప్పు, నీరు, గాలి, భూమి అనునవి కూడా భౌతిక విధానములో స్థూలముగ పరిగణింప బడుచున్నవి.) కాని అవి కూడా సూక్ష్మములే అవి సూక్ష్మములైనప్పటికి స్థూలములుగనే తోచుచున్నవి.

ఏ విషయమైతే భౌతికమైన విధానములో స్థూలముగ చూచు చున్నామో స్వప్నావస్థలో అదేవిధమైన పంచ భూతాత్మకమైన యీ జగత్తునందు కలిగిన అవస్థ పదార్థరూపము వలెనే మనము గమనించుచున్న ప్రతి విషయము ప్రతివానికి అనుభవమే.

ఆధ్యాత్మికముగ మనము జాగ్రదవస్థలో భౌతిక ప్రపంచాన్ని తిలకిస్తున్న విషయము పురస్కరించుకొని చెప్పవలసి వచ్చినప్పుడు అది జాగ్రదవస్థలో స్థూలరూపమని అందు మనుగడ గలిగిన మన శరీరము స్థూల శరీరమని చెప్పవలసి యున్నది. అదియే నిద్రావస్థలో అటువంటి ప్రపంచమునే గనుచున్నాము. ఆ స్థితిలో వాటిని సూక్ష్మ రూపములని పేర్కొనుచున్నాము. ఇది అభౌతికమైన సృష్టియొక్క వైచిత్రియము.

మనము స్థూల జగత్తుకు వలెనే సూక్ష్మజగత్తులోను మనుగడ నొకే విధముగా నున్నట్లు కనబడినను ఆ యవస్థ కొన్ని లిప్తకాలముల పాటు నున్నప్పటికి అనుభవమందు స్థూలజగత్తులో అనుభవించునట్లు

మనకు తెలియుచున్నది. దానికి యేవిధమైన భిన్నములేని పరిస్థితిలో ఉన్నప్పటికి శరీరము మాత్రము సూక్ష్మశరీరము. అస్థిమాంసవసా వికారమైన తనువుగాదు.

అందు చూడబడే స్థలనిర్దిష్టములు ప్రస్తుతము భౌతిక జగములో తానున్నచోటు మాత్రిముకాదు. సృష్టిలో యే చోటనో స్థూలముగా నున్నచోటులు మాత్రిమే. ఒకప్పుడు మన ప్రయాణములలో ఆయా చోట్లు గోచరించుచున్నప్పుడు స్వప్నావస్థలో (దృశ్యములలో) గన్న విషయాలు జ్ఞప్తికి వచ్చినప్పుడు నొకప్పుడు మనము దృశ్యావస్థలో గన్న విషయాలు జ్ఞప్తికివచ్చినప్పుడు ఒకప్పుడు మనము దృశ్యావస్థలో గన్న విషయమునిజమేనని నిశ్చయించబడుచున్నది. అదే విధానము మన భౌతిక విషయములో మనము అనుభవించుచున్న యెండ వేడిమి గాలియొక్క చల్లదనము, నీటిరుచి, తిను పదార్థములందుగల రుచులు వాసనలు యథాతథంగా దృశ్యములో యే విధమైన తారతమ్యములేని సమానమైన విధముగ అనుభవరూపంలో తెలియబడుచున్నది. దీనిని బట్టి పంచభూతాత్మకమైన ప్రపంచము స్వప్నావస్థలో సూక్ష్మశరీరముతో చూచిన విషయాలు తారతమ్యము లేకపోవుట మనము గ్రహించిన విషయాలను తెలుసుకోగలము.

ఒక మానవుడు తాను భౌతిక రూపముతో చూచినవిషయాలు దృశ్యమందు ఆ వ్యక్తి ఫలానాయని గ్రహించుటయేగాక, కంఠధ్వని అదేవిధముగనుండుట అతనితో మాటలాడినప్పుడు ప్రశ్నకు జవాబు సంగ్రహించడము మనయనుభవమందున్న విషయ విధానము. భౌతిక మైన శరీరము గాలితో కూడిన ఊపిరివిధానములో శ్వాసగపేర్కొన్న బడు పై విషయము భౌతిక గ్రహణేంద్రియములద్వారా గ్రహించినధ్వని పదార్థ సముదాయములలోగల స్థూలత్వము అది గాలితో (ఊపిరి) కూడిన శ్వాసనుబట్టి సజీవముగాయున్న స్థూలశరీరి. మానవుడు

గ్రహించే విషయములోనున్న ఊపిరితోకూడిన శ్వాస సూక్ష్మశరీరముగ దృశ్యములో సూక్ష్మ శరీరముగనున్న వ్యక్తిత్వములో ఊపిరితో కూడిన శ్వాసరూపము (మనకు) కానకాదు.

(ఈ గాలిని పీల్చుచున్న శ్వాస దానిని పురస్కరించుకొని యీ శరీరముయొక్క మనుగడకలదు. అది ఆయుష్షురూపములో ఊపిరి యీ శరీరమునకు వేరైననాడు యీ శరీరము పడిపోవుచున్నది. యిది స్థూలశరీరముయొక్క విషయము.)

ఈ విషయాలనుబట్టి ఆధ్యాత్మికముగ స్థూల, సూక్ష్మ, కారణ మహాకారణ శరీరములుగ ప్రయాణము చేయవలసిన విధానములో పై జెప్పిన స్థూలము తరువాత సూక్ష్మము గలదని తెలియబడుచున్నది. ఈ విధముగ స్థూల, సూక్ష్మ కారణ, మహాకారణ శరీరములుగ యున్న సంగతి తెలుసుకొని జ్ఞాన మార్గములో ప్రయాణము సాగించవలసి యున్నది.

స్థూలశరీరము :— ఇది ప్రతి మానవుడు జీవచైతన్యముతో తన అవస్థలు భౌతిక విధానమున గ్రహించడము, గ్రహించిన విషయాలు తన అనుభవములో భిన్న భిన్నవిధాలుగా తన అవసరమైన విషయాలు సంగ్రహించుటకు తన బుద్ధియొక్క వికాసము ఆలోచనారూపములో అది లభ్యమయ్యేవరకు పోనిచ్చి లభ్యమైన తరువాత సంగ్రహించినది కూడా భౌతికముగనే యున్నది. దానియందుగల శక్తిస్వరూపాన్ని భౌతికమైన విషయముగనే తనమాటలలో చెప్పుచున్నాడు. కాని అది పదార్థ రహితమైనప్పుడు దానిలోనిశక్తి అభౌతికముగ నున్న సంగతి అతనికి తెలియడములేదు. దానిని గూర్చి విమర్శించలేక పోవు చున్నాడు.

ఈ విధముగనే తనజీవితాంతమువరకు యేమరియుండి కాలమును జారవిడుచుచున్నాడు. అతని దృష్టిలో ప్రపంచము స్థూలముగనే

యుండిపోవుచున్నది. దానికి భిన్నముగ స్వప్న రూపములో భౌతిక జగత్తునందు కనపడిన విషయములు గోచరించినప్పుడు అవి ఆశ్చర్య కరముగ నున్నప్పుడు అపురూపమైన విషయముగా చెప్పినను అది యేమిటాయని విమర్శించలేక పోవుచున్నాడు. అజ్ఞాన రూపంలో మానవుడు యీ సృష్టిలోనున్న అస్తి, మాంస, వసావికారమైన దేహము భౌతికమైన స్థూలముగనే స్థిరపరచుచున్నాడు.

స్వప్నమందుగన్న తన శరీరమును జూచి విమర్శించు ఊహ జన్మరహితము చేసుకొనవలసిన జిజ్ఞాసువుకు సంశయముగా తోచక మానడము లేదు.

సూక్ష్మశరీరము :— సూక్ష్మశరీరము మామూలు మానవుని యందు నిద్రావస్థలో స్వప్నముగను, నిజమైన సాధకుని సమాధియవస్థ యందు దృశ్యరూపములో గోచరించు తనవంటి శరీరమునకు సూక్ష్మ శరీరమువలె యున్నది. ఇందు మానవుడు సజీవముగాయున్న భౌతిక శరీరమువలె సమాధి యవస్థయందు దృశ్యరూపములో అనుభ వించుచున్న విషయము సూక్ష్మమైనది. యిది స్వప్నపురియందు తా గన్న విషయము.

ఇందు చూచిన విషయములు సాధారణమానవుడు భూత కాలమున జరిగిన విషయములు తన ఊహలోనున్న విషయములో లేక ముందు జరుగబోవు విషయములు అని నిశ్చయించి దాని ప్రశంస క్రమ క్రమముగా మరచిపోవుచున్నాడు.

ఈశ్వరవిషయము తెలుసుకో నభిలషించిన సాధకుడు స్వప్న దృశ్య విభాగములతో కూడిన పరిజ్ఞానముకలిగి యేది స్వప్నమో యేది దృశ్యమో తేల్చుకొని, స్వప్నమన్న తనకు భూతకాలమందు కలిగిన అనుభవమో భవిష్యత్తునందు తాను ఊహించుచున్న విషయమో

అయివుండుటచే దానికి రక్షించక, దానికి భిన్నమైన విషయము సమాధి యవస్థయందు కనబడునది దృశ్యమని నిరూపణయయిన వాటియందు తానుగన్న విషయాలు తనయంత్య పరిణామమనే ధామమును చేరు ప్రయాణమునకు అవి యెంతవరకు సరిపోవునో తెల్పుకొని యిదమిద్ధమని నిశ్చయించవలసి యున్నది.

ఈ సూక్ష్మ శరీరము యీ స్థూలజగత్తునకు భిన్నముగయున్న సూక్ష్మ జగత్తులో తన యనుభవములో స్థూల జగత్తులో స్థూలశరీరముతో అనుభవించుచున్నట్లు యున్నను, అనగా గృహములు, వస్త్ర వాహనములు, భోజనాది రుచులు, శబ్ద స్పర్శ రూప రస గంధాలు, బంధు మిత్రాది రూపములు తనకు అనుభవ నీయములుగా నున్నట్లు గ్రహించినను, స్థూలజగత్తులో స్థిరముగా నున్నట్లు సూక్ష్మ జగత్తులో దృశ్యరూపములుగా గనుపించునవి స్థిరముగాలేవు. సూక్ష్మ జగత్తులో యనుభవించనవి స్థూల జగత్తులో నున్నట్లున్నవేగాని అందుకు భిన్నముగా లేవు కాని, వాటిలో విశేషములు సాధకులు ఆధ్యాత్మికమైన ఈశ్వర స్థానమునకు ప్రయాణముచేయు బాటయని గ్రహించగలడు. ఇది సద్గురువు సహాయమున కలుగుచున్నదని తెలుసుకొనగలడు. ఈ స్థితి నుండి సాధకుడు సాధనా ఘట్టముగ ఊహించినప్పుడు, స్థూల శరీరమునకు భిన్నముగ యింకొక శరీరము తాను పయనించుచున్న ఆధ్యాత్మిక బాటయందు సూక్ష్మ శరీరముకన్న సున్నితమైన విధముగ సాధకునిగ గోచరించుచున్నది.

కారణ శరీరము :— ఇది పై దానికి మించినది. ఈకారణ శరీరము స్థూల సూక్ష్మ శరీరములవలె గాక సున్నితమైనదిన్ని, అగోచరమైనదిన్ని, స్పర్శాది విషయములకు గాక లొంగనిదిన్ని అయినప్పటికి స్థూల, సూక్ష్మ శరీరములవలె గోచరించుచున్నది. ఇది ఉపాధిరూపమైనదిగ యుండి స్థూల సూక్ష్మ శరీరములకు కలుగు అవస్థలకు ఘటనా కారణమయినది.

ఈ స్థితిలో కలిగే ఊహా పరంపరలు స్థూల సూక్ష్మ శరీరము లుగాయున్న జీవికి ఆకరమై స్థూల సూక్ష్మ శరీరములోని జీవికి అహం కలిగించి దేహముపై మమకారము కలిగించి అరిషడ్వర్గములను ఉద్రే కింపజేసి స్థూల సూక్ష్మ శరీరములకు ఆయా కార్య కలాపములను కలి గించి ఊర్ధ్వగతికో, అధోగతికో పోవుస్థితి యీ కారణావస్థయందే కలుగుచున్నది.

ఈ స్థితికి వచ్చిన సాధకుని ఆత్మకు శ్వాసయొక్క గమనమును తెలుసుకొనగల శక్తి సంక్రమించినది.

ఈ స్థితికి వచ్చిన సాధకుని ఆత్మకు భ్రాంతి, భ్రాంతికి మించిన కుండలిని, వీటికిమించిన కాల మహాశక్తి ఆవహించి ఆశాబద్ధమైన స్వర్గ జగత్తు. అందులో సాధకునికి ఆకర్షణీయమైన ఊహలు కల్పించి ఆ కల్పనా విషయాలు అనగా సౌధాలు, ఉద్యానవనాలు, సరోవర ములు అందు తన్నపేక్షిస్తూ నిరీక్షిస్తూయున్న ప్రేమ మయమైన రూపము.

పైన పేర్కొన్న విషయము భ్రాంతి కాల మహాశక్తి ప్రభావ నిర్మాణమై అదే తన ధామమని ఆ రూపమే ఈశ్వర రూపమని దానిని తెలుసుకొని గ్రహించి దానిలో లీనమగుటకే యీ జన్మ వచ్చినదని అందుకే యీసాధనా సంపత్తియని రూఢిచేయుచు ఆశాబద్ధమైన విషయానికి యీ భ్రాంతియను కాలమహాశక్తి మాటి మాటికి సాధకుని ఆత్మను కలతబెట్టుచు క్రింది మెట్లకు అధోలోకమునకు దించుకుపోవు ఊహలు కల్పించి జడజన్మలకు తీసుకపోజూచును. ఆ స్థితిలో సాధకుడు క్రిందకే పోజూచును. కాని గురుమహాశక్తి శిష్యునికి వాటియందుండే నిజము తెలుసుకొనే భావము ఆశీర్వాద రూపములో ఆహ్వానయమానం చేసి యేది నిజమో యేది భ్రాంతియో నన్నసంగతి విమర్శనగా తేల్చి

కొనునట్లు చేయును. ఇచ్చోటనే సాధకుడు గురువు చెప్పినది నిజమా తనకు అనుభవమందున్న భ్రాంతికరమైన విషయము నిజమా అనుస్థితి కలుగును. ఇది సాధకునికి "అగ్నిపరీక్ష" దీనికి కారణము పైకి దృక్కు పోనిచ్చిన శూన్యము క్రిందికి చూచిన ఆశాబద్ధమైన ఈశ్వరునిగా రూపించు భ్రాంతిలోకము. ఈ స్థితికే

"తత్భావ భవాభవంబైన పద్ధతులన్ మరణించి పుట్టగా,
యేవిధమైన వస్తువునకీ యగచాటులొ చెప్పరెవ్వరున్"

అన్నాడు తత్వవేత్త.

ఈ స్థానమునకు వచ్చిన సాధకుని ఊహలో శ్వాసయే కారణ శరీరమునుండి షట్చక్రములలో ఊర్ధ్వ అధోముఖములకు సాగుచున్న దని తెలుసుకొనుచున్నాడు. ఇది గ్రహించిన సరిపోవునని సాధకుడు తలచి నిశ్చయించబోవు సమయాన యింకొక ఊహాజగత్తు ఉన్నట్లు తెలియబడుచున్నది.

మహాకారణ శరీరము :— ఈ స్థూల. సూక్ష్మ, కారణ శరీరాల లోని విషయాలు తెలుసుకొనగోరే సాధకునికి కనబడే ఊహాజగత్తె అది యేదిగా నున్నదని తనలో తాను ప్రశ్నించుకొన్నప్పుడు అది మహాకారణ శరీరమని తెలియబడగలదు.

(ఇది కారణ, సూక్ష్మ, స్థూల శరీరములకు మూలస్థానమై "నేను" అనే ధ్వనికి యేశక్తి ప్రాతిపదికమై స్థానికి తొంగియున్నదీ మహాకారణ శరీరమని.) అది యే విధముగా తెలుసుకొనుటకు సాధ్యమని ఊహించిన "నేన"ను ధ్వనియందు భావము పోనిచ్చిన, కారణ శరీరములో అరిషడ్వర్గాలను ఉద్రేకింపజేసి సూక్ష్మ శరీర ములో రూపించి ఊహల కల్పించి స్థూల శరీరముచే ఆయా కార్య కలాపాలను జరిగింపజేసినదీ మహాకారణ శరీరమని సాధకుడు తెలుసు

కొని నిశ్చయించ గలుగుచున్నాడు. ఈ చోటనే వృత్తిపుట్టి ఊహ లుగా మారి కారణ సూక్ష్మ శరీరములు దాటి భౌతిక శరీరములో ఆవ హించి అవయవముల ద్వారా కార్య కలాపములు జరిపించుచున్న శక్తియే మహాకారణ శరీరములో ఇమిడియున్నది.

ఇది స్థూల, సూక్ష్మ, కారణ, శరీరములోవలె భౌతికముగను, అభౌతికముగను, ఊహామాత్రముగను గాక ఊహాలందు లొంగినట్లు కనబడి ఊహాతీతముగానున్న శరీర రూపము.

దీనిని తెలుసుకొన్న సాధకుడు తనకుతాను తెలుసుకొన్న ఇవి యన్నియు యీషత్తు భేధములతో నొకే విధములుగా నుండుటచే యిన్నిపాట్లు పడి సాధనలలో వాదివత్తులైన కష్టములకోర్చి యీ చోటికి వచ్చానని స్థిరత్వమునకు వచ్చి ఊర్ధ్వమునకు చూచిన శూన్యమును, అధోముఖముగ క్రిందకు చూచిన తాను దాటి వచ్చిన స్థితులు వాటి యందు నిర్లక్ష్యము, అసహ్యము కనబడుచున్నది. నిస్పృహ వచ్చు చున్నది. అందుకే

"యే విధమైన వస్తువునకో యీ యుగచాటులు చెప్ప రెవ్వరున్" అని చెప్పబడినది.

నీవు జన్మరహితము చేసుకొని రస స్వరూపిగా మారి శాశ్వత మైన నీ నిజస్థానమును గ్రహించువాడవైన పై చెప్పబడిన నాలుగు శరీరములలో గల దాటను ప్రయాణము చేసి క్రింది మెట్లుగాయున్న భ్రాంతి, కుండలిని, కాల మహాశక్తులు తీసుకొనిపోయే అధోలోకము నుండి తృక్ష్నాసమును మార్చి వాటి కతీతుడవై ఊర్ధ్వమునకు వచ్చిన సంగతి తెలుసుకొన్నవాడవై నీదృష్టి ఊర్ధ్వముఖముగాపోనిచ్చి అక్కడ శూన్యముతక్క యేదియు కనబడని కారణమువ ఆ స్థితిలో నీ గురువును మరువక ఆ శూన్యమందు నీ సద్గురువు రూపముపెట్టి అదియు

యే శక్తియని సాధించిన ఆ మహారూపము నాలుగు శరీరములుగ నున్నదని వాటికి మించిన శూన్యమును శూన్యమునకు మించిన గుణరహితమైన "నేను" అనునవియే "తానని" తెలుసుకొనగలడు.

మహాకారణ శరీరంగా ఊహారూపమైన తన రూపము సృష్టి యందున్న ప్రతి ప్రత్యేగ భిన్నమైన అణువునందు తన రూపమే కన బడును. అది గురుమహాశయుని ఆశీర్వాదమున అవ్యయమై తన రూపం సృష్టి యావత్తునందుగల తేజస్సు తన విధానమైన తేజస్సుగనే యున్న దని తెలుసుకొనగలడు.

ఈ స్థితిని భౌతికమైన శరీరమున్నూ, సూక్ష్మాతిసూక్ష్మమైన మహాకారణ శరీరముతో కూడిన ఆత్మస్వరూపమున్నూ ఒకదానినుండి ఒకటి వేరు కాదని తెలుసుకొన్నవాడై జీవదేహములు వేరుకావను నిశ్చయమునకు రాగల్గే స్థితిని పొందగలిగే విషయమున అన్నీ తాను గనేయున్న సంగతి తెలిసిన సద్గురుని ప్రబోధమున నీ నిజస్థానమును చేరి తరించెదవు గాక !

# సుషుమ్న

సుషుమ్న కేవలము ఆధ్యాత్మిక విధానమున గురువులు చెప్పు ఆత్మయొక్క అంత్య పరిణామము తెలియబడు చోటుయని చెప్పుచు "ఇడా, పింగళా, సుషుమ్న" యను మూడు నాడులు భ్రూమధ్య స్థానమున నున్నవని, దాని స్థానము మానవ వ్యక్తిత్వమునందు నొష్ట యంధు కలదని నిరూపణ చేయునట్లు తన వాఙ్మయమునందు ప్రభో ధించుచున్నారు.

ఈ సుషుమ్న వరకు సాధకుని సాధనాశక్తి వచ్చి ఆ సుషుమ్న నాడి బద్ధలై "కోటి సూర్యులు, కోటి చంద్రులు కోటి కోటి తటుల్లతల్" అవి ప్రసాశించిన యెంత వెలుగో అంతటి వెలుగుగ ఈశ్వర తేజస్సును నచ్చోట గాంచగలరని చెప్పుచున్నారు.

ఇది యదార్ధమని తెలియని గురురూపముదాల్చిన వ్యక్తులు చెప్పు సంగతి.

ఈ "సుషుమ్న" నాడి వెన్నెముకలో నరమువలెనుండి సాధనా రూపమైన శక్తిచే దానిని బద్దలుగొట్టునప్పుడే ఈశ్వర తేజస్సు గ్రహించ గలడని గురువు చెప్పినప్పుడు శిష్యరూపంలో యున్న వ్యక్తి నిశ్చయించి సాధనా విధానమును సాగించుచున్నాడు. ఇటువంటి రీతిగా చెప్పబడే విషయం కేవలం అభాస.

నీ గురువు సద్గురువు అయినప్పుడు సుషుమ్నను విడమర్చి చెప్ప దగినప్పుడు నది కేవలం నాడీరూపము కాదు. అది నాడీరూపముననున్న మానసిక రంధ్రము అభౌతిక శ్వాస రూపమున ఉచ్ఛ్వాస, నిశ్వాసలుగ "సః, అహంగ" "యా—హు" అని గాలి ధ్వనితో షడ్చక్రములను డాసి నడచుచున్న విషయమును తెలసికొనవలసి యున్నదని చెప్పవలసి యున్నది.

ఈ అధోముఖంగాయున్న సుషుమ్నా నాడినుండి అనగా మానసికరంధ్రమునుండి ప్రసరింపబడు శ్వాస మూలాధారము నుండి సహస్రారము వరకు ప్రసారమగుచున్న సంగతి తెలుసుకొనవలసిన విషయము షట్చక్రములయందు చెప్పబడిన రీతిని భావమను చోటు నుండి తిరుగ భావమను చోటులో చేరుటకు ఉచ్ఛ్వాస. నిశ్వాసలుగ యున్న యీసుషుమ్న సహస్రారమను భావరూపమనుచోట "కుంభక" రూపమున ఆగినప్పుడు యీ సుషుమ్నయొక్క శక్తి స్వరూపమైన తేజస్సు ఈశ్వర తేజస్సుతో సమానమైన విషయముగా యున్నది. అట్టి స్థితిని గురుమహాశక్తితోడై ఆ కుంభకమును ఛిద్రము చేసినప్పుడు శిష్యరూపములోయున్న వ్యక్తియొక్క ఆధ్యాత్మిక తేజపరిణామము వెల్లడైనప్పుడు యిది కేవలము ఈశ్వర సంభూతమైన తేజస్సని తనకు తాను సాక్షిరూపమున నిశ్చయించ గలడు.

ఇదియే సుషుమ్న పరిణామము

# హంస - షట్చక్రములు

ఈశ్వర విషయమును తెలుసుకొని తరించాలని అభిలాష కలిగిన వ్యక్తులను వారివారి గురువులుచెప్పు సాధనా క్రమములలో శ్వాసారూపమైన హంస షట్చక్రముల మీదనుండి ప్రయాణముచేసి ఊర్ధ్వాధి గమనమున హంసనుపోనిచ్చి అచ్చటనున్న గురు స్వరూపము నందు హంసను లీనము చేయవలెనని చెప్పుచున్నారు. దాని ప్రాతి పదికము తప్పుగా నున్నది.

హంస యన్నప్పుడు మానవుడు భౌతికముగ ఊహించినప్పుడు నొకబాతు ఆకారమున వాఙ్మయమందు వర్ణింపబడినది. గురువుగా యున్నవ్యక్తి చెప్పునప్పుడు హంస అనునది దాని నిజస్వరూపము తెలుపక తెలియని పరిస్థితిలో "హంస" అని చూపుటలో శిష్యుడుగా యున్న వ్యక్తి వాఙ్మయములో చెప్పబడిన హంసను దృష్టియందు చిత్రించు కొనుచున్నాడు. ఆదిలోనే అక్కడే వస్తురూపములో చిత్రింపబడిన హంసను యే విధంగా పయనింప చేయవలెనో తెలుసు కొనుటకు తికమకలు పడుచున్నాడు.

"హంస" అన్నప్పుడు శ్వాసలో హం = నేను, సః = అది, సః, అహం "సోహం" అను ధ్వని-దానియొక్క శక్తి ఆత్మను అవహిం చిన జీవ జడత్వమును శక్తి పదార్థములను విడదీయు శక్తి యేదైతే యున్నదో దానికే హంసయని చెప్పవలయును. కారణము బాతు ఆకారములో వాఙ్మయములో చిత్రించబడిన హంసయొక్క గుణము నీరు కలిసిన పాలను నీరు నీరుగను, పాలు పాలుగను విడదీయు శక్తి గలదిగాన అట్లు విడదీయగలుగుట హంసయొక్క స్వభావముగాన శ్వాసలో మిళితమైయున్న సహ అహం అనే విషయము జీవ జడ

త్వము నందుగల శక్తి పదార్థములుగను వేరుచేయు స్వభావము కలుగు శ్వాసకు తాత్వికులు హంసయని పేరుపెట్టినారు.

ఇది సాధనారూపమందు షడ్చక్రములపై ప్రయాణము చేయించిన ఈశ్వర విషయము తెలుసుకొనగలరని, యీ షడ్చక్రమములలో మానవునియొక్క మూలాధారమైన గుద స్థానమును నొక్కినచో హంస సహస్రారము అనే ఊర్ధ్వ స్థానమువరకు ఉన్న ఆరు వక్రములు వాటి అధిష్ఠాన దేవతలు ఆరుగురని చెప్పుచు ప్రతి చక్రమందును ఆయా విధములైన వెలుగుతో కూడిన రంగులతో కలిపి ఆయా చక్రముల కధిష్ఠాన దేవతలైన రూపములు తిష్ఠవేసి యున్నవని వాజ్మయమందు వ్రాయబడి యున్నది.

వీటికి నొక్కొక్క దేవతకు గురువుచే ప్రబోధింపబడిన సాధనా మంత్రము హంసరూపమైన శ్వాసయందు మిళితముచేసి ఆయా దేవతలను ఆయా చోటుల నుండి మాయింపజేసి ఊర్ధ్వమునకు పోయిన సహస్రార రూపమైన తేజస్వరూపము. గురువుగా నున్నదని చెప్పుచు దానిలో యీ హంస లీనమై శాశ్వితపదవి పొందుచున్నదని చెప్పుచున్నారు.

ఆధ్యాత్మిక విధానము యనగా వేదాంత మనబరగు తత్వము సాంఖ్యాది విషయాల ప్రబోధ రూపములో గురువులుగా తీర్చిన వ్యక్తులు హంస షడ్చక్రములలో వాటిస్థానమందు అధిష్టాన దేవతగ పేర్కొన్న దానినిగూర్చి గురు ప్రబోధ మంత్రము ఉచ్చాటన చేసిన ఆయా దేవతలు హంసగానున్న శ్వాసకు దారినిచ్చి ఊర్ధ్వమున దృక్స్థానమున నున్న సుషుమ్న అను నాడిలో నున్న తేజస్సులలో యీ హంస మిళితమై బ్రహ్మ తేజస్సుగ మారి స్వయంబ్రహ్మ అగుచున్నదని చెప్పుచు దానికి సాంఖ్య సిద్ధాంతము మూలమని నిరూపణ

చేయుటకు యీ హంస మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞా చక్రములు ఆరింటిపైనున్న అధిష్ఠాన దేవతలను నూహించి వాటిని ఆయా చోటులనుండి తొలగించి ముందుకు సాగిన సహస్రారముగయున్న ఏడవస్థానము "ఓం" కారముగ యున్నదని చెప్పుచు అది సహస్ర దళములతో కోటి సూర్యుల కాంతితో ప్రకాశమానమైన చోటు గలదని అది గురుస్థానమని అటువంటి తేజస్సును అది ఆశ్రయించి యున్నదని చెప్పుచు భక్తులు దానినిచేరి జీవన్ముక్తులు కావలయునని చెప్పుచున్నారు.

పై ఆరు చక్రము లనగా మూలాధారమున విఘ్నేశ్వరుడు స్వాధిష్ఠానమున బ్రహ్మ, మణిపూరక చక్రమున మహావిష్ణు, అనాహత చక్రమున రుద్రుడు (శివుడు) విశుద్ధ చక్రమున జీవాత్మ ఆజ్ఞా చక్రమున పరమాత్మ, సహస్రారమందు గురువు. యీ సప్తస్థానములందు ఆయా దేవతా రూపములు నున్నవని వాటిని నీ గురుబోధితమైన మంత్రము విఘ్నేశ్వరునకు ఆరువందల సార్లు, బ్రహ్మకు ఆరువేల సార్లు, మహావిష్ణువునకు ఆరువేల సార్లు, రుద్రునకు ఆరువేల సార్లు, జీవాత్మకు వెయ్యిసార్లు, పరమాత్మకు వెయ్యిసార్లు, గురువునకు వెయ్యిసార్లు, జపించవలెనని యివి గుద, లింగ, నాభి, హృదయ, కంఠ, భ్రూమధ్య, బ్రహ్మరంధ్ర స్థానములతోనున్న యీ దేవతలను సూర్యోదయమునుండి తిరుగ సూర్యోదయమువరకు ఇరువదియొక్క వేల ఆరువందల సార్లు జపించవలెనని చెప్పుచున్నారు.

ఈ విధమైన దేవతారూపమైన పోలిక లున్నవని చెప్పుమాటలను విశ్వసించి నవి భౌతిక రూపములో చెప్పబడియున్న కారణమున శస్త్ర కారులచే, కోయించి ఆయా స్థానములుండుచోట పరీక్షించి చూచిన తత్వమను పేరుతో వాఙ్మయమందు చెప్పపడిన ఆయా

చక్రములందు దళములుగాని, వాటి విషయములలో చెప్పబడిన తేజస్సుతో కూడిన రంగులుగాని, వాటిపై అధిష్ఠాన దేవతలుగా పేర్కొన్న రూపములుగాని కానరావడములేదు. కాని అస్థి మాంస వసావికారమైన మాంస కండరములే కనబడుచున్నవి.

ఆయా స్థానములందున్న దేవతలను దృష్టిలోపెట్టి మంత్ర రూపమైన సాధనా నిమగ్నులను అడిగిన, వాస్తవముగా వారు నిజము చెప్పవలసి వచ్చినప్పుడు, బ్రహ్మనాడి యయిన సుషుమ్న పగిలి రస స్వరూపమను తేజము గాంచినట్లు చెప్పగలరో లేరోగాని అది తెలుసుకోవలెనన్న వారు చెప్పిన దృక్కునకు అడ్డుదూరుచున్న అధిష్ఠాన దేవతల రూపములను మాత్రము వారి సాధనా విషయమునకు నడ్డు దూరి వారి దృష్టిలో తిష్ట వేసుకొనిపోయి తొలగడములేదు. తొలగినట్లు చెప్పలేరుకూడా. సాధకుడుపై అధిష్ఠాన దేవతలను మూలాధార చక్రమును ఊహించు విఘ్నేశ్వరుడు మానవ దేహముతో కూడిన చాటలవంటి చెవులతో తొండముకలిగిన లంబోదరాకారమును మూలాధార చక్రమునందు ప్రతిష్ఠించి తిరిగి తొలగించుటకు సమకట్టిన ఆ యాకారము నాతని దృష్టినుండి తొలగుట అసాధ్యము. ఇట్లే స్వాధిష్టానమున నాలుగు మోముల బ్రహ్మలును మణిపూరకమున శేషశాయి అయిన మహావిష్ణువును, అనాహతమున మెడయందు సర్పములు నొష్టను కన్ను కలగిన శివుని విశుద్ధమున జీవాత్మ యను రూపరహితమైనది కాని తన రూపములాంటి రూపమునుగాని అక్కడ అధిష్టాన దేవతగా నిర్మింపబడిన రూపముగాని ఆజ్ఞా చక్రమున పరమాత్మ యన్నప్పుడు అది యేదియో తెలియని విధమున తికమకలుపడి యేదో తనకు తోచిన రూపాన్ని అక్కడ ప్రతిష్ఠించి సహస్రారమున గురువుగా నిలిపినప్పుడు యీ పై జెప్పిన ఆకారమునకు పురాణ వాఙ్మయములందు చరిత్రలు వుండుటచే ఆయా

చరిత్రలు జ్ఞాపకము రావడము సహజము. ఈ తీరున పడిపోయిన మానవులు దానిని యేవిధముగా ఆరాధించిన తనకు జన్మరహితము కలుగునో తెలుసుకోలేని పరిస్థితిలో నుండుటచే యీ షడ్చక్రము లన్న సాధనా క్రమములో చీకాకుపడి మొదటికే విడిచివేయు చున్నారు.

మానవుడైన నీకు జన్మ రహితము స్వాభావికమైన విషయముగ నున్నదిగాన నీవు నిజైై జన్మ రహితుడవై రసస్వరూపుడవు కాదలచితి వేని "హంస" హం = నేను. సః = అది. "సః అహం"లతో కూడినశ్వాస స్థూల. సూక్ష్మ. కారణ. మహాకారణ శరీరములుగనున్న విధానమున విజ్ఞాన దీక్షలో జాగ్రత్త. స్వప్న. సుషుప్తి. తురీయావస్థలలో చూచిన జగత్తులలో నీవు నీ రూపుగాంచి దానినుండి వెలువడ్డ ధ్వనులను విని చర్యలను చూచినప్పుడు భ్రాంతిచే ఆవహింపబడిన అజ్ఞాన రూపమైన చీకట్లను జ్ఞానరూపమున వాటిని ఛేదించి వెలుగును నీవంతట నీవే దృశ్యములలో చూడబడిన విషయములు హంసయనే శ్వాసయొక్క మహాశక్తియని తెలుసుకొనగలవు.

జగత్తునందుకలుగు జ్ఞాన. అజ్ఞాన. చర్యలు యే విధముగా వీక్షించుటకు సాధ్యముగా నున్నదో అలాగున చూచే శరీరము సజీవ ముగా నుండుటకు శ్వాస యెట్లగత్యమో అట్లే సూక్ష్మ కారణ మహా కారణ. తురీయావస్థలలో నీ శరీరమునకు ఆయా జగత్తులలో కదలిక కలిగించుటకు శ్వాస ఆధారముగాన అటువంటి శ్వాసపై చెప్పబడిన షడ్చక్రముల స్థానములలో ఆయా చోటులలో చెప్పబడిన అధిష్టాన దేవతా రూపముల శక్తియుక్తమైన చోటులను తాకినప్పుడు అనగా మూలాధార చక్రమందు విఘ్నేశ్వరుడు విఘ్నములు కలుగజేయు శక్తిగా నున్నదన్న అది నీవుచేయు సాధనా విధానమున నీకు కలుగు మానసికశక్తి అపాన వాయువు ద్వారమున పోవుటచే నీ సాధనాశక్తి

విష్నమై పోవుచున్నది. అది తెలుసుకొన్న భాగవతము "అంఘ్రి మూలమున మూలాధార చక్రంబు పీడించి" అన్నప్పుడు మూలాధార చక్రమును మడమచే నొక్కి అనగా స్థిరాసనమువేసి నీ మడమచే ఆ రంధ్రము మూయబడిన నీ సాధనాశక్తి పైకెగసి లింగ, నాభి స్థానములనుండి హృదయమునకు క్రమక్రమముగ ఊర్ధ్వస్థానమునకు నీ ఆత్మశక్తి పయనించి సహస్రారమందున్న సుషుమ్నా రూపమందుగల బ్రహ్మ తేజస్సున కలియునని చెప్పినట్లున్నది. అట్లు మూలాధార చక్రము మూయబడిన విధానములో విఘ్నముకాని స్థితిలో నీ హంస స్వాధిష్టానమునగల బ్రహ్మయను శక్తి నాలుగు ముఖాలుగ కలదన్న వ్యక్తిత్వమును విడిచి అక్కడనున్న శక్తి సృజనా శక్తిగా నిశ్చయించి ఆ చోటును నీ హంస రాపాడినప్పుడు వూహాలుపుట్టే మూలస్థానమని తెలుసుకొన గలవు. అది యదార్ధ భ్రాంతిజన్యములుగ నున్నవని గ్రహించి ఆ వూహాలందు నీ హంసను మిళితముచేసి మణిపూరకమున మహావిష్ణువన్నప్పుడు విష్ణువుయొక్క శక్తి స్వరూపము వృద్ధిచేయునది గాన నీ హంసతో కూడిన వూహాలు వృద్ధియయినకొలది నీకు సాధ్యము కానంత దూరమునకు ప్రసరించుచున్నదన్న సంగతి తెలుసుకొని అవి విష్ణుసంభూతమైన శక్తిచే విశాల పర్చబడి అందులో మిళితమైన నీ హంసను అనాహతమునకు అధిష్టాన దేవత అయిన రుద్రుని శక్తి లయ కారణము. గాన అంతవరకు సాగిపోయిన వూహాలలోగల మలిన మైన వూహాలు ఆ చోట నశింపబడి శుభప్రదమైన శివరూపములో శుభప్రదమైన వూహాలలో నీ హంసను యిమిడ్చి, విరుద్ధముగనున్న జీవాత్మయనుశక్తి నీ ఆత్మ జీవరూపములో నీ ఆకార రూపములోనున్న దని తెలియబడి అటువంటి జీవరూపమైన ఆకారముతో కూడిన నీ హంసను ఆజ్ఞా చక్రమునకు అధిష్టానదేవతయయిన పరమాత్మవరకు పయనింపజేసి పరమాత్మఅన సర్వవ్యాప్తమైన తేజోరూపమని సహస్రార స్థానమునకు అధిష్టాన దేవతయగు గురుమహా తేజస్సునగల గురువను

గుణరహితమైన మహాతేజస్సు నీవుగా మారిన విధమునకువచ్చి అది నీవేయని తెలుసుకొనవలసి యున్నది. ఈ విషయాన్ని నీ హంసను తెలిసిన సద్గురుండు ప్రబోధరూపమైన మంత్రము హంసరూపమైన శ్వాసలోచేర్చి షట్చక్రముల తాకిడికి అధోముఖమున పోనిచ్చి ఊర్ధ్వ ముఖమున సహస్రారమునకు పోనిచ్చి గ్రహించవలసిన సాధకుడు భ్రూ మధ్య మందు దృక్స్థానమున్నదని తెలుపు సద్గురుని ఆశ్రయించి హంసగాయున్న శ్వాస ఊర్ధ్వ అధోముఖములకు సహస్రారమువరకు షట్చక్రములను దాసి ఊహాజన్యమైన కుండలిని కాలమహాశక్తులను పోకార్చు విధములను తెలుసుకొని ఊర్ధ్వ ముఖుడవై భావమునకు స్థానమైన దృక్కు అనుచోటుకు నీ చూపుమరల్చి గుణరహితమైన నీ గురుస్వరూపాన్ని వీక్షించిన అది గుణరహితమైన అవ్యయమై నీ రూపమును లయింపజేసి నిన్ను అవ్యయముగా మార్చి ఆ తెలివియను తేజస్సే నీవుగా నున్నావని తెలుసుకొన గలవు.

# శ్వాస

మానవ మనుగడకు శ్వాస అనునది గాలి పీల్చడమునకు ఉచ్ఛ్వాస. నిశ్వాస కుంభకములని చెప్పబడుచున్నది. అస్తి మాంస వసావికారమైన దేహమునకు కదలిక కలిగించుచున్న విషయము జీవ చైతన్యమునకు కారణము శ్వాస. ఈశ్వాస ఉచ్ఛ్వాసములోగాని నిస్వాసలోగాని, కుంభకములోగాని ఆగిపోయిన మానవుని మనుగడ లేదు. అప్పుడు ఊపిరి పూడిపోయినదని జీవము లేదని చెప్పబడు చున్నది. ఎప్పుడైతే జీవములేదో యీ శరీరము పడిపోవు చున్నది. ఆక్షణమందే కట్టెయని పిలువబడు చున్నది. మత మతాంతర ఆచార విధుల ప్రకారము ఆ శవమును కాల్చడముగాని ఖననము (పాతిపేయడము) చేయడముగాని చేయుచున్నాము. భౌతికమైన యీ దేహము జీవ రూపములోనున్న అభౌతికమైన శక్తికి శ్వాస ఆధారమని ఆయుష్షు రూపంలో (శతాయుః పురుషః) నూరు సంవత్సరముల వరకు మానవుడు జీవించునని చెప్పేడి మాటలలో మానవునియొక్క ఆయువు నూరేండ్లు నిండక పూర్వమే యీ శ్వాస ఆగిన మానవుడు చనిపోవుట మనము గమనించు చున్నాము.

దేహధారి అయిన జీవి శ్వాసకు అకరమై యుండుట అను పద ముల గాలిని పీల్చడము ఆగిపోవడమని తెలిపిన విషయము. ఇది భౌతిక ప్రపంచములో భౌతిక దేహము ధరించి మనుగడ సాగించుచున్న వ్యక్తిత్వముయొక్క విషయము. అటువంటి వ్యక్తిత్వము స్వప్న దృశ్యములనెడి సూక్ష్మమైన విధానములో కూడా యిటువంటి రూపము తోనే తన భౌతిక శరీరము సజీవముగానున్న చోటుగాక వేరొకచోట నున్నట్టి విషయము మన అనుభవములో స్వప్న దృశ్యాలలో తెలియు

కొనుచున్నాము. అటువంటి నిద్రావస్థలోనుండి స్వప్న దృశ్యములను వేరొకచోట నున్నటువంటి వ్యక్తిని మనం చూచినప్పుడు యే చోటు నైతే తాను నిదురించుచున్నాడో లేక సమాధి అవస్థలో నున్నాడో ఆచోటుననున్న అతని భౌతికమైన దేహము సజీవమైన జీవముతో ఆ జీవములో శ్వాస ఉచ్ఛ్వాస నిశ్వాసములతోనే యున్నది. ఆ వ్యక్తి గమనించుచున్న దృశ్యములో తానున్న చోటుకు సుదూరమైన స్థలములో భౌతిక దేహముతోకూడిన తన స్వరూపం తోనే అక్కడ యింకొకరితో సంభాషించుచు యెదిరివ్యక్తిని తెలుసు కొనుచు ప్రశ్నోత్తరములకు జవాబులు చెప్పుచు అక్కడనున్న స్థలములో చెట్లు చేమలు నదులు పర్వతాలు పట్టణములు జనసమూహములు భౌతికముగ మన అనుభవములో నున్న విషయముగనే తిలకించుచున్నాడు. అతని కంఠధ్వని యెదిరివాని కంఠధ్వని పోల్చ గలుగుచున్నాడు. ఎదిరి వ్యక్తి సజీవముగా నున్నవారైనను మరణించిన వ్యక్తియైనను అతని స్వరూపము ఆ కంఠధ్వని అతని నామము, అతనికి తెలిసినంతవరకు సరిపోవుచున్నది. ఆ దృశ్య సమయములో భౌతిక ప్రపంచములో తాను అనుభవించుచున్న జిహ్వయొక్క రుచియును, కంటియొక్క దృష్టి చెవుల ధ్వనియొక్క దేహముయొక్క స్పర్శా రూపములో యెండయొక్క వేడిమి, గాలి యొక్క చల్లదనము, వర్షమున తడియుట ఆ చోటులలో తినిన పదార్థములయొక్క భిన్న భిన్న రుచులు, సుగంధ దుర్గంధములు భౌతికమైన ఘ్రాణేంద్రియములతో యెట్లు గ్రహించుచున్నాడో, ఆ విధముగనే స్వప్న దృశ్యాలయందు గ్రహించుచున్నాడు. పరీక్షించి చూచిన దృశ్యమందు చూచిన స్థలము భౌతికమైన దేహమున్న చోటుగాదు. అయినప్పటికి భౌతిక దేహ రూపములో గ్రహణేంద్రియములద్వారా గ్రహించిన విషయాలు అక్కడకూడా గ్రహించు చున్నట్లు అక్కడ భౌతిక స్థూల శరీరమువలెనే కనబడుచున్నది.

భౌతిక దేహమునకు యీ శ్వాస ఉచ్ఛ్వాస నిశ్వాసలలో వున్న విధము దృశ్యరూపంలో సూక్ష్మంగా యున్న విషయంలో దేహము భౌతికమైనదిగ యుండి ధ్వనించుచున్నప్పుడు దానిలో భౌతిక శరీరముతో పీల్చబడే గాలిరూపములో నున్న శ్వాస అక్కడ లేదు.

భౌతిక ప్రపంచమందు శ్వాస ఆగిన ధ్వనికూడా ఆగిపోవు చున్నది. ఇంద్రియములు పనిచేయడంలేదు. కాని దృశ్యములో యేనాడో దేహము విడిచిపెట్టిన రూపము గోచరించినప్పుడు అతని సంభాషణలో సజీవముగనున్న ధ్వనియే వినబడుచుండుట మన అనుభవమున తెలిసిన విషయమే గాన శ్వాస అన్నప్పుడు ఉచ్ఛ్వాస. నిశ్వాస రూపములో గాలితో కూడిన విషయము మాత్రము కాదు.

మానవుడు పీల్చుగాలి ఊపిరితిత్తులవరకే వెళ్ళి అందులోనున్న రక్తమును శుద్ధిచేసి గుండెకు పంపుటకే నుపయోగించు చున్నదిగాని అసలు శ్వాస అనునది ఊపిరితిత్తులకు అన్యముగ నువ్న షట్చక్రములనబడు మూలాధారమునుండి సహస్రారమువరకు ఉచ్ఛ్వాస నిశ్వాస రూపములో వాటిని షట్చక్రములునంటి సాగుచున్న విషయము జ్ఞాన విధానములో ఈశ్వర సన్నిభమైన తేజస్సుగ తన ఆత్మ పరిణామము పొందుటకు ఆకరమైయున్న సంగతిని విస్మరించక దృష్టిలో పెట్టిన దానిలో ఊతిరితిత్తులవరకు వెళ్ళి తిరిగి బైటకు వచ్చు గాలి మాత్రము కాదని తెలుసుకొనగలడు.

శ్వాస ఒక అద్భుతమైన మహావిషయం. ఈ శ్వాస పంచ భూతాత్మమైన సృష్టిని గల శక్తి ఆత్మయొక్క ఉనికిపట్టు. ఆకారణమున సాధకుడు సాధనారూపమైన విషయము ఉచ్ఛ్వాస. విశ్వాస. కుంభకమనేగాలిలో ఇమిడ్చి సాధనచేయడమేనని అది రేచక, పూరక కుంభకములని చెప్పుచున్నారు. ఇది శ్వాసను తెలుసుకోజాలని వారి

పడికట్టుమాట ఈ షడ్చక్రముల విధానంలో ఈ శ్వాస ప్రసరించాలనే విషయం వచ్చినప్పుడు ఈ శ్వాస ఊపిరితిత్తులను చించుకొనిపోయి మూలాధార చక్రమువరకు వెళ్ళే సావుకాశం లేదు కాబట్టి ఈ ఊపిరిగావున్న శ్వాస శ్వాసకాదు.

ఈశ్వరసంభూతమనే మహావిషయం తెలుసుకోవలెనన్న అభౌతికమైన దృశ్యరూపములో కనబడే భౌతిక శరీరములాంటి శరీరము అక్కడ సజీవంగా రూపించే విధానంలో ధ్వనించే ధ్వనికి శ్వాస ఆకరముగాన, ఆ సూక్ష్మశరీరములో ఆడుచున్న శ్వాసకే ఆధ్యాత్మిక శ్వాసయని చెప్పవలసియున్నది. కారణము శ్వాసలేనిచో ధ్వనిలేదు. ధ్వనిలేనిచో మనుగడలేదు. దీనిని పురస్కరించుకొని సాధకుడు సాధన చేయు మంత్రము యదార్ధమైన శక్తివంతమైనప్పుడు దృశ్యమందున్న సూక్ష్మశరీరమును స్థూలశరీరముగ మార్చుచున్నది. ఆ శరీరముయొక్క బరువు భువన బ్రహ్మాండములతో తూచినదానికంటె బరువుగనుండును. తేలిక విషయము వచ్చినప్పుడు పల్చని ఆకు (దళం) కంటే తేలికగనుండును. అదియే శ్రీ కృష్ణభగవానుని తులాభారము. అదియే మహమ్మద్ ప్రవక్త యందు వారికుమార్తె గ్రహించిన యదార్ధము.

శ్రీ మహమ్మద్ ప్రవక్త నిర్వాణము తరువాత రెండువందల మైళ్ళ దూరమునుండి ఆయన శిష్యుడు మదీనావచ్చి అచ్చటి ఆనాటి ఖలీఫా సిద్దీఖ్ గారితో సహా మహమ్మదీయులనందరిని నుద్దేశించి మీ అందరిలో శ్రీ మహమ్మద్ వారి నిజస్వరూపమును గుర్తించ గలిగిన వారెందరు, వారు యెవరు అని ప్రశ్నించినప్పుడు ప్రతియొక్కడు వారి భౌతికరూపాన్ని వర్ణించగలిగారు గాని ఆయన శ్రీ మహమ్మద్ గారి కుమార్తె ఫాతిమాగార్ని ప్రశ్నించినప్పుడు "ఒకనాడు శ్రీ మహమద్ వారి నడుముకట్టు బిగించుచుండగా తాను బిగించిన ముడితో సహా

ఆ నడుముపటకా యివతలికి వచ్చిన విషయముచూచి తాను తన తండ్రి వైపుచూడ వారి భౌతికరూపము కనబడక ఆకాశమునుండి భూమి వరకు మహాతేజస్సుతో నిండిపోయియున్నదని చెప్పారు. ఈ సంగతి విన్న శిష్యుడు సభాసదులను చూచి మీ అందరిలో యీమె ఒక్కరే శ్రీ మహమ్మద్ వారి విశ్వరూపమును గుర్తించిరని చెప్పెను."

అదియే శ్రీ మహమ్మద్ ప్రవక్త యొక్క నిజస్వరూపము. అదియే శ్రీకృష్ణ భగవానుని విశ్వరూపము. అదియే శ్వాసయొక్క ఆకారము.

శ్వాసయొక్క ఉనికిపట్టు గురువుచే తెలియబడి ఆ సూక్ష్మ శరీర మందు ఆడెడి శ్వాసలో "సోహం." సః అహం, అది నేను అనుధ్వని రేచక పూరకముగ నున్నదని తెలుసుకొని అందు గురుప్రబోధిత మంత్రము సాధించినప్పుడు, అది ఆత్మయనే ఈశ్వర సంభూతమైన మహాశక్తి యని నిరూపణ చేయగలడు.

ఈ శ్వాస పూరకమందు అధోముఖముగను రేచకమందు ఊర్ధ్వ ముఖముగను అతిసూక్ష్మముగా సన్నని బాటలో షట్చక్రములను డాసి ఊర్ధ్వమునకుపోయి, అది గురుస్వరూపమైన గుణరహితమై ఈశ్వర సంభూతమైన సృష్టికి ఆదినిగల తేజస్సునందు లీనమగుచున్నది.

ఈ శ్వాసను సాధకుడు తలయొక్క గ్రాహ్యములో స్థూల సూక్ష్మకారణ శరీరములవరకు తన భౌతిక శరీరమునకు అన్యముగా యున్నట్లు తెలుసుకొనగలడు. మహాకారణ శరీరము భౌతికమైనదిగా కాక అభౌతికమైనదిగా కాక వూహారూపములో రూపించును. ఆ స్థితిని తనలో నున్న జగత్తు గోచరించును. అది తనకన్యంగాకుండ తనలో యున్నదని తనే అదియని తెలుసుకొనగలడు. అందు నీవుపాడేమంత్రము యదార్థమైయున్న నీచుట్టూయున్న జగత్తు ఆ మంత్రమునే జరిపించు చున్నది. అదియు తనముక్తికై పాడుచున్నది.

దీనినే "ఏదోకాలము వైణికాకృతిని యెవ్వానినోపాడు" అన్నాడు తత్వవేత్త. ఏదికాలము స్మరించి తన నిజస్థానము తిరుగపొంద వలెననుకొనుచున్నదో అట్టి మంత్రమును స్మరించి సాయుజ్యరూపముగ నున్నమానవుడు తాను తనతో నున్న జగత్తు కాలములోనున్న విషయము తెలుసుకొని యేముక్తికై కాలముపాడుచున్నదో తనలోనుండి వస్తూ యున్న ధ్వని యని తెలుసుకొన్నవాడై ఈ శ్వాసరూపమైన మహా శక్తి ఆత్మకు ఆకరమై ఈశ్వర తేజోరూపములో సమ్మిశ్రితమగు వరకు సోహం-సః అహం శ్వాసయే బాటయని తెలిసికొనగలడు.

ఆ వ్యక్తిత్వమునందు వచ్చిన ప్రతిధ్వని జయధ్వజమెక్కి వాటి యదార్థమును సమర్థించును.

కాబట్టి శ్వాస వుచ్ఛ్వాస నిశ్వాసకుంభకములనే గాలియందుగాని దానియందు "సోహం" అనునాదముపెట్టి సాధకుడు మంత్రము సాధించిన ముక్తివచ్చునను పడికట్టు మాటలకులొంగి విలపించక యథార్థమైన శ్వాసను సూక్ష్మముగను అదియే జీవముగను ఆత్మగను పరిణామములో ధ్వనితో కూడిన ఈశ్వర తేజస్సుగను వున్నదని అది తానేనని తెలిసికొన గలవు. అప్పుడు ఆ ధ్వని నేను అనేదే పలుకుతుంది. అదియే కాలము. తన ముక్తికై పాడుచున్నది.

ఇందు నిగూఢ విషయాలు ప్రస్తుతకాలములోనున్న సైన్సు పూర్తిగ మారణహోమముగమారి అందు యేహ్యము జనించి మానవ దృక్పథము ఆధ్యాత్మికమువైపు మరలి దీనిని సైన్సురూపములో తెలుసు కొనుకాలమువచ్చి దానిని పరికరములద్వారా తెలుసుకొన ప్రయ త్నించును. ఆ కాలమున ఈ శ్వాస విషయము తెలియబడగలదు. అదియైనను సైన్సురూపములో సూక్ష్మ శరీరమువరకే గాని ఆ పైని పరికర సాధ్యముకాదు.



# ఆరాధన

సృష్టిలో ఆరాధన యనేది పూజా విధానమును పురస్కరించు కొనిచేయు కార్య కలాపములకు ఆరాధన యని చెప్పుచున్నారు. ఈ ఆరాధన ప్రతి మతములోను యేదో రూపములో జరుగుచునే యున్నది.

హైందవమత సాంప్రదాయములో విగ్రహముగలచోట ఆరాధన చేయు క్రమము అందరికి తెలిసినదే. అలాగుననే మహమ్మదీయులలో ఆరాధనా విధానమైన కార్యక్రమమునకు "ఫాతెహా" అందురు క్రైస్తవులలోకూడా మేరీ, క్రీస్తు విగ్రహముల మోల ఆరాధనచేయు క్రమము కలదు.

హైందవమతములో వారివారికి అనుగుణ్యమైన శిల్ప రూపములలో చెక్కబడిన విగ్రహముమోల దీప ధూప నైవేద్యములను పెట్టుచు యనగా నొక ప్రమిదలో నేయియో. నూనెయో పోసి వత్తి వేసి వెలిగించి అగరవత్తులు వెలిగించి సాంబ్రాణి అగ్నియందువేసి ధూపము వచ్చునట్లుచేసి ఫలరూపములోగాని, ప్రసాద రూపములో గాని తినుట కర్హమైన పదార్థములను అచట పెట్టి వాటికి ధూప దీప నైవేద్యములని పేరిడి చేయుపూజకు ఆరాధనయని చెప్పబడు చున్నది.

ఇస్లాం మతములో పై విధముగనే అగరవత్తులు వెలిగించి అగ్నియందు సాంబ్రాణివేసిన ధూపము వచ్చునట్లున్నప్పుడు పలావులాంటి ఆహారముగాని, పాయసములాంటి పానీయముగాని, పండ్లుగాని పెట్టి చేయు పూజావిధానమునకు ఆరాధన (ఫాతెహా) అని పేర్కొని నిర్వ

నిర్వర్తించుచున్నారు. అలాగుననే వారి వారి మతనిర్ణయం పద్ధతులలో ఆరాధన చేయుచున్నారు.

ఈ మూడు మతములేకాక సృష్టియందుగల ప్రతి మానవ సంఘము వారి వారి సంఘనియమిత విధానంలో పై విధముగా ఆరాధనలు చేయుచున్నారు.

ఈ పై విషయాలను చూచిన వ్యతిరేక విమర్శకులు విమర్శించక మానలేదు. "రాళ్ళు తిననేర్చిన రాసులు ఆగునా" యని హేళన చేయుటకూడా కలదు. నైవేద్య రూపములో పెట్టిన ఆహార పదార్థములు ఆ విగ్రహములు తిననేర్చినవి కావు.

అక్కడపెట్టి యెవరి వస్తువులు (పదార్థములు) వారికి తిరుగ లభ్యమగుటచే యీ విధానములో ఆరాధన కల్పించి ఆ మృష్టాన్న భోజనము తాము అరగించుటకు తాము కల్పించినవేకాని యిది నిజముగ మానవునికి యే విధమైన విషయమునకైనను ఉపకరించునవి కావని ఇస్లాం మతములోచేయు భక్ష్యాది విషయములను ఆయా పేర్లను బట్టి ఆరాధించిన ఆయా వ్యక్తులు తినరుగదా! అటువంటి పరిస్థితిలో యిది కేవలం మూఢత్వమని విమర్శించు నొకశాఖ మహమ్మదీయులలో లేకపోలేదు. అలాగుననే క్రైస్తవ మతములలోకూడా విగ్రహారాధన లేని క్రైస్తవశాఖవిగ్రహారాధనచేయు క్రైస్తవశాఖను విమర్శించుట గలదు.

ఈ పై విషయాలనుబట్టి చూచిన యీ విమర్శకులు విమర్శించే అంశములు సరియైనవేయని నొప్పుకొనవలసియే యుండును. ఇది భౌతిక విధానములో చూచిన విమర్శనలకు లొంగిపోవుచున్నమాట వాస్తవమేకాని భౌతిక రూపంలో విమర్శించిన యీ విమర్శకులకు మూఢులని జడ జన్ములని చెప్పక తప్పదు. వీరు ఆ చోట నియమమైన వాటిలో గల అభౌతికశక్తిని యెరుగరు.

ఆరాధనయందు పెట్టిన భౌతిక అభౌతిక రూపములు మాయింప జేసి ఆయా రూపములయొక్క సూక్ష్మాతి సూక్ష్మమైన రూపము నకుపోయి వాటి గుణములను పరిశీలించిన వ్యక్తికి ఆరాధన యేమో తెలియగలదు.

హైంతవ మతమందు ప్రతిష్టింపబడిన విగ్రహములో నుచ్ఛరింపబడిన ఈశ్వర సంభూతమైన శక్తివంతమైన రూపము నిరూపణ కాగలదు. దానిని ఆరాధించు (పూజించు) విషయములో నియమింపబడిన సువాసన కలిగిన ధూపము, దీపము, రుచికలిగిన పదార్థము సువాసన కలిగిన పుష్పము వాటియొక్క భౌతికరూపమును మాయింపజేసి దీపమందుగల అగ్ని ధూపమందుగల ఆహూతి పుష్పమందుగల సువాసన పదార్థమందుగల రుచి సమ్మేళనచేసి ఆ ఆరాధన సమయమందు ఉచ్చరించు మంత్రరూపమయిన ధ్వనితో మేళవించిన అది నొక మహత్తరమయిన శక్తిని ఆత్మకు సంక్రమింపజేయును.

పై విషయము గురువుగాయుండి ప్రబోధరూపంలో ఉచ్చరించు మంత్రముయొక్క ధ్వనిలో అఘ్రాణించగల శక్తివంతమైన ఆత్మ స్వరూప పరిణామంగలదిగ ఉన్నప్పుడే పై విషయము సాధ్యము కాగలదు.

దృశ్యరూపములో కనబడే సూక్ష్మశరీరము యీ పై విధములైన వస్తుగుణముల శక్తిని అశరీరముగ నది అఘ్రాణించగలదు. సూక్ష్మ జగత్తులో అనుభవరూపములో తెలుసుకొన్న విషయాలు భౌతికంగా అనుభవించునట్లే మనం చూచినప్పుడు యీ వస్తువుయొక్క భౌతిక రూపం తీసివేసి సూక్ష్మరూపముగ మార్చిన తెలియగలదు.

భౌతికరూపము భౌతిక పదార్థములను యెట్లు ఆరగింపగలదో, అట్లే సూక్ష్మాతిసూక్ష్మమైన గుణసహితమైన శక్తిని జగద్రూపమైన సూక్ష్మ

మైనఆత్మ ఆ(ఘూణించగలదు. ఈ పరిణామమునను౦న్న ఆత్మకుమహత్తర మైన అభౌతికమైన శక్తి రాగలదు. ఆశక్తి భౌతికదేహమును ఆవహించి సమాధియవస్థకు తీసుకొనిరాగలదు. అది సవికల్ప సమాధి రూపంలో మానవుడు ఒక అపురూపమైన దృశ్యమును చూడగలడు. ఇది ఆత్మ యొక్క పరిణామమునకు పునాది.

దీనిపై మోసి ఈశ్వర సంభూతమైన మహాశక్తి తానుగా నున్నా నని నిరూపణచేయు సాధనారూపమైన ధ్వని సద్గురునినోట ధ్వనింప బడినప్పుడు ఆక్షణమందే సాధనారూపమైన ధ్వని సద్గురునినోట ధ్వనింప బడినప్పుడు అ క్షణమందే ఆత్మపరిణామముపొంది ముక్త స్వరూపంగా మారి నేననునదియే విశ్వరూపమని తెలియగలదు.

అందుచేతనే మహమ్మదీయ తత్వవేత్తలు
"కాబెమె హాబు తఖానేమె
యారబ్ తెరా జల్వా ఏక్సా నజరాతాహై"

కాబామశీదులోను విగ్రహప్రతిష్ఠాపన జరిగిన ఆలయములోను ఈశ్వరా నీ తేజస్సును ఒకేలాగున చూచుచున్నాను అన్నారు.

అది తనకు లభ్యం కావలెనన్నా ఆరాధనయే దానికి ప్రాతి పదికము.

మత మతాంతరములయందు చేయు ఆరాధన సూక్ష్మరూప విధానమున విమర్శించిన నది ఆత్మపరిణామమునకు దోహదమివ్వగల దన్న సంగతి నిశ్చయము.

# మహాత్మ్యములు



ఈశ్వర విషయం తెలుసుకొని తరించవలెనను నపేక్ష కలిగిన మానవునకు సృష్టియందు అపురూపమయిన రెండు విషయములు ఆతనికి దృగ్గోచరమగుచున్నవి. ఒకటి కాషాయ వస్త్రధారి రెండు నటువంటి విధానములో మహాత్మ్యయములనబడు క్షుద్రదేవతోపాసనా శక్తి యొక్క పరిణామములు.

కాషాయవస్త్రధారణచే ప్రజలను ఆకర్షించి ఈశ్వరవిషయం చెప్పగలడనే ప్రకటనలో ముందు నాతని మహాత్మ్యములు పొగడ బడుచున్నవి. ఆ విషయంలో అభౌతికమయిన మానవదృష్టికి కాన రాని విధానములో విభూతి వ్రేళ్ళనుండ రాల్చడము, చేయిచాచగనే సంకల్పించిన వస్తువు రావడము, ఆ వస్తువులు అపురూపంగ నుండ డము చూచిన వ్యక్తులు దిగ్భ్రాంతులై ఇతను మహాత్ముడని గణనీయ మయిన మహనీయపదంబులు తెలిసినవాడని నిశ్చయించి నాతనిని గురువుగా తత్వవేత్తగా పరిగణించి నాతనిని వెన్నాడుట చూచు చున్నాము. ఆతనిని వెన్నాడుటమేగాక దానాదివిధులు సమర్పించుట చూచుచున్నాము. ఇది లోక పరిపాటిగా ఆధ్యాత్మిక విషయంలో ముఖ్యస్థానము ఆక్రమించియున్న ఈ కాలములో యివి మన గమనికలో లేకపోలేదు,

పూర్వపు మహాఋషులు, ద్రావిడులుగయున్న మానవులు క్షుద్రదేవతో పాసకులుగ చేయు కనికట్లు. మాయా ఇంద్రజాలములకు ప్రత్యామ్నాయంగా ఆర్యులనబడు మానవులు అధర్వణ వేదమునగల కొన్ని బీజాక్షరములు యందుగల ధ్వనిని సాధించి వాటియందుగల క్షర రహితమయిన అక్షరరూపశక్తిని ఆహ్వానమానము చేసుకొని

ద్రావిడులు (రాక్షసుల) మాయా కనికట్టు యింద్రజాలములను ఛేదించు శక్తిని సంపాదించి ప్రత్యర్థి యింద్రజాలములతో కూడిన కనికట్టును బేధించి అరికట్టి వారి తత్వరూపమయిన విషయానికి ఆటంకము కలుగ కుండా అవిచ్ఛిన్నముగ సాగించి నియమబద్ధముచేసిన విధానమున సాధించి ప్రత్యర్థిమాయలను మటుమాయముచేసిన విధానమున తిరిగి యీనాడు అదే క్షుద్రదేవతోపాసనాది యింద్రజాలములు మహాత్మ్యములపేరుతో తత్వవేత్తలమనిపించుచున్న వేషధారులు తాత్వికులుగ చెలామణియగుచున్నారు. ఆ సాధించు బీజాక్షరములకు రూపకల్పన చేసి హనుమదోపాసనా, కాళీయోపాసనా, త్రిపురసుందరీయుపాసన, బాలోపాసన ఆదిగాగల ఉపాసనములు సాధించి ప్రయోగములుచేసి ప్రజలను భయభ్రాంతులుగ మార్చి (చేసి) వారి సిరులను హరించు చున్నారు. ఇటువంటి శుంఠలను మహాత్ములని తత్వవేత్తలని పేర్కొని వారి మాయను బడు అమాయక ప్రజలను చూచిన జాలికలుగక మానదు. కారణమేమన పైన పేర్కొనిన హనుమంతుడు శ్రీరామ భక్తుడు. శ్రీ కాళి శుభప్రదమై శక్తిస్వరూపమైన శివుని భార్య త్రిపురసుందరియన్నప్పుడు శోభయొక్క మూర్తి. బాలయన్నప్పుడు నొక అమాయక ఆత్మ. వాటిని క్షుద్రరూపమైన మంత్ర సాధనలో పేర్కొనుట మిక్కిలి శోచనీయమైన సంగతి.

"భూతాని యాంతి భూతేజ్యా" అన్నాడు శ్రీకృష్ణభగవానుడు. భూతములను ఆరాధించిన ఆ భూతముల శక్తి రాగలదని తన భగవద్గీతలో నిర్వచించినాడు.

పైని పేర్కొన్న రూపములు శుభప్రదమయినప్పటికి క్షుద్రదేవతా రూపములు వాటికి కల్పించి క్షుద్రదేవతా శక్తిని వాటి రూపమున సంగ్రహించి ప్రయోగములు చేయుచున్న సంగతి ఆదిలో ఆర్యులు గ్రహించి యీ భూతరూపములను తమ నిజమంత్ర శక్తిచే

లోబరచుకొని క్షరరహితమయి ధ్వనిని ఉపాసన చేసి వారి అధీనము లలో నా క్షుద్ర దేవతలశక్తిని లోబరచుకొని యిటువంటి విధముగ ఉపాసనచేసి గ్రహించిన ద్రావిడుల మంత్రశక్తిని నిర్మూలింపగ గలిగినారు. అయినను అట్టివిధానముపోయి యీ కాలములో గురువులుగా వేషధారులై ప్రజలను మోసగించి కృత్రిమమయిన ధనమును సంపాదించే వ్యక్తులను చూచిన తత్వవేత్తకు వారిపై అసహ్యము కలుగక మానదు. (ఈ క్షుద్రదేవతోపాసకులకు సారాయి, భంగు, గంజాయి కారముతోకూడిన మాంసము మొదలగు మత్తు వస్తువులు సేవింపుట అవసరమయి యున్నది. కారణము అది క్షుద్రదేవతా ప్రీత్యర్థమయి యున్నవి.)

మహాత్మ్యములు :— మహాత్మ్యములన్నవి యీ క్షుద్రదేవతా రూపమున కలిగే పరిణామములు కావు. అవి అభౌతికమయిన తత్వ రూపమున నిర్వాణము (సాయుజ్యము) సాధించు ధ్వనియందు అయాచితముగా ఫల ప్రధానము చేయు మహాశక్తి. అది తత్వవేత్తయొక్క వాగ్రూపమున ఆశీర్వాదములుగా వెలువడ గలవు. అవి నొక విషయమును పురస్కరించిగాని నొకరి యిచ్చానుసారమునకుగాని నొక అవసరమునకుగాని లొంగియుండవు. స్వేచ్ఛారూపములో తన ఆత్మీయులైన భక్తునియొక్క సంకల్ప సిద్ధికి తోడ్పడగలవు. అటువంటి ఆశీర్వాదము అయాచితమయిన వాగ్రూపముతో ఆ తత్వవేత్తయందు ప్రగాఢమయిన భక్తి విశ్వాసములుగల భక్తునకే సంక్రమింప గలవు. కృతిమమును మోసమును గల్గి మహాభక్తునివలె నటించు వ్యక్తియొక్క హృద్వాంత మెరింగిన సద్గురువుయొక్క దృక్కు నాతనిపై ప్రసారమయిన అభౌతికమయిన ఆశీర్వాదముగ కనపించినను అది అతని కుటిలత్వమును కూలద్రోసి శాప రూపమున నతనిని స్మశానము వరకు యీడ్చుకొని పోగలదు.

అట్టి మహత్తరమయినఈశ్వర రసస్వరూప సంభూత మహాశక్తిగ రూపించిన తత్వవేత్తను నిరసించి నిరాకరించిన ఏ వ్యక్తి నైనను మాడ్చి బూడిద చేయును. అంతియేకాదు "జలధిమండిన జడధారి మండిన నార్ప ఎవరితరము గాదు" అన్నాడు. తత్వవేత్త (ఇక్కడ జడధారియన్నప్పుడు కురులను జడులుగ మార్చి తల ధరించిన సన్యాసి కాడు. అజ్ఞాన తిమిరమును మాడ్చి జడునిగ నిల్చిన తత్వవేత్త) కాన అటువంటి వ్యక్తి కన్నులనుండి శాపరూపమున ప్రసరించిన అగ్ని యే దిక్కుగ ప్రసరించిన ఆ దిక్కున యేదియున్న నది దహించిపోవక మానదు.

ఇటువంటి తత్వవేత్త సామాన్యముగ వేషధారికాడు. క్షుద్ర దేవతా రూపమైన మహాత్మ్యము లనిపించు విషయములను చూపించి మతులను మార్చువాడు కాడు. ఆతడు సర్వమానవ ప్రకృతిలో సామాన్యమైననొకనిగనే మెలగు చుండును. అతడు పాదము మోపిన చోట శుభములే జరుగుచుండును. ఆతని ఆశీర్వాద ప్రభావమున నిర్వాణ పరిణామము రాగలదు. అటువంటి వ్యక్తియని నీఆత్మ యెవని యందు నీకు ప్రబోధము వేయునో అటువంటి వ్యక్తియని నీ మదిలో నిర్ధారణ అయినప్పుడు ఆతనిని వెన్నాడితివివేని ఆ వ్యక్తియందుగల అభౌతికమైన ఈశ్వర శక్తియందుగల మహాత్మ్యములు అపురూపమైన వని యేవిధమైన క్షుద్ర శక్తులకు లొంగనివని నవి తన ఆత్మ పరిణామమును కలిగించి ముక్తిని చేయగల శక్తివంతమైనవని తెలుసుకొన గలవు. కావున నీవు పైని పేర్కొని క్షుద్రదేవతా విధానములైన యింద్రజాలములకు మోసపోక నిజతత్వము తెలిసినవ్యక్తి నీకు ఆత్మ యందు తెలియబడినప్పుడు నాతనిని యనుసరించి ఆతనియందుగల గుణగణములను విమర్శించి అభౌతికమైన నాతనియొక్క ధ్వనియొక్క పరిణామము తేల్చగలిగే మహత్తరమైన విషయములే మహాత్మ్యములు

గాన అట్టి వ్యక్తిని సందర్శించి అభౌతికమైన మహత్తర విషయములు గ్రహించ గల్గెదవుగాక.

పై దానికి భిన్నముగ తత్వవేత్తగా నిర్మాణములోనున్న వేష ధారియయిన క్షుద్రదేవతోపాసి ధనహీన ఆశాపరులను ప్రచారకులుగ పంపించి మోసగించుచున్నారు. ఈ విషయాలే మహత్యములని లోకు లను నమ్మించు మోసగాండ్ర పాలుపడి అమాయకులు మోసమునకు పాల్పడి చింతాకాంత్రులగు చున్నారు.

ఈ మోసగాడైన క్షుద్రదేవతోపాసకుని కంటె మిన్నయైన విషయాలుచేసి చూపగల మెస్మరిష్టులు గారడీవాండ్రుకూడా కపట వేషధారణ లేకపోవడంచేత తత్వవేత్తలుగా చలామణి కాలేకపోవు చున్నారు.

# మానవుడు - ఈశ్వరుడు

జడజన్మలుగానున్న 84 లక్షల జీవరాసుల జన్మలనుండి మానవ రూపముపొందిన ఆత్మ తాను మానవరూపము పొందకపూర్వం తన ఆత్మపొందిన గడ్డి మొదలు మానవరూపంవరకు తాను యెత్తిన 84 లక్షల జడజన్మలుదాటి ఊర్ధ్వముఖంగా మానవ జన్మవచ్చి అధో ముఖంలోయున్న యీ 84 లక్షలు జీవరాసులుగాయున్న జడజన్మలతో తనను పోల్చుకున్నప్పుడు అవి తనరూపమునకు సరిపోని కారణము తెలుసుకొని (తాను దాటివచ్చిన జడజన్మలను చూచి వాటికంటె అతీ తమైె ఉత్కృష్ట స్థితిలోనున్న తనయొక్క రూపము పోల్చినప్పుడు యే యొక్క జీవి తనతో సరిపోని విషయము తెలియబడుచున్నది.) తనదృష్టి ఊర్ధ్వముఖమున పోనిచ్చిన విశ్వరూప శక్తివంతమైన త్రిమూర్త్యాత్మక మైన బ్రహ్మ, విష్ణు మహేశ్వరులయొక్క రూపాలను దృష్టిలో పెట్టినప్పుడు వారి రూపురేఖలు తన రూపు కంటె భిన్నముగా లేవని తెలుసుకోగలిగినప్పుడు త్రిశక్తిసమ్మిశితమైన మహాశక్తి (తేజస్సు) ఈశ్వరుడు ఆ రూపముననే యుండగలడని నీకు నిశ్చయమైనప్పుడు నీవు కూడా ఈశ్వరుడవే. ఇది నీగురువు ఆశీర్వాదమున నీ దృక్కు మార్చ బడినప్పుడు తప్పక నీవు విశ్వరూపివి (ఈశ్వరుడు) అని తెలియబడ గలదు. "లఖ, దఖ, లఖనల్, ఇన్సాన" మానవరూపము జగతాతీత మైనదిగ సృష్టించ బడినదని "ఖురాను" ఇదే మన్సూరు తత్వవేత్త "అనల్‌హఖ్"నేను ఈశ్వరుడను అను విషయమును చర్చించిన మానవ రూపమే ఈశ్వర రూపమని విశదమగును.

కావున ఓ మానవుడా! జడజన్మలకును ఈశర్వసంభూతమైన త్రిమూర్త్యాత్మకమైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు మధ్యనున్న నీవు అధోముఖంగ చూడక ఊర్ధ్వముఖంగ నీ దృష్టి మరల్చి ఈశ్వర రూపివైన స్వయం బ్రహ్మయని ఆనందించెదవు గాక!

# కుండలినీ శక్తి

సాధకుడు జ్ఞాన ప్రబోధమైనటువంటి సాధనారూపమైన ముక్తిని బడయుటకు సద్గురువుని ఆశ్రయించినప్పుడు ఆ గురువు యదార్థమైన ఈశ్వర సంభూతమైన శక్తి కలిగియుంటే తాను భ్రాంతియనే మహా శక్తి "కుండలిని" (సర్పరూపమున) సాధకునకు సాక్షాత్కరించి అది పెట్టు కష్ట నిష్టూరములు ఐహికముగను మానసికముగను ఉన్నప్పుడు వాటివిషయము తెలిపి సాధకుని ఊర్థ్వముఖముగా ప్రయాణము చేయించవలసిన విధి గురువుదై యున్నది.

ఆ సాధనలో శ్వాస అజ్ఞా చక్రము వరకు అనగా మూలాధార చక్రమునుండి అజ్ఞా చక్రమువరకు తనస్థితి మానసికమైన విధముగ మారేవరకు ఆ కుండలినీయొక్క నిజరూప నిష్పత్తి తెలియదు.

ఆ సాధకుడు అజ్ఞా చక్రమందు తన ప్రయాణమున్నప్పుడు భ్రాంతియొక్క నిజస్వరూపమైన ఆకారము సర్పమువలె నున్నది. అజ్ఞా చక్రముచోటుకు సాధకుడు వచ్చినప్పుడు నాతనికి భ్రాంతిమహాశక్తి సర్పముగా గోచరించును.

ఇంతవరకు సాధకుడుచేయు సాధన గురించి దానిలోవచ్చు ఘట్ట ములందు స్త్రీ అయిన పురుషరూపములోను పురుషుడైన స్త్రీ రూప ములోనూ మారి సాధకుని దృష్టిని అపురూప సౌందర్యాతిశయములుగా వాఙ్మయమందు పేర్కొనబడిన మోహ వికారములైన స్వర్గసౌధాలన బరగు భ్రాంతి కుత్రిమస్థానము పాపకూప పాతాళమునకు తీసుకొనిపోయి "తనకంటే వేరే ఈశ్వరుడు లేడు. సర్వము నాలో యున్నవి నన్ను ఆరాధించిన నీకు ముక్తి కరతలామలకముగా యున్నద"ని భ్రమతో కూడిన ఆశాబద్ధములైన ఊహలకు లోనుచేసి సాధకుని వంచింపజేసి

అధోముఖముగ ప్రయాణము చేయించి ఆకాశాది పంచమహాభూత ముల తేజస్సును స్వర్గ నరకాల సౌధములను చూపించి "యివన్ని నా ఆధీనములోనున్న సంగతి నీ గ్రాహ్యమునకు వస్తూయున్నప్పుడు నేనీ శ్వరుడనని నమ్ముటకు సాక్ష్యము యింతకన్న నీకేమి కావలసియున్నది." "నిన్ను యిందున్న స్వర్గసౌధాలలో నిలుపువాడ నేనుండగ నీగురువును నీవెందుకు అనుసరించు చున్నావు" అని కలతపెట్టి గురునియందు అపనమ్మకము కలిగించి గురుశిష్యులమధ్య వాదము పెంపొందింప జేయును.

గురువునందు విరక్తి కలిగించి గురువన్న, ధర్మమన్న అయిష్టత కలిగించి సాధకునకు గురువుచే చూచించబడిన భౌతిక జగత్తునందు భ్రాంతిశక్తి ఆవహించిన మానవరూపాన్ని పురస్కరించుకొని ఆవ్యక్తి యే ఈశ్వర సంభూతుడని, నతనిచే యీ ముజ్జగంబులు నడుపబడుచు న్నవని యీ సృష్టి రహస్యము అతని వలనే తెలియబడగలదని యిది చూచుటకు భౌతికరూపంగ కనబడుచున్నదిగాని అభౌతికమైన ఈశ్వరశక్తియేయని నీవు విశ్వసించి దానియందు లీనమగునట్లు సాధన చేసి ఆదే ముక్తిస్థానమని నీవు నిశ్చయింపవలసి యున్నది గాన అలా చేయగలిగిననాడు నీవే గురువుగా నుండుటకు అర్హుడవని అహంకార రూపములో గర్జనగా ఆ భ్రాంతిశక్తి సాధకుని గద్దించి సద్గురువును ధిక్కరింపజేసే స్థితికి సాధకుని తీసుకొనివచ్చును.

అట్టి స్థితిని సాధకుడు భ్రాంతిశక్తియైన కుండలినికి లొంగి తన గురువును ధిక్కరించ సమకట్టినప్పుడు ఆ సద్గురువు మందహాసియై చిరు నగవు పెదవులతో యీ భ్రాంతి రూపకుండలిని యీ వ్యక్తి సాధనా ప్రయాణములో కుండలిని గ్రహిస్తున్న విషయము తెలిసినవాడై ఓర్పుగలవాడై తన శిష్యుడు భ్రాంతి కుండలినీశక్తికి లోనై దాని అభౌతిక ఆదేశమున భౌతికముగ తన్ను యెదిరించుచున్న సంగతి తెలి

సినవాడై సాధకుని వ్యతిరేక వాదమునకు సమాధానమియ్యక సాధకుని ఊర్ధ్వముగ ప్రయాణము చేయించి కృతార్థుని చేయించుటయందే తన లక్ష్యమున పెట్టుకొని అభౌతిక రూపములో నటువంటి సాధకునికి సహాయపడుచునే యుండును.

ఈ ప్రయాణములో అనేక విధములైన ఘట్టములు కలిగి యెన్ని బలీయమైన కష్టములు యీ కుండలినీశక్తి భౌతికముగ అభౌతికముగ పెట్టినను యీ సాధకుడు భ్రాంతి కుండలినీశక్తివైపు మళ్ళని కారణమున మళ్ళగలడనే ఆసక్తితో నానా కష్టములుపెట్టి గురుధిక్కారము చేయించి తనవైపుకు మళ్ళించిన స్థితిని తాను విశ్వశిస్తున్న కుండలినీ శక్తియే నిజమైన ఈశ్వర శక్తియని నమ్మి దానికై ప్రాణాలనైన ధారబోయ సమకట్టిన సాధకునియందు గురువునకుగల ప్రేమాతిశయములలో తన ప్రాణాలపై ఆశవదలి ఆ కుండలనీ శక్తి యొక్క భ్రాంతి స్వరూప యదార్థమును చెప్పినను నమ్మక తను నమ్మని పరిస్థితికి వచ్చి గురునియందు ధిక్కారమునుచూపి తన ప్రాణాలపై ఆశ వదలమన్నట్లు తెలిపినను ఆ చోట గురువు సాధకుని విధానము తప్పుత్రోవ మన్నదని చెప్పి ఆ సాధకుడు చెప్పు విషయాలను గురువు కాదనడముచూచి సాధకుడు తాను ముక్తిపొందడము గురువునకు అయిష్టతగ యున్నదనే ధ్యేయము యీ భ్రాంతి కల్పించి తాను చిత్రించిన అభౌతిక స్వర్గసౌధాలు భ్రాంతితో కూడిన అజ్ఞాన రూపమైన సాధకుని ఆత్మస్వరూపము సువర్ణ సౌదావళి కాసారమయమైన విహారవనములు కలిగిన స్థలమందు చల్లని పిల్లవాయువులు వీచే సమయంలో విహరించుచుండగా అనేక విషయములు గురువును ధిక్కరించేలాగున బోధించుచున్న భ్రాంతి కుండలినిగాయున్న విధానాన్ని సాధకుని అనుసరింప జేయుచున్న తాను నుడివిన విషయాలు శాశ్వితమని నిర్ధారణ అగునట్లు చేసి అధోముఖముగ అధోలోకములకు కొనిపోవు సమయమున గురువ్వాపము

అభౌతికముగ మంత్రరూపమున సాక్షాత్కరించి "జగత్తే మంత్రము" "మంత్రమే గురువు" "గురువు నీవు" అనే ధ్వని అభౌతికముగ సాధకుని హృదయమందు ధ్వనింపజేసి జగత్ స్వరూపమే గురువైనప్పుడు యీ కుండలినీశక్తి యనబడు భ్రాంతి భౌతిక స్వరూపమైనట్టి జగత్తు లోనిదే కాబట్టి యిదికూడా రసస్వరూప సన్నిభమైన గురువందు అణువుగాన యీ కుండలిని యదార్థమైన ఈశ్వర స్వరూపముగా దనిపించును.

పై విషయము గురుస్వామిని ఆరాధించి తెలిసికొనవలసియున్నదని ఊహ తన భావరూపమునుండి ధ్వనించిన భ్రాంతిశక్తియైన కుండలిని తన దృష్టినుండి తొలగించి గురువే సర్వమని విశ్వసించు సమయాన భౌతికరూపమునుండి తొలగి ఆజ్ఞా చక్రములో తన నిజ స్వరూపాన్ని సర్పముగామారి సాధకునకు భయముకలిగించిన సంక్షుభితము రేకెత్తించి సహస్రారమునకు పోవు బాటకు అడ్డుగా వచ్చి నిలచును.

ఆజ్ఞా చక్రములోనికి మంత్రము సాధనా విధానములో రాగానే శుభప్రదమైన శివరూపము అశుభమైన ఊహలను లయింపజేసినపుడు సర్పాకారముననున్న కుండలినీశక్తి లయమైపోయిన అశుభ ఊహలను రెచ్చగొట్టి జడజన్మలకు తీసుకొనిపోవు విధానమునకు మరలించును. ఈ కుండలినీశక్తి మాయింపచేయుట సాధకునకు అగ్నిపరీక్ష.

ఈ స్థితికి వచ్చిన సాధకుడు యీ అడ్డును తొలగించుకొనలేక తికమకలువడిపోయి చాలా శ్రమింపవలసి యున్నది. ఆధ్యాత్మికముగా యీ విధముగా క్షోభ కలిగిస్తూ భౌతిక జగత్తునందు ఆసాధకునకుగల జీవనోపాధి ఆరోగ్యాది విషయములందు దుఃఖితునిగాజేసి సాధకుని ఓర్పుకు మించినంత శక్తివంతమైన బాధాపరంపరలు చేకూర్చుచుండును.

ఇటువంటి స్థితిలో మధ్యమధ్య భౌతిక శరీరముగా వచ్చిన భ్రాంతి రూపమును తన యెట్టయెదుట నిలబెట్టి సంజ్ఞా రూపములో పిలిచినట్లుచేసి ఆ రూపము చూచిన ఆనందాతిశయములుగ నున్నట్లు నిరూపణచేయించి దానిని అనుసరింప జేయుటకు ఊహలు కల్పించును. ఈ స్థితిలో మానవుడు తట్టుకొనలేక గురుమహాశక్తి ఆశీర్వచనము నొకటే గతియనవలసి యున్నది. ఆ చోటుకు రాగలిగిన సాధకునకు అగ్నిపరీక్ష.

ఆ చోట సాధకుడు "సన్యాసిచేసినా, సామ్రాట్టుచేసినా" గురు నిదే భారమని యేడ్చును. ఈ స్థితిలో కుండలినీశక్తి కష్టములు పెట్టు టకు కారణము సాధకుని శ్వాస ఆజ్ఞాచక్రము దాటి సహస్రార మునకు ప్రయాణము చేసిన ఆ సాధకునికి ముక్తి కరతలామలకము కాబట్టి భ్రాంతికి మానవజీవి సార్థకం కాకుండా చెయ్యడం తన విధి గాబట్టి, యిన్నిశ్రమలు బెట్టినప్పటికి యే సాధకుడు అగునో అతడే సాధకుడు. కారణం భ్రాంతికి ఏనాటికీ ముక్తిలేదు. అటువంటి సమయ మందు భ్రాంతి కుండలినీశక్తికి లొంగనియ్యక కాపాడగల మహ నీయుడే సద్గురువు.

జీవి జడజన్మలలో నున్నంతవరకు అది కుండలినీ ఆధీనమందుం డును. అది మానవజన్మ యెత్తిన తన శక్తికి మించిపోయినది గాన దానిని యే విధాన్నైనా తిరుగ జడజన్మలకు పోవునట్లు చేసినగాని దానికి శాంతిలేదు.

ఇటువంటి శక్తినుండి తప్పించు సమయాన "బాకాలునూదిన వ్యాసంగరచన కళాకలాపంబు చల్లారజూచు" అను వాక్యమును తత్వ వేత్త పలికినాడన యిట్టి స్థితిని గురువు సాధకునికి అనేక విషయాలలో పాల్గొని తాను శ్రమించి అనేక కథలు తెలిపి తన శిష్యుని కాపాడి సాయుజ్యుని చేయ సమకట్టును.

ఈ ఆజ్ఞాచక్రమునకు వచ్చిన సాధకుని ప్రయాణమందు మాటి మాటికి శేషరూపమును కల్పించి మామూలు సర్పరూపముగ మారి అడ్డగించి భయపెట్టి పెడత్రోవను పెట్టుటకు కడవరకు చూచుచునే యుండును.

అది సాధకునియందు "నేనను భావము మదిలోమాని సమస్తంబు గురుని మాట్కొన్ గని, విజ్ఞాన సమాధిలో గురువే తానని" అను నిశ్చయము వచ్చేవరకు సాధకునినుండి తొలగక యుండును.

ఆ భ్రాంతి మహాశక్తియను కుండలినీ రూపమైన మహాసర్పము శివుని మెడయందు, విష్ణువుని నొసట కెదురుగ బ్రహ్మ తలపైన కాటు పడునట్లు చిత్రకారుడు చిత్రమునందు చూపించుటకు కారణము. పురాణ బద్ధమైన వాఙ్మయమందు గల స్వరూపమందు యిటువంటి త్రిమూర్తియాత్మకములైన మహాశక్తులను కాటువేసి క్రిందిమెట్లకు పోవునట్లు చేయగలుగు శక్తి స్వరూపమని, అదియే కుండలినీ మహాశక్తి యని తెలియజేయబడినది.

త్రిమూర్త్యాత్మకములైన మహాశక్తులకే దాని బారినుండి తొలగించుకొనుటకు వీలులేని విషయము గమనించినపుడు మానవ రూపమైన సాధకునకు అసాధ్యము. అది సద్గురువైన మహాశక్తికే సాధ్యము. కాబట్టి "నగురోరధికం" అని యే సాధకుడు ఆ త్రియై గురువునుగన్నాడో నాతడే ఆజ్ఞా చక్రమందున్న భ్రాంతి కుండలినీ మహాశక్తినీ సర్పరూపములో గాంచినప్పుడు భయపడక గురువుచే ధ్వనింపబడిన మంత్రశక్తిని యెల్లప్పుడును మరచిపోనిస్థితిని యే సాధకుడుండునో నటువంటి సాధకుడు పఠించు మంత్ర మహాశక్తి గురువుగా నున్నదని నిశ్చయించి దానిని మరచిపోకుండా స్మరణలో నున్నప్పుడు ఆ గురువు ఆ సాధకుని ఆజ్ఞాచక్రము దాటించి సహస్రారమునకు ప్రయా

ణము చేయించగలడు. గాన సాధకుడు మరచిపోని స్థితిలో తన మదిలో తన గురువు తనకు బాసటగాయుండి తనకు యే విధమైన శ్రమలు వచ్చినా వాటినుండి తొలగించి తనకు స్థాయి నిచ్చునట్లు జేసినప్పుడు ఆ సాధకునికి తన గురువునందుగల అపారమైన భక్తితో కూడిన విశ్వాసముయొక్క స్థితి తనకు ముక్తియని సాయుజ్యమని నిశ్చయించ గలడు.

ఇది ఆధ్యాత్మికంగా సాధనా రూపములో ప్రయాణము చేయు సాధకునకు లభ్యము.

దృఢమైన విశ్వాసముతో తన గురువే సర్వమని యేకాగ్రతగ నిశ్చయించు భక్తునకు యీ అలజడి యుండదు.

ఈ ధర్మమందు సాధనచేయు శిష్యరూపమున్న ప్రతి సాధకునకు యీ సర్పరూపమైన భ్రాంతి కుండలినీ వారి వారి దృశ్యములలో తప్పక రూపించును.

# లక్ష్య మం

లక్ష్యము అన్నప్పుడు మానవ దృక్పథమందు బాహ్యరూప ములో కనబడే వస్తురూపమును చూచినపుడు అది తనకు అవగాహన అయ్యే విషయమే కాకుండా ఆంతరంగికముగా తన దృష్టియందింకొక జగత్తు ఉన్న విధానమున అందులో అనేక భిన్నా భిన్నమైన రూప నిష్పత్తి ఆంతరంగికముగా మన అంతర్దృష్టికి నిరూపణ అగుచున్న సంగతి ప్రతి మానవుడికి విదితమైన విషయమే.

అందు మానవుని ఊహలో ఉన్నవి లేనివి అప్పటికప్పుడు ఊహించబడినివి తన అంతర్దృష్టియందు నిర్మాణమై ఒక ఆశా రూప మును పురస్కరించుకొని వాటికి తగిన విధానములో తన మనస్సు ఆ కనపడిన రూపములందు నిబద్ధమై వాటిని పొందవలయునని ఊహ జనించుచున్నది. ఇది జాగ్రత్ స్వప్న సుషుప్త్యావస్తలలో కూడా ప్రతి మానవునికి ఊహ అనే విషయములో సహజమైనది. ప్రతి విషయం ప్రాపంచిక విషయాలలో మారి అజ్ఞానియొక్క విధానమునకు పోక జ్ఞాన స్వరూపియై తరించవలయుననే భావమునకు వచ్చి సద్గురువును ఆశ్రయించి మంత్రోపదేశము పొంది దీక్షా రూపములో సాధన చేయు వ్యక్తి తన దృక్కును ఒక లక్ష్యమందు కేంద్రీకరించినప్పుడు ఆ లక్ష్యము తన స్వ స్వరూపముపై నున్నప్పుడు అదిమారి భిన్నభిన్న రూపాలుగా పొడగాంచి అందు అపురూపమైన రూపము స్త్రీ అయిన పురుషుని రూపము, పురుషుడైన స్త్రీ రూపము ప్రత్యక్షమై కామరూపమున విజృంభించి మోహింపజేసి ఆ వ్యక్తిని తన వైపునకు మరలించి ఐహిక విషయేచ్ఛలే ఆముష్మికమైన స్వర్గాది సౌఖ్యములని ఆ యా సమయ ములందు నిరూపణ అగునట్లుచేసి, ఇదే ముక్తికి మార్గమనిపించి, ఈ

సాధకుని బోర్లపడునట్లుచేసి, ఈశ్వర విషయమును మరపించి, నాస్తిక విధానమునకు గడంగి, ఆ సాధకుని మనస్సునకు కలత కలిగించును. ఇట్టి స్థితికి వచ్చిన సాధకుడు అపురూపమైన ఒక మహాశక్తిని సంగ్రహించ బోవు సమయమని నిశ్చయము. అట్టితరి ఈ పై విషయమును నిరూపణ చేసిన గురువునందు మహాశక్తి స్వరూపమైన ఆ మంత్ర ధ్వనిని మాయింపజేసి అజ్ఞాన స్వరూపిగా ఐహిక విషయములనే నిరూపణచేసి జడజన్మలకు తీసుకొనిపోవు ఆ మహాశక్తి భ్రాంతి.

ఆ భ్రాంతిశక్తివల్ల కల్గిన అవరోధము గురువు ముందర సాధకుడు వెల్లడించినపుడు అది భ్రాంతి మహాశక్తియొక్క కార్యకలాపమని గురువు చెప్పినను వినని పరిస్థితిలో ఆ గురువు సద్గురువైన స్థితిని శిష్య విధానములోనున్న భ్రాంతి శక్తియని నిరూపణచేసి దానినుండి పైదొలగించి క్రమబద్ధునిగా చేయు భారము గురువుయందు కలదు.

అట్టితరి ఆ గురుమహాశక్తి సాధకుని దృష్టిని పురస్కరించుని శిష్యరూపమైన ఆత్మను అనేక భిన్న భిన్న ఆకర్షనీయములైన రూపములుగామార్చి అందు ఏ రూపమందు తాను కోరిన వ్యక్తిత్వము ఎన్నుకొనుటకు సాధ్యముకాని ప్రసక్తిలో ఒక రూపమునకు మించిన యింకొక స్ఫురద్రూపము కనపడునట్లు చేసి ఆ సాధకుని యొక్క మనస్సును ఒక స్థిరత్వమునకు రానీయని పరిస్థితి కల్పించవలసిన బాధ్యత గురువుదే. అలా కన్పించిన వ్యక్తులయందు ఒక నాటికి ఒక వ్యక్తిత్వమందు లక్ష్యమునిలచి దానిని అనుసరించు సమయమున ఆ భ్రాంతి రూపమైన వ్యక్తిత్వము భౌతికముగాకూడా తనకు ప్రత్యక్ష మగునట్లు చేసి అదే ఈశ్వరుడనిపించి ఆ రూపమే తన జన్మ జన్మాంతరములందు జంటగాయున్న విషయమునకు రానిచ్చి ఒకవంక ఆ రూపము ఇంకొక వంక గురుస్వరూపము ఈ రెండు స్వరూపములమధ్య నిలచి ఆ సాధకుడు

ఎటు పోనున్నాడని పరీక్షకు పెట్టును. అట్టి పరీక్ష సాధకుని బారి అగ్ని పరీక్ష.

ఆ సాధకుడు భ్రాంతి స్వరూపాన్ని అనుసరించే విషయము ఈ గురువునకు గోచరించినపుడు తన మహత్తరమైన ఆత్మీయ శక్తిని ఆశీర్వాద రూపమున ఆ శిష్యునియందు ప్రసరింపజేసి మోహన రూపముననున్న భ్రాంతి స్వరూపము భౌతిక విధానమున దాని కార్య కలాపములలో మాయతోకూడిన ఢంబములాడు స్వరూపములని తెల్పి దాని కార్యకలాపములు నిజరూపమున వెల్లడి జేసి ఆ రూపమందు విరక్తి కలిగించి అసహ్యించుకొనునట్లు చేసి పశ్చాతాపమున గురుని శరణు వేడునట్లు చేసి అయాచితంగా ఆ యాత్మ "నగురోరధికం" అనిపించు నట్లుచేసి ఏ స్థితియందు కూడ మతి పై ధ్వనిని మరచిపోని పరిస్థితికి తీసుకొనివచ్చి దానియందే తన ఆత్మను నిమగ్నత చేసిన స్థితిని జగత్తే మంత్రము, మంత్రమే గురువు అనే లక్ష్యమునకు తీసుకొనివచ్చి భ్రాంతిశక్తి స్వరూపం జగత్తులో నొకటని నిరూపణ చేసి ఏ సమయమందును గురువుని మరచిపోని స్థితి తన దృష్టియందు గురు స్వరూపాన్ని స్థిరీకరించిన స్థితియే లక్ష్యము. అదే లక్ష్యము. ఈ లక్ష్యము అంతర్ బాహ్య విషయములందు కూడా సాధకుని దృష్టికి నిరూపణ కాకమానదు.

తన లక్ష్యములో ఏ సమయమందును గురుస్వరూప మహాశక్తిని మరచిపోక ఆ గురుమహాశక్తి ఏ సమయమందును భ్రాంతిశక్తి స్వరూపమువల్ల కల్గు జడత్వమునకు పోనీకుండా తన సద్గురువు కాపాడగలడని నిశ్చయంతో పవిత్రుడైన భక్తుడు చలనములేని భక్తి విశ్వాసరూపముగా మారిన సాధకునకు ఏ సమయమందును సద్గురువు

అతని లక్ష్యమందు ఉండును. కాబట్టి అట్టి భక్తి విశ్వాసములు కలిగిన ముక్తస్వరూపులగు వ్యక్తులకు ఈ భ్రాంతిశక్తి ఆ సాధకునికి కల్గించు యిక్కట్లు వారినుండి తొలగించి ఏ విధమైన కలతలు రానీయకుండా ఆ గురువు చేయును గాన అట్టి వ్యక్తుల విధానములో పై విషయము అనగత్యము.

ఇదే లక్ష్యము యొక్క అంతర్యము.

# పిశాచములు



సృష్టిలో యివి మానవ గణములవలెనే జీవగణములను బోలిన సూక్ష్మ రూపమైన అభౌతిక శరీర ధారులై లోకమున వెలయుచున్న సంగతి అపూర్వమైనది.

ఆది నుండియు నేటివరకు ప్రళయకాలమువరకు యీ పిశాచ గణములు నుండగలవు.

ఇవి వాఙ్మయమందు దేవ, గంధర్వ, యక్ష, రాక్షస, కిన్నెర, కింపురుష, పైశాచిక గణములని యున్నవి. ఈ పైశాచిక గణములు కేవలం భ్రాంతి మహాశక్తి యొక్క అనుచరులని చెప్పవలసియున్నది. వీటికిని ఆయుష్షు సంతానము కలదు. ఇది ఆత్మ మానవ వ్యక్తిత్వము పొంది ఈశ్వర విషయం వ్యక్తము చేసుకొని తరించు జన్మరహితము చేసుకొను అంత్య జన్మగాయున్న యీ మానవ జన్మను భ్రమకు లోనుజేసి మానవుడు ముక్తస్వరూపుడుగా మారకుండా అద్భుతగిలి జడజన్మలకు దారిచూపి ముక్తస్థితి రానీయకుండా శక్తివంతమై యున్నవి.

ఈ సృష్టియందు అయిదు సంవత్సరముల లోబడిన బాల బాలికలపై ఆహూయమానమై ఆగతానాగకములు చెప్పుచు మూఢులై వయోవృద్ధులయందు కూడా ఆవహించి గ్రామదేవతల పేరున ఆ బాలబాలికలనోట పలికించి అవి నిజములని నిరూపించి ప్రజలు నమ్మునట్లు చిత్రవిచిత్ర విషయములు వర్తమాన కాలమునకు సరిపోవునట్లు వచ్చు ధ్వనులు మూఢ స్వరూపంగా మారిన మానవులకు వాటియందు నమ్మకము కలిగి ఆ పిశాచశక్తినే దైవ సంభూత

మైనటువంటి మహాశక్తి స్వరూపములని నమ్మి వాటి పేరున విగ్రహ ములను సృష్టింపజేసి గుడులుకట్టి అందు ప్రతిష్టింపజేసి పూజలు సలు పుచు ఈశ్వర సంభూతమైన తేజస్సును తెలుసుకోగల్గె మానవత్వమును పైశాచికముగ మానవ దృక్పధము నుండి మార్చివేయు చున్నారు.

పెద్దవారు అనగా బాల్య వయసును మీరినవారు నొక గౌరవ మైన స్థానము (గొప్పతనము) సంపాదించుటకు ఆయా దేవతల పేర్లతో తమపై ఆహూయమానమై పలికించినవని నటనలు చేయు చున్నారు. ఈ విధంగా గ్రామ దేవతల పేర్లేకాక ఈశ్వర నామంగా వచ్చినప్పుడు నారాయణాది ఈశ్వర నామములను పేర్కొని ఆయా చోట్ల వెలసినట్లు కల్పించి ఆచోట ఆలయములు నిర్మించునట్లు చేసి అక్కడ చేరు జనులకు వూహించరానంత మహత్తును కలిగింపజేసి ఈశ్వర సంభూతమైన మహా విషయమును గ్రహించి జన్మ సార్ధకపర చుకొని జన్మరహితము చేసుకొని విశ్వ సంభూతమైన రస స్వరూప సన్నిభమైన పరిణామము పొందగల మానవ వ్యక్తిత్వముయొక్క విధానమును మార్చి అటువంటి మానవుని తన శక్తి లోబరచుకొని బుద్ధియొక్క వికాశమైన తెలివిని అడ్డి తనలోగల కృత్రిమమైన అభౌతిక మైన తేజస్సును మానవ రూపులకు గోచరించి తనే ఈశ్వరుడని నీవు చూచిన తేజస్సే ఈశ్వర తేజస్సని యిదియే ముక్తికి ఆకరమైన స్థానమని మానవునిలో అభౌతికముగా ధ్వనించి ఆ మానవుని తన యందు విశ్వాసునిగ చేయుచున్నది.

ఈ గణమునకు అధిపతియైన భ్రాంతి మహాశక్తి (దీనినే మాయా శక్తియనియు, "ఖురాను" "బైబిలు"లలో "సైతాను" అనియు చెప్ప బడుచున్నది.) ఈశ్వర శక్తికి సమంగాయున్నట్లును అది ఈశ్వరశక్తి

కాదని తెలుసుకోలేని మానవ జన్మకు ఈశ్వరతేజ స్వరూపమే అను కొనునట్లు నిరూపించి పెడదారులపెట్టు జడజన్మలనే పాతాళమునకు త్రోసివేయు చున్నది.

దీనినే భ్రాంతి మహాశక్తియని నిశ్చయించి దాని యదార్థ స్థితి భౌతిక మానవ రూపమందు సమ్మిళితమై ఆకర్షణీయమై అది ముక్తిని కోరి గురువును చేరి సాధించు భక్తులైన సాధకులను వారు స్త్రీలైన పురుష రూపములోను, పురుషులైన స్త్రీ రూపములోను జాజ్వల్య మానమైన తేజస్సుతో ప్రజ్వలించి ప్రభావింపజేసి తన వైపునకు మళ్ళించి ఈశ్వర సంభూతమైన తేజస్స్వరూపుడైన గురువును ధిక్క రింపజేసి పెడదారిని తీసుకపోవు సమయమున ఆ సద్గురువు తన శిష్యుని యందుగల ప్రేమాతిశయములను పురస్కరించుకొని ఆ భక్తుడు చేయు పైశాచిక భ్రాంతి జన్యమైన ఆర్భాట భాషణములకు లొంగక తన ఈశ్వర సంభూతమైన అభౌతికమైన మహాశక్తిని ఆశీర్వాద రూపమున తన శిష్యుని ఆవహించిన పైశాచిక శక్తిని ఈశ్వరశక్తి కాదని నిరూ పణ అయ్యేవరకు వదలక నొక కాలానికి యీ గురుమహాశక్తి వలన పైశాచిక రూపమైన భ్రాంతి శక్తి వదలిపోవునట్లు చేయగలుగు చున్నాడు. ఇది అనుభవరూపములో ఆ సద్గురువునందుగల మహా తేజస్సును శిష్యుడైన భక్తుడు తన గురువునందు భక్తి విశ్వాసములు సడలని స్థితిలో స్థాణువై నిలబడగలడో ఆతని దృక్ దృశ్యములను సద్గురువైన తన గురువుయొక్క తేజస్సు పైశాచిక శక్తిస్వరూపమైన భ్రాంతి జన్యమైన తేజస్సును మాయింప చేయడము అనుభవ రూప ములో చూచి తెలుసుకొని ఆ పైశాచిక శక్తిని విరక్తి అసహ్య రూప ములో తనకు గురువు ప్రబోధించిన మంత్రధ్వని ఉచ్ఛరింపజేసి నప్పుడు దానియందుగల బలీయమైన శక్తి భ్రాంతిజన్యమైన పైశాచిక

శక్తిని మాయింపజేసి గురుమహాశక్తిలో ఆహూయమానమై లీనమై తన ఆత్మ ఈశ్వర సంభూతమైనదని తెలుసుకొని గుణరహితమైన గురుస్వరూపమని నిశ్చయమై తాను ముక్తిస్వరూపినని తన ఆత్మ తనలో ధ్వనించువరకు యీ పైశాచిక శక్తి తనే ఈశ్వరుడని వొప్పించుటకు ప్రయత్నించుచునే యుండును. దానికి కారణము మానవ వ్యక్తిత్వము పొందిన ఆత్మ ఈశ్వర సంభూతమైన మహా విషయంగా మారి ముక్తి పొందకుండునట్లు చేయుటయే యీ పైశాచిక శక్తి ఆశయము.

ఒక మానవునియొక్క ఔన్నత్యమును చూచి యింకొక మానవునికి యెంత అసహనమో ముక్తిపొందే మానవవ్యక్తిని చూచి ఆ కల్పాంతము వరకు ముక్తి అర్హతలేని యీ పైశాచిక శక్తికికూడా యీర్ష్యా రూపమయిన అసహనము.

ఈ పైశాచికశక్తి నొక మానవునికి తన నిజరూపమును చూపించి భయపెట్టగల శక్తివంతమయి ఆ సమయములో భయపడిన మానవుని నిర్జింప చూచును. అట్టి సమయములో ఆ భయపడే మానవుడు యీ సర్వ వ్యాప్తమయిన పైశాచిక మహాశక్తి ఈశ్వరశక్తికి లొంగియున్నదని తెలుసుకొన్నవాడై ధైర్యము చిక్కబట్టి దానివైపు తన దృష్టిని నిగుడించిన అది తొలగిపోగలదు కాని, సద్గురువుని ఆశ్రయించిన ప్రబోధింపబడిన మంత్రిముగల వ్యక్తియైన, ఆ పైశాచిక శక్తి ఆ మంత్రిధ్వనిలోగల అగ్నిజ్వాలకు మాడి ఖిలమయి నాశనమయిపోవును.

ఇది మానవులను సర్పములయందు చెట్లయందు శిలలయందు గ్రామ పొలిమేరలనే హద్దులయందు యీ మానవబుద్దిని పోనిచ్చి తమవైపుకు త్రిప్పుకొని ఆ తిరిగిన మానవులకు కొన్ని సుఖములు శుభములను కూర్చి ఆ శుభములు కూర్చబడిన మానవులకు తనయందు

అనగా ఆయా రూపములందు భక్తి విశ్వాసములు కలుగునట్లుచేసి జడ జన్మలకు పోవునట్లు చేయుచున్నది. ఈ శక్తికి లొంగిన అనేక మానవ రూపులను తెలుసుకొన్న శ్రీకృష్ణ భగవానుడు.

"మనుష్యాణాం సహస్రేషు
కశ్చిత్ యతత సిద్ధయే"

అని తన భగవద్గీతలో పేర్కొనుటకు కారణమైనది. ఆ ఆత్మ మానవ వ్యక్తిత్వము పొందునప్పటికి ఈశ్వర విషయము తెలుసుకొనుటకు స్థితప్రజ్ఞత్వము పొందిన ఆత్మ కొన్ని వేలలో నొకటిగా నున్నట్లు చెప్పినాడు.

అయినప్పటికి కొందరు పైశాచిక వశీకరణ మంత్రము సాధించి దాని శక్తిని పురస్కరించుకొని సాటి మానవులకు విభ్రాంతులుగాచేసి వారి సృష్టికి తాము ఈశ్వర స్వరూపమైన అవతారులమని విశ్వాసము కలిగించు చున్నారు. అటువంటివారు ఆ పైశాచిక శక్తిని ఆధారముగ చేసుకొని చిత్ర విచిత్రములను చూపి సాటి మానవుడు తనను ఆశ్రయించి అవతారిగా నిశ్చయించి సేవించునట్లు మార్చగలుగు చున్నాడు.

ఇటువంటి వాటిని గూర్చియే భాగవతమందు "కాననివాని నూతగొని కాననివాడు విశిష్ట వస్తువుల్ కానని భంగి" అని పేర్కొనబడినదికాన కుహనా సన్యాసి గురువుగా వచ్చినప్పుడు అతనిని ఆశ్రయించిన శిష్యుడు ఒక గ్రుడ్డివానిని మరియొక గ్రుడ్డివాడు ఆశ్రయించి వస్తు సముదాయమును చూడనియట్లు, ఈశ్వర విషయం తెలిసికొనలేక జడజన్మలకు పోవుచున్నాడు. అందుచే సాధకుడు యే వ్యక్తిత్వము గుణరహితమైన సద్గురు స్వరూపముగ నున్నదో యే వ్యక్తి

త్వము పైశాచిక భ్రాంతిజన్యముతో కూడిన కుహనా సన్యాసత్వముగ నున్నదో విమర్శన రూపములోపెట్టి తెలుసుకొని కుహనా రూపమైన పైశాచిక శక్తి స్వరూపమని నిశ్చయించబడిన వ్యక్తిని కాదని ఈశ్వర సంభూతమయిన మహాశక్తి స్వరూపమయిన సద్గురువును ఆశ్రయించిన వాడే భ్రాంతిజన్యమయిన పైశాచికశక్తి బారినుండి తొలగి తరింపగలడు.

# భజన

లోకములో భజనయను విషయము అతి పవిత్రమైనదిన్ని ముక్తిదాయకమని యీ కలికాలమందు ముక్తిపొందుటకు భజనే శరణ్యముగా యున్నదని భజనకూటములు యేర్పాటుచేసి యేకాహ సప్తాహ రూపములో అవతార మూర్తులైన శ్రీరామచంద్రమూర్తిని శ్రీకృష్ణుని స్మరించుటయేగాక యీ యుగములో అవతారులని చెప్పుకొనుచున్న పేర్లను భజన విధానములో తప్పట్లు తాళాలలో రాగ యుక్తముగ కీర్తన సమామ్నాయముగ ధ్వనిరూపములో వినువారికి వెల్లడగునట్లు పాడుచున్న విషయము యీ కాలములో అన్నిచోట్ల సంఘరూపములో కూటములుగ జేరి భజనలు చేయుచున్న సంగతి మనకు తెలిసినదే.

ఈ భజన అనే విషయము ఉపనిషద్రూపములోబెట్టి విచారించిన "భజామ్యహం" భజామి + అహం" భజామి = భజించు చున్నాను. అహం = నేననుదానిని. అని స్పష్టంగా ఉపనిషద్రూపమైన వాక్యానకు అర్థము తేల్చుచుండ దానికి ప్రత్యామ్నాయముగ ధర్మము స్థాపించుటకు అవతరించిన ఈశ్వర సంభూతములైన వ్యక్తిత్వములను భజించుట యుక్తముకాదని ఉపనిషత్తులు ఘోషిస్తున్న సంగతి విస్మరించి వారికి తోచిన అర్థములతో వ్యాఖ్యానించి మారు త్రోవలు పోవుట న్యాయముకాదు.

"రామః = రమయతీతి రామః" అన్నప్పుడు ఆత్మస్వరూపమును రమింపజేసి దానికి పరిణామమునకు తీసుకొనివచ్చి ముక్తస్వరూపముగా మార్చు శబ్దానికి దశరథతనయ రామాయని, సీతాపతి రామాయని మేళ తాళములతో ధ్వనించడము సరిగాదు. "రమ" శబ్దము వచ్చినప్పుడు ఈశ్వర సంభూతమైన మహాశక్తియే తానుగా యున్న సంగతి యని నిశ్చయము దీనినే ఉపనిషత్తులందు

శ్లో॥ అపహాయ, నిజం కర్మ, కృష్ణ కృష్ణేతి వాదినః
తే హరిద్వేషిణః పాపాః ధర్మార్ధం జన్మయదరేః

ఈ పై విషయానికి అర్ధము తెలుసుకొనలేక అర్ధము తెలియని కారణమున గాబోలు "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే, యుగే" అన్న విషయము పురస్కరించుకొని ఆ అవతారమును ఈశ్వరునిగా "రసస్వరూపునిగ" నిశ్చయించి "స్మరణాన్ముక్తిః" అనే పదమున భజనగ పేర్కొని తన్మయులగుచు యితరులను భ్రమింప జేయుచున్నారు.

పైని పేర్కొన్న భగవద్గీతా వాక్యము ననుసరించి అర్ధము చేసుకొన్న దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించుటకు వచ్చిన వ్యక్తిత్వమును అవతారమని మరచి కృష్ణాయని అర్చువారు ఈశ్వరునికి విరోధులై పాపమును పొందుచున్నారని ఉపనిషద్రూప వాక్యమునకు అర్ధము.

అపహాయ, నిజం కర్మ కృష్ణ కృష్ణేతి వాదినః
తేహరిద్వేషణః పాపాః ధర్మార్థం జన్మయదరేః॥

అన్న శ్లోకమును అన్వయించిన.

నిజం కర్మ = యదార్ధమైన కార్యమును
ధర్మార్ధం యదేరేః = ధర్మమును స్థాపించుటకు వచ్చిన హరి యొక్క జన్మయను

అపహాయ = మరచి
కృష్ణ కృష్ణేతి = కృష్ణకృష్ణయని
వాదినః = ధ్వనించే
తే = వారు
హరిదేషిణః = ఈశ్వరునికి విరోధులు
పాపాః = పాపము పొందుచున్నారు.

అని పై ఉపనిషత్తు ఘోషించుచుండ దానికి వ్యతిరేకముగ రామా, కృష్ణా యని భజించుటవలన ముక్తి వచ్చునని భ్రమించుట తగదు.

లోకమందు జనులు చేయు భజనలుయెంతవరకు సార్థకమగునో తెలుసుకున్నవాడే యోగి.

భజన :— ఇప్పుడు లోకములో యే రూపముననో భజనగా స్మరించు కూటములను హర్షించవలసి యున్నది. కారణము యీ యుగమందు మానవత్వము అతి నీచమైన కామ్య కలాపములకు పోవలసిన కాలమిది. ఇట్టి కాలమందు జరుగుచున్న భజనలు అటువంటి వ్యక్తులను భయ విభ్రాంతులనుజేసి కామ్య రూపమైన తుచ్ఛ విషయాలకు పోకుండా కాపాడుచున్నది గాన, బాహ్యరూపమున యీ భజన విధానమును హర్షించవలసియున్నది. హర్షించుకు అవసరము కూడాను.

# భ్రాంతి

ఈ సృష్టి యావత్తును ఈశ్వర మయమైనప్పటికి ఈశ్వర విధానాన్ని తెలుసుకొనుటకు సాధ్యపడనివ్వని శక్తివంతముగనుండి జడ స్వరూపునిగ యీలోక జీవజాలమందు గల మనుగడయే స్థిరమనిపించి ఆశక్తి కలిగించి ఈశ్వర విషయాన్ని మరపించి తనలో ఉద్భవించు అభౌతికమైన భావములు దానిలోగల్గు వ్యూహోగానము కార్యసిద్ధికి తెచ్చుటకు ప్రయత్నింపజేయు ఆశక్తియే భ్రాంతి స్వరూపము.

ఇది మానవ అన్యత కలిగిన ప్రతి జీవమును భ్రాంతి శక్తి ఆవహించియున్న సంగతి యేలాగున్నప్పటికి ఈశ్వర నిష్పత్తిని సాధనారూపంలో తెలిసికోగలిగేశక్తి వంతముగా యున్న సృష్టియందు వుత్కృష్టతపొందిన ఆత్మపరిణామం తెలుసుకోగలిగే స్థితిలో నున్న జీవరూపము మానవుడు.

ఈ భ్రాంతి మానవజన్మలో జ్ఞానరూపమైన ఈశ్వర విషయం తెలుసుకొను భావమును ఆవహించి ప్రాపంచిక విషయములందు యిచ్ఛ కలిగించి వాటియందు సుఖ సంతోషములు కలవని విశ్వాసము కల్పించి అటువంటి విషయములందు కలిగిన అభిలాష యిచ్ఛ యీ మానవుని తలక్రిందుగాచేసి పాతాళమునకు దిగిపోవు విధానమునకు మార్గదర్శియై దాని అంత్యమందే స్వర్గాది యదార్థములు కలవని నిరూపణయగుటకు నిజములనిపించుకొన్న విషయములు అనుభవనీయులుగా చేసి ఆ పైనిగల స్థానము జన్మ జన్మాంతరముగా నున్నప్పటికి అదియే ఈశ్వరస్థాన మనిపించి బోర్ల బడద్రోయుశక్తి భ్రాంతి.

ఇది మానవునిలో భౌతికమైన విషయమందు వారి వూహాలు యదార్ధ సహితమైనవిగ గ్రహించు విధానమందు భ్రాంతియని పలుకుచు లోకమందలి జీవ జాలాన్ని కూడా నాశన స్థానమున పెట్టగలిగిన శక్తి భ్రాంతి తన దృష్టికి చాలా తేలికగను నిర్లక్ష్యముగను అనగా "వుఫ్" మని వూదిన పోగల్గుదానియట్లుగను నిశ్చయించి దానిని విలువ లేని దానినిగ మార్చుచున్నాడు. ఉపేక్ష చేయుచున్నారు. ఇది ఒకని విషయమునకు వచ్చిన విధమునకే భ్రాంతియను చున్నారు.

అది కార్యరూపములో మనము విమర్శించిన ఆ భ్రాంతియొక్క పారిభాషికము వేరువేరుగ చెప్పవలసి వచ్చినప్పుడు ఒకనికి రుచ్య భోజనములందు భ్రాంతి నొకనికి చిత్రవిచిత్రమైన వస్త్రధారణయందు భ్రాంతి యింకొకరికి బంగారమందు భ్రాంతి, మరియొకనికి భూగృహ వసతులు గడించుటయందు భ్రాంతి, నొకనికి అగ్నిసాక్షిగా వచ్చిన స్త్రీ యందు భ్రాంతి, మరియొకనికి తన సంతానమునందు, యింకొకనికి స్ఫురద్రూపియైన అన్య స్త్రీయందు భ్రాంతి, మరియొకనికి సృష్టి యందలి అతీతమైన విషయములను భౌతికరూపములోమార్చి. నిరూపణ చేయుటయందు భ్రాంతి, యింకొకనికి లోకజాలమంతటిని తన గుప్పెటలో పెట్టుకొని దానిపై అధికారమును చేయుటయందు భ్రాంతి యీ విధముగా యెవరికివారు విమర్శించుకొన్న తాను భ్రాంతి స్వరూపుడుగా వున్నాడనుమాట నిజమైనప్పటికి అది తెలుసుకొనలేకుండా చేయగల్గునదికూడా భ్రాంతియే. పై విషయమును భ్రాంతిగా వున్నట్టుల జ్ఞానము ప్రబోధించినప్పుడు చెప్పుచున్న సంగతి ప్రతివారికి తెలిసినదే. కాని యదార్ధమైన భ్రాంతి స్వరూపము గ్రాహ్యమగుట కష్టము. అది తెలుసుకొనవలెనన్న విమర్శనా దృష్టితో పరికించిన నది తెలివికి మించియున్నది. ఈ విషయము క్రింది విధానమున తెలుసుకొననగును.

వెలుగునకు భ్రాంతి చీకటి, జ్ఞానమునకు భ్రాంతి అజ్ఞానము నిజమునకు భ్రాంతి అబద్ధము, కామమునకు భ్రాంతి వికారము, సహన మునకు భ్రాంతి కోపము. విశాలహృదయమునకు భ్రాంతి కుచ్ఛిత మనస్సు. ధర్మము (దానము) నకు భ్రాంతి లోభము. శీలమునకు భ్రాంతి మోహము, ఔన్నత్యమునకు భ్రాంతి ఈర్ష్య (మాత్సర్యము) సాత్వికమునకు భ్రాంతి గర్వరూపమైన దర్పము. పై విషయములు వొకదాని నింకొకటి విమర్శనా దృష్టితో పరికించి వాటి పరిణామమును తెల్పుకొని నొక స్వరూపముగ మార్చిచూచిన భ్రాంతి యనునది రూపించ గలదు.

(1) వెలుగునకు భ్రాంతి చీకటి÷
జ్ఞానమునకు భ్రాంతి అజ్ఞానము

మానవుని అజ్ఞాన దశలో ఈ భ్రాంతి మహాశక్తి యొక్క కారుచీకట్లులో పెద్దకాంతి కలిగిన విద్యుద్దీప మెలాగున తనకాంతి వెలార్చుచు కనులకు యెట్లు మిరుమిట్లు కలుగునట్లు చేయునో అట్లే చీకటిని బడిన అజ్ఞానియందు ఆ భ్రాంతి శక్తి విజృంభించును. ఆ విద్యుద్దీపము నాలాగుననే ప్రకాశించు చుండగా సూర్యోదయమై మధ్యందిన మార్తాండ రూపమున విజృంభించు సూర్యకాంతియందు చీకటిని మటు మాయముచేసి వింత గొలిపిన విద్యుత్కాంతి కూడా కాంతి రహితమై కనిపించును.

ఆ స్థితిని విమర్శించిన యీ కాంతి సూర్యుని కాంతిలో (వెలుగులో) లీనమైనట్లు ఈశ్వర సంభూతమైన తేజస్సు విజృభించి భ్రాంతి రూపమైన వెలుగును మాయింప జేయును.

పై ఉపమాన రీతిని భ్రాంతిరూపమైన వెలుగు ఆ రసస్వరూపము యొక్క తేజస్సునందు లీనమై తన కాంతి తగ్గి సృష్టితో మిశితమై

ఆ వెలుగునందు ప్రమగ్గింప బడును. అప్పుడు సర్వము తేజోమయమైన ఈశ్వర రసస్వరూపముదక్క యింకొకటి లేనేలేదు.

పై విధానమున మోసి మానవుడు చీకటిని నిర్జించి వెలుగుగను అజ్ఞానమును మాయింపజేసి జ్ఞానిగను మారుటకు ప్రయత్నించ వలెను.

2. నిజమునకు భ్రాంతి అబద్ధము :- ఆత్మ యను దానికి నిజ స్వరూపము. దానికి నిజము తెలుసును. కాలానుగుణ్యముగ తనకు తాత్కాలికమైన సుఖము హాయి ఆనందము కలుగజేయు విషయము నిజమునకు విరుద్ధముగా యున్నప్పటికి భ్రాంతి స్వరూపమయిన అబద్ధము ఆవహించి అనేక నికృష్టకార్యములు చేయించుచున్నది.

3. కామమునకు భ్రాంతి వికారము :- ఈ కామమును విమర్శించిన దానియందుగల నిగూఢమైనశక్తి ఈశ్వర సంభూతమైన స్థానమునకు తీసుకొనిపోగలిగే శక్తివంతమై యున్నప్పటికి దానిని మాయింపజేసి తనకు ఇచ్ఛకలిగిన యనేక రూపములుగా రూపింపజేసి వాటియందు తన ఊహాలుపోయి వాటిని పొందవలెనను అభిలాష కలిగించి అవి సాధ్యమయ్యేవరకు పయనింపజేయు శక్తి వికారము.

4. విశాలహృదయమునకు భ్రాంతి కుచ్చిత మనస్సు :— విశాలహృదయమన్నప్పుడు అది సృష్టియావత్తు ఆవహించిన ఆత్మ స్వరూపము. అది విష్కళంకమైన స్వచ్ఛమైన శాంతి ఆనంధమునకు నిలయమై వున్నప్పటికి ఆ మనస్సునందుగల కుచ్చితమైన ఊహాలకు లొంగదీసి తనకంటె అన్యమైనవారియందు అయిష్టతకలిగించి తన విధానమును నికృష్ణ విషయమునకు మార్చి లోకదృష్టికి హీనునిగా తలపోయునట్లుచేయు కుచ్చితము సంకుచితమై నాశన హేతువునకు కారణమగుచున్నది.

5. ధర్మమునకు భ్రాంతి లోభము :- మానవ స్వరూపము కేవలము ధర్మము (దానము) యొక్క ఆకరము. ఆ స్వరూపము ప్రతి నిత్యము ధర్మమను యదార్థమును గ్రహించి దానిలోగల ఆనందము చూరగొనవలెనను అభిలాషగల్గినదే మానవ స్వరూపము. కాని ఆ ధర్మమనుదానిని కార్యరూపము దాల్చనియ్యక ఊహలయందు మాత్రమే యిమిడ్చి సమసిపోవునట్లుచేసి ఆశాబద్ధమై అది విమర్శనము నకు తీసుకొనివచ్చి అంత్యపరిణామము స్వార్థంగామార్చి లోభమునకు లోబడునట్లు చేయుచున్నది. దానిని ప్రతిమానవత్వమున్ను లొంగిపోవు చున్నది. తాను లోభినాయని తనలోతాను విమర్శించుకొనిన దాని పరిణామము తప్పక తాను లోభిగాయున్నట్లు నిరూపణకాగలదు.

6. శీలమునకు భ్రాంతి మోహము :- మానవ వ్యక్తిత్వము నందు యశఃకీర్తులకు ఆకరమైన మహాశక్తి శీలము. ఇది సర్వావయవ ములను భౌతికయింద్రియములను (కర్మేంద్రియములు) గ్రహణేంద్రియ ములను తాను ప్రతిలిప్తకాలము విమర్శనలో పెట్టినప్పుడు అవి శీలమను పవిత్రతనే ఆశించుచున్నవి. వీటిని మోహమను సుందరరూ పము ఆకర్షించి శీలరహితమైన నికృష్టమైన విషయేచ్ఛలకు దారిచూపి మోహమనునది మహాసముద్రమై ఆ సముద్రాఘాతమందు తనను ముంచి పాతాళమును చూపుచున్నది.

7. ఔన్నత్యమునకు భ్రాంతి ఈర్ష్య :- జీవి దేహధారియై తనకంటె నున్నతస్థితియందున్న మరియొక దేహధారినిచూచి మాత్సర్య పడుచున్నది, ఈర్ష్యపడుచున్నది. ఇదియే సృష్టియొక్క రహస్యము. ఈర్ష్యారూపంలో ఈశ్వర విషయం తెలుసుకొని తరించాలను విషయా నికివచ్చి యీ జీవికి మానవవ్యక్తిత్వము కలిగినకాని సార్థకముకాదని, నొకదాని తరువాత యింకొక వున్నతమైన జన్మతరువాత జన్మగా మారి మారి 84 లక్షల జీవరూపములు గడచి కడపటిజన్మమానవ వ్యక్తిత్వము

పొందిన యీజీవి ఈశ్వర విషయం వ్యక్తం చేసుకోగలిగే శక్తివంత మైనప్పటికీ సత్స్థానానికి వచ్చినట్లు తెలిసినప్పటికీ అది మరచి. తనకంటె మించిన పావతాశము కల్గిన స్థితికికలిగియున్న లేక సంపాదించిన యింకొక మానవునిచూచి మత్సరపడుచున్నాడు. ఈ మత్సరము యొక్క అం త్యము మానవ అహంకారరూపంలో దర్పరూపంలో యీర్ష్యా సంభూత మైన మహాశక్తి కూడా తనవలెనే దేహధారియై యున్నట్లు నిశ్చయిం చిన దానిని కూడా నిర్జింప సమకట్టుజూచే స్థితికివచ్చి ఆవేదన, కలత, చీకాకులతో గూడిన అశాంతికి ఆకరమగుచున్నది. ఈమహాశక్తి వలన మానవ వ్యక్తిత్వము నాశనమై దానియందుగల ఆత్మస్వరూపంగా నున్న జీవికూడా బుగ్గియై నశించుచున్నది.

8. సాత్వికమునకు భ్రాంతి గర్వరూపమైన దర్పము :- సృష్టి యందు ఉత్కృష్టమైన జన్మగాయున్న మానవునియందు సాత్వికము ప్రాతిపదికము, నది యేజీవిని హింసించుటకు పాల్పడదు. దానికి కారణము ప్రతి స్థావర జంగమాత్మకమైన జీవస్వరూపము నొకే విధ మైన స్వరూపాన నొకే స్థానమందున్నట్లు కనబడుటయే కారణము. అటువంటి విధానమును మార్చి అహంకారమును రేకెత్తించి తనకు గల బలవిహ్వాలములను ఉద్రేకింపజేసి గర్వభూయిష్టమయిన మహా శక్తిని రేగిత్తించి దర్ప స్వరూపములో నిమిడి తన వ్యక్తిత్వము జడిపించి యితరుల మత్స మాయింపజూచి తనకుతానే నాశన కారకు డగుచున్నాడు. అటువంటి వ్యక్తికి యీ సృష్టియావత్తు నల్లపూసగా దోచి తన ఊహలలో యావత్తు సృష్టిని నిర్జించగలనని నిశ్చయించి దర్పమున నాశనమగుచున్నాడు.

ఈ పైవిషయములు యే మానవుడు క్షణక్షణము లిప్త లిప్త యందు విమర్శనలో బెట్టి విమర్శించిన భ్రాంతిగా చెప్పబడిన విషయ ములను దృష్టిలోపెట్టి నిరూపింపజేయగల సమర్థుడుగానున్నాడో

ఆతడే తత్వవేత్తయొక్క రూపముగానున్నాడు. ఆ రూపముననే యీ విమర్శనారూపమైన పరిణామము రెండు రూపములుగమారి కనబడుచున్నది.

ఒకటి ఈశ్వర రస స్వరూపసంభూతమైన మహాతేజస్సు. రెండు భ్రాంతి స్వరూపమైన కళంకసహితమైన మలినము కలిగిన వెలుగు ఈ రెండింటిని సృష్టియందు చూడగలిగినవాడే విశ్వరూపి. ఆతనికే భ్రాంతియనునది తెలియగలదు. ఆతనినుండి భ్రాంతి వదలిపోవును. దీనినే "భ్రాంతి వదలిన తత్వమెవ్వనికి తెలియు".

"తత్వమన్న తానేగదా" అన్నాడు తత్వవేత్త.

తత్వమన్న తానేగదాయన్నప్పుడు భ్రాంతిని మాయింపజేసిన తాను "నేను" గానే యున్నాడని నిశ్చయము.

# ఎరుక

ఎరుక అనునది అపురూపమైన శక్తివంతమైన ధ్వని. ఇది మానవునిలో నిగూఢముగను, బలీయముగను వ్యక్తముకాని పరిస్థితిలో నుండి వ్యక్తమై మానవుని సాయుజ్యుని చేయుచున్నది.

ఇది మొట్టమొదట ఆదిగ తల్లిని నెరుకపరచుచున్నది. అది ఆ తల్లికి జన్మించిన విషయము అతనికి తెలియకపోయినను సంతాన రూపమున నిగూఢముగనున్న అవినాభావ సంబంధమైన ప్రేమ తల్లిని తల్లిగా నిరూపణ జేయుచున్నది. ఆ తరువాత శబ్ద పరిజ్ఞానము వచ్చిన తరువాత తల్లి మాతృరూపమేగాక గురురూపమై తండ్రిని యెరుక పరచుచున్నది. అందులో యీ వ్యక్తిత్వమునకు ప్రగాఢమైన విశ్వాసము కలిగి తన జన్మకారకుడుగా యెరిగి అతనియందు భక్తి పురస్కారుడగుచున్నాడు. ఆ తరువాత ప్రాపంచిక జ్ఞానములో ప్రతి విషయమును యెరుకలో యిమిడియున్నట్లు తెలుసుకొని పరిగ్రహించి వాటిని తెలుసుకొను చున్నాడు. ఆ తరువాత ధ్వని రూపమున శబ్దములుగాయున్న వాఙ్మయమును యెరుక రూపములో గ్రహించుచున్నాడు. ఆ వాఙ్మయమందున్న నిగూఢమైన శక్తిని తన జన్మ స్థానమైన విరాట్ స్థానము గ్రహించు ఆవేశముతో పయనించి ఆ స్థానము యెరుక రూపములో సద్గురు ఆశీర్వాదమున గ్రహించి బడసి "స్వయం బ్రహ్మన సందేహ" అనుచున్నాడు.

తానే విశ్వరూపమని నిశ్చయమై తాను యీ సృష్టిగా వున్నాను, తనలో ఈ సృష్టి యంతాయున్నదని తన యెరుకలో తెలుసుకొని మురియుచున్నాడు.

ఇందులో భిన్నంగా కొందరు మానవులు తత్వ ప్రబోధకులై యెరుకలేదని అచలమే పరిపూర్ణమని యీ దేహము మాడి బూడిదై పంచభూతాలలో కలసి పోవుచున్నదని, ఆత్మ బయలులో కలిసి పోవును

గాన అంతా బయలేనని యీ దేహధారిగా చేసిన వుత్కృష్ట నికృష్ట కార్య కలాపములు దేహమునకు అనుగమింప బడునని ఆత్మ పవిత్ర మైనదిగాన దానికి దేహధారిగా వున్నప్పుడు చేసిన పాపకార్యములు దేహమునకేగాని ఆత్మకు నంటవని పుణ్య పాప కార్యకలాపములనేవి కేవలం మాటలని అవి దేహము కాష్టమునుకాలి బూడిదయైనప్పుడు అవి దేహముతో సమసిపోవుచున్నవి కాన తన సుఖముకొరకు యే విషయమైన కార్యకలాపములాచరించి నప్పటికి పాపములు అంటవని చెప్పెడి సంస్థలు యీ సృష్టిని అచలమత రూపమున ప్రబలియున్న సంగతిని పురస్కరించుకొని సటువంటి సంస్థలలో నున్నవారు యెదురై నప్పుడు వారిని ప్రశ్నించినప్పుడు వారు "గురువని లేక లేదని అది నిష్ప్రయోజకమైన శబ్దమని యెరుక అనునది యెక్కడ నున్నదని" వాదించి యేవో కల్లలు బొల్లులు హేతువాదమున వాదించునప్పుడు నష్టివారిని నీ తండ్రి పేరు యేమిటని ప్రశ్నించిన తన తండ్రిగాయున్న వానిపేరు "రామస్వామి" యని చెప్పినప్పుడు కాదు వెంకటస్వామికి పుట్టావు అన్నప్పుడు అతనిలో తన తల్లి అవినీతిపరురాలుగ చెప్పుచున్నా డని తన రక్తనాళములు కోపమున నుప్పొంగి వుగ్రుడై మీద పడుచున్నాడు. ఆ సమయాన "నీవు యెరుక లేదన్నావు నీవెవరికి పుట్టావో నీ తల్లికి తెలుసును ఆమె నీ గురురూపమున రామస్వామిని చూపి యితడు నీ తండ్రియని చెప్ప నీవు తెలుసుకున్నవాడవై గురువు అక్కరలేదనడం భావ్యంకాదు. ఆమె చూపిన యెరుకయే నిన్ను నా తండ్రిని యెరిగింప జేసినదిగాన యెరుక లేదనరాదని చెప్పినప్పుడు తన అంతరాత్మ పై విషయము యదార్థమని ఘోషించినప్పుడు బేలపడి తల వంచుచున్నాడు.

ఈ విషయము తేట తెల్లముగ నిరూపణ అయ్యే విధానములో తెలియబడిన ఈశ్వర విషయములో కాదని కల్ల బొల్లు లల్లవలదని

తత్వవేత్త వారిని జాగృతి విధానములో తెలియబరచి నప్పుడు లోలో పల తెలుసుకొనికూడ తన విధానమునకు లొంగిన అమాయక ప్రజలను తను లోపుచేసుకొని వారు సమర్పించు ఆహార పానీయాదులకు విష యేచ్ఛలకు దాసుడై అవి లభ్యమగుటకు వేదాంత రూపములో అచ లము పరబ్రహ్మ స్వరూపమని అదే మానవుని పరిపూర్ణమని దానికి పదముగా నాస్తికముగ చెప్పిన పడికట్టు మాటలను పురస్కరించి పం చీకరణ విధానములో సాంఖ్యమున తన ధర్మమును ధృవీకరించ సమ కట్టి సాటి మానవులను తనలాంటి భ్రాంతి రూపులుగ మార్చుచున్నాడు. తన ఆత్మను బలీయమైన నాశన స్థానమునకు చేర్చి ఆ కల్పాంతము దాక ముక్తియనే విషయమునకు రాలేక పాపస్థానమున నిలచిపోయి అచల రూపమైన బయలులో క్రుమగ్గుచున్నాడు.

నీకు నిజమయిన తత్వమును తెలిసి నీలోనున్న నిగూఢమయిన విరాడ్రూపమయిన రసస్వరూప స్థానమయిన నీ జన్మభూమిని చేరుకొన వలెనను పథము సార్థక పరచుకొనవలెనన్న యిట్టి అచల రూపులు స్థాణువుల దరిజేరక భ్రాంతి జన్యమయిన భౌతికంగా పలుకు వాక్కును మాయింపజేసి పంచ భూతాలతోగల ఆత్మ స్వరూపమయి "నేను" అనుధ్వనిని సూక్ష్మ శరీరమున దృశ్యరూపములో ధ్వనించుచున్న "నేను" అను వాక్కును భేదించి అది అజాండమయిన తేజ స్వరూప ముగ నున్న నిజము తెలుసుకొన్న గురు స్వరూపమును ఆశ్రయించి తరించెదవుగాక.

# యోగి

యోగి యను శబ్దము ఈశ్వర విషయమైన శక్తి స్వరూపము జ్ఞాన విధానమున సాధనచేసి తన యనుభవములో తెలుసుకొని ఆ అనుభవ రూపములో ఆశీర్వాద ప్రసారమున తన శిష్యుడుగాయున్న వ్యక్తియందు ప్రతిఫలింపజేసిన తన యనుభవమునకు తెచ్చి ఆ యను భవము ఆతని ఆత్మ పరిణామము ముక్తి స్వరూపముగ యున్నదని నతని స్వయంలో ఆతని ఆత్మ సాక్ష్యమిచ్చి నిర్ధారణచేసి సాక్షిగా మారి తన గురువుయొక్క మహత్తరమైన యోగశక్తిని ప్రశంసించి "నగురో రధికం" అను ఆర్యోక్తిని నిర్ధారణ చేయగల మహావ్యక్తియే యోగి యనబడును.

ప్రస్తుత ప్రపంచమందు యిటువంటి విషయము మృగ్యమై డాంభికమైన వేషధారణలో లీనమై ముక్తిని కాంక్షించు అమాయక ప్రజలను మోసగించి వారి సిరులను హరించి కడకు యీ యోగవిద్య బూటకమని ప్రజలు తూలనాడునట్లు పరిణమించినది.

ప్రస్తుత యుగంలో యోగియన్నప్పుడు కాషాయాంబరధారియై రుద్రాక్షమాలలు ధరించి కేశముండనము చేయించిన నొక యోగి రూపము.

తనకురులు జిగురుతోనో మఱ్ఱి పాలతోనో జట లల్లుకొనునట్లు చేసి గడ్డము పెంచి దండ కమండలములు చేబూని కాషాయాంబరములు ధరించిన మరియొక యోగిరూపము.

మన మధ్య తిరుగుచు యోగియన్న పారిభాషికము వేషధార ణలో యిమిడ్చి వారి తల్లి తండ్రులు చిన్ననాడు చేసిన నామకరణము తుడిచివేసి మాయింపజేసి యోగానంద, గగనానంద, చిదానంద

సదానంద, జ్ఞానానంద, ప్రణవానంద ఆదిగాగలపేర్లు పెట్టుకొని ఆనంద స్వరూపులైనట్లు నటిస్తూ పడికట్టు మాటలు నేర్చుకొని ఋగ్వేదాది సూక్తులో, యే ఉపనిషత్తుల లోనిదో లేక భగవద్గీత లోనివో శ్లోకాలు వాటి తాత్పర్యాలు నేర్చి వల్లించి భారత, భాగవత, రామాయణాది పౌరాణిక వాఙ్మయ విషయములుగల గద్య పద్యములనో వల్లించి వప్పగించి తన స్వయంలో తోచిన విధానంగ వాటికి అర్థములు చెప్పి ప్రబోధరూపంలో తాను స్వయంగా తెలుసుకొన్నానని ఇవి అంతరార్థములని యివి ఆత్మకు తట్టి అనుభవములో రావలసినవే గాని బాహ్యార్థములకు సరిపోవని, తమ శిష్యులకు బోధించినప్పుడు అవి శిష్యరూపములలోనున్న వారి అనుభవానికి రానప్పుడు శ్రీవారి శిష్యుడు ఆ విషయము ప్రశ్నించినప్పుడు నీ గురువంతటి వాడైతేనేగాని తెలియ నేరదని పడికట్టు మాటలలో నీలో ధ్వనించుచున్న "నేనను" నది భౌతికమైన శరీరమునుండి విడువడి నప్పుడు అది అభౌతికముగానున్న సంగతి సర్వ జనీనకముగా తెలిసిన విషయమేగాన ఆ యభౌతిక విషయాన్ని దాని నిజరూపాన్ని తెలుసుకొన్నప్పుడే తప్ప నేను చెప్పే అనుభవ రూపమైన మాటలు నీ యనుభవమునకు రాజాలవుకాన "నేన"ను అభౌతిక విషయాన్ని తెలిసికొనే టంతవరకు నీవు గురు శుశ్రూష చేయవలసినదేనని శిష్యరూపములో నున్న వ్యక్తి యొక్క మత్స హాయింపజేయు చున్నాడు.

ఈ విధముగనే స్వాములు, తీర్థులు, తీర్థస్వాములు బాబాలుగా మారి క్షుద్రదేవతోపాసకులై తాను ఉపాసించిన పైశాచిక శక్తి వల్ల కలుగు దోషదూషితమైన కల్పనలు మహాత్మ్యములుగా మార్చి లోకాన్ని భ్రాంతిశక్తి లోనుచేసి శిష్యులను జడజన్మల కాకరులగు నట్లు చేయుచున్నారు. ఇటువంటి పరిస్థితిలో ప్రజలు మోసపోయి పై

వారిని యనుసరించి దారి గానక అర్తులై వాపోయి స్మశానమునకు చేరుచున్నారు.

పై చెప్పిన ఆనంద స్వరూపులని చెప్పుకొను యోగరూపులు వారివారి నామములనుబట్టి అర్థములు చెప్పిన

యోగానంద :— యోగానంద యన్నప్పుడు యోగము ఆనందముగా కలదని యిది యథౌతికముగాయున్న సంగతి తెలసినవాడు యోగము ఆనందముగా నున్నదని చెప్పరేడు.

గగనానంద :— గగనానంద మన్నప్పుడు గగనమునకు ఆకాశమనే అర్థమిచ్చునప్పుడు ఆకాశమునుచూచి యితను ఆనందించిన దేమిటో?

చిదానంద :— చిత్ అన్నప్పుడు మనస్సు దీనిని చూచి యితను పడిన ఆనందమేమిటి?

సదానంద :— ఎల్లప్పుడు ఆనందముగా వుండడమనేది ప్రకృతిలోగల యే జీవికైనా సాధ్యముగా నువ్నదాయని ప్రశ్నవేసి నప్పుడు ఇతని ఆనంద స్వరూపమెట్టిదో చెప్పనక్కరలేదు.

జ్ఞానానంద :— జ్ఞానము అను విషయము అర్థమవని విషయము. అట్టి తెలియని విషయము తెలుసుకొన్న ఆనందమేమిటో?

ప్రణవానంద :— ప్రణవం అన్నప్పుడు "ఓం" ఆకారముగా యున్నదని అది "అ,ఉ,మ," అను బీజాక్షరముల సంపుటియని చెప్పినప్పుడు దానిలోయున్న ఆనందమేమిటి?

పై వాటికి అర్థాలు తెలియని పరిస్థితిలో ప్రజాదృష్టిలో గర్వభూయిష్టమైన అహం సంపాదించే పడికట్టు మాటలు తప్ప వారు ఎంత వరకు వీటి నిగూఢమైన తత్వరూపమైన విషయాన్ని తెలుసుకున్నారు అనుపశ్న వారికే వేసినప్పుడు వాటికి సమాధానము చెప్పవచ్చును

కాని వారంతట వారు వారి ఆత్మలలో యీ ప్రశ్న సంశయ రూపంలో పెట్టి ప్రశ్నించికొన్నప్పుడు వారి ఆత్మ వారికే నీవు బూటకవరివై లోకమును మోసముచేయు వేషము వేసుకొంటివి యని వారి ఆత్మయే వారికి ప్రబోధించగలదు.

అలాగుననే స్వాములు. తీర్థులు, తీర్థస్వాములు, బాబాలుకూడా వారంతట వారు ప్రశ్నించుకుంటే యిదే అర్థము (మాట) వారి ఆత్మలు పలుకగలవు.

యదార్థమయిన యోగియని నిరూపణ చేయవలసిన వ్యక్తి శోకానందుడో. స్మశానందుడో, చిత్యానందుడో, దుఃఖానందుడో దరిద్రానందుడో అయినప్పుడు ఆ వ్యక్తి ఈశ్వర సంభూతమయిన మహాశక్తిని తేజస్సున బడయగలడు.

శోకానందుడు :— మానవునికి భౌతికమయిన బాధలే కాకుండా అభౌతికమయిన కష్టములకు లోనైనప్పుడు తాను అంతర్యమున శోకించును. ఆ శోకముయొక్క ప్రాతిపదికమును విమర్శించి దాని అంత్యము ఆనందముగ మార్చిన వ్యక్తియే యోగి.

స్మశానందుడు :— తనదృష్టిలో తన యనుభవములో స్మశానమును రూపించిగాని స్మశానమునకు పోయిగాని అక్కడ మసి అయిపోయిన మానవ కళేబర భస్మమును చూచి తన్నుకూడా నొక నాడు యీ స్మశాన వాటిక స్వస్తి జెప్పినప్పుడు నాలాంటి ఇంకొక మానవుడు నాలాగుననే యీ చోటికి వచ్చి భస్మమైపోయిన నన్ను చూచి తానుకూడా ఈ స్థితికి రాగలడని తలచినప్పుడు అతని అంతర్యమున యేనాటికైనా మానవ వ్యక్తిత్వము యీ స్థితికి రావలసి వచ్చినప్పుడు తాను తన అంతర్యమున ఆ స్థితి స్థిరపరచి యీ స్మశానము ప్రకృతిని తలదన్ని స్వస్తి చెప్పించుచున్నదని ఆ తరువాత యీ సృష్టితో సంబంధము వదలిపోవునని ఆనందించువాడే యోగి.

చిత్యానందుడు :— తాను కాలుచున్న నొక కాష్టమును చూచి అచితియందున్న కళేబరము కనపడకపోయిన కాలుచున్న పై కట్టెనుచూచి కొంతసేపటికి లోనున్న తనవంటి మానవ కళేబరమును ఈ మండుచున్న అగ్ని జ్వాలలు బూడిదచేసి ఆశానిబద్ధమైన తన ప్రాపంచిక ఊహలను మాయింపజేసిన విషయము తలచుకొని ఆనందించువాడే యోగి.

అట్టి సమయమున వీక్షించుచు తనకట్టెకూడా ఒక కాలమునకు యీ స్మశానములో ఆ కాలుచున్న కట్టెవలెనే కావలసియున్నదిగా నిశ్చయించి ఆ సమయము తాను యీ ప్రకృతిని తలదన్ని జగద్రూపిగా మారే సమయమని నిశ్చయించి ఆనందించువాడే యోగి. ఖనన మగువాడుకూడా ఇదే విధముగా నిశ్చయించుకోవలసి యున్నది.

దుఃఖానందుడు :— మానవుడు సృష్టియందు తన మనుగడ ఆయుష్షున్నంతవరకు ప్రతి లిప్తకాలము దుఃఖముతో నిండియున్న సంగతి తెలుసుకొని దుఃఖమునకు దుఃఖమునకు మధ్య శాంతిరూప ములో వచ్చు స్థాయిని తెలుసుకొన్నవాడు యీ దుఃఖమునబెట్టు దుఃఖమును ఆనందముగ అనుభవించి మధ్యను వచ్చిన స్థాయియే బ్రహ్మస్వరూపమని నిశ్చయించుకొనువాడు యోగి.

దరిద్రానందుడు —: మానవుడు యెప్పుడు భాగ్యమునే కోరు కొనునుగాని దారిద్ర్యమును కోరడు. కాన భాగ్యమునకై పాటుపడుట మానవ స్వభావము. అది ఆశాబద్ధమై తిరిగి నొకనాటికి దారిద్ర్య స్థితికి తీసుకొనిరాక తప్పదు. అట్టి స్థితికి వచ్చినప్పుడు తననుండి విడి పోయిన భోగభాగ్యములు తలచుకొని ఆ సమయమందుగల నున్నత స్థాయిని వూహించి దృష్టినిపెట్టి దానివలె చలనముగాక చలనము లేనిదిన్ని దానికి మించినది లేనిది యేదైతే దారిద్ర్యముగా నున్నదో దానియందు తన మనస్సు లగ్నముచేసి చూచిన తన భోగభాగ్యాది

సౌఖ్యములందుగన్న స్థాయిని దారిద్ర్యమందుఁగల స్థాయిని పోల్చి భోగభాగ్యములయందుకంటె యీ దారిద్ర్యస్థితియే మానవ పరిణామమునకు దారిచూపి ఈశ్వర సంభూతమైన మహదానందమునకు ఆకరమని తెలుసుకొన్నవాడే యోగి.

పైని చెప్పిన సన్యాసులు, స్వాములు, ఆనందులు, బాబాలు వివాహ రహితులని మనకందరకు తెలిసిన విషయమే. వీరు పెట్టుకొనిన నామములు సార్థక పరచుకొనవలెనన్న సంసార విధానమైన ప్రకృతి ప్రకాండములేని యీ జీవులు ప్రేమయన్నప్పుడు దానిని యే విధముగ వ్యక్తము చేయగలరో అట్లే శోకమనునది వీరికి యేలాగు తెలియుటకు వీలగునో అనే ప్రశ్న వచ్చినప్పుడు కామ వికారమైన అలజడిని స్థాయిచేయుటకు అగ్నిసాక్షిగా వివాహరూపములో వచ్చిన స్త్రీయందు ఆ కామ వికారాన్ని స్థాయి చేయునప్పుడు వివాహితుడు పొందు ప్రేమరూపమయిన ఆనందమును యీ సన్యాసి తెలిసికొనగలడా? ఆ రూపమున కలిగిన సంతానమును తాను కోల్పోయినప్పుడు ఆ దుఃఖము యే తీరున నున్నదో చెప్పగలడా? అనే ప్రశ్నలు వచ్చినప్పుడు యోగ విషయములో అతని అనుభవ మేమిటో తేలగలదు.

వివాహితుడైన వ్యక్తి అగ్నిసాక్షిగాయున్న భార్యను మొదటిసారిగా అనుభవించినప్పుడు ఆతనికి కలుగు సుఖము సౌఖ్య స్వరూపములో కలిగిన ఆనందము ఈశ్వరుని మొదటిసారిగా ధ్యానించునట్లు చేయుచున్నది.

స్వామీ! భార్యా భర్తలైన మా దాంపత్య ఐకమత్యము యీ కలయిక యీ ప్రేమ యీ సుఖము యీ ఆనందము మా ఆయుష్షు అంతమువరకు స్థిరముగా నుండునట్లు ఆశీర్వదించి ప్రసాదించెదవుగాక యని ఈశ్వరుని ధ్యానించుచున్నాడు. ఈచోటనే మాన

వృనియందు ఈశ్వరుని ధ్యానించు జ్ఞాన ముదయించుటవలన ఈశ్వరుని అండవేడి అతని సహాయముకొరకు వేడుకొను జ్ఞానోదయ మొలక తన హృదయమందు మొలకనెత్తుచున్నది. ఇది పై జెప్పిన సన్యాసుల అనుభవములో లేదు.

సృష్టియందు యేది పోయినప్పటికి యెంతనష్టము వాటిల్లినప్పటికి యెన్నిబాధలు నాతనికి చుట్టుముట్టినప్పటికి వాటి ఉధృతము మాయింప జేయుటకు ప్రయత్నించి బడయ సమకట్టును గాని తాను సంతానమును పోగొట్టుకొనిన దుఃఖము, శోకము భరింపరానిది. ఈ విషయము అనుభవమందున్న వానికితప్ప యొరులకు తెలియరానిది ఇట్టి శోకానుభవము సన్యాసికి లేదు. ఈ శోక మోహములలోగల అనుభవము తెలియరాని వ్యక్తిని యోగియనుట మిక్కిలి శోచనీయము. ఒకవేళ యోగిరూపములో ప్రేమరూపమును వెళ్ళడించ గలిగిన నతడా ప్రేమను తెలుసుకొని అనుభవములో నున్నాడని విస్థారణ అయినట్లయితే అతడు తెరవెనుకను పొరపాటు జీవితము గడుపుచున్నాడన్న మాట నిశ్చయము.

ఈ సన్యాసి రూపములోనున్న వ్యక్తి పుత్రశోకాన్ని వెల్లడించ గలిగినట్లయితే అతడు తెరవెమకను పొరపాటు జీవితము గడుపుచున్నాడన్న మాట నిశ్చయము.

ఈ సన్యాసి రూపములోనున్న వ్యక్తి పుత్రశోకాన్ని వెల్లడించ గలిగినట్లయతే చీకటిలో నాతడు సంతానమును కన్నాడని నిశ్చయముగ చెప్పవలసియున్నది. అలాకానిచో నొక సంసారి వలన తెలుసుకొని హావ, భావములలో ప్రకటించు చున్నాడని తెలియ నగును.

పై చెప్పబడిన సన్యాసులు, బాబాలు, స్వాములు తీర్థస్వాములు తాము బ్రహ్మచారులమని చెప్పుకొనుట లోకవిదితమే కాని వారా బ్రహ్మచారి పదమునకు అనర్హులు.

అస్థలిత బ్రహ్మచారి శ్రీకృష్ణుడే అతనికే ఆ నామము సార్థకము. అవిధమైన జీవితమును యే మానవుడైతే గడుపగలడో అతనే

యోగి, అతనే గృహస్థు, ఆతనే బ్రహ్మచారి, ఆతనిని జారుని రూప ములో చిత్రించిన దుర్మార్గ చరిత్రకారులు నశించెదరుగాక.

అటువంటి శ్రీ కృష్ణభగవానుని అంశ వీరియందు యేమున్నదో అతని జీవిత విధానము వారిచే యేవిధముగా అనుసరించ బడుచు న్నదో, పాఠకులు గ్రహించి వీరికి భగవద్గీతయను విషయము యెంత వరకు తెలియబడి యున్నదోయని విమర్శనలోబెట్టి చూచిన వారా భగవద్గీతను తాకుటకైన అర్హులుకారు. కుహనాయోగులని తేల్చు కొనగలరు.

ఇట్టి యనుభవములేని జ్ఞాన శూన్యులైన ప్రకృతి అనుభవము లేని సన్యాసులను వెంటాడు అమాయక ప్రజ భ్రాంతులు మూఢులు.

మహమ్మదీయుల విషయములో శ్రీ మహమ్మదు ప్రవక్త జీవితమును ఆయన నిర్వచనములను అనుసరించువారే మహమ్మదీయ తాపసులు.

ఇంతయేల! బాధ్యతాయుత సంసార విధులను పాటించుచు వాటినుండి వైదొలగి సృష్టియంతటికిని వేరై తానుగా చూచువాడే యోగి, అతనే విశ్వరూపి అటువంటివాడే భగవద్గీత, శ్రీ మహమ్మద్ వారి సూక్తములు తననోట వచించుటకు అర్హుడు.

తత్వము చెప్పిన మహనీయుడు ప్రతివాడు సృష్టిలో నొక మానవుడుగానుండి సంసారవిధులను నిర్వర్తించినవాడే.

పై విషయంగా సంసారిగయున్న వ్యక్తికి భిన్నమైన సన్యాసి యనుపించి వానికి కామోద్రేకమున కలుగు శక్తిని నిర్మూలింప సమకట్టిన నది స్ఖలన రూపంలో చేరి ఆతనికి శోభివ్యాధి అంకురించి నాశనమునకు దారితీయునను ఆరోగ్య శాస్త్రము సుస్పష్టము. అటు

వంటి వ్యాధి లేకుండ కాలము గడుపుచున్నారన్న సన్యాసులు తెర వెనుక పాపముచేయుచున్న సంగతి నిజము.

అగ్నిసాక్షిగ వచ్చిన స్త్రీయందు కామవికారమును స్థాయి చేయడముతప్ప మరి యే విధముగను అరికట్ట జాలరు.

శ్మశానమున గూర్చుని చితాభస్మము రాసుకొని తపస్సు చేసుకొనుచున్న శుభప్రదమైన శివమహాశక్తి వైష్ణవాకారమైన విష్ణువు మోహినీరూపముదాల్చి అమృతము పంచునాడు శ్మశానవాసి యయిన సన్యాస రూపియైన మోహరూపమైన మన్మధుని మాడ్చి అరూపిగాచేసిన కామరహితుడయిన శివుడు కామరూపిగా మారి ఆ మోహినీరూపమును సంభోగించవలెనన్న కోరిక జనించి తరిమిన విష యము పైన పేర్కొనిన బ్రహ్మచారులమని చెప్పుకొనుచున్న సన్యా సులు, ఆనందస్వాములు, తీర్థులు, తీర్థస్వాములు, బాబాలు మరువ కుందురుగాక.

ఈ పై సన్యాసి రూపులు గురువులుగా పేర్కొనబడి శిష్యులకు యింద్రియాతీతమైన యోగ విషయములు యింద్రియానుభవములేని సన్యాసులు యే విధముగా ఈశ్వర విషయం బోధించి ఒప్పించ గలుగుచున్నారో వారిని చేరిన సంసార బాధ్యులైన శిష్యులు విమ ర్శించిన తేలగలదు.

సన్యాసులు, బాబాలు మొదలుగాగల మహాత్ములు యోగ రూపములో ఈశ్వరుడై పోయిన తరువాత వారికి సుఖదుఃఖాలు శోకానందములు యెందుకుంటాయి అట్టివారికి యీ సంసారమేమిటి అని ప్రశ్నలు రావచ్చును.

ఈశ్వర సంభూతమైన తేజస్సుగా మారాలియన్నప్పుడు భౌతిక శరీరధారియైన మానవునికి అనుభవరూపములో ప్రతి విషయమును

విమర్శనగా దాని పరిణామము తేల్చుకొనిన తరువాతనే తాను విశ్వ రూపంగా నున్నాడు. అది తెలుసుకోవాలన్నప్పుడు శ్రీ కృష్ణ భగవానుని యొక్కయు, శ్రీ మహమ్మద్ ప్రవక్త యొక్కయు పవిత్రమైన జీవితములను ఉపమానముగ తనముంగర బెట్టి తన జీవితము వారితో సరిపోలు విధానముగ ఆధ్యాత్మికంగా గడిపినప్పుడు అందు కృతార్థత వచ్చినప్పుడే యోగరూపిగయున్న విశ్వరూపి.

శ్రీ మహమ్మదు ప్రవక్త మామూలు సంసార జీవితము గడపుచు చక్రవర్తులనైన లెక్కచేయలేదు. శ్రీకృష్ణుడు చక్రవర్తియై కూడా కుచేలునిలాంటి బీదవానిని అర్ఘ్యపాద్యములిచ్చి తనతో సమానముగా గౌరవించెను. ఏసుక్రీస్తు తనను శిలువ నెక్కించుటకు పాల్పడిన శిష్యుని శపించలేదు. వారి విధానములు తత్వవేత్తకు దక్క యితర మానవునకు సాధ్యముకాదు.

శిల రూపంలో ఎవరైతే అరిషడ్వర్గాలను స్థాయిరూపంలో పెట్టి చేయు సాధనలో ఆశక్తి ఆత్మ కావహించి పరిణామము తీసికొని రాగలుగుతుందిగాని బూటకంగాయున్న యోగిరూపంలో ఉన్నంత మాత్రాన చంచలరూపంగాయున్న మనస్సు స్థిర నిలకడకు రాదు. కాబట్టి అతడు ఉచ్చరించు మంత్రముయొక్క శక్తి ఆత్మకు ఆవహించదు. కాబట్టి ఈశ్వర పరిణామము రానేరాదు. యోగి రూపముగా వేషము వేసినంత మాత్రముచేత ఆతని ఆత్మకు ఈశ్వరత్వము రాదు. అతడు యోగికాడు. అతడు ఈశ్వరత్వము గలిగిన యోగి అనుట భ్రాంతి. ఈ నిజవిషయం సాధకుడు తాను ప్రశ్నించుకొంటే దాని పర్యవసానము నిజమని తేలగలదు.

# కాలము

కాలముయొక్క విషయము విమర్శించినప్పుడు సాంఖ్యరూపములో సూర్యోదయము నుండి తిరుగ సూర్యోదయము వరకు ఒక దినమని, యీ దినమందు 24 గంటలని, గంటకు 60 నిముషములని· నిముషమునకు 60 లిప్తలని విభజించి ఇటువంటి దినములు 365 కలిగిననొక సంవత్సరమని నటువంటి సంవత్సరములు కలిగిన కాలము 195 కోట్ల కొన్ని లక్షలని చరిత్రకారులు నిరూపించియున్నారు.

ఈ కాలమున యుగములు, యుగాంతరాలు, పదకొండు రుద్రులు 12 సూర్యులు, 9 బ్రహ్మలు ఇంద్రాదులతో కూడిన స్వర్గాధిపతులు యిప్పటికే సమసిపోయినట్లు చెప్పబడినది.

పైన పేర్కొనబడిన కాలంలో యీ సృష్టి అనేక విధములైన మార్పులు చెందినందున చారిత్రిక రసాయినిక ఆధ్యాత్మిక శాస్త్రములు వెలసినవి.

రసాయిన శాస్త్రము యీ భూగోళాని కన్యంగాయున్న అంగారక, శుక్ర, చంద్రగోళములందు ప్రవేశింప ప్రయత్నించుచున్న యీ కాలమును మన దృష్టియందుపెట్టి విమర్శింప గలిగిననాడు మన దృష్టికి గోచరించుచున్న పంచ భూతాత్మకంగా యున్న యీ సృష్టి యొక్క ప్రాతిపదికము కాలముపై మోసియున్నది.

కాలమన్నప్పుడు పై జెప్పిన సాంఖ్యవిధానములో నిరూపింపబడిన కాలము వాఙ్మయమందు నిరూపింపబడిన విషయము కాలము కాదు.

కాలమనునది అభౌతికమహాశక్తి, దీనిని కాలవాదులు ఈశ్వరునితో పోల్చిన విషయము పురస్కరించుకొని విమర్శించిన లిప్తకాలమునకు ముందు జరుగు విషయము తెలియక దాని పరిణామము ఊహించ

లేని మార్పులలో గోచరించుచున్నది. కాలములో నొక లిప్త కాలము ముందు జరిగే విషయము మానవునకు తెలియదు. అది కాలము నకు తెలియును. కాబట్టి కాలవాదులు కాలాన్నే ఈశ్వరుడన్నారు.

ఈ కాలము యీ సృష్టికి ఆదిని యేర్పడిన శూన్యమునకు అంత్యము ఇది సృష్టికి ఈశ్వరునికి మధ్య మహాశక్తివంతమై నిలచి యున్నది.

విమర్శనా సృష్టిలో యిదియొక అభౌతికశక్తి నుండి విడిపోయి నట్లు ఉపనిషద్వాక్యములు నిరూపింప జేయుచున్నవి. "తత్ సృష్ట్వా దదేవాను ప్రావిసతు" అనే శృతిరూపంలో "తత్ సృష్ట్యా" యేదో అభౌతికమైన మహాశక్తి వలన సృష్టింపబడినదని కాలముకంటె మించిన శక్తి యింకొకటి కలదని తెల్లమగుచున్నది "తదేవాను ప్రావిసతు" యేదైతే యీ సృష్టిని సృష్టించినదో దానిలోనే ఆ శక్తి ప్రవేశించినదని నిశ్చయమగుచున్నది.

దీనినే "ఆ విరాట్టు నుండి ఆనాడు తెగిపోయి
ఆవిర్భవించి మర్త్యాకార మందగ" అని తత్వవేత్త

యొక్క వాక్కు. పై విషయాన్ని విమర్శించగా రసస్వరూప సన్నిభ మైన తేజస్సునుండి విడిపోయి సృష్టిగామారి యేదైతే తెగినదో అది మానవ రూపముగ రూపించినదని తెలియబడుచున్నది.

ఈ తెగిపోయిన సృష్టిని విమర్శించిన పంచ భూతాత్మకంగా తెలియబడుచున్నది. అందు ప్రవేశించిన శక్తి ఆత్మగా యున్నదని అప్పుడే పంచభూతాత్మకమైన సృష్టియని పిలువబడుచున్నది. ఈ పంచ భూతములు అణుసముదాయము ప్రతి ప్రత్యగ భిన్నమైన అణువు నందుగల శక్తి తేజోరూపమైన

"అణో రణీయాన్ మహతో మహీయాన్
యేషోణురాత్మ"

ప్రతి ప్రత్యగ భిన్నమైన సూక్ష్మాతి సూక్ష్మమైన అణువునందు నిష్కళంకమైన రస స్వరూప సంభూతమైన తేజస్సుయొక్క కిరణ పుంజము ప్రవేశింపబడి ఆత్మగా పరిగణింప బడుచున్నది. ఇటువంటి సృష్టి తెగినక్షణమే కాలము.

ఈశ్వర తేజస్సునకును కాలమను సృష్టికిని మధ్య యేర్పడిన ఖాళీ శూన్యరూపమున నొకదాని కింకొకటి వేరు చేయబడినది. ఆనాటి నుండి యీనాటివరకు సాంఖ్యరూపంలో 195 కోట్ల సంవత్సరములని చెప్పబడుచున్నది. యిందు ప్రత్యగ భిన్నమైన అణువును దృష్టి యందు పెట్టి సూక్ష్మాతి సూక్ష్మంగా చూచిన ప్రతి యణువందును మానవరూపమే కనబడుచున్నది.

ఈ మానవాకారముయొక్క అణు సముదాయమును తన విమర్శ నలో పెట్టి యీ పంచభూతాత్మకమైన సృష్టిని విమర్శించి దాని యొక్క రూపము నిరూపణ చేసినప్పుడు మానవ రూపంగ మారి తీరును. ఈ విషయాన్ని పురస్కరించుకొని ఊహలు సృష్టి ఆవలకు పోనిచ్చిన ఆ విరాట్టునుండి తెగిని పదార్థరూపము మానవాకారము. ఈ మానవాకారము కాలమహాశక్తితో సృష్టియై భిన్నా భిన్నమైన అణువులుగా మారి ప్రతి యణువందుగల శక్తి స్వరూపము ఈశ్వర సంభూతమైన శక్తిగల ఆత్మ జీవరూపమున పదార్థరూపములో దేహ ధారియై 84 లక్షల జీవరాసులుగ మారినది.

ఓషధీరూపమున గడ్డి మొదలు ఈశ్వర తేజస్సును వ్యక్తం చేసుకోగలిగే మానవరూపంగా వచ్చినప్పుడు వొకజన్మనుండి మరి యొక జన్మకు మధ్యనున్నది కాలము. ఈ మానవజన్మయే ఈశ్వర విష యాన్ని వ్యక్తము చేసుకొనుటకు అంత్య జన్మయని యీ జన్మ పొంది తన జన్మస్థానమైన విరాట్‌స్థానమును బడయుటకై యేకాగ్రతతో జన్మజన్మాంతర రహితము చేసుకొని మానవజన్మ కలిగినప్పుడు అందు

తనకు కలిగిన బాధాకరమైన కష్టములందు స్వామీ! నాకీ జన్మ మెందుకిచ్చావు అని అరుచుచున్నాడు.

ఈ మానవరూపమునకు మించిన మానవరూపము యింకొకటి లేనికారణమున యిది త్రిమూర్త్యాత్మకమైన బ్రహ్మ, విష్ణువు, మహేశ్వ రులన్నుకూడా చిత్రకారుడు మానవాకారములో చిత్రించి యుండుట చేత వాటికి మించినటువంటి మహాశక్తి కలదని అది నామరూపరహిత మైనదని తెలియబడుచున్న కారణమున మానవాకారముగ నున్న ఈ జన్మను నామరూపరహితమైన రసస్వరూపమైన స్థానము కోరుటలో యిటువంటి జన్మనుకూడా రహితముచేసి తన జన్మస్థానమును చేరుటకై ఆశ వ్యక్తముచేయుచున్నది.

ఈ చోటుకే "సహజమాకర్షకముగాదె జన్మభూమి"
అన్నాడు తత్వవేత్త. ఈ వాక్కే శ్రీకృష్ణభగవానుడు

శ్లో॥ అవ్యక్తాదీని భూతాని
వ్యక్త మధ్యాని భారతా
అవ్యక్త నిధినాన్యేవ
తత్రకా పరిదేవనా ! భగవద్గీత.

"ఓ అర్జునా! ఇప్పుడు నీక్కు కలిగిన మానవజన్మలో ఈశ్వర విష యాన్ని తెలుసుకొనుటకే వచ్చినది. ఈ జన్మలో ఈశ్వర విషయమును తెలుసుకొని జన్మరహితము చేసుకొనుటకై యున్నది. అది అవ్యక్త రూపములో అనగా జడజన్మల రూపములో 84 లక్షల జన్మలు యెత్తి యున్న సంగతి తెలుసుకొన్న వ్యక్త రూపాన మానవునిగా నీవు తరించు మార్గమున పయనించి సార్థకుడవై జన్మరహితము చేసుకొనలేకపోయిన తిరుగ చీకటి రూపము భ్రాంతి స్థానమైన అజ్ఞాన రూపమై జడజన్మలకు పోగలవని" చెప్పినాడు.

ఇంతటి విధానముగయున్న ఈ సృష్టి కాలమను మహాశక్తికి లొంగియున్నది. అది గమనించి తెలుసుకొనుట చాలా కష్టతరమైన సంగతి.

ఈ కాలమను మహాశక్తిని విమర్శించిన ఈ పంచ భూతాలకంటే మీరియున్న శూన్యముకంటె మీరిపోయి భువన బ్రహ్మాండములను తన అధీనమున బెట్టుకొని శాసించగల శక్తివంతమై యున్నది.

ఇది తేజస్వరూపమైన రస స్వరూపమునకు లోబడి యున్నది. యిది భౌతికాభౌతికముగా యున్నది. ఇది సూక్ష్మాతి సూక్ష్మమంగా యున్నది. దీనిని మానవుడు ఆ ప్రపత్తిలో గ్రహించలేని కారణమున స్థూలంగాయున్నట్లు యోచించి దానిని తేలికగా జారవిడుచుచున్నాడు. దీనిని జాలమనే రూపంలో ఉపేక్షించి మరపులో పడిపోవుచున్నాడు. దీనిని విమర్శించి జారిపోయిన ప్రతిక్షణము తిరిగి ముందుకు రాదనే తెలివి మానవునకు కలిగినప్పుడు దీనియొక్క విలువ తెలిసికోగలడు.

ఈ చోటనే

ఉ॥ "కాలము పోవుచున్న దొడికంబున బట్టగలేము మీరురా
రేల నిజార్థముల్ చదువరేల" అన్నాడు తత్వవేత్త.

ఈ కాలము విమర్శనకు వచ్చినప్పుడు దానినొక రూపములేని కారణమున శూన్యమువలె గోచరించుచున్నది. కాని ఇది మాత్రము శూన్యము కాదు.

నీకు ఈ కాలమను దానిని తెలియగోరితివేని విరాడ్రూపము నుండి విడిపోయి మానవాకారముగాయున్న ఈ జగత్తు తిరుగ తన జన్మస్థలము పొందవలెననే వూహలో వ్యక్తమగుచున్న మానవ జన్మ యందు ఆ వూహ కల్పించినది కాలము.

అట్టి విధానములో ప్రయాణముచేయు మానవ జన్మను జడునిగా మార్చి కష్టనష్టములను కల్పించి తన జన్మరహితమను వూహను మరపింప జేయునది కాలము. కష్టములలో జన్మరహితము కోరి స్వామీ! యని యార్చి అర్చిన తరువాత ఆ కష్టములనుండి తొలగి స్థిమితము యేర్పడినప్పుడు తాను కష్టమందు అర్చిన సహకారుని మరపించి పెడ దారికి నడపినది కాలము. సహన రూపమున బలీయమైన కష్ట నిష్టుర ములను దాటి తొలగించుకొని తన సహజ జన్మస్థానము అయిన విరా డ్రూపమునకు పయనింప జేయునది కాలము. సద్గురువుని ఆశ్రయింప జేసి గురువంతటి వానిగ మార్చి "అహం బ్రహ్మాస్మి" అనిపించినది యీ కాలము. అటువంటి పరిణామము కలిగింపజేసి గుణరహితమైన సత్తుగానున్న వ్యక్తిరూపములోనున్న వానిని గురువుగా గుర్తింపజేసి నదీ కాలము. ఆ గురువు ప్రబోధరూపములో తాను పయనించు దారులలో అడ్డు తగులుచు అనేక ఆశాబద్ధములైన రూపములు కల్పించి ఆ ప్రయాణమున అంతరాయము కల్పించినదీ కాలము.

ఇటువంటి బలీయమైన కాలమును తెలుసుకొనవలెనన్న నీకు భ్రాంతియందు కలుగు మార్పులను గమనించిన తెలుసుకొనగలవు. ఇంతటి బలీయమైన కాలముకూడా తెగిననాడు కలిగిన శూన్యమును మాయింప జేసుకొని తాను ఈశ్వర రూపంగా మారి కాలమును శబ్ద మును సమయింప జేసుకొని ముక్తి పొందాలని కాంక్షించుచున్నదికూడా యీ కాలమే. ఇచ్చోటనే.

"యేదో కాలము వైణికాకృతిని నది యెవ్వానినో పాడు" అన్నాడు తత్వవేత్త. దాన్ని అతిక్రమించి యెవడైతే దాటింపగలడో అతడు కాలమహాశక్తిని తెలుసుకొన్న వ్యక్తి, అతడే సద్గురువు. ఆతన్ని ఆశ్రయించి గురువంతటి వానిగా మారినవాడే శిష్యుడు.



# భక్తి

ప్రతి మానవుడు యేదో రూపంలో భక్తిని పాటించక తప్పదు. ఎంత విద్యావంతుడైనా తనకు విద్యగరపిన విద్యా గురుని మ్రోల భక్తితో కేల్మోడ్చి శరీరము వంచి నమస్కరించి తీరవలెను. ఎంత ధనవంతుడైనా ఆ సిరి పోకుండా వృద్ధి యగుటకు ధనాధి దేవత లక్ష్మిని భక్తితో ఆరాధించక తప్పదు. ఎంతటి వుద్యోగియైనా తనపై అధికారికి భక్తి సూచకమైన విధానమున నమస్కరించక మానలేడు. వ్యవసాయదారుడు వ్యవసాయఫలము యింటికి జేరువరకు తన అంతర్యమందు భక్తిని పురస్కరించుకొని తన యిష్టదైవమును ప్రార్థించుచు కాలమును నిరీక్షింపవలసియున్నది. ఎంతటి కళాకారుడైనా తన కళ ప్రకృతిలో పొగడబడు వరకు ఆ కళయందు భక్తి చూపించవలసి యున్నది. ఎంతటి కవిసామ్రాట్ అయినా విద్యాధిదేవత సరస్వతిని భక్తితో కొలువవలసియున్నది. ఎంతటి దుర్మార్గుడైనా యెంతటి సజ్జనుడైనా, యెంతటి బలవంతుడైనా, యెంతటి బలహీనుడైనా తన కెట్టి యిక్కట్టులు కలుగకుండునట్లు తన అంతర్యమున భక్తినే ఆశ్రయించివలసి యున్నది. ఆరోగ్యవంతుడు తన కనారోగ్యము కలుగకుండునట్లు అనారోగి తన అనారోగ్యము తొలగిపోవునట్లు చేయగల అభౌతిక శక్తియందు భక్తినే ఆశ్రయించును. కాని యీ పై చెప్పబడినవారు తమ తమ స్వార్థములందే భక్తిని జ్ఞప్తికి తెచ్చుకొనుచున్నారు. ఇది తాత్కాలికమైన భక్తి. యీ భక్తి అనుదానికి అర్థము తెలిసి విమర్శించిన ఆ విమర్శ తన జన్మ యే విధముగా కలిగిన దోయను పరిశ్నకు రాక మానదు. ఇది తలి దండ్రులయొక్క సంతాన రూపంలో వచ్చినట్లు తెలుసుకొనుచున్నారు. ఇంతటి ఉత్కృష్టమై నటువంటి జన్మ మానవునిగా తల్లిదండ్రులనే వారి సంతానమున

వచ్చిన విధానములో ఆత్మ పొందిన యీ మానవ వ్యక్తిత్వం పురస్కరించుకొని నలువైపులా చూడ్కులు నిగిడించి తన చూపులకు కనబడు ప్రతి వస్తువు మానవుని తెలివియొక్క వికాశమునకు భక్తి పురస్కరంగా లొంగిపోవుట తెలుసుకొని అందులో యీ జన్మ కలుగుటకు కారణమైన తల్లి తండ్రులయందు చూపవలసిన భక్తి మొట్ట మొదటగా నేర్చి తెలిసికొన వలసి యున్నది. అది తన తల్లి తండ్రుల యందు చూపు భక్తి రూపమైన విశ్వాసము ప్రేమా వారికిగల అవసరము లను తీర్చుటయందు తాను పడు శ్రమ నమ్రత చూచి ఆ తల్లితండ్రులు తమ సంతానముయొక్క అభివృద్ధికి ఆశీర్వదించెదరు. ఆ ఆశీర్వాదము ఆలకించిన తాను చూపించిన నమ్రత భక్తియొక్క స్వరూపము. ఇది భక్తికి పునాది.

వివాహితుడై అగ్నిసాక్షిగా స్వీకరించిన స్త్రీని భార్య అను నిశ్చయము పురస్కరించుకొని ఆమెయందు అపారమైన శాంతియుతమైన ఆదరణ ఆ స్త్రీ వ్యక్తిత్వముయొక్క హృదయమును భర్తయందు భక్తి రూపమైన నవనీతముగా మార్చగలదు. ఆ భార్యగాయున్న వ్యక్తి తన భర్తయందు అమూల్యమైన విశ్వాసము ఆదరణ నమ్రత తన సర్వావయవ స్వాధీనత భక్తితో సమర్పించి అంజలి ఘటించి ఆరాధ్య దైవంగా భర్తను పూజించునది భక్తి.

తనకు కలిగిన సంతానమునందు హెచ్చుతగ్గులులేని ఆధిక్యత, అనాధిక్యత రానీయకుండా తన సంతానము స్త్రీలైనా పురుషులైనా సమాన దృష్టితో సమానమైన ప్రేమతో సమాన ఆదరణతో వారిని లాలించి వారి పురోభివృద్ధికి పాల్పడుచు వారిని సత్సంకల్పులుగ మార్చిన, అట్టి తల్లి తండ్రులయందు ఆ సంతానము చూపు నమ్రత భక్తి.

తన సేవకునియందు యజమానిచూపు ఆదరణకు దయకు పాత్రుడై స్వామి కార్యమందు (తన యజమాని కార్యమందు) నిమగ్నుడై తన స్వామికి తోడ్పడుటయందు చూపించు దీనత భక్తి.

వీటికి అతీతమైనదిన్ని మానవ వ్యక్తిత్వమందు ధ్వనించు జన్మరహితమనే ధ్వనికి భక్తియే ప్రాధాన్యమని తెలిసికొని ఆచరించు విధానమునకు ఆధ్యాత్మికమని, దానిని ప్రయత్నించి బడయుట మానవునికి అత్యుత్తమమైన పరమావధికి భక్తియే మూలము.

ఈ భక్తి రూపములో ఈశ్వర సందర్శనము బడయుటకు ప్రయత్నించుచున్నాడు. ఆదికాలములో భిన్నభిన్నములుగా మార్పు చెంది కులాలుగ, మతాలుగ మారి వారివారి కులమత విధులనుబట్టి కర్మలు ఆచరించుతూ అందుచూపు నమ్రత భక్తి యనుచున్నారు. దీనిని పురస్కరించుకొని సాయుజ్యము బడయవచ్చు ననుచున్నారు.

ఇది భిన్నభిన్న విధానములలో యీ భక్తి ఆచరణలో నున్న విషయం మానవ గమనములో పూజా రూపములో గోచరించు చున్నది. ఒకానొకడు చెట్లను, రాళ్ళను, విగ్రహాలను యింకా తనకు దైవమనుతోచు ప్రకృతి నిబద్ధమైన పదార్థములను పూజించు పూజలలో తన భక్తి చూపించుచున్నాడు.

ఒకడు ఆలయమునకుపోయి విగ్రహముగాయున్న మూర్తిని జూచి భక్తిగా పూజించుచున్నాడు. యింకొకడు విగ్రహములేని ప్రార్థనా గృహముగ కట్టిన మశీదునందు చేయు ప్రార్థనయందు చూపు యేకాగ్రత భక్తి అనుచున్నాడు. ఇంకొకడు క్రైస్తవాలయమున ఈశ్వర విషయంగా యేసుక్రీస్తుని ప్రోల మొరపెట్టు విధానములో భక్తి చూపించుచున్నాడు. ఇది మత సంబంధమయిన భక్తిని పురస్కరించుకొని పూజలుగా ప్రజ ఆచరించుచున్నది.

ఒకడు భక్తి పరవశుడై గానముచేసి ఆ గానములో లీనమగుట భక్తి యనుచున్నాడు. ఇంకొకడు యేకాంతముగ కూర్చుండి తాళము చేతగొని నామస్మరణ చేయుచు భక్తి యనుచున్నాడు. మరియొకడు తాళములు వాయించి పాడి పరవశుడై పోయినరీతి భక్తి యనుచున్నాడు. ఇది లోకములో భక్తియను స్వరూపములుగా నున్నవన్న సంగతి ప్రతి వారికి తెలిసిన విషయమే.

పైని ఆచరించు భక్తి, భక్తి స్వరూపములు సాయుజ్యము నీ జాలవు, భక్తియను పదమునకు అర్థము తెలుసుకొని సాయుజ్యము పొందే పరిణామివై వెలయగలనను ధైర్యము నీకున్నయెడల నది తెలుసుకొనుట మానవునకు దుస్సాధ్యము. అది తెలుసుకొనగోరు వ్యక్తి ఆత్మయొక్క అభౌతికమైన పరిణామము తెలుసుకొనవలసి యున్నది. అది తెలుసుకొనుట తనంతట తనకు సాధ్యం గాలేదు. దానిని తెలుసుకొనుటకు గుణరహితమైన ఆత్మపరిణామము తెలిసికొన్న వ్యక్తి గురువుగా నీకు లభించి నీ విమర్శలో నిశ్చయమైన అట్టివానిని ఆశ్రయించే ముందు గురువుగా రూపొందిన వ్యక్తిత్వమును భక్తితో కూడిన విమర్శనలో పెట్టితివేని ఆ గురువుగానున్న వ్యక్తిత్వ మందలి ఆత్మ నీ యాత్మను నవనీతముగా మార్చు సద్గుణియై యుండును. అతనిని నీవు ఆశ్రయించినప్పుడు నీవు చూపించు భక్తి కళంక రహిత మైనదని తెలిసికొని నిన్ను తనచోట ఆశ్రయమిచ్చును.

అట్టి గురువు నీకు లభ్యమైనప్పుడు అతనియందు నీవుచూపు విశ్వాసము అనిర్వచనీయమైనదని అతనికి తెలిసినప్పుడు అతడు తన అభౌతిక మైనశక్తి నీ యందు ఆహూయమానమైన దృష్టిని నిలిపి నిన్ను ప్రబోధ రూపమున మంత్రము ప్రబోధము చేయును, ఆ సమయమందే నీ వ్యక్తిత్వము నవనీతమయి నీ నాడులు నమ్రతచే కృంగి నీ గురువు

నందు అపారమయిన విశ్వాసము కలుగచేయును. నిన్ను నిజమయిన భక్తునిగ మార్చును.

ఆ ప్రబోధింపబడిన ధ్వని సాధనా రూపంలో పెట్టి గురువాజ్ఞ ప్రకారము నీవు ఆచరణలో పెట్టితివేని నీకు భౌతికమైన శరీర విధానానికి అన్యంగా నీ ఆత్మ గ్రహించు విషయము దృశ్యములుగ కనబడును. సద్గురువు ఆశీర్వాదమున నీ అనుభవములో భక్తి రూపమును నీవు చూడగలవు.

కొంత కాలమునకు నీవు నీ గురువునందు నీవు సాయుజ్యము పొందే విషయంలో చూపించే భక్తిని నిర్మూలింప జేయుటకు భ్రాంతి యనే మహాశక్తి నీ సాధనా దారికి అడ్డు తగిలి నీ దృష్టి భౌతికంగా అభౌతికంగా నీ దృష్టికి ఆకర్షణీయమైన రూపములలో కామ వికార చేష్టలను చూపించి నిన్ను తన బలీయమైన శక్తితో గురునాజ్ఞగ ఆధ్యాత్మికంగా చేయు ప్రయాణము నుండి మరలింపజేసి దుష్టచేష్టలకు లోనగునట్లు చేయును. అట్టి సమయమందు సాధకుడు తికమకలుపడి భ్రాంతికి లొంగిపోవు సమయమందు సర్వజ్ఞుడైన నీ గురువు ఆ దుష్ట ఊహలతో కూడిన దుష్టశక్తులనుండి దాటింప జూచును. అపుడు నిన్ను ఆకర్షించి నిన్ను జడ జన్మలకు తీసుకొనిపోవు బలీయమైన భ్రాంతిశక్తి రూపింపజేయు దుష్టశక్తులనుండి తప్పించి సాయుజ్యమున నున్న ప్రయాణపు బాటలో తీసుకొని పోవుచున్న గురువునకు నిన్ను ఆకర్షణ రూపములవైపు త్రిప్పి నీవు సాయుజ్యుడవు కాకుండా చేయు భ్రాంతిశక్తికి మధ్య నీవు నిలచే కాలము వచ్చును. అది సాధకునకు అగ్ని పరీక్ష.

రెండు బలీయమైన శక్తుల నడుమ నిలచిన నీవు గురువైపు చూపించు విశ్వాసము భక్తిని పురస్కరించుకొని నీ గురువు నీకు

భ్రాంతియొక్క యదార్థరూపము అది రూపింపజేయు ఆకర్షణీయమైన కామ రూపములను అది చేయించు దుష్టచర్యలను నీకు అవగాహన యగునట్లు చేసి వాటి బారినుండి రక్షించి నిన్ను నిమ్న లోకాలకు జారిపోకుండా నిలిపిన స్థితిలో నీవు చూపు భ్రాంతిజన్యమైన వుద్రేకము నకు సహించి తాను భక్త స్వరూపునిగ నీకు సాక్షాత్కరించి నిన్ను కృతార్థునిగ చేయగలిగే శక్తివంతుడు సమర్థుడునై యున్నవాడు నీ గురువు.

నీవు యీ దారిని ప్రయాణము చేయునప్పుడు నీ యనుభవ ములో నీ దృశ్యములో భ్రాంతి కాల మహాశక్తులు అడ్డుతగిలి నిన్ను తిరోగమింపజేసే ఘట్టములలో వచ్చు బాధల కొర్చుకొని గురు సమర్థ తను నిర్ధారణచేసే విశ్వాసరూపమైన భక్తి నీ మనస్సు నుండి జారి పోనీక స్థిరపరచి నీ గురువునకై అర్పుము.

ఈ స్థితిలో నీ జీవితము తుఫానులోబడ్డ ఓడను బోలియుండును ఈ స్థితికి వచ్చినప్పుడు నీ యనుభవమునందు నీ భౌతికమైన దేహము భక్తిని కృంగి పోలి నవనీతమై పోవును. అదియే భక్తిలో నిమగ్నత.

అది తెలిసిన నీగురువు నిన్ను పరీక్షించబూని సూక్ష్మదేహియై దృశ్యరూపములో కొండశిఖరాన నిలచి నిన్ను పిలచును. కొండ శిఖరాన నున్న ని గురుని జాడ తెలుసుకొని పైకెగసి భక్తిపూర్ణుడై గురువు పాదములు స్పృశింప జూచును. నీ భక్తిని పరీక్షింపగోరి నీ గురువు పదాహతిని నిన్ను క్రిందకు త్రోయును. అలా త్రోసినను తిరిగి పైకెక్కి తన పాదములు నంటుటకు ప్రయత్నించుచున్న భక్తుని యొక్క భక్తిని పైకెక్క శక్తి లేకపోయినను నీయందుగల భక్తి ఆ గురుని పాదములు అంటుటయందు చూపు నీ ఓర్పు పరీక్షించి నీ గురువు నిన్ను సమీపించి లేవనెత్తి అలింగనము చేసుకొని నిన్ను అపు

రూపమైన సూక్ష్మ జగత్స్వరూపిగ మారు భక్తి స్వరూపునిగ మార్చి నీవు సాయుజ్యము పొందు విషయమునందు నీవు అనుభవజ్ఞుడవగునట్లు ఆశీర్వదించును.

ఇదియే శ్రీకృష్ణభగవానుడు తన భగవద్గీతలో "భక్తియే సాయుజ్యమునకు మూలమని" నిర్వచించినాడు.

అటువంటి భక్తునిగా నిన్ను మార్చి నీ గురువు నీ మూల సాక్షియై, అవ్యయమై, నిన్ను అవ్యంగామార్చి సర్వసాక్షియై నిన్ను తనలో చేర్చుకొని గురుశిష్య భేదరహితము నిరూపణ చేయును.

ఇది భక్తియొక్క పరిణామము. ఇదియే సాయుజ్యమును పొందగల సాధనము. దీనినే సోలిపోయిన భక్తియని, రాలిన భక్తి యని అందురు. అందుచే రాలిన భక్తి (నశించిన జడత్వము) తో నీ గురువును భజింపవలసిన విషయమునకే భక్త స్వరూపమని నిశ్చయము.

# త్యాగము



త్యాగమనునది నొక దివ్య మహాశక్తి. దీనిని ఆత్మ మానవ వ్యక్తిత్వం పొందిన రూపంలో తెలియబడు చున్నది. ఇది ప్రాపంచిక మానవ విధానంలో నొక యిచ్ఛను త్యజించడమందు చూపు ఆశక్తి త్యాగమనబడు చున్నది. కాని మానవుడు త్యాగి కాలేకపోవుచున్నాడు కారణము యిది భ్రాంతి ఈశ్వర మహాశక్తులమధ్యనున్న సంధి.

ఇది ఆధ్యాత్మికంగా యోగులని పిలువబడేవారు మాటి మాటికి త్యాగమును పురస్కరించుకొని తాముచేయు ప్రబోధములో యీ త్యాగమనే పేరొక్కనుచున్నారు. ఈ సృష్టియందు వాంఛనీయములైన ప్రతి విషయమందును త్యాగము చూపించవలయుననియు అట్టి త్యాగము యెవరు చూపించగలరో వారే ఈశ్వర విధానములో సాధనచేసి ముక్తిపొందుటకు అర్హులని చెప్పుచున్నారు. అది ప్రకృతి పరముగ తాను ప్రాపంచిక విషయంలో అనుసరించు ప్రతిదానియందు తాను విరక్తి పడి వాటిని విడిచివేయుటయే త్యాగమనుచున్నారు. అదియే నిజమైన విరాగత్వమను చున్నారు. దానికి వేషరూపంలో కాషాయ వస్త్రధారణ చిహ్నము సాధనముగా నిరూపించి విరాగియనిపించి ఆశారూపమైన ప్రతి విషయాన్ని త్యజించుట యన్నప్పుడు సంసార మనునది మహాసాగరమువంటిది. కాబట్టి దానిని యీదుట యందే జీవితకాలము సరిపోవుచున్నదని, కాన మానవుడు ఆ సంసారమును త్యజించక పోయినట్లయితే అతడు జ్ఞానిగ మారలేడని అతడు త్యాగిగమారే సావకాశము లేదని సంసార మన్నప్పుడు సతీ, సుత బంధు మిత్రాదులను తత్సంబంధ కార్యకలాపములను త్యజించవలెనని అనుచున్నారు. తరువాత అరిషడ్వర్గములనే కామ, క్రోధ, లోభ,

మోహ, మద. మాత్సర్యములనే మహాబలీయమైన శక్తులనబడు శత్రువులను సంహరించినగాని త్యాగి కాబోవడనుచున్నారు.

జిహ్వా రూపంలో షడ్రుచులను విడిచి శాకాహారిగ మారమని చెప్పుచున్నారు. తన కలవాట్లగ నున్నవాటిని అస్వభావముగ మార్చి నగాని త్యాగి కాడనుచున్నారు. తరువాత దేహ సౌష్టవమునకు సౌరభ్యమునకు త్యాగ రూపంలో అలంకారాది వస్త్రధారణమాని కాషాయ వస్త్రధారియై ప్రకృతి విషయం ప్రతిదానిని త్యజించుటయను నిశ్చయానికి వచ్చి దానికి చిహ్నముగ కాషాయాంబరధారణయే యుక్తమైన దని అటువంటి మానవునికే యీ ఈశ్వర విషయం గ్రహింపగల అర్హతగలదని అతడే త్యాగియని నాతనిని అనుసరించి నాతడు చేయు ప్రబోధములను ఆలకించి సాధన చేసిన ముక్తి కలుగునని చాటుచు ప్రజలను చీకటిని బెట్టుచున్నాడు.

అటువంటి పరిస్థితికి వచ్చిన వ్యక్తి తనలాగే అందరు సన్యాసులైననాడే ముక్తి పొందగలరని లేనిచో జన్మ జన్మాంతరములకు పోయి కొన్ని మానవజన్మలు యెత్తిన తరువాత యీ సన్యాస రూపమైన ప్రకృతిలో సర్వస్వము త్యాగముచేసిన సన్యాస రూపమునకు రాగలడని ఆ స్థితి యే మానవత్వమునకు గలుగు చున్నదో ఆ వ్యక్తి ముక్తి పొందగలుగు చున్నాడుగాన సంసారబంధమైన మానవ జన్మలు అనే క్రమము పొందకుండా యుండుటకు యీ విధమైన అంత్య జన్మగానున్న సన్యాసజన్మను పొంది కాషాయ వస్త్రధారణలో యిమిడి పోయిన సన్యాసిని ఆశ్రయించి నొకజన్మ తరువాత మరియొక జన్మ యెత్తకుండా ప్రకృతిని త్యజించవలసిన విషయానికి రావలసిన యున్నదని యే నాటికైనా మానవుడు సన్యాసిగనే ఈశ్వరుని తెలిసికొనగల్గుచున్నాడని ప్రబోధము చేయుచున్నారు.

ఈ విషయానికి రాగల్గుటకు ప్రకృతిని త్యాగరూపంలో నిర్జించ డమే ఉత్తమమైన సాధన యనుచున్నారు. అందుచేతనే పీఠాధి పతుల పేరిట సన్యాసియని పోల్చబడే కాషాయంబరములను ధరించి గురువులుగామారి ప్రబోధములు సల్పుచున్నారు.

ఈ వేషధారణయే త్యాగానికి చిహ్నమనుచున్నారు.

పైని చెప్పబడిన విషయము సన్యాసి వేషము శ్రీవిజ్ఞాన విద్యా పీఠంలో అవహేళనకు అపహాస్యమునకు పాల్పడుచున్నది. కారణ మేమన, పైన చెప్పబడిన కావిగుడ్డలు ధరించిన సన్యాస త్యాగికాడని స్వానుభవములో నీ పీఠము నిరూపించుటయే.

త్యాగమన్నప్పుడు ప్రకృతిరూపమైన భ్రాంతికిని రస స్వరూప సన్నిభమైన మహాకాంతికిని మధ్యనున్న బలిపీఠముపై తెగిపోయే ఆత్మస్వరూపమే సన్యాస సన్నిభమైన త్యాగరూపము.

అది స్వానుభవమునకు దక్క మాటలకును ప్రబోధములకును లొంగునదికాదు. ఊసులలో లేదు. భ్రాంతి ఈశ్వర మహాశక్తులమధ్య నున్న బలిపీఠంపై నిలబడిన మానవ వ్యక్తిత్వం పొందిన ఆత్మత్యాగ మననేమో తెలిసికొనదలంచినప్పుడు, ముందు తాను ప్రకృతిలో లీనమై అందరిలో తా నొకడుగ నిశ్చయించుకొని మొదట పంచభూతముల యొక్క గమనికను విమర్శనలోపెట్టి విమర్శించి ఒక భూతమునకు మరి యొక భూతమునకు గల తారతమ్యము త్యాగము తెలుసు కొనవలెను.

ఆకాశము తననుండి వెలువడేశక్తి ధ్వనిని తనలోనే యిముడ్చు కోకుండా త్యాగరూపములో యావత్సృష్టిని ధ్వనింప జేయుచున్నది. అగ్ని తాను యే ఆవరణము యేర్పరచుకోకుండా యావత్తు సృష్టిని ప్రజ్వలింప జేయుచున్నది. గాలి యే గుహాయందో డాగిపోక సృష్టి

సమస్తమందునను త్యాగరూపములో విస్తరించి యున్నది. నీరు తాను స్థంభించిపోకుండా సమస్త సృష్టిని తర్పణ చేయుచున్నది. భూమి తన నుండి వుద్భవించు ప్రతి విషయము సృష్టి యావత్తు వెదజల్లుచున్నది. ఇట్టి స్వార్థత్యాగమునుచేసిన పంచభూతములను తనలో చేర్చుకున్న మానవ వ్యక్తిత్వము తనకుతాను త్యాగిగ మారవలసిన సంగతికి రావలెను. ఈ విధముగ స్వార్థత్యాగ రూపములో నెగడుచున్న పంచ భూతముల మనుగడను చూచి తాను స్వార్థములేని త్యాగమును చూపవలసి యున్నది. దీనినే నిష్కామ కర్మయని చెప్ప నొప్పును. ఈ విధముగ ప్రతి కర్మయందును త్యాగము చూపగలిగినప్పుడు త్యాగి యైన నిష్కామకర్మయోగిగ పరిగణింపబడగలడు.

ఈ విషయము తెలుసుకొనిన మానవ వ్యక్తిత్వమునకు అతిక్రమించియున్న ప్రకృతి సిద్ధమైన తన సంసారమును చూచి యితరులు చెప్పే సాగరమను వాక్కును త్యజించే పంచభూతముల త్యాగమును ననుసరించి తనను ఆశ్రయించియున్న సంతతిని ఆలినిచూచి సంసారము సాగరము వంటిదని తలచక తనమీద మోసియున్న ప్రతిప్రాణిని పోషించుభారము బాధ్యత తనకు తప్పదని నిశ్చయించి వారిప్రాప్తము తనద్వారా వారికి లభ్యమయ్యే విషయంగా యున్నదని నిశ్చయించి వారికి లభ్యముగా వారి ప్రాప్తమును సమకూర్చే మరియొక మహాశక్తి తన కన్యంగానుండి అది తనద్వారా సంక్రమింప జేయుచున్నదని, ఆ శక్తి యెవరి ప్రాప్తానుసారము వారి వారికి లభ్యపరిచే విషయము ఆ మహాశక్తికే సాధ్యమని నిశ్చయించి తనవారికి తనద్వారా ప్రాప్తరూపమైన సహాయమును తనద్వారా సహాయము పొందుచున్న వారిని దెప్పని (యెత్తిపొడవని) పరిస్థితిలో తాను వారికి అన్యంగా యుండి తననుండి పొందిన సహాయమును పురస్కరించుకొని వారు పొందు ఆనందాతిశయములు తిలకించి తాను లోలోన సంతసించి

తృప్తిపడుటయే త్యాగము. ఇదియే వైరాగ్యము. ఇతనికే విరాగియని చెప్పవలెను.

ఈ సమయమందు నీకు జ్ఞాపకము వచ్చు ఈశ్వరుడు కూడా ఆశాబద్ధమైనదే కాబట్టి నటువంటి విషయంలోనున్న ఈశ్వరత్వాన్ని కూడా త్యజింపవలసియున్నది. ఈస్థితికి వచ్చినప్పుడు నీవు లోకాన్ని ప్రకృతిని నీ సంసారాన్ని నీ యాలు బిడ్డలను త్యాగరూపమున మురిపింపజేయగల్గు త్యాగివై నెగడగలవు. హర్షింప బడెదవు. ఈ స్థితికి వచ్చిన నీవు యెవరి విమర్శనలకు పాల్పడవు.

ఇదియే ఉపనిషత్తుగ చెప్పిన తామరాకునందలి నీటిబొట్టు ఉపమానము.

తామరాకు తాను నీటికి ఆకరమైయున్నను అందున్న నీరు ఆ తామరాకును అంటనట్లు (ఇంకనట్లు) యుండునో ఆవిధంగా మానవుడు ప్రకృతికి, సంసారమునకు అన్యంగా నుండి జగదాతీతుడై యేదైతే "సత్" అనిపిస్తుందో దానిని తెలిసికొనుటకు సాహసించగలడు. అప్పుడు ప్రకృతిలో లీనమై యున్నంతవరకు ఈశ్వరుడుగా నీవు ఆధారించిన శక్తి భ్రాంతియని తెలిసి త్యాగివై త్యజించగలవు. ఆ తరువాత యేది ఈశ్వర సంభూతమైన మహాశక్తి స్వరూపము రసస్వరూపముగా యున్నదని అది "నేను"గా నున్నదను విషయానికి రాగలవు. అది తన కన్యంగాయున్నదని నీ ఆత్మ ధ్వనించునప్పుడు దానిని కూడా విరాగరూపంలో త్యజించితివేని ఆ రస స్వరూపము నీ కన్యముగా లేదని అన్యముగా తనదన్న పదము త్యాగముచేసిన విషయములో పజ్రివ్వలించు నీ యాత్మయే విశ్వరూపాతీతమైన విరాడ్రూపమని తెలిసికొని శాశ్వితుడవయ్యెదవు.

ఈ స్థితిని ఆహూాయమానము చేసికొన్న వ్యక్తియే త్యాగి ఇది స్వానుభవములో తెలియపర్చ గల్గినవాడే విరాగియైన త్యాగరూపమైన సద్గురు స్వరూపము. త్యాగమన నిదియే.



# విశ్వాసము

ప్రపంచమందు విశ్వాసమనునది త్యాగరూపమైన ఆత్మ సమర్పణయనుదానికి పర్యాయపదముగ వాడబడుచున్నది. ఒకరియందు గల ఆప్యాయత అభిమానములతో కూడిన తోడ్పాటునకు, సహాయమునకు విశ్వాసమని చెప్పబడుచున్నది. ఈ విధమైన విశ్వాసముగల మానవునికి వొకానొకప్పుడు అవిశ్వాసము రావటానికి సావకాశము ఉన్నది. ఒకప్పుడు తానుపొందిన మేలు మరచి అవిశ్వాసియై ద్రోహమునకు పాల్పడి ద్రోహియని ఆ సహాయము పొందినవాడు ద్రోహియని పిలువబడుచున్నాడు.

ప్రపంచమందు యే జీవియందైనను విశ్వాసమనునది కేవలం తాత్కాలికమైనది తప్ప శాస్వితమైనదిగాదు. సాధారణంగా కుక్కకున్న విశ్వాసము యెవరికీ నుండదని ఆదర్శప్రాయమై ఉపమానంగా వాడుట మానవ నైజముగా నున్నది. అది విశ్వాసమైన జంతువని చెప్పడంలో అతిసయోక్తి లేదుగాని, తన యజమాని దానిని సరియైన పరిస్థితిలో అషారాది విషయమును కల్పించనినాడు తన యజమాని యందు దానికి అవిశ్వాసము కలుగక మానదు. అదియుగాక తన యజమానియిచ్చు ఆహారముకన్న మంచి రుచికల వేరొక పదార్థము దానికన్యుడు యింకొకడు కలుగజేసిన వానివెంట పోవుటగాని ఆతడు ఘాతకుడైన నాతనిని చూచి మొరిగి తన యజమానిని కాపాడుటగాని చేయకపోవుట గాని సహజగుణము.

కాబట్టి నొక జీవియందు యింకొక జీవికి విశ్వాసము తాత్కాలికమైనది తప్ప శాశ్వితమైనది కాదు. ప్రకృతి రూపంలో విశ్వాసమనునది పై విధమున రూపించు చున్నది.

విశ్వాసమనునది దాని యర్థము తెలుసుకొనగోరిన మానవుడు మాటలలో తేల్చి స్థిరపరచుకొనలేడు. అది అభౌతికమైన, నిగూఢమైన సత్యముయొక్క పరిణామమే విశ్వాసము. ఇది మాటలలో తెలియబడు నదికాదు. చేతలకు లొంగునదికాదు.

అభౌతికమైనదిన్ని, సూక్ష్మమైనదిన్ని అగోచరమైనదిగ నుంచి ఆత్మకు బలీయమైన శక్తిని ఆపాదింపజేసి త్యాగిగా మార్చి శరీరమును ఆహుతి చేయగల్గునట్లు సాహసము వుత్పన్నమై దాని పరిణాను మే బూదెగా మారునని తెలియబడినప్పటికి కూడా తాను దాని పరిణామము నందే లగ్నమై ఆచోట చూపు నిర్దిష్టమైన సంకల్ప సిద్ధికి విశ్వాసమని పేర్కొనవలసి యున్నది.

అట్టి విశ్వాసము కలుగవలెనన్న ఆత్మయే విశ్వాసరూపమైన పరిణామము పొందవలసి యున్నది. అటువంటి విషయము సృష్టియందు గల ప్రతిజీవి తన్ను చూచినప్పుడు విశ్వాసిగా మార్చగలిగే శక్తి వంతుడుగా తానున్నాడని యెవడు తెలుసుకొనగలుగు చున్నాడో ఆ రూపమే విశ్వాసము అతడు "తత్-త్వమ్" = అది నేను అని చెప్పగలడు. అతడే తత్త్వవేత్త.

తత్త్వముయొక్క రూపంగ మారినది విశ్వాసము. ఈ విషయ ముగా పరిణామము పొందిన తత్త్వవేత్త స్వయంభువు, స్వయంబ్రహ్మ ఇదే విశ్వాసముయొక్క రూపము.

# సగుణబ్రహ్మ - నిర్గుణబ్రహ్మ

ఆధ్యాత్మిక జ్ఞానమును ప్రబోధించువారు సగుణోపాసనయని నిర్గుణోపాసనయని రెండు విధములుగ మార్చి ప్రబోధించుచున్న సంగతి తెలిసినదే.

సగుణోపాసనయన్నప్పుడు విగ్రహ రూపమును తన ముంగట నిలిపి దానిని ఈశ్వర నామాంకితంగా స్తోత్రముచేసి ఆ విధానముగ వారి గురువులచే ప్రబోధింపబడిన మంత్రమును ఆ విగ్రహము మ్రోల ఆసన నియుక్తుడై యుండి నిమీలిత లోచనుడై దృష్టి ఆ విగ్రహముపై కేంద్రీకరించి మంత్రము పఠించు విధానమునకు సగుణోపాసనయని యీ విధానమైన అంతరము దాటిన తరువాత ఈశ్వర విషయమైన విషయము తెలుసుకొనుటకిది మొదటి మెట్టని ఆ తరువాత నిర్గుణ స్వరూపమును తెలుసుకొను మెట్టుకు వచ్చి సాధించి అందు అవ్యయమయి సాక్షియై అనంతరము సర్వసాక్షియైన నిర్గుణముగ మారవలసిన విషయము నకు నిర్గుణోపాసనయని జెప్పుచున్నారు. యిటువంటి వారి ప్రాతిపదికము ఆదిలో గ్రహించుటలోనే బోర్ల పడినారు.

సగుణమన్నప్పుడు గుణసహితమైనదిగ చెప్పు మాటను పురస్కరించుకొని విమర్శించిన ఆ విగ్రహముయొక్క సహజమైన గుణము రాతిని నుద్దేశించిన గుణముతప్ప చలన సహితమయిన గుణమును నిరూపణచేయు నది కాదు. గుణ నిరూపణము నిరూపణశక్తి చలన సహితమైన జీవ రూపము దాల్చిన దేహమునకే కలదు. అటువంటి జీవి తెలివికి ఆకరమైన మానవ వ్యక్తిత్వమునకే సాధ్యము. కావున గుణసహితమైన మానవ వ్యక్తిత్వము ఈశ్వర విషయము తెలుసుకొని తరించవలెననే విశ్వాసంలో కూడిన నిశ్చయమే సగుణము. ఈ సగుణ స్వరూపము ఈశ్వర

సంభూతమైన మహాశక్తి తనదేనని తెలుసుకొన్న తత్వవేత్తలు స్వస్వరూపమే నిర్గుణమై బ్రహ్మస్వరూపము తెలుపునదీగాన స్వస్వరూపోపాసనయే సగుణ సహితమైన బ్రహ్మమని యెలుగెత్తి చాటినారు. దీనినిబట్టి మానవుడు ఆదిలో ఈశ్వర రసస్వరూప సమ్మిశ్రితమయి ఆ విరాట్టునుండి అణురూపంగ తెగిపోయినపుడు గుణ సహితమైన విషయమును తనలో నుండి జారవిడచి తాను నిష్కళంకమైన తేజస్సుగా నుండిపోయినది. అందుచేతనే మానవుడు గుణసహితమైన ఈశ్వర రసస్వరూపము.

ఇది సద్గురువు చేత ప్రబోధింపబడిన మంత్రరూపమున తన సగుణ సంబంధమయిన జీవ దేహములు రెండును అపురూపమైన శక్తి స్వరూపములని తెలుసుకొన్నప్పుడు నిర్గుణమైన ఆ ఈశ్వర తేజస్సునందు తనుగా లీనమైపోవు చున్నాడు.

ఆ నిర్గుణమైన ఈశ్వర తేజస్సుగా సగుణమైనదిగయున్న యీ మానవ రూపము నిర్గుణముగ మారి తిరుగ తన జన్మస్థానమును కోరు ఆసక్తి కలదియైనది. ఆ కారణముననే మానవుడు జన్మరహితమును కోరుచున్నాడు.

"సహజ మాకర్షముగాదె జన్మభూమి"

అన్నాడు తత్వవేత్త. ఈ స్థితికి వచ్చిన మానవుడు అవ్యయమైన నిర్గుణుడు. అతడే సర్వసాక్షియైన గుణరహితుడు సర్వసాక్షి స్వరూపి.

గాన ఈశ్వరుని సంబోధించినప్పుడు యోగులు స్వస్వరూపమయిన సగుణుడుగానే ఆరాధించిన విషయము "సగుణబ్రహ్మముగా దలంతురు నినున్ సన్యాసులున్ యోగులున్" అన్నాడు తత్వవేత్త.

తన స్వరూపమే రసస్వరూపముగ యున్నదన్న విషయము సువిదితము.

# అ ౨౦ వు

ఈ సృష్టిని జీవి అనేక జడజన్మలుయెత్తి కడపటి జన్మగ మానవ వ్యక్తిత్వము (మానవ రూపము) పొందిన స్థితిలో ఈశ్వర విషయాన్ని గూర్చి మానవుడు అనేక రూపాలుగ మార్చి వారి, వారి భావములకు వూహలకు అనుగుణ్యమైన స్థితిగల వాఙ్మయమున వ్రాయబడి, ఆనాడు వ్రాయబడి ఆలా వ్రాసిన వారలలో కాలాన్నే ఈశ్వరుడని (కారణ మేమన లిప్తకాలమునకు ముందు జరుగబోవు విషయము కాలగర్భ ములోనుండి కాలమునకు తెలియును కావున కాలవాదులు ఈశ్వరు డన్నారు.) సంబోధించిన వారలను కాలవాదులని; అణుబద్ధమైన తేజస్సే ఈశ్వరుడని చెప్పువారిని అణువాదులని, ధ్వనియే ఈశ్వరుడని చెప్పువారిని ధ్వన్యావాదులని వీటినన్నిటిని త్రోసి ఈశ్వరుడనే విష యము లింగవాచకముగా నుండుటచే పురుష రూపంగ సాక్షాత్కరిం చకపోవడంలో అది యే విధముగనున్నదో తెలియబడని స్థితిని నమ్మ టకు వీలుతేదు గాన లేనిదానిని ఉన్నదని నిశ్చయించడం భ్రాంతుల వాదమని చెప్పునట్టి వారిని నాస్తికులని, పదార్థ వాదులని పరి పరి విధములుగ ఈశ్వర విషయమును విజ్ఞాన రూపంలో విభజించి వారి వారి తెలివికి గోచరమైన విషయములను ఉపనిషద్రూపములలో చెప్పబడి ఆ చెప్పినవారిని ఆ యా గణములకు చేరిన వారని పూర్వపు వాఙ్మయములో తెలియబడుచున్నది. వేద విహితమయిన సూక్తము "అణోరణీయాన్—మహతో మహీయాన్ యేషోణురాత్మ" సూక్ష్మాతి సూక్ష్మమయిన అణువులోను భువన బ్రహ్మాండములకు మించినటువంటి విధానములోను ఈశ్వర తేజస్సు నిండియున్నదనిన నిర్వచనము యదార్థము.

1 కాలవాదులు :—ఈ కాలమనునది సూక్ష్మాతి సూక్ష్మమయిన విషయంగా వర్తమాన కాలానికి సూక్ష్మాతి సూక్ష్మమయి చేరువునగల భవిషత్కాలమును మానవుడు తెలుసుకొనజాలకున్నాడు. భూతకాలము తెలియబడినప్పటికి దానిని ఆపి వుంచలేకపోవుచున్నాడు. భూతకాల మునకు లిప్తదాటిన వర్తమానకాలము అనబడును. దానికి లిప్తలో భవిష్యత్కాలము యీ మూడింటిని మానవుడు నొకే కాలమున నొకే సమయమందు తెలుసుకొనగల్గినను అందుగల మార్పు తెలుసుకొనుట అసాధ్యముగా ఉన్న సంగతి తెలుసుకొని యేది కాలంలో మిళితమైన మహాశక్తియో అదియే ఈశ్వరుడని అది మానవ ఆత్మను తన కళ్ళెంలో బిగించి యే సమయమందు యే విధంగా మార్చవలెనో ఆ కాలమహాశక్తికి సాధ్యముగాన దానికి మించిన శక్తి యేదీ లేదని యీ కాలమే ఈశ్వరుడని చెప్పినారు.

2 అణువాదులు :—ఈ యావత్తు సృష్టిని ఛిద్రంచేసి దీనిని సూక్ష్మాతి సూక్ష్మమైన అణువులుగ మార్చగల్గినప్పుడు దానియందు తేజోమయమైన శక్తి పదార్థంతో మిళితమైయున్న విషయము తెలియ బడగలదు. అట్టి కోటానుకోట్ల సూక్ష్మాతి సూక్ష్మమయిన అణువుల యొక్క సముదాయమే యీ సృష్టియని యీ సృష్టిని పరికించిన ప్రతి అణువునందును తేజస్సుతో కూడిన పదార్థము గోచరించుచున్న స్థితిని మానవ వ్యక్తిత్వము పొందిన జీవరూపము ఆపాదమస్తకంగా మానవ శరీరమందు నిండి, నిండియున్న సంగతి తాను తన అనుభవంలో తెలియ బడుచున్నది. గాన పదార్థ రూపమయిన యీ జీవకణములలో మిళిత మయి అలరారుచున్న స్థితిని ఆ వ్యక్తని ఆపాదమస్తకము గిల్లినప్పుడు ఆ గిల్లబడిన వ్యక్తి బాధాసూచకమయిన అమ్మా! యని యాడ్చుట ప్రతి వానికి అనుభవంలోనున్న సంగతియే గాన యీ అణువే శక్తి పదార్ధ మిశ్రితంగానున్న సంగతి తెలిసికొని అణువందుగల పదార్థ

మును వేరుగ విభజించిన అందున్న శక్తియే ఈశ్వరుడని అణువాదుల వాదము.

3 ధ్వన్యావాదము :- సృష్టియందుగల ప్రతి పదార్థము నందును ధ్వని మిశ్రితమయియున్నది. కాబట్టి అట్టి ధ్వని మానవ రూపంగా వచ్చిన వ్యక్తిత్వము నుండి వెలువడి సౌజ్ఞ రూపంలో నున్న తెలివిని ధ్వనిగామార్చి ఆ ధ్వనియే సర్వస్వమునకు మూలమయి దానిని ఉపాసించి తెలిసికొన్న అది "నేను" అను ధ్వనిగానున్నదిగాన "నేను" అనే ధ్వనియే ఈశ్వరుడని నిశ్చయించి ధ్వన్యావాదులు వాదించినారు.

నాస్తికులు :- పై జెప్పిన వారి వాదములన్నిటికిని స్వస్తి జెప్పి ఈశ్వరుడు లేడను శబ్దము నాస్తికమున నిరూపించుటకు చార్వాకులు ప్రయత్నించి యీ సృష్టియే ఈశ్వరుడని పలుకబడు నామవాచకము లింగ బేధములతోకూడిన నొక స్వరూపము మానవ దృక్పధములో నిర్మాణమగుచున్నది. గాని అది యే రూపములో నున్నదన్న దానిరూపు, స్థితి తెలియబడని స్థితిలోనుండుటచేత పదార్థశక్తి సమ్మిళితమయిన యీ జగత్తే యదార్థమని ఈశ్వరుడు మిధ్యయని యిది యేనాడు సృష్టింపబడినదో యేనాడు ఖిలమయిపోవునో చెప్పజాలని స్థితినుండుటచేత యిది పంచభూతాత్మకమయిన ఆకాశము; నిప్పు, నీరు, గాలి భూమి ఈ ఐదింటి యొక్క ప్రాతిపదికమయిన శక్తి వీటిలో సమ్మిళితమైన నొకదాని కింకొకటి సంఘటింపబడుటచేత వీటియొక్క నిర్మాణరూపము సృష్టిగా పేర్కొనబడి మానవుడు సృష్ట్యాతీత విషయమయిన జన్మగనుండి వీటియందుండే హాయిని ఆనందమును గ్రహణేంద్రియములవలన గ్రహించి జ్ఞానేంద్రియముల ద్వారా ఆనందించుటయే మానవుని పరమావధిగ నున్నప్పుడు యింకక్కడి ఈశ్వరుడని నాస్తికులు పలికినారు.

అణువు :— ఇది వేదవిహితమయిన ధ్వనిలో
"అణోరణీయాన్ మహతో మహీయాన్ యేషోఽణురాత్మ"

ఈశ్వరశక్తి ప్రత్యగభిన్నమయిన సూక్ష్మాతి సూక్ష్మమయిన పదార్థరూపంలో యిమిడి భువన బ్రహ్మాండములకు మించియున్న తేజస్సు ఆత్మస్వరూపంగా నున్నదని చాటుచున్నది. ఇదే శృతి రూపంలో "తత్సృష్ట్వాత దేవాను ప్రావిసతు"

ఏ మహాశక్తి యీ పంచభూతాలను సృష్టించినదో ఆ పంచ భూతాలలోనున్న మహాశక్తిరూపము తేజోరూపమైన ఆత్మగ. తేజస్సుగా పదార్థరూపమైన యీ పంచభూతాలలో లీనమై పోయినట్లు చెప్పబడుచున్నది. వీటిని పురస్కరించుకొని చెప్పబడిన విషయము "అణువు" అన్నప్పుడు రెండుగా చెప్పబడుచున్నది. 1. పదార్థము 2. శక్తిస్వరూపమయిన తేజస్సు. ఇవి నొకదానినుండి యింకొకటి విడదీయకాని, శక్యముకాని పరిస్థితిని నున్నవి.

శక్తియన తేజోవంతమయినదిన్ని, పదార్థమన్న ప్రకాశరహితమైనదిన్ని (చీకటిగనున్నదని) చెప్పబడుచున్నది. అణువన శక్తి, పదార్థ మిశ్రితము. వెలుగు చీకటులు రెండు నొక డోలికలో బోసిన మిశ్రమములావున్నదని తత్వవేత్తయొక్క వాక్కు. ఇందు చీకటి నుండునది పదార్థముగను, శక్తిగానుండునది తేజస్సుగను పేర్కొన్నప్పుడు శక్తి తేజోరూపంలో యెంతసూక్ష్మమో పదార్థము చీకటి రూపంలో అంతసూక్ష్మంగాయున్నదని తెలియబడుచున్నది. దీనిని వేరువేరుగా భావించిన చీకటిగ యున్న పదార్థ రూపము కట్టె రూపంలో శ్మశానమున చూప బడుచున్నది. శక్తి స్వరూపమైన తేజస్సు అంతర్ధానమై మన చూడ్కులకు అంతర్ధాన మగుచున్నది. పై విషయాన్ని విమర్శించిన చైతన్య సహితమైన ఆత్మ విధానమయిన శక్తి వేరని, చలనంలేని పదార్థ రూపములో కట్టెను

వేరుగా పేర్కొని వారివారి వాఙ్మయంలో వారివారికి తోచినవిధంగ నిరూపణచేసినారు. కాని యీ రెండువిషయాలపై దృష్టిని కేంద్రీకరించిన కాలి బూడిదైన యీ పదార్థరూపము సృష్టికి మించిపోలేదన్న సంగతి గమనించదగినది. ఈ ఆత్మ యేసమాయాన్నైనా యీ పదార్థాన్ని ధారణచేయగలిగే శక్తివంతమయినది. దీనికి "అణోరణియాన్ మహతో మహీయాన్ యేషోణురాత్మ" అన్న సూక్తము పురస్కరించికొని ప్రతి సూక్ష్మాతి సూక్ష్మమైన విషయాన్ని ఈశ్వర కిరణ తేజఃపుంజము ప్రతిప్రత్యగ భిన్న పదార్థంగానున్నదానిలో ప్రవేశించి యున్నట్లు విశదమగుచున్నది. ప్రతి సూక్ష్మాతిసూక్ష్మమైన అణువులన్ని ఉదాహరణరూపంలో గ్లాసులుగా మార్చి అందు నింపబడిన నీరు శక్తిగా నిశ్చయించిన, ఆత్మరూపమయిన నీరు నిండియున్న పదార్థశరీరమనబడు గ్లాసు బోర్లపడినప్పుడు దానినుండి ఒలికిన నీరు యింకొకగ్లాసులో నింపవలెనన్న అన్ని నిండిన గ్లాసులేయగుటచే వాటిలో బోర్లపడ్డనీరు నింపవలెనన్న సాధ్యముకాని స్థితిని శరీరరూపమయిన పదార్థమును ఆత్మ (తేజస్సు) నిండియున్నదో ఆ పదార్థ శరీరము యేరూపంగా మారినను తిరిగి దానినే ఆశ్రయించవలసియున్నది. గాన మరణరూపములో ఖిలమయిన యే శరీరమయినను యేచోట భిన్నభిన్నములుగ విసరబడినను సాయుజ్యముపొందని కారణమున సర్వవ్యాప్తంగాయున్న ఆత్మ తన శరీరపదార్థమునే ఆశ్రయించవలసియున్నదన్న విషయము పైని చూపిన ఉదాహరణను పురస్కరించుకొని శరీరమునకు ఆత్మకు అవినాభావ సంబధముగలదు గాన విడదీయ శక్యముగాదు. కాని యీ అణువునందుగల శక్తి పదార్థములు రెండూ విడదీసి చూపగలిగే శక్తివంతమైన మహాశక్తి నీకు గురువుగా సంప్రాప్తమైనప్పుడు పదార్థరూపముగనున్న శరీరము శక్తియను (ఆత్మ) తేజస్వరూపమును విడదీసి తిరుగ సమ్మిళితము చేసుకొను విధానముచూపి

అణువును దానిలో చీకటిగయున్న పదార్థమును ఆత్మగాయున్న తేజస్సును రెండూ సూక్ష్మాతి సూక్ష్మమైన విధానములో నొకదానితో యింకొకటి కలసిపోయి సర్వము విశ్వరూపమైన ఈశ్వర తేజోరూపముగా మారినవిధానమున తెలుసుకొని శరీరము కూడ ఆత్మలాంటి తేజోరూపమేనని గ్రహించునట్లు చేయును.

ఈశ్వర శాశనమైన తేజస్సులో నుండి విడిపోక పూర్వము ఈ జగత్తుకూడా తేజస్సుగనేయున్న కారణమున అది తెలిసిన శ్రీకృష్ణ భగవానుని విశ్వరూపము అదియే. శ్రీమొహమ్మద్ ప్రవక్తయొక్క "మేరాజ్" కూడా అదియే.

పదార్థరూపమైన శరీరమును నిర్మూలింపజేసి విశ్వంగా మార్చిన విషయము తిరుగ నిర్మాణరూపంలో మానవునిగ మారిన విధము.

ఇదే "ఆ విరాట్టు నుండి ఆనాడు తెగిపోయి
ఆ విర్భవించి మర్త్యాకారము పొంది"

అన్నాడు తత్వవేత్త. మర్త్యాకారముపొందిన అణువే ఆ విరాడ్రూపము నుండి తెగిన మానవాకారము అదే పంచభూతాత్మకమైన జగత్తు అయిన సృష్టి. ఆ సృష్టియే శక్తి పదార్థరూపమైన మానవరూపము అదే తేజోబద్ధమైన అణురూపము.

కొందరు ఉదజని నత్రజని మొదలుగాగల మారణాస్త్రములను గల తేజస్సే ఈశ్వర తేజస్సనుచున్నారు. అది కేవలము భ్రాంతి. వాటిలోగల శక్తి నిర్మూలనమేగాని నిర్మూలించినదానిని తిరుగ నిర్మాణము చేయజాలవు అది కేవలము రసాయనిక విధానముతప్ప ఈశ్వర సంభూతమైన అణుశక్తి కాజాలదు.

"సత్తే" గురువుగా లభించినప్పుడు అతనిని ఆశ్రయించినట్టి శిష్యుడు ఈ స్థితిని తెలుసుకొని ప్రతిప్రత్యగ భిన్నమయిన అణువు

నందును తనకు ప్రబోధించిన క్షరరహితమయిన మంత్ర ధ్వనిని క్రోడీకరించి శక్తి పదార్థ మిశ్రితమైన అణువున నెట్టిన అణువు విచ్ఛిన్నమయి తేజస్సుగ మారిపోవును. ...

"భౌతికాభాస రసస్వరూప సముపాసకుడో డె

కృతార్థు డన్నిటన్"

అన్నాడు తత్వవేత్త. దీనిని పురస్కరించుకొని యే మానవుడు సర్వము తనుగా నున్నదని అదియే ఈశ్వర సన్నిభమయినదని నిశ్చయమునకు వచ్చునో నాతడే ముముక్షువు. విశ్వరూపి.

# శూన్యములో సద్రూపము



శూన్యమన్నప్పుడు యే విధమైన దృష్టి గ్రహించలేనట్లు అర్థమిచ్చుచున్నది. అది బుద్దియొక్క వికాసమైన తెలివికికూడా అందని స్థితిలో నున్నది. ఈ శూన్యమేమిటని? ప్రశ్నవచ్చినప్పుడు దానిని గూర్చి యిదమిద్ధమని చెప్పుట దుస్సాధ్యముగా నున్నది. ఈ శూన్యమును గూర్చి తెలుసుకొనవలసిన మానవులు తమ బుద్ధికి రసస్వరూపుడైన ఈశ్వరుడు ముందా యీ శూన్యము ముందా? అను ప్రశ్నవచ్చినప్పుడు అది వూహలకందనిదై యున్నది. ఈ శూన్యము గొప్పశక్తిగలచోటు యిది లోక విషయములలో చూచిన ఒకరూపానికి యింకొక రూపానికి మధ్య శూన్యము. ఆలాగుననే దేహ అవయవములకు మధ్య శూన్యము, గ్రహణేంద్రియమునకు గ్రహణేంద్రియమునకు మధ్య శూన్యము. జ్ఞానేంద్రియమునకు జ్ఞానేంద్రియమునకు మధ్య శూన్యము అణువు అణువుకు మధ్య శూన్యము, అణువులోగల శక్తి-పదార్థముల మధ్య శూన్యము.

ఈశ్వరుడు రసస్వరూపమైన మహాశక్తి. యిది భువన బ్రహ్మాండములు నిండియున్న తేజస్సు. భువన బ్రహ్మాండములన్నప్పుడు నొక పరిధి యేర్పడుచున్నది. ఆ పరిధికిమించిన విషయం శూన్యము తప్ప వేరొకటి లేదు. శాశ్వతమైన తేజస్వరూపమైన రసస్వరూపము నుండి దాని కదలికచే భిన్నమై తెగిన సమయము కాలము. కాలమును కూడా అతిక్రమించినది శూన్యము.

రసస్వరూపమునుండి తెగిన పదార్థరూపమైన అణువుచుట్టు శూన్యము. ఆ అణువు విస్తరించి ప్రపంచముగా మారిన సృష్టి చుట్టు శూన్యము. పంచభూతములలో ఒక భూతానికి మరియొక

భూతానికి మధ్య శూన్యము. సూర్యునిచుట్టు శూన్యము నక్షత్ర మునకు నక్షత్రమునకు మధ్య శూన్యము. చంద్రునిచుట్టు శూన్యము వెలుగు చీకటుల మధ్య శూన్యము, సంధ్యలో శూన్యము లోకమునకు అలోకమునకు మధ్యశూన్యము. ఈశ్వరునికి జీవునికి మధ్య శూన్యము తెలివికి తేజస్సుకు మధ్య శూన్యము.

ఇట్టి శూన్యమునకు వునికి యేదో గ్రహించుటయే మానవ జన్మ సాఫల్యము. ఇందు చెప్పబడిన ప్రతి విషయమునుదృష్టికితెచ్చి విమర్శించినప్పుడు ప్రతిదానికి శూన్యమే ఆధారమని అవగాహన కాగలదు.

నీవు రసస్వరూప సంభూతమైన తేజస్సును గ్రహించు యిచ్ఛ గలవాడవైన ముందు శూన్యమును గూర్చియే సాధన చేయవలసి యున్నది. నీ దృష్టికి నీవూహ యెంతవరకు సంశయాస్పదమై ప్రశ్నలకు లోనై ప్రయాణము చేయునో అంతవరకు దాని అంత్యపరిణామము తేలువరకు నీవూహ పోనిచ్చిన కడకది శూన్యమనుచోటికే వచ్చి నిల చును. నీవు ఆశూన్యమునందు వచ్చు వూహలు భ్రాంతిజన్యములై నిన్ను భౌతికమైన విధానమునందు అశుభమైన సుఖములకే దారి తీయును. నీ వూహలు నటు మరల్చక ఆ శూన్యమందే నీ దృష్టి నిగుడించి నీ బలీయమైన తపోదృష్టి శక్తిని ఆసూన్యమందు ఢీకొల్పి నెట్టితివేని ఆశూన్యము తేజస్సుగా మారగలదు. ఆ దృష్టినే కాలమందు పెట్టికొట్టితివేని ఆ కాలముకూడా తేజస్సుగా మారును. తరువాత నేవిరాట్టునుండి అణువుగా విడిపోయి మారిపోయిన పంచ భూతముల యందు వేరు వేరుగ నీ ఆధ్యాత్మిక దృష్టిని నిగుడించుతివేని ఈ పంచ భూతములు తేజస్సుగా గోచరించగలవు. తరువాత నీ దృష్టికి స్థూల ముగా కనబడుచున్న చెట్లు, చేమలు, పర్వతాలు, నదులు, మృగములు పక్షులు, క్రిమి కీటకాదులు దృగ్గోచరములన్నియు తేజస్సుగా కనుపించ

గలవు. ఇట్లు ఒకటి యేమిటి శూన్యము తేజస్సు, సూర్యుడు తేజస్సు చంద్రుడు తేజస్సు, నక్షత్రములు తేజస్సు, రేణువులు తేజస్సు నీ భౌతికమైన ప్రతి అవయవము తేజస్సు, నీ గ్రహణేంద్రియములు నీ జ్ఞానేంద్రియములు తేజస్సు నీ భౌతికమైన విధానము తేజస్సు, అందు నేనను ధ్వని తేజస్సు. నీ సూక్ష్మశరీరము తేజస్సు, నీ కారణ శరీరము తేజస్సు, నీ మహాకారణ శరీరము తేజస్సు. వీటియందు యేదైతే ధ్వని రూపంలో "నేను" అని పాడుచున్నదో అది తేజస్సే. నాదమే తేజస్సు, తేజస్సే నాదము యీ నాదమందు శూన్యము తేజస్సుగా యిమిడి పోయినది.

భౌతికమైన ప్రతిదానిని శూన్యంలో ఆభాసరూపమైన తేజస్సుగా మార్చి అది తానుగానున్నట్లు తెలుసుకొని ఆ తేజస్సు ఈశ్వర తేజస్సుతో సమానముగా నున్నట్లు యెవడు గ్రహించగలిగే ఉపాసన చేయునో తానే పూర్ణుడు. ఎక్కడ శూన్యమనుకొను చున్నావో అది ఈశ్వరుడు. ఎక్కడ ఈశ్వరుడు కలడనుకొను చున్నావో అది శూన్యము.

శూన్యమే ఈశ్వరుడు
ఈశ్వరుడే శూన్యము
శూన్యము, శూన్యమే

ఈశ్వరుడనే తేజస్సు దక్క శూన్యమనేది లేనేలేదు.

ఈ ఈశ్వర తేజోరూపమైన సద్రూప ధ్వనిని నీ అంతరమందు నీవు గ్రహించి చూచి వినగలవు.

ఇది నీ సద్గురువు అధీనము, ఇదే శూన్యమందు సదూ్ాపము. ఇదే యీ విజ్ఞాన విద్యాపీఠము ప్రబోధించి అనుభవములో తెలియు నట్లు చేయును.

ఈ పై విషయాన్ని నిరూపణచేసినవాడే సద్గురువు.

ఈ విజ్ఞానవిద్యాపీఠాధిపతి తన శిష్యునియందు ఆశీర్వాదరూపమయిన నిగూఢప్రేమ కలిగి ఆ శిష్యుడు భ్రాంతిని ఈశ్వరుడుగాపోల్చి తన గురువును తృణీకరించినప్పుడు ఆ శిష్యుడుచేయు అర్భాటములనే యేఘాల ధ్వనిబోలు నతని పిడివాదధ్వని సమర్థించుకొనుచు ఆ శిష్యుడు విసరు దురుసుతనములకు సముద్రము అలలను తట్టుకొనునట్లు తట్టుకొని త్యాగరూపియై ప్రతివిషయము పాఠాలుగా నేర్పి కృతార్థుని చేయును.

ఇట్లు చేయగలిగినవాడే సద్గురువు. శూన్యములో సద్రూపము నెరిగినవాడు.

# ఓంకారము

"ఓం" కారము ప్రణవనాదమని, జీవరూపమని ఆధ్యాత్మిక వాఙ్మయములో గోచరించుచున్నది. ఈ "ఓం" కారము అ, ఉ, మ, అనే పదముల సంగమముచేత వచ్చిన ధ్వని. ఇందు ఆది అక్షరమైన "అ" కారధ్వనియొక్క అర్థము "అకారార్థో విష్ణుః జగదుదయ రక్షా ప్రళయకృత్" క్షరరహితమైన అకారధ్వని అర్థము. ఈశ్వర సంభూత మయిన విష్ణువుగ నది త్రిమూర్త్యాత్మకమైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లకు గల్గిన శక్తులు అనగా బ్రహ్మయొక్క శక్తి నైజము సృష్టిచుట విష్ణు యొక్క శక్తి నైజము వృద్ధిపొందించుట (పెరిగింపజేయుట) మహేశ్వరుని (శివుని) శక్తి నైజము లయింపజేయుట పై అర్థములను సూచించే ధ్వనికి ఆకరమని చెప్పుచున్నారు.

ఈ మూడుమహాశక్తులు "ఓం" కారమందు క్షరరహితమయిన అక్షరముగ ధ్వనించుచున్నది. ఖురాను నందు అను మూడుఅక్షరముల సంగతికి, నిదే యర్థము.

పై విషయాన్ని పురస్కరించుకొని ఆదిని విరాడ్రూపములో యీ ధ్వని సమ్మిళితమయి యున్నది. విరాడ్రూపమునుండి శక్తి పదార్థ మిశ్రితమైన అణువు తెగిపోవుటకు ఈ ధ్వనియే కారణము. ఈ ధ్వని జీవరూపములో ధ్వనించినది. అది సృష్టియైన తరువాత పంచభూతాత్మ కమైన ఈ సృష్టియందేకాక విరాడ్రూపము నుండి తెగిననాడు యేర్పడిన అడ్డు (ఖాళీ) కాలమనబడి ఆ కాలముతో సహా ఈ సృష్టిని యేర్పడిన 84 లక్షల జీవరూపాలలోను ధ్వనించి ఈ 84 లక్షల జీవగణ ములను రహితము చేసుకొని అంత్యజన్మగ పరిణమించిన మానవ జన్మగా వ్యక్తమయినప్పుడు దానియందు "నేన"ను ధ్వనిలో మానవ వ్యక్తిత్వముయొక్క స్వరూపము "ఓం" కారముగ నున్నది.





ఓం కారము - శూన్యము - మానవాకారము.

శూన్యములో సద్రూపము.

విరాడ్రూపమునుండి తెగిన అణువునందుగల ధ్వని ఓంకారము అది శూన్యమందు లీనమయినప్పుడు మానవాకారముగ పరిణమించి నది. పై చూపిన చిత్రకారణమున ఆదిలో విరాడ్రూపమునుండి తెగిన అణువు మానవాకారమని సుస్పష్టము.

దీనిని తత్త్వవేత్తలు "ఓం కారమే జీవమనుచు నమ్మి ఆకార మును వీక్షించిన" నాడు నీవు ఈశ్వరత్వము తెలుసుకొన గలవని నుడివినారు.

ఇదియే యోగరూపంలో జీవరూపము సగుణ బ్రహ్మయని దానిని సాధించిన సృష్టియంతయు స్వస్వరూపమయిన జీవముగ నమ్మి సాధించిన ఈ సృష్టి జీవ సమ్మిశ్రితమయిన ఓం కారముగ నున్నదని తెలుసుకొనిన యిది సాక్షిరూపంగా మారి అవ్యయమయి నిర్గుణ మయిన విధానములో సర్వసాక్షిగ మారి ధ్వనించినప్పుడు ఈ ఓంకార నాదమే ప్రణవనాదము.

ఈ ప్రణవనాద సంభూతమయిన ధ్వని "ఓం" కారరూపంలో జీవరూపముగా తెగిన అణువు మానవాకారంగా వున్నదని నిశ్చయము గాన "ఓం" కారము జీవము యొక్క స్వరూపమని నిశ్చయించి అది "నేను"గా ఉన్నానను విషయానికి వచ్చి ఈ వచ్చిన స్థితి 84 లక్షల జీవాలలో ముక్తి పొందుటకు ఆకరమయిన మానవ రూపము వరకు

వచ్చి మానవరూపము పొందిన క్షణమందే ఆశాబద్ధమయిన రెండు భావములుగ విడిపోయినది.

1 ప్రాపంచిక స్థిరమయిన వస్తు రూపములందు ఆశగను;
2 ఈశ్వర సన్నిభమయిన జన్మరహితము ముక్తిగను పరిణమించినవి.

మొదటిది భ్రాంతి జన్యమయిన జడజన్మలవైపు మరలించు ధ్వనిని ఆకరము చేసుకొనిన "నేను" జడజన్మలు పొందుచున్నది.

రెండవది పై దానిని విస్మరించి ఈశ్వర సంభూతమయిన విరాడ్రూపము "నేను"గా గ్రహించిన ఆశ సగుణ రూపంలో ప్రకృతి పై శేషికమయిన ఈ సృష్టిని తనలో లీనం చేసుకొని అవ్యయమయి నిర్గుణోపాసన రూపంలో విరాడ్రూపమయిన రస స్వరూపములో లీనమగుచున్నది.

ఇదియే ఓం కార స్థానము.

# వాక్కు

వాక్కనేది ప్రాపంచక దృష్టిలో చాలా తేలికైనపదముగ సులువుగ జారవిడచు చున్నారు.

ఇది అభౌతికమైనదిన్ని రూపము తేల్చరానిదిన్ని అయివున్నది. ఇది సృష్టిలో ధ్వనిరూపంలోయున్న సంగతి విస్మరించరాదు.

ఈ వాక్కు స్థావర జంగమాత్మకమైన ప్రతి పదార్థరూపమందును అంతర్లీనమైయున్నది. దీనిని రాయి, రప్ప, చెట్టు, చామలలో వినలేకపోయినను, క్రిమి కీటకాదులలోని వాక్కు మనకు తెలియక పోయినను, పశు పక్ష్యాదుల వాక్కును గ్రహించుట కష్ట సాధ్యమైనను, ఆవు అంబా అన్నప్పుడు తన దూడ అరచుకుంటూ దగ్గరకు రావడము చూచు చున్నాము. కోడి కొక్కొరోకో అన్నప్పుడు పెట్ట దగ్గరకు వచ్చి చేరుచున్నది. పిల్లలకోడి తన పిల్లలను ఆహారము యేరి పిలచినప్పుడు ఆహారముకని, గ్రద్ద వచ్చినప్పుడు హానికరమైనదవి తెలుపుటకు అరచు ధ్వనులు వేరువేరుగ గమనించగలము.

ఈ వాక్కు మానవవ్యక్తిత్వములో వ్యక్తమైనప్పుడు మొదట సౌజ్ఞలతో ఆరంభమై ధ్వనిలో రూపించి, గీతవక్రించి వర్ణమైన విధానములో మారి, వర్ణసమామ్నాయమై వాటియొక్క కూడిన శబ్దమయి శబ్దసంపుటి వాక్యమై అవాక్కు యొక్క సమూహము భావసహితమై తన అంతర్లీనమయిన ఊహకు ఆకరమయి ఆయా ధ్వనులలో వ్యక్తమగుచున్నది. ఆ వ్యక్తమయిన ఊహాపరిణామము ప్రశ్నోత్తరములలో ఒకరినొకరు తెలుసుకొనునదై అది వాగ్వివాదములో ఊహకందనంత వరకు పోయినది.

ఈ ఊహారూపమయిన వాక్కు వాఙ్మయ రూపముదాల్చి సృష్టిలో మూడు విధాలుగ పరిణమించినది. 1. చరిత్ర 2. రసాయనికము 3. ఈశ్వర విషయము తెలుసుకొను ఆధ్యాత్మికము.

1. చరిత్ర :— ఇది సృష్టియందు వర్తమానకాలమునకు ముందు భూతకాలమనబడు పూర్వకాలమును తెలుపబడు వాఙ్మయమును అప్పుడు జరిగిన చారిత్రాత్మకమైన విశేషములు కథలుగను, వైశేషికములుగను, సాంఖ్యములుగను పరిణమించినది.

2. రసాయనికములు :— ఇవి సైన్సురూపములో ఆయా పదార్థములలోనున్న నిగూఢశక్తిని వ్యక్తముచేసి వాటిలో నుండి బయలుదేరు శక్తియొక్క సంపుటి మహత్తరమైన పరిణామములకు దారితీసి వాటియొక్క నిర్మాణము మండలములను వశీకరించుకొనుటయే గాక జగత్కళ్యాణమును నిర్మూలించువరకు పోవుచున్నది. మానవుని నిరీశ్వరునిగ మార్చుచున్నది.

3. ఆధ్యాత్మికము :— ఇది చరిత్రను పురస్కరించుకొని రసాయనమునకు (Seience) తలదన్ని అభౌతికమైన ఈశ్వర రహస్యము ఆత్మయొక్క పరిణామమేనని తెలుపుతూ సృష్టియావత్తు ఆత్మయొక్క స్వరూపమని నిరూపించుచు పై జెప్పిన చారిత్రకమును రసాయనమును వ్యక్తముచేసి తనలో యిముడ్చుకున్నదీ యాత్మయేనని తెలుపుతూ దీనికి మూలము ఆ వాక్కు రూపములోవచ్చిన ధ్వనియే కారణమను సంగతి మానవుడు తెలుసుకొనకతప్పదు.

ఈ వాక్కనునది వ్యక్తముచేసుకొని శక్తివంతమయిన మానవుడు తనలోతాను వితర్కించుకొనుచు విమర్శించెనేని దృష్టికి వచ్చిన అది యెక్కడ ఉత్పత్తి యగుచున్నదో తెలియడములేదు. గాని పెదవుల జారునప్పుడు కంఠమందు వక్రించి జిహ్వనుండి పెదవులలో ధ్వనించు

చున్నట్లు తెలుసుకోగలుగుచున్నాము. గాని దీని ప్రాతిపదికము ఏది అని విమర్శించి కంఠమునుండి మనసులోనుండియని, ఆత్మలో నుండి యని, హృదయములోనుండియని మెదడు (Brain) నుండియని శాస్త్ర వేత్తలు చెప్పుమాటలను సూచించు విధానమునువిమర్శించిన తేలడములేదు.

ఈ వాక్కు ఈశ్వరసంభూతమై శక్తిపదార్ధసహితమైన జీవ దేహములనబడు స్థూలదేహమును విమర్శించిన తేలువిషయముకాదు.

ఇది నీదృశ్యములో, కలలలో, నీ సూక్ష్మదేహమునుంచి కూడా యీవాగ్రూపము ధ్వనించుట తెలుసుకొనుచున్నావు. ఆ దృశ్యములో నీ శరీరము భౌతికముగ లేదుగాని భౌతికదేహమునకు సరిపోలు నీసూక్ష్మ దేహములో భౌతికదేహములో యున్న ధ్వనిలాంటిదే అందులోను ధ్వనించుచున్నది గాన యీవాక్కు సూక్ష్మమైన జీవదేహములకు ఆపాద మస్తకమయిన శక్తియొక్క ధ్వనియే వాక్కు.

ఇది ఆదిని విరాట్టునుండి విడిపోయిన అణువందు జీవరూపమున ధ్వనించిన వాక్కు ఓం అనునదియే దీనికి ప్రాతిపదికము. అది తెలుసు కున్నవాడు యీ సృష్టి, దీనియందుగల ధ్వని ఈశ్వరునిలోనిదేనని నిశ్చయించగలడు.

పై విషయాన్ని విడమర్చి అవగాహన అయేటట్లు చెప్పగల యోగి (ఓం) అనువాక్కును (ధ్వనిని) భేదించి దాని పరిణామము రస స్వరూపంగ నున్నదని నిరూపణ చేయగలడు.

దీనిని తెలిసిన సద్గురువు తన శక్తిచే ఈ వాగ్రూపమైన ధ్వనిని ఈశ్వర సంభూతమైన తేజస్సుగా తన శిష్యునకు అవగాహనయగునట్లు నిరూపించవలసియున్న బాధ్యత తనపై నున్నది.

# నిర్వాణము

మనదృష్టికి కనబడుచున్న భౌతికరూపంలో అనుభవంగాయున్న యీ ప్రపంచము అనంతమైనదిన్ని మన ఊహకు అందనటువంటిదిన్ని యిది ఎప్పుడు నిర్మింపబడినదో ఎవడు నిర్మాణకర్తయో, తెలియని పరిస్థితిలో ఊహలకు లొంగని విధానమున దీనిలో మనదృష్టికి కనబడే పంచభూతాలు, యీ పంచభూతాల ఆవరణలో అనేక జీవ జడపదార్థ రూపములు, స్థావర జంగములుగా కనబడి సృష్టియొక్క ఔన్నత్యమును అనేక విధాలుగ పొగడ్తలకు విమర్శనలకు ఆకరమయి విలసిల్లుచున్న దీనిలో 84 లక్షల జీవరాసుల మనుగడగనున్న విషయము చరిత్రలోనే గాకుండా మన అనుభవమందును గ్రహించుచున్న వీటన్నిటిలో మానవరూపము ఉత్కృష్టమైనదిన్ని, దానికి మించిన యింకొక రూపము లేదన్న విషయము నిర్ధారణ కాకమానదు.

ఈ మానవ వ్యక్తిత్వమందున్న తెలివియొక్క వికాసము విజ్ఞానమనేధ్వని ఎంతవరకు ప్రసారమై తెలుసుకోనేర్చినదని మన విమర్శనలో పెట్టి దీని పరిణామము విమర్శకుబెట్టిన, యీనాడు భూమికి సుదూరమందున్న గోళములలో ప్రవేశించి అక్కడనున్న వింతలను గ్రహించడమే కాకుండా అక్కడకు చేరి స్థిరపడి తన ఉనికి మనుగడ సాగించగలమను నిశ్చయుడై కృతార్థుడయ్యే విషయానికి వచ్చినది.

భవిష్యత్కాలమునందు పై విషయాన్ని సిద్ధింపజేయ సమకట్టిన మానవునియొక్క నిశ్చితాభిప్రాయము మన అనుభవములోకూడా తెలిసికొనేటట్లు యీ కాలము, యీ సృష్టి, యీ మానవుడు అనే విషయాలపై తత్వదృష్టికి విమర్శనారూపములో వచ్చినప్పుడు ఆశ్చర్యముగా నుండకమానదు.

"ఏతద్విషయే తత్పూర్వం ప్రాచీనం:"

ఏ విషయాలైతే పైని వర్ణింపబడినవో వాటి పూర్వచరిత్రే యేమిటి అనే ప్రశ్నవచ్చినప్పుడు వీటన్నిటికి మూలమైన అణువు. ఆ అణువు ఆ విరాడ్రూపమునుండి తెగిన కారణమని తత్త్వవేత్తయొక్క వాక్కు.

"ఆ విరాట్టు నుండి ఆనాడు తెగిపోయి
ఆవిర్భవించి మర్త్యాకారమందగ"

అన్న యీ వాక్కును దృష్టిలోపెట్టి ఊహారూపములో విమర్శించిన యీ యావత్తు పంచభూతాత్మకమైన సృష్టి మానవాకార సమ్మిశ్రిత అణురూపము రస స్వరూప సన్నిభమయిన విరాట్టు నుండి దాని కదలికలో విడిపోయి పంచభూతాలుగ ఆవిర్భవించి (విస్తరించి) తిరుగ మానవాకారములో యీ సృష్టియొక్క విధానమును విమర్శించే శక్తివంతుడై సృష్ట్యాతీతమయిన విషయాన్ని యేదిగ నున్నదని విమర్శించుటకు సాహసించుచున్నాడు. దానికి మూలము పంచభూతాలుగ ఆవిర్భవించిన అణుబద్ధమయిన ఈ సృష్టి ఈశ్వర రస స్వరూప తేజోపుంజము యీ సృష్టియందు ప్రసరింపబడి కదలిక కలిగి ఆత్మగా నిరూపింపబడుచున్న విషయము "శృతిరూపంలో"

అణోరణీయాన్ మహతో మహీయాన్
యేషోఽణురాత్మ"

పిపీలికాది బ్రహ్మపర్యంతము అన్నప్పుడు సూక్ష్మాతిసూక్ష్మమైన అణువునుండి బ్రహ్మాండమువరకు ఆ తేజఃపుంజము నిండియున్నట్లు ఆ తేజోరూపమే ఆత్మగయున్నట్లు నిర్ధారణ చేయుచున్నది. అందులో విరాట్టునుండి తెగినవిషయం అన్నప్పుడు ఆ సమయము కాలముగ ఏర్పడి ఆకాలము యీనాటికి 195 కోట్లు సంవత్సరములైనట్లు చరిత్రే తెలుపుచున్నది.

మానవజన్మ యీ పంచభూతాలుగ ఏర్పడిననాడు రూపొందిన ధ్వని కాలముగా ఏర్పడిన సమయమందు యీ జగత్తున స్థావర జంగ మాత్మకమయిన జీవరాసులలో నొకటిగ మానవజన్మ మానవరూపముగ యున్నట్లు మన బుద్ధిని విమర్శించిన ఇది స్పష్టత కావడములేదు. కారణము యీ సృష్టి అయిన తరువాత యీ సృష్టిలో భిన్న భిన్న రకాల జీవరాసులు వేరు వేరు గణాలుగయున్నట్లు తెలియపడుచున్నవి. అందు పంచ భూతాత్మకంగయున్న యీ సృష్టి నొక భూతమ్ములో యింకొక భూతము మిశితమై వాటి కదలికా సంఘటనలవలన యీ ఆత్మయొక్క భౌతిక శరీరము గడ్డిగ నుద్భవించినట్లు నిర్ధారణ చేయ వలసియున్నది. ఈ గడ్డియే 84 లక్షల జీవరాసులకు వీటి అంత్య పరి ణామ రూపమయిన మానవునివరకు యీ గడ్డి రూపములోగల ఆది ఆత్మయే రూపాంతర ప్రాతిపదికముగా నిశ్చయించి దీని తరువాత నొక దానివెంబడి యింకొకటిగా లతలు, వృక్షములు, కీటకములు, పక్షులు, జంతువులు మొదలగు జీవరాసులవరకు కలిగి అవి ఆత్మశక్తి సమ్మిళితమై కడకు ఆత్మ భౌతిక అస్థి మాంస వసా వికారసన్నిభమయిన మానవ వ్యక్తిత్వము వరకువచ్చి దీనిని మించిన యింకొకరూపము సృష్టిని లేక పోవడంచేత దీనినే సృష్టియొక్క అంత్యపరిణామమని నిశ్చయించ వలసినదిగ యున్నది. ఇది నిశ్చయపరచుటకు దీనికి మించిన బ్రహ్మ విష్ణు, మహేశ్వరులను త్రిమూర్త్యాత్మకమయిన రూపచిత్రణ మానవ రూపముగ నుండుటచే పై విషయము సృష్టియొక్క అంత్యపరిణామ మగుట నిశ్చయము.

మానవరూపము పొందినటువంటి మనువుయొక్క రూపము (వైవశ్వత మనువుయొక్క రూపము) ప్రస్తుతము మనదృక్పథములో నున్న మానవాకారముగా ఉద్భవించినట్లు ఉపనిషత్తులవల్ల తెలియు చున్నది. ఇది మొదటి మానవాకారము.

ఈ మానవరూపము పొందిన యీ మనువు రూపమునకు ముందు "స్వాయంభువు. సారోచిష" ఆదిగాగల ఆరుగురు మనువుల అనంతరము ఉద్భవించునట్లు చరిత్రలో ఉపనిషత్తుగ చెప్పబడిన విష యము.

వైవస్వతో మనుర్నామ
మాననీయో మనీషిణామ్.

ఈ ఆరుగురు మనువుల విషయము వూహించినప్పుడు ఆదిని విజ్ఞానముతో కూడిన (తెలివియొక్క వికాసము) ఆది మనువైన స్వయంభువులో రూపింపబడి దానియందుగల వూహలు సృష్టికి విజ్ఞాన మయమై నొక అంతరమునుండి యింకొక అంతరమునకు మారిన మహత్తరమయిన శక్తి స్వరూపంగా యున్నట్లు నొప్పుకొనక తప్పదు.

పై విషయాన్ని పురస్కరించుకొని విమర్శించిన 84 లక్షల జీవ రాసులుగ వృక్ష, క్రిమి, కీటక, పశు, పక్ష్యాది మృగములు స్థావర జంగములుగానున్న ఆత్మ సమ్మిశ్రితస్థూల స్వరూపములుగా నున్నప్పటికి తెలివియొక్క వికాసము వీటికున్న ప్రస్తుతస్థితినుండి ఉత్తమమైన స్థితికి మారలేని కారణమున ఆది నుండి ప్రళయమువరకు ఆ విధముగనే నుండగలవని నిర్ధారణ కాని, మానవుడు నొకప్పుడు పశుప్రాయంగా తన మనుగడ నున్నప్పటికి దానిలో నిగూఢముగానున్న బుద్ధియొక్క వికాసము తెలివి రూపములో నొక అంతరమునుండి యింకొక అంత రము దానికంటె ఉత్కృష్టమయిన అంతరమునకు వచ్చే విషయములో ఆరుగురు మనువుల కాలము గడచిన తరువాత 7 వ మన్వంతరమయిన సూర్య సంభవుడైన వైవస్వత మనువు వర్తమాన మానవరూపిగ నిర్మాణమై ఆ రూపములో తెలివియొక్క వికాసము తనయొక్క ఆది పునికి (స్థాన) మయిన ఆ విరాట్టును గ్రహించి అదిగామారవలెననే

స్థిర భావమునకు ఆటపట్టయిన జీవమని భగవద్గీతలో శ్రీకృష్ణభగవానుడు నిర్వచించెను.

ఇమం వివస్వతే యోగం। ప్రోక్తవాన్ అహమవ్యయం
వివస్వాన్ మనవే ప్రాహ। మనురిక్ష్వాక వేబ్రవీత్

అర్జునునకు యోగరహస్యమయిన మంత్రమును ప్రబోధించే ముందు అది ఆదిమానవ సంభూతుడైన వైవస్వత మనువునకు యీ రహస్య యోగమంత్రము ప్రబోధింపబడినట్లు చెప్పబడినది.

మానవరూపము పొందిన వ్యక్తిత్వములో తెలివియొక్క వికాసము కాలక్రమేణ మూడు భాగములుగా మారినది. 1. చరిత్ర 2. రసాయినిక శాస్త్రము 3 పై రెంటియొక్క పరిణామము ఆధ్యాత్మికంగా తత్వరూపములో ఈశ్వర విషయము తెలిసికొనినగాని తరించడమనే జన్మ రహితము సార్ధకము కాదను నిశ్చయమునకు వచ్చిన ప్రయత్నము.

చరిత్ర :— చరిత్రయనగా మానవుడిగావచ్చి సృష్టిలో జరిగిన చిత్ర విచిత్రములయొక్క కాలనిర్ణయమును తెలుపుచు మానవ మనుగడలో విశేషములు వ్యక్తంచేసి ముందుకాలము వారికి భూతకాలములో జరిగిన అంశములను నిరూపణ చేయడానికి చరిత్ర అనబడుచున్నది.

రసాయినికశాస్త్రము :— రసాయినికమనగా నొక రసాయనములో యింకొక రసాయనము సమ్మిశ్రితమయినప్పుడు వచ్చే పరిణామము బుద్ధి వికాసముయొక్క తెలివిని ప్రాపంచకములో ప్రసరింపజేసి దిగ్భ్రాంతులను చేయగలిగించే పరిణామము రసాయినిక శాస్త్రముగా నిరూపణ చేయుచున్నది. అది భూమండలమునకు అన్యంగానుండే యితర మండలములను తమ వునికిపట్టు చేసుకొనుటకు మారణహోమములకు దారితీయు విషయముగ రూపింపబడుచున్న విషయము రసాయనిక శాస్త్రముగా యున్నది.

ఈ రసాయినిక శాస్త్రనిరూపణచేసిన వ్యక్తిని అభౌతికమయిన ఈ సృష్టికి కారణమయిన రసస్వరూపమైన విరాట్టును ఈశ్వరుడుగా పేర్కొనబడుచున్న విషయము నీకు యెంతవరకు తెలియునని ప్రశ్నించినప్పుడు ఆ విషయము యీషత్తు కూడా తెలియదని తన యదార్థమును వెలిబుచ్చవలసి వచ్చును. ఈ రసాయనికంగా తెలుసుకొన్న విషయం నా బుద్ధిరూపంలో వచ్చిన వూహ ప్రయత్నరూపంలో సార్థకమైనదేతప్ప ఈశ్వర విషయం నాకు తెలియదని చెప్పక తప్పదు.

మూడో విషయంగానున్న ఆధ్యాత్మిక రూపంలో తత్వముగా రూపొందిన ఈశ్వర విషయం తెలుసుకొన్నగాని తరించడమనే జన్మ రహితముకాదను నిశ్చయమునకు వచ్చిన ప్రయత్నము మానవబుద్ధి విమర్శనా రూపములో రెండుగా మారినది ఒకటి నాస్తికము రెండు అస్తిక్యము.

నాస్తికము :— మానవుడు ఈశ్వరుని తెలుసుకోవాలనే ఊహ కలిగినప్పుడు తనంతట తాను విమర్శించిన, పుల్లింగంగా కనబడుచున్న విషయములో అభౌతికమైన శక్తిపై నమ్మకము లేకపోవడంచేత యీ సృష్టియొక్క విధానములో సృష్టికర్త యెవరు అన్న ప్రశ్నకు వచ్చినప్పుడు అది తన బుద్ధికి అందని విషయంగా నుండుటచే ఈశ్వరుడు అనే విషయం లేనేలేదని పంచభూతాలతో కూడిన సృష్టిని నొకదానితో యింకొకటి సంఘటనవలన దృష్టికి కనబడే ప్రతీది పుట్టి ఆయుష్షురూపంలో అంత్యకాలమున నశించిపోవుచున్నది. కాబట్టి ఈలోగా అనేకసార్లు పుట్టియుండడం అనుభవంతో తెలుసును కాబట్టి యీ సృష్టిలో మానవుడుగా యున్నవ్యక్తి భౌతికమైన అనుభవ రూపంలో యిది యదార్థమని, ఈ సృష్టి తాను పుట్టకముందు నున్నది. పుట్టినప్పుడు యున్నది. తాను యిందుండి లేచిపోయిన

తరువాతకూడా నుండగలదని తనకంటె ముందుగ పోయినవారివల్లి గ్రహించి తాను చనిపోయినప్పుడుకూడా యీ ప్రపంచము యీ విధముగనే యుండునని ఉచ్చరించి యీ సృష్టియే ఆయుష్షు రూపమున నందరికి స్వస్తి చెప్పుచున్నది గాన ఈశ్వరుడనేవాడు అనగత్యముగాన అది రూపనిష్పత్తిగ కనబడేలాగున లేదుగాన అభౌతికమయిన మాట మోసగ్రాండ ప్రసక్తిగాన ఈశ్వరుడనేవాడు లేనేలేడని యను చున్నాడు.

ఈ ప్రసక్తిలో మొదటివారు చార్వాకులు. వారు నిరీశ్వరతత్వ విషయములో "శాశ్వత ఆనందమే" ఈశ్వరుడని చెప్పబడిన విష యము నుండుటచేత అది తెలుసుకోవాలని నిశ్చయించి యే విషయ ములో ఆనందము ఉంటుందో అనే పరీక్షకు పాల్పడి తన ఊహలో శాశ్వతానందము కలిగిస్తుందన్న ప్రతిదానియందు కొంతకాలమునకు విరక్తి కలగడము చూచి కడకు విరక్తి రహితమని నిశ్చయించిన స్త్రీ పురుష కలయిక రూపమైన సంభోగమునందు తనకు కలుగు ఆనం దమే శాశ్వతమయిన ఆనందమని నిశ్చయించి నీతి నియమములేని దౌష్ట్యమునకు పాల్పడి, దాని విషయములో అవయవములలో బలము అంగసౌష్టవమునకై మూలికా రూపములో యీ శరీరమును పోషించ వలసిన అవసరము కలిగి ప్రతి మూలికా పాషాణా వస్తుగుణ మును పరీక్షించినట్టిది. చరకుని కాలానికి వస్తుగుణ గ్రహణము ఆయు ర్వేద వైద్యంగా మారినది.

పై విధమున చార్వాకులు శరీర దారుఢ్యము కోల్పోలేని స్థితికి యున్నను యీ సంభోగ విషయమందు వారికి యెప్పుడు ఒకేలా ఉండుటచే ఆ ఆనందమునందు విరక్తి కలిగి యీ భోగలాలసమైన ఆనందము శాశ్వతమైన మహోదానందము కాదని తెలుసుకొని యిట్టి ఆనందముకూడా ఈశ్వర మయమైన చిదానందముకాదని నిశ్చయించి

సుఖదుఃఖములను నొకే రూపములో సహనమున ఆనందంగా అనుభ వించుచు మానవ ఆయుష్షు అంతమందు అంతర్థాన మవడం తప్ప ఈశ్వరుడనేవాడు లేడని నిశ్చయించి భౌతికంగా శాశ్వితానందం పొందలేమనే నిశ్చయానికివచ్చి పై చార్వాక నాస్తిక వాదముగా నున్న వాఙ్మయము నిర్మూలింప జేసినట్లు చరిత్రలో కనబచుచున్నది.

అక్కడక్కడ వాగ్రూపములో నుండిపోయిన విషయములను పురస్కరించుకొని అచలమనుపేర నొక మతరూపము లేవదీసి మరణము తరువాత పదార్థరూపమైన శరీరము పంచ భూతములలో కలసిపోవు చున్నది. అభౌతికమైన ఆత్మ కనబడని స్థితిని బయలులో కలసిపోవు చున్నది. అంతకంటె వేరులేదని "విధినిషేధము లేటికి పవిత్రుడానెడన్" అని నొక ధర్మసంస్థ ప్రపంచములో విలసిల్లు చున్నది.

దీనిని చార్వాకులు చూపిన ఉపమానము పంచభూతాత్మక మయిన యీ సృష్టి నంతటిని నొక రసాల వృక్షముగా మార్చి అది నొక కాలానికి నశించిపోవునట్లు నిశ్చయించి మానవుడుకూడా నశించి పోవుచున్నట్లు తేల్చి యీ సృష్టికూడా నాశనము కానున్నదని ప్రళ యమనునది అంత్యనాశనము కలదని యీ అచలమతము నొప్పుకొను చున్నది. ఈ సృష్టి నిర్మాణము చేయుటకు కర్త అవుసరం కాబట్టి యేదైతే సృష్టించినదో అదే ఈశ్వరుడని "తత్సృష్ట్వాత దేవాను ప్రావిసతు" అను సూక్తి ప్రకారము నొకవేళ ఈశ్వరశక్తి యున్నప్ప టిక అది యీ జగత్తులో లీనమైపోయి యుంటుంది కాబట్టి వేరే యీ సృష్టికిమించి ఈశ్వరుడు లేడుకాన ఈ జగత్తులో ఈశ్వరుడని చెప్పు మాట మిధ్యగాన తానున్నంతవరకు తనకు లభ్యమైనటువంటి సుఖ దాయకమైన విషయాలను అనుభవించుట ఈ సృష్టికి అంత్యపరిణా మమైన మానవుడు. అనుభవించుట విధియని నిశ్చయించి కర్మయను

విషయము నిషేధమనునది లేదుగాన అలావున్న బూడిదఅయ్యే శరీర మునకేగాని పవిత్రమైన ఆత్మకు లేదని చెప్పుచు విధి నిషేధములనేవి మాటలుగాని యదార్థములో లేవని పల్కుచు దుష్కృత్యములైన విషయములను సత్కృత్యములుగా అనుభవించుటయే మానవుని విధియని దీనికి నిషేధముండకూడదని అర్థములు చేయుచున్నారు.

ఆస్తికుడు :- ఈ సృష్టికి నిర్మాత నొకడుండాలి కాబట్టి ఆ కర్తకు ఈశ్వరుడని చెప్పక తప్పదని నిశ్చయించిన అది అభౌతిక విషయము కాబట్టి యోగ రూపంలో తెలుసుకోవలసిన విషయం కాబట్టి.

"అణోరణీయాన్ మహతో మహీయాన్
యేషోణురాత్మ"

అను సూక్తరూపంలో ప్రతి సూక్ష్మాతి సూక్ష్మమైన అణు స్వరూపమునందును ఈశ్వర తేజోపుంజము ఆత్మగ లీనమయి అది భువన బ్రహ్మాండముల వరకు నిండియున్నదిగాన అది తెలుసుకొనుటకు యోగ సాధనములు అవసరమని నిశ్చయించి దానిని తెలుసుకొనుటకు సంస్థలు మతాలుగా మారి ఆ మతసంస్థలు వారివారి అనుగుణ్యమయిన విషయములు వేద ఉపనిషదాది భగవద్గీతలు ఋషి ప్రోక్తములను అనుసరించిన వేద విహితమతము నొకటిన్ని దేవుని బిడ్డడై స్వర్గమనే స్థానమును అలంకరింపజేయు శక్తివంతుడై యున్నాడనే విషయము బైబిలు రూపములో తెలియబరచిన ఏసుక్రీస్తును ననుసరించే మతము నొకటిన్ని మానవునికి మించినటువంటి అభౌతికమైన శక్తి ఈశ్వరుడని అభౌతికమైన ధ్వని విద్యాగంధములేని నొకవ్యక్తినోట నుండి ధ్వనింప బడి "ఖురాను"గ నిరూపింప బడినటువంటి ఇస్లాము మతమున్ను వీటి యొక్క ప్రాతిపదికము ఆస్తికరూపంలో అభౌతికమయిన మహాశక్తి ఈ సృష్టికర్తగయున్న ఈశ్వరుడున్నాడని రూపించుటయే.

నాస్తిక మన్నప్పుడు లేదని ఆస్తికమన్నప్పుడున్నాడని వాటిని సమన్వయపరచి ప్రబోధించిన మతములు రెండే రెండు ఒకటి వేద విహితమైన మతము, రెండు ఇస్లాం మతము.

ఈ రెండుగ్రంధములలోను ఓకేమాట వినబడుచున్నది.

అసత్, నాసత్ ఉచ్యతె (గీతలో)

లా, యిలాహ, యిల్లాల్లాః (ఖురాను)

పై రెండు ధ్వనులు నొకే అర్ధమును పూరించుచున్నవి.

"అసత్, నసత్, ఉచ్యతె = లేదు, వున్నాడు

"లా, ఇలాహ, ఇల్లాల్లాః — లేదు అల్లా, వున్నాడు అల్లా

ఈ సూత్రములనుబట్టి మానవుడు తెలుసుకొనవలసిన విషయము కనబడ నటువంటి ఈశ్వరుని లేదని నిశ్చయించి ఈ సృష్టి యేవిధముగా నిర్మింప బడినదను అంత్య పరిణామమునకు వచ్చి భౌతికముగా కనబడేది ప్రతీది సృష్టి సహితముగా ప్రళయ కాలానికి నాశనము కాక తప్పదని ఈశ్వరుడు లేడనే విషయానికి వచ్చిన తరువాత ఈ సృష్టి ప్రళయమందు నాశనమై యేమగుచున్నది? యను ప్రశ్నకు వచ్చి దానిని యిముడ్చుకొనే (లీనము చేసుకొనే) మహాశక్తి యొకటున్నదనే నిశ్చయించి ఆ శక్తినే ఈశ్వరుడని ఆ ఈశ్వరుడనే నిర్ధారణలో ఈశ్వరుడున్నాడని నొక స్థాయికివచ్చి తెలుసుకొనే అవసరము కలుగుచున్నది.

"తత్ సృష్ట్వా తదేవాను ప్రావిసతు"

ఏది సృష్టించినదో ఆ సృష్టింపబడిన సృష్టిలో అదే ప్రవేశించినదని అర్ధము.

"అణోరణీయాన్ మహతో మహీయాన్

యేషోఙురాత్మ"

సూక్ష్మాతిసూక్ష్మమైన ప్రత్యగ భిన్నమైన అణువులో శక్తి స్వరూపముగ ఆత్మ నిండినది. బ్రహ్మాండములవరకు వ్యాపించినది.

ఈ రెండు ఉపనిషద్వాక్యములో ఆస్తికుడు, నాస్తికుడు వారి వారి వాదములలో నుపమాన రూపముగ నిర్వచించు చున్నారు.

నాస్తికుడు పై ఉపనిషద్వాక్యములో సమర్ధనీయమయిన విషయములో యేదైతే యదార్థములో నున్నదో యేది ఈశ్వరుడనిపించుచున్నదో దానిచే సృష్టింపబడిన సృష్టిలో లీనమయి పోయినది. అది సూక్ష్మాతి సూక్ష్మమయిన అణువులోను భువన బ్రహ్మాండముల వరకు వ్యాపించిన లోకా లోకములలోను, లీనమయిపోయినదిగాన ఈశ్వరుడనే మహాశక్తి లేదని ఈ జగత్తే దాని రూపమని దానియొక్క పరిణామం మానవుడని మానవునికంటె మించిన మరియొక అపురూపమైన వస్తువు కానరాదు, కాన అనుభవనీయమైన ప్రతి విషయములను అనుభవించుటకు మానవజన్మ వచ్చినదిగాన, అతనికి మించిన విషయము యింకొకటి లేదు. కాన ఈశ్వరుడు ఉన్నాడనే నమ్మకము మానవునియొక్క బధిరత్వమని రసాల వృక్షమును ఉపమానముగ తీసుకొని ఈ వృక్షము నొకనాటి కాలమున టెంకగయుండి మహావృక్షముగ మారిన తరువాత ఆ చెట్టుయొక్క వ్రేళ్ళలో త్రవ్వి చూచిన అందు టెంకయొక్క రూపము కానరావడములేదు. కాన నొకప్పుడు ఈశ్వరుడుగా నున్నప్పటికి అది యీ జగత్తు మారిన విషయములో పై సూక్తముల ప్రకారము సృష్టియనే మహావిషయములో టెంక చెట్టులో లీనమయినట్లు ఈశ్వరుడు లీనమైపోయినాడుగాన ఈశ్వరుడొక డున్నాడని విశ్వసించుట మానవుని అజ్ఞానమను చున్నాడు.

పై సూక్తములను పేర్కొని ప్రతిప్రత్యగ భిన్నమయినసూక్ష్మాతి సూక్ష్మమయిన అణువు భువన బ్రహ్మాండములోను, యిటువంటి సృష్టిని సృష్టించిన ఈశ్వర సంభూతమయిన మహాశక్తి ఆత్మరూప

ములో పరిణామముపొంది ఈశ్వరునిలో లీనమగుచున్నది. అంత వరకు జన్మ జన్మాంతరములు యెత్తుచునే యున్నది.

ఆస్తికుడుకూడా నాస్తికుడు ఉపమాన్యంగా చెప్పిన రసాలవృక్షమును తానుకూడా ఉపమానంగా చెప్పుచు నొకప్పుడు ఈశ్వరుడుగానున్న టెంక ఈ సృష్టి వృక్షముగా మార్చినప్పుడు ఆ వృక్షముయొక్క మట్టినినున్న వేళ్ళను త్రివ్విచూచిన కనబడదుగాని తాను సాధనారూపములో తపస్సున ఆ చెట్టుయొక్క పరిణామము యెంతవరకు అని ప్రశ్నించుకొని, దాని పరిణామమును నిరీక్షించిన కొంతకాలమునకా వృక్షము వసంత ఋతువులో పూచి దానినుండి పిందియై కాయగామారి ముదిరి పండై, నేల రాలినప్పుడు ఆ పండును చిదిపిన యే టెంక వలన ఈ వృక్షము పుట్టి విస్తరించినదో, దానియొక్క రూపము టెంక అని తెలుసుకొనవచ్చును. దాని నిజరూపము మొదట వృక్షములాగున నున్నదా? యని ప్రశ్నించుకొన దానిని భూమిని పాతి తిరుగ అది మొలచి పూర్వమునున్న చెట్టువలెనే రూపొందుచున్న సంగతి తెలియగలదు. ఈ విధముగనే ఆత్మ రూపముగయున్న శక్తిని ప్రాతిపదికము ఈశ్వర రూపమేయని తెలుసుకొనగలరని నిరూపణ చేయుచున్నారు. అది "నేను" అను ధ్వనిగయున్నదని అది తెలుసుకొన్న ఈశ్వర విషయము తెలియబడగలదని ఒప్పింప జూచుచున్నారు. ఈ ఆస్తి, నాస్తికులుగా రూపొందిన వారిద్దరును యదార్థమునకు నాస్తికులు. ఈశ్వరుడు భౌతికముగ కనబడని కారణమున లేడనుచున్నాడు నాస్తికుడు. ఊహించి వున్నాడని కనబడకపోయిన నమ్మికలోయున్నాడనుచున్నాడు ఆస్తికుడు నిజమునకీయిద్దరు నాస్తికులే.

"విధినిషేధము లేటికి పవిత్రుడౌనెడన్."

అన్నాడు తత్వవేత్త.

చార్వాకులు, చార్వాకమతముయొక్క అంత్యరూపమైన అచలులు పై తత్వవేత్తయొక్క వాక్కును పురస్కరించుకొని వారు

తృప్తులై ఆనంద పడవచ్చునుగాని, ఆ తత్వవేత్త పై వాక్యమును నిషేధిస్తూ చెప్పిన క్రిందివాక్యమును గమనించవలసిన అవసరమెంతయు గలదు.

చ॥ విధియు నిషేధముల్ విడిచిపెట్టితివేల స్వతంత్రజీవిత
ప్రథితవిలాసముల్ బడయవచ్చితివా. అవి నిష్టకంటె. న
త్యధికతరంబు కష్టము సుమా. అపకీర్తి శిరానబెట్టి యీ
పృథివి తృణంబుకంటె కడుహీనునిగా దలపోయనేర్తువే

—అన్నాడు తత్వవేత్త.

విధినిషేధములు మానవుని ఊహలో రెండు త్రోవలు యిమిడి యున్నవి. అవి మానవుని ఉత్కృష్ట నికృష్ట జీవితమును తెలుపునవిగా, ప్రపంచమందు కీర్తి, అపకీర్తులుగా భాసిల్లుచున్నవి. విధి నిషేధములను రెండింటిని సమన్వయించి. వాటినిమించి యే మానవత్వము సృష్టిలో తన మనుగడ సాగించుచున్నదో ఆవ్యక్తిత్వమే తత్వరూపము ఈ విధి నిషేధములనే వాటిని యేదేని మానవుడు అనుసరించినా క్రింది మెట్లకు దిగిపోవుచున్నాడు. కాన నిష్టకంటె (తపస్సు) వీటికి మించిన జీవితమును సాగించువాడు తాను ప్రతివస్తువును విమర్శించి కళంకము లేని బాటను అనుసరించగలడు. అట్లుగాక యీ విధినిషేధములు విడచి వీటికిలోనై స్వతంత్రముగా తన జీవయాత్రను సాగింప నేర్చినట్లయితే నిష్టకంటె (తపస్సుకంటె) కష్టతరమైనది, అసాధ్యమైనది. అట్టి వ్యక్తి యొక్క జీవితము లోక దృష్టిలో నాతడు కడు హీనునిగ రూపించ గలడు. ఇట్టి స్వతంత్ర జీవిత విధానమున విధి నిషేధములు విడచి సంచరింపజేయునది "భ్రాంతి" మహాశక్తి.

భ్రాంతి మహాశక్తి మానవునియందు అంకురించి, విధి నిషేధములను పాటింపనియ్యక వాటికిలోనై తన యిచ్ఛవచ్చినట్లు సంచరింప జేసి తుదకు నాశనమునకు హేతువైన నిషిద్ధ జీవితమును గడుపుచు

జడజన్మలకు దారితీసి ఆకల్పాంతముదాక తన్ను సాయుజ్యమనునది ఊహకురాని స్థితికి మార్చి, మోహ దేవతకు దాసుడై మోహమునరాలి బూడిద అయ్యేవరకు ఈ భ్రాంతి తన్ను వదలదు, ఆ స్థితిని.

"భ్రాంతి వదలిన తత్వమెవ్వనికి తెలియు

—అన్నాడు తత్వవేత్త.

ఇట్టి విధి, నిషేధములనుండి వైదొలగి తన విషయము ముక్తిని కోరు విధానమునకు వచ్చి తత్వరూపిగ మారవలయునను భావము తన మదికి తట్టినప్పుడు

"తత్వమన్న తానేగదా" అన్న తత్వవేత్త వాక్కును పురస్కరించుకొని "తాను" అనగా "నేను" అను విషయము తెలుసుకొనదగిన విధానము యెట్లని చింతించినవాడవై అట్టి విషయము తెలుసుకొనదలచినప్పుడు నీ దృష్టికి ఆధ్యాత్మిక ప్రబోధకుడుగా వచ్చిన వ్యక్తి నేననునది నీలో నిగూఢముగానున్న సంగతి తెలుసుకున్నగాని వార్ధక్యము లేదనుచున్నాడు.

అదే శ్రీరామచంద్రమూర్తిని హనుమంతుడు స్తోత్రము చేసినప్పుడు "ఇన్నేల జెప్పవలయు తన్నే తాను యెరుగుకొరకు, తనకన్యంగానున్నదంతయు దబ్బర" అని రామస్థవరాజములో చెప్పబడిన విషయమును విమర్శించిన "నేను" అను విషయమును తెలుసుకొనదలచిన వ్యక్తిత్వము దానిని అంటని ప్రతి విషయమును వేరుచేసిన "నేన"నునది తెలియబడగలదని చెప్పుచున్నది.

పంచభూతాలు గాని, సృష్టిలోయున్న భూ గృహవసతులు గాని, దారా పుత్రాదులుగాని తనను అంటని విధముగానున్న విషయము మానవుడు తెలుసుకొనవలెననే వరకు తెలియబడుచున్నది. కాని ఆపాద మస్తకము అస్థి, మాంస, వసా వికారముతో కూడిన యీ

మానవరూపంలో ధ్వనించుచున్న "నేన"నే ధ్వనికి యివి అంటు చున్నవా అనే ప్రశ్నకు వచ్చినప్పుడు అది తెలుసుకొనగోరే వ్యక్తి తనకంటే ముందు నిర్యాణము (మరణము) పొందిన వ్యక్తిని గూర్చి యింకొక వ్యక్తి ఊహకు తెచ్చిన "నేన"ను ధ్వని ఆ కట్టెలోలేని కారణమున ఆ శరీరమును అగ్నిలో కాల్చడమో, భూమిలో ఖననము (పాతిపెట్టుట) చేయడమో తిలకించినప్పుడు వానిలో ధ్వనించే "నేన"ను ధ్వని మృగ్యముగుటయే కారణము గాన "నేన"ను ధ్వనికి శరీరము కూడా అన్యముగా నున్నదని తెలుసుకొనుచున్నాడు. దీనినే భాగవతంలో

"తన్నెరుంగక కర్మతంత్రుడై కడపట ముట్టడు
భవ శతములకునైన"

"నేన"ను ధ్వనియొక్క పరిణామము తెలుసుకొని అదిగా మారిన గాని ముక్తరూపము రాదుగాన నటువంటి స్థితికిరాని ఆత్మ వేలాది మానవ జన్మలు యెత్తినను ముక్తి రానేరదని చెప్పబడుచున్నది.

ఈ విషయము తెలుసుకొనుటకే "సాధన" యిది చెప్పువాడే "గురువు" అనబడి భౌతికదేహమందు ధ్వనించు "నేన"ను ధ్వనిని పురస్కరించుకొని తన శిష్యునకు జ్ఞానప్రబోధము సర్వసాధనగా భౌతిక దేహమందుగల వూపిరి "నిశ్వాసగా నిశ్చయించి యీ వూపిరి గానున్న శ్వాసను పురస్కరించుకొని వుచ్ఛ్వాస, నిశ్వాస కుంభకము లపై మోపి స్వరసాధన చెప్పుచున్నాడు. ఇది కాలముకూడి మరణము తరువాత భౌతికమైన ధ్వనికి ఆకరమై పైని పేర్కొన్న శ్వాసరూపమైన వూపిరి ఆగిపోయి "నేన"ను ధ్వని మృగ్యమయే విషయాన్ని గూర్చి మరచినాడు.

ఈ ఉచ్ఛ్వాస, నిశ్వాస కుంభకముగానున్న శ్వాసయను వూపిరి వూపిరితిత్తుల వరకే పోవుచున్నదికాని శ్వాస మూలాధార చక్రము

వరకు వెళ్ళి ఆ చోట ఆ శ్వాసను బంధించినగాని సాధ్యము కాదను భాగవతము.

"అంఘ్రిమూలమున మూలాధార చక్రంబును బీడించి"

అన్నప్పుడు ఊపిరిగానున్న శ్వాసగాదు. అభౌతికముగా దృశ్య రూపములో తన సూక్ష్మ శరీరమునుండి ధ్వనించు "నేన"ను ధ్వనికి ఆకరమైన శ్వాసయేగాన దానికి భౌతికమైన వూపిరి అనవసరము గాన వూపిరిగయున్న శ్వాసను వదలి సూక్ష్మరూపమున ధ్వనించుదానికి ఆకరమైన శ్వాసను తెలుసుకొని పై విషయముగానున్న "నేన"నునది తెలుసుకొని దానిలో లీనమైనగాని ముక్తి రానేరదుగాన

పై విషయమున విమర్శనకు తెచ్చి "నేను" అన్నది యేమిటి అది తెలుసుకొనుటెట్లు? అనే ప్రశ్న రాకమానదు. యిది తెలుసుకొన వలెనన్న మానవుడు యీ క్రింది విషయములు అనుభవమునకు తెచ్చిన తెలుసుకొన సాధ్యమని తత్వవేత్త ఉవాచ.

ముక్తికై పాటుపడే సాధకుడు తెలుసుకొనవలసిన "నేన"ను పరిణామము రాగతిగే విధానమును తెలిసికొను విధానము:

"స్వర్గ నరకాల ఆశలు వదలివేసి
పాప పుణ్యాల కబురులు రూపుమాపి
మోక్ష బంధాల తలుపులు మూసివేసి
అక్షరాద్వైత బ్రహ్మపదార్థ తత్వ
భావ జిజ్ఞాసలను తన్నివైచి దేవ
పూజల నమస్కృతుల నిప్పుపుల్ల గీసి
దోసిలొగ్గి వేడెడి భక్తి బాసి శాస్వత
ప్రభా భాసమాన నూత్న ప్రదీప్త
జ్ఞాన తేజంబులో లీనమైన వెలుగు
వెలుగులోపల నానంద విభవమొందు" (తత్వవేత్త)

పై విషయాన్ని విమర్శనలో పెట్టి తన దృష్టిని దీనియందున్న నిగూఢ విషయము గ్రాహ్యమునకు వచ్చినవారు శాస్విితానందమే "నేన"ని తెలుసుకొనగలరు.

అట్టి తెలివికి వచ్చినవారు భౌతిక దేహమునుండి ధ్వనించు ధ్వనిని దృశ్యరూపములో నీవు సూక్ష్మ శరీరిగయున్న సంగతి తెలుసుకొని దాని యందుగల ధ్వనితో సహితము భౌతికముగ మార్చిన యీ క్రింది విషయమునకు రాగలవు.

గాలి నెవరేని మూటగా గట్టిరేని
వెలుతురెవరేని గాదిలో వేసిరేని
కాలవాహినికిని గట్టు కట్టిరేని
మెరుపు తళుకులు దోసిళ్ళ నెఱపిరేని
వారికేమైననిది చెప్పవచ్చునేమొ
వారికేదైననిది చూపవచ్చునేమొ (తత్వవేత్త)

ఏ వెలుగైతే "నేన"ను ధ్వనిలో ఆనంద రూపంగా కలదో దానిని పై విధముగా తాను మారినగాని యనగా పైన పేర్కొన్న తత్వవేత్త వాక్కు సూక్ష్మముగానున్న సంగతికివచ్చి తను దృశ్యమున సూక్ష్మరూపమునుండి స్థూలముగా మారిన విధానములో పై పేర్కొన్న సూక్ష్మములు స్థూలముగా తనకు లభ్య సాధ్యముగాన అట్లు మార్చ గలిగే సద్గురువు నీకు లభించిన అతని ముఖతః నీవు తెలుసుకొనగలవు. ఇది ఆ గురు ఆశీర్వాద సాధనా రూపమున తెలుసుకొనగలవు.

సాధకుడు యీ క్రింది చెప్పిన విధంగా తన గురువు చెప్పిన ధ్వని రూప మంత్రము సాధన చేయవలసి యున్నది.

ఎవని కంఠంబు యేడ్పుచే వివశమగునొ
ఎవని కన్నీళ్ళు నానాటి కేరులగునొ

ఎవని ర క్తంబు పొంగి వేడెక్కి నొక్కి
ఎవని దేహేంద్రియంబు లైహికము మఱచు
ఎవని చైతన్యమిట్టె నిర్జింపబడును
ఎవని జీవాణువులును స్థంభించిపోవు
వానికీ కాంతికన్నుల కానబడును
వానికీ వెల్గుముందర వచ్చినిలచు

ఎవని కంఠంబు యేడ్పుచే వివశమగునో అనే విషయములో సాధకుడు ధ్వనిరూపములోనున్న క్షరరహితమైన మంత్రము సాధించుటకు ప్రయత్నించినప్పుడు అతని కంఠము అతి ప్రేమాతిశయమందు తనకు కలిగే దుఃఖసమయంలో కంఠము రుద్ధమైనప్పుడు ఆ సమయమున తనస్థితి యే విధముగా నున్నదో తన అనుభవ రూపమైన స్మరణకు తెచ్చుకోవలెను.

ఎవని కన్నీరు నానాటి కేరులగునో = సాధనా రూపములో నతని కంటినుండి కన్నీరు అత్యధికముగ శోక రూపమున కారినపుడు ఆ కండ్లు నుబ్బిన విధానములో తన స్థితి యే విధముగా నున్నదో తన జ్ఞప్తికి తెచ్చుకొని ఆ సాధనా రూపములో ర క్తము పొంగి వేడి జ్వాలలు తన శరీరమునుండి బయలు వెడలును.

ఈ స్థితికి వచ్చిన మానవునియొక్క దేహేంద్రియములు సృష్టిపై గల చైతన్యము మాటు పడిపోయి ప్రాపంచిక విషయాలు మాయింపబడును. అట్టి స్థితిని నీవువచ్చి నిలచిన నీ అభౌతికమైన సూక్ష్మశరీరిగనున్న నీ జీవాణువులు స్థంభించి ఆ స్థంభించిన జీవాణువుల యొక్క తేజస్సు నొకటిగ నిర్మాణమై ఆ కాంతి ఆ సాధకునకు ప్రత్యక్షమగుచున్నది. ఈ స్థితిని దృక్కు ద్రష్ట ఒక్కటేనని ఈ కీలు చెప్పగలిగిన వాడు గురువు.

దీనినే అవ్యయమనుచున్నారు. ఇదియే పరమాత్మ తత్వమను చున్నారు. ఈ విషయాన్నే

అదియె అవ్యయమదె బరమాత్మ తత్వ
మదియె అనురాగముల కాణయాచి ప్రకృతి
విశ్వములకెల్ల నెలవైన వీరభూమి
తపములకునెల్ల ఫలమౌచు దనరుచోటు
ఊహ చొరరాని చోటు సందేహములకు
లొంగనటువంటి చోటు ఏ లోటులేని
చోటు శాంతికి స్థానమై సౌఖ్యచోటు
అదియె నా జన్మభూమి, నా కదియె నెలవు
అదియె నా వాస మదియె నా సదన మరయ, అని

తత్వవేత్త.

ఈ స్థితికి వచ్చిన వానినే విశ్వరూపి యనుచున్నారు. సర్వజ్ఞు డనుచున్నారు. వీటన్నిటికి స్వస్తి చెప్పునది ప్రళయమను మహాశక్తి నిర్వాణముగా మారుచున్నది.

మానవుడు యింతవరకు వచ్చినప్పటికి అతడు నాస్తికుడే! కారణము మానవుడు తన జీవ పరిణామమునకు వచ్చినప్పుడు శూన్యుడై అగమ్య గోచరుడగుచున్నాడు.

"జీవుడు వింధు దేహమున చేడ్పడియుండెనొ లేక వట్టి
మిథ్యా వృతమైన క్లేశముల నారడి చెందుచునున్నవాడో
తద్భావ భవాభవంబైన పద్ధతులన్ మరణించి పుట్టగా
ఏ విధమైన వస్తువునకో యీయగ చాటులు చెప్పరెవ్వరున్.

అని నిస్పృహ పడిపోయినాడు. ఆ తరువాత శూన్యమునే చూచి నాడు. అతని యంతర్వ్యూహ మరణమనే ప్రళయము తప్ప యింకొక

ఉఛ్వాసరాని పరిస్థితిలో అస్తి, నాస్తికులు; నాస్తికులై పోవు చున్నారు.

మానవుని ఆయుష్షు ముక్తిరూప సాయుజ్యము ప్రపంచమున ప్రశ్నోత్తరములలో నమసిపోయినది. కాగా గురువులు చెప్పే యజ్ఞ, యాగాది క్రతువులలోను, దానధర్మాది విధులలోను, గుళ్ళు గోపురాలు మశీదులు కట్టడములోను, పూజాది నమస్కృతులలోను భజనలాది ఆర్భాటములలోను, ముక్తి కలదనే విశ్వాసముపై వాటిని నమ్మినదే సాయుజ్యమను మాటలలో సాయుజ్యము (ముక్తి) రానేరదు.

యీ విధముగ తపస్సులో శ్రమించినప్పటికి బ్రహ్మస్వరూపము కాంచనేరవు. కారణము

నాస్తికమునకు దారితీసి ఈశ్వర రస స్వరూప మహాశక్తిని కూడా నిర్జింపగలిగే భ్రాంతి మహాశక్తి ఆభాసరూపమైన రసస్వరూప మను ఈశ్వరత్వమునకు లొనియ్యడములేదు. గాన భ్రాంతి యనునది తన యనుభవములో ఏదియో గురు ఆశీర్వాదమున గ్రహించిన గాని ఈశ్వర రహస్యము తెలియదు గాన నదియే తత్వముయొక్క ఆదేశము.

ఓ మానవుడా! ఈశ్వర విషయమందు తానుగా గ్రహించే స్థితికి వచ్చినప్పుడు భ్రాంతి స్వరూపము కూడా ఈశ్వర తేజస్సుతో సమాన మైన తేజస్సుతో ప్రకాశించును. ఆ కాలము నీకు వచ్చినప్పుడు ఆ వెలుగులలో ఏది నిజమో, ఏది అబద్ధమో తెలియనేరని పరిస్థితిని తెలియబరచే వ్యక్తి గురురూపమున సాయుజ్యుడై యుండిన, భ్రాంతి యొక్క రూపమును దానియొక్క ఉనికిని, దాని కార్యకలాపములు నిన్ను యే విధముగా బోర్లపడవేసినదో తెలుపగలిగినప్పుడు, నీవా స్థితి నుండి తేరుకొను విషయము నీకు తెలియునట్లు చేసినప్పుడు నీ ఆధ్యా

త్మిక జీవిత గాథ యావత్తు స్మరణకు వచ్చి "గురు" స్వరూపముయొక్క నిజము తెలుసుకొని అదియే సాయుజ్యరూపమని తెలుసుకొన్న దృష్టిని అనంతమైన దూరమునకు పోనిచ్చినప్పుడు నీ ఊహలు బహుదూరము నండి నీలోనున్న యదార్థ స్థానము భావమను చోటికి చేరుకోగలవు. అప్పుడు నీవు ఆనంద పరవశుడవై భ్రాంతిని తెలిసి ఆ శక్తిని నిర్జింప గలిగే శక్తి రాగలవు.

ఇది గురువు అభౌతికమైన ఆశీర్వాదమున కలుగవలసిన విష యము. దీనినే ఆధ్యాత్మికమున అగ్నిపరీక్షయందురు.

అప్పుడు నీ గురువునుగూర్చి నీవు స్తోత్రము చేసుకొనగలవు.

అప్పుడు నీయంతట నీకే గురువుయొక్క మహామహనీయమైన సాయుజ్యరూపము నీలో యిమిడి నీ భావములో భ్రాంతియనే చీకటిగా నడచిన నొకనాటి కాలమును స్మరణకు తెచ్చి సాయుజ్యమను మహా తేజస్సు, యే గురుమహాశయుని ఆశీర్వాదమున తెలియబడినదో ఆ ఆశీర్వాద రూపమైన మెరపుతీగెలు నిన్ను చీకటిరూపములో పడద్రోసి జడజన్మలకు తీసుకుపోనెంచిన "భ్రాంతి" మహాశక్తిని ఛిద్రమొనరించి దానిని నీదరికి చేరనీకుండా చేసిన ఆ మహావ్యక్తి, ఆ భద్రాకారుడు నీకు చూపించిన నిర్వాణరూపము అసామాన్యమైనదని తెలుసుకొన్న నీకు నీ గురువు పాదములకు ప్రణమిల్లెదవు.

అప్పుడు నీ మతికి నీ గురువు తెలిపిన విషయము స్మరణకు వచ్చి సృష్టి యావత్తు తేజోరూపమైన రస స్వరూపమని తెలుసుకొనగలవు.

నీ దృష్టిని అణువు మొదలు బ్రహ్మాండము వరకు నిగుడించి నీ యాధ్యాత్మిక శక్తిని క్రోడీకరించి నెట్ట నందులో తేజస్సు దక్క పదార్థము గాంచనేరవు.

ఈ సృష్టిని చూచి నీ ఊహలో పదార్థ రూపమని నిశ్చయింప బడిన విధానము మాయింపబడి యీ యావత్తు సృష్టి ఈశ్వర తేజ

స్వరూపమైన రస స్వరూప సన్నిభమైన కాంతివంతమైనదని నిరూపణ కాగలదు. అప్పుడు నీవు ఈ సృష్టియావత్తు మొదట రసస్వరూపమై శిథిలమై తేజస్సులోనిదేనని తెలుసుకొనగలవు.

ఈ సృష్టికాకముందు శిథిలమైన తేజోరూపము రసస్వరూప ముగనున్నదని నిశ్చయించినప్పుడు నీకు సంశయము రాకమానదు.

ఈ పదార్థరూపమైన సృష్టి కలుగుటకు కారణమేమి?

ఆ రస స్వరూప సన్నిభమైన శిథిలమైన తేజస్సు యొక్క కదలికచే విడువడిన విషయము అణువను పదార్థముగ మారి పంచ భూతాత్మకమైన యీ సృష్టి సంభవించినదని తెలుసుకొనగలవు.

ఎప్పుడైతే ఈశ్వర స్వరూపమైన శిథిలమైన తేజస్సుగ నున్నదో ఆ లిప్తలోనే దానినుండి విడిపోయిన యీ జగత్తుకూడా నున్నదని నిశ్చయము.

అది పంచభూతాత్మకముగా మారిన క్షణమునుండి నొకదాని తరువాత యింకొకటి 84 లక్షల జీవరాసులుగ పరిణామము పొంది మానవరూపంగామారిన దేహరూపములలో దేహిగా ఆత్మ పరిణామము పొంది "నేను" "నాది" స్వార్థరూపమయిన ధ్వనిని వ్యక్తంచేయగలిగిన సామర్ధ్యమునకు రాగలుగుచున్నది. దీనియందే తన స్వస్థానమను జన్మ రహితమైన విషయమునుకోరు వూహ కూడా పుట్టుచున్నది. దానిని తెలుసుకొనవలెనను యభిలాష కలిగిన నాడె నది ఉత్కృష్టమైన మానవ రూపముగా విలసిల్లు చున్నది.

"ఆదిని కల్గదొక్క యణువైనను తేజముదక్క" —తత్వవేత్త.

ఈ సృష్టి పదార్థ సమ్మిళితమైన తేజస్సు. దీనిని జడమని కొందరు, వాస్తవమని కొందరు, వారివారి ఊహల తోచిన విధాన మున వాఙ్మయములో అతి చిత్రమైన విషయాల నిమిడ్చి పరిజ్ఞాదృష్టికి

తెచ్చి విశ్వసించునట్లుగ చిత్రించినారు. వాస్తవముగా దీనిని విమర్శించిన, దీని ఆదిని కనుగొనవలెనని ప్రయత్నించిన తేలే విషయంకాదు. ప్రతిప్రత్యగ భిన్నమైన అణువును బహు అణుసముదాయమయిన జడమయిన పదార్థమును దానికిమించిన భౌతికా అభౌతిక రూపములున్ను. భువన బ్రహ్మాండములవరకు విమర్శనలోపెట్టి దాని మూలమును గ్రహించగలిగితిని అని చెప్పు వ్యక్తిని ప్రశ్నించిన ఈశ్వర తేజస్సు వేరు. భువన బ్రహ్మాండములలో నిండిన వెలుగు ఈశ్వర సంభూతమైనప్పటికి రెండు వేరు వేరుగా కలవని చెప్పవలసియుండును.

తత్వరూపమున నిరూపణలో తెలుసుకోగలగిననాడు విమర్శకులోనైన సాధకుడు ప్రయత్నించిన అణువులయందు శక్తి, పదార్థములు రెండుగానున్న విషయము మాయింపజేసి ఆ అణువందుగల తేజస్సును తన ఆత్మ తేజస్సును తనకు భిన్నముగాయున్న యణువునందు క్రోడీకరించి దృష్టిని గుడించి దానిని ఢీకొని నెట్టిన అణువునందుగల పదార్థమును అందున్న తేజస్సు పదార్థమును ఆవహించి యావత్తు తేజస్సుగా మారి కనబడును. ఆరీతిగనే ప్రతి భౌతిక, అభౌతికరూపములను సృష్టిని, పంచభూతాలవరకు తన ఆధ్యాత్మిక దృష్టిని నిగుడించి తన ఆత్మ తేజస్సు క్రోడీకరించి నెట్టిన సర్వమును తేజస్వరూపముగనే గోచరించును.

అస్తి మాంస వసా వికారముగనున్న తానుగానున్న తన శరీరము కూడ అతి తేజస్సుగా మారి కనబడును.

ఇది తెలుసుకోవాలన్న

"తన్మాత్రయవిద్య తొలంగిన
కాయములోనున్న రూపె కనుపించు నీకు—తత్వవేత్త.

సృష్టియందు ఆధ్యాత్మిక వాఙ్మయమందు చెప్పబడిన మానవుడు అనుకొనే "నేను" అనేధ్వని పైరీతిగ విమర్శించి నిశ్చయించిన

ఈ మానవుడు అనుకొనే ఈశ్వరుని తేజస్సుయనునది కూడా చీకటి గనే యున్నది.

అటువంటి తేజస్వరూపమయిన చీకటిని తొలగించి, చీకటి స్వరూప మయిన పదార్థమును తేజస్సుగా మార్చగలిగిన శక్తి "నేను" అదియే నీలోనుండి దృశ్యమున సూక్ష్మరూపములో ధ్వనించి తేజస్సుగా ప్రజ్వ లించి భువన బ్రహ్మాండములకు మించివున్నదన్న రస స్వరూప పరి ణామము. యిదియేగాన యిది తెలుసుకోవలెనన్న శ్రీ కృష్ణభగ వానుడు చెప్పిన

"అసత్, న, సత్, వుచ్చతె" యదార్థములో లేదనే నిశ్చయా నికివచ్చి నాస్తికుడై విమర్శించిన ఉన్న యదార్థము తానై "స్వయం భువని" చెప్పగలడు.

ఇదియే "లా యిలాహ-ఇల్లల్లాహు" మహమ్మద్ ప్రవక్త యొక్క నోట ధ్వనించిన దానియొక్క అర్థము.

ఈ స్థితికి వచ్చినప్పుడు "అహం-బ్రహ్మాస్మి" యేదైతే తేజ స్వరూపముగాయున్నచో అది నేనైతినని అర్థము.

"అన్ రాయ తెరబి, బెరబ్బి" నేను ఈశ్వరుడనై ఈశ్వరుని దర్శించితిని అనే అర్థమును నొకటే.

"ఖులూబుల్, మోమినీన
అర్షల్లా, హుతాలా" } మానవాత్మయే ఈశ్వర స్థానము

అస్తి మాంస వసావికారమయిన మానవస్వరూపమయిన దేహ మందు ధ్వనించే "నేన" ను దాని సూక్ష్మరూపమే రస స్వరూపము. దానిని యెవరు తెలుసుకున్నారు అనే ప్రశ్న వచ్చినప్పుడు

"భౌతికాభాస రస స్వరూప
సముపాసకుడోడె కృతార్థుడన్నిటన్"

భౌతికముగాయున్న ప్రతి పదార్థము ఆభాసరూపమైన తేజ స్వరూపముగా మార్చగలిగి, ఆ రస స్వరూపముతో సమానముగ గ్రహించగలిగే ఉపాసనా రూపమైన సాధనచేయు సాధకుడే కృత కృత్యుడుకాగలడు.

"ఇదియే శ్రీకృష్ణభగవానుని విశ్వరూపము"
"ఇదియే మహమ్మద్‌వారి మేరాజ్"
"నేననుభావము మదిలోమాని
సమస్తంబు గురుని మాట్కింగని
విజ్ఞాన సమాధిలో గురువేతానని" —తత్వవేత్త.

నిశ్చయమునకు వచ్చినవాడే కృతార్థుడు. అట్టి విషయమును ఆహ్లాయమానమైన రూపములో తెలుపగలవాడే గురువు. గుణ రహితమయిన తేజస్వరూపమే గురుస్వరూపము. "సత్" యొక్క స్వరూ పమే గురుస్వరూపము. అతనికే సద్గురువను నామము చెందును.

ఇటువంటి సద్గురువు నీకు లభించిననాడే సాయుజ్యరూపములో నున్న ఆధ్యాత్మికమైన రూపము.

భౌతిక అభౌతిక స్థూల సూక్ష్మ యను వివక్షతలేని స్థితిని తేజ స్సుగా గ్రహించగలవు. అలా గ్రహించిన వ్యక్తి గురువుగా లభించి నప్పుడు, సత్తే గురువని నీకు నిశ్చయమైనప్పుడు "జగత్తే మంత్రము" మంత్రమే గురువు. గురువే సాయుజ్యరూపము అని నీ ఆత్మ నిశ్చయించ గలదు.

నీవు నీ గురువు చెప్పిన మంత్రధ్వనికి భౌతికమైన యే పదార్థ వస్తువునందైనను క్రోడీకరించిన అది నీగురువుగ మారి స్వస్వరూపమై గుణరహితమై అవయమై ఆభాసరూపమయిన రసరూపమైరూపించు నప్పుడు ఎక్కడిది శూన్యము, ఎక్కడిది జగము, ఎక్కడిది పదార్థము

యేమిటీ యీ తుక్కయని నీలోయున్న సద్వస్తువునుండి ధ్వనింపజేయు చున్నదో ఆ రస స్వరూపము గురువుగయున్నప్పుడు దానితో సమానముగ ప్రయాణము చేయుచున్నాననను నిర్ధారణ నీకు కలిగినప్పుడు అట్టి వ్యక్తిత్వమందు యెవనికి భక్తితో కూడిన విశ్వాసము కలుగునో నాతడు సాయుజ్యుడు. గాన నీవాతీరున మారి తరించి గుణరహిత మయిన ఆభాసరూపి యగుదువు గాక.

అటువంటి వ్యక్తిత్వమును నీవు అనుభవరూపంలో గ్రహించిన నాడు సర్వము గురువే అయివున్నాడు గాన అట్టి వ్యక్తియందు అచం చలమయిన విశ్వాసము, సోలిపోయిన భక్తితో కూడిన పరిణామము పొందిననాడు నీవే ఆ సద్రూపమయిన గురువు.

ఇది తెలుసుకోవలెనన్న

ఇటువంటి "నేను" అను విషయము గ్రహించవలెనన్న వేదాలు చదివినా, క్రతువులు నెరపినా, దానధర్మాలు చేసినా "నే న" నే యదార్ధము తెలుసుకొనలేరని శ్రీకృష్ణభగవానుడు తన విభూతి యోగములో పేర్కొనియున్నాడు.

శ్రీ మహ్మద్ ప్రవక్తకూడా యీ విషయమే బోధపరుస్తూ. యేకేశ్వరుడైన ఈశ్వరునియందు విశ్వాసమే సాయుజ్యమని చెప్పిరి.

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణు
గురుదేవ మహేశ్వరః
గురు సాక్షాత్ పరబ్రహ్మ
తస్మై శ్రీ గురవేనమః

'నగురోరధికం' జగదాతీతమయిన శక్తి స్వరూపములైన బ్రహ్మ విష్ణు, మహేశ్వరులకు అతీతుడు గురువు.

ఆ గురుశబ్దము నిర్గుణమయిన గుణరహితమయినది. సర్వవ్యాప్తమయినది.

పై విధానాన్ని నిరూపణ చేస్తూ, ప్రబోధరూపంలో బోధిస్తూయున్న ఆధ్యాత్మిక విద్యాపీఠము యీ విధిరీతులమీదనే పీఠాధిపతిగ యున్న గురువనిపించుకొనిన వ్యక్తి, ప్రబోధము చేయు శక్తివంతుడుగా నిరూపణ కాగలడు.

# నేనం

వశిష్ఠుడులాంటి మహర్షికి తన వ్యూహాలలో "నేనను" విషయ ముపై సంశయము కలిగి తన దృష్టిలో తనకు గోచరించుచున్న దృశ్యము నందు, తన దృష్టిని కేంద్రీకరించగా శుభప్రదమైన శక్తి శివరూపంగా మారి, వశిష్ఠునకు సాక్షాత్కరించగా తన వ్యూహాలందుగల సంశయము "నేను" అను విషయము తలపునకురాగా ఆ శివశక్తిని తనకు దర్శన మైన సమయమందే సంశయ నివృత్తికై యడిగినాడు. (యోగవాశిష్ఠము) మహాశక్తి స్వరూపమైన "ఓ శివా! నేననగా ఏ విధమున తెలియ నగునని యడిగినాడు. ఆ శివశక్తి దృశ్యరూపంలో "నేనూ ఆ విషయము యొక్క పరిణామమునకై తపస్సు చేయుచున్నాను. ఏ విషయము యొక్క పరిణామము తెలిసికొనకోరి నేను తపస్సు చేయుచున్నానో ఆ "నేనను" విషయముయొక్క అంత్య పరిణామము నాకింతవరకు తెలియ రాలేదు. నా దృష్టిలో నాకేగాదు నీకుకూడ తెలియనేరదు. తెలిసినను క్రోవడము అభాస".

"నేను" యను శబ్దరూపమైన ధ్వని గ్రాహ్యమునకువచ్చి యను భవ రూపంలో మారాలంటే దుస్సాధ్యము. స్థూల, సూక్ష్మ, శరీర రూపాలను గ్రాహ్యమునకు వచ్చిన తరువాత కారణ శరీర పరిణామము సాక్షిగా గురుముఖతః నీకు తెలియబడిననాడు సర్వసాక్షి స్వరూపంగా అది తనంతట అదేమారి అవ్యయమై స్వయంభువుగా మారి దాని పరి ణామము "నేనని" ధ్వనించినప్పుడు ఆ ధ్వని నీయంతట నీవే యవగాహన చేసుకొన్ననాడు నీవు దాని యాదిలోనున్న "ఓం" కారము ప్రణవనాద మని యుపనిషత్కర్తలు పేర్కొన్న విషయమును దృష్టియందు నిలిపి కేంద్రీకరించి ఆ "ఓం" కారమును ఛిద్రము చేసిన ఆ దృష్టియొక్క కేంద్ర పరిణామము జీవుడని నీకు నీ గురువు నీకు విశదీకరించ గలిగినప్పుడు

నీ యనుభవరూపంగా నీకు తెలియజేసినప్పుడు పంచభూతాత్మకమైన యీ సృష్టిలో పదార్ధరూపంగా కదలాడుచున్న జీవరూపంగా నీకు గోచరించినప్పుడు అనగా నీకు అవగాహన యగునట్లు నీయంతట నీకే తెలియబడగలదు. అది తెలిసికోవాలన్న దృశ్య విధానములో కనబడే దృగ్రూపంగాయున్న సూక్ష్మ శరీరము; భౌతికమయిన శరీరంగానున్నప్పటికి యదార్ధంలో నచ్చట భౌతిక శరీరమెటువంటిదో అలాగునే దానికంటె సూక్ష్మమయిన "కారణ శరీరము" తేట తెల్లమయి అది "అవ్యయం"గా మారి "మహాకారణ శరీర"మయి నామరూప రహితమగు చున్నది. ఈ నామ రూపరహితమయిన విషయమునుండి వెలువడిన ధ్వని క్షరరహితమయిన "నేను" అక్షరముగా నీకు తెలిసినట్లు నీకు నీ గురువు చేసిననాడు మహాకారణ శరీరము పరబ్రహ్మగా మారే స్థితికి వచ్చినట్లు నీవు నిశ్చయించగలవు. ఆ పరబ్రహ్మ స్వరూపము సర్వవ్యాప్తికంగా యున్నట్లు గ్రహించుటే యీశ్వరతత్వాన్ని తనలో నిముడ్చుకొని భ్రాంతి రహితమయిన దృక్కుగా నీవు మారు విధానమునకు వచ్చినట్లు నీకు నిశ్చయము కాకమానదు. ఇది మహాకారణ శరీరమని పేర్కొన్నప్పటికి నచ్చోట శరీరమనునది మందంతో కూడిన పదార్థము మాత్రం కాదు. ఈ తరువాతనే "అ ఉ మ" బీజాక్షరముల సంపుటి "ఓం" కారముగా గ్రహించగలవు. ఈ విధముగనే శ్రీ మహమ్మద్ ప్రవక్తనోట ధ్వనింపబడిన ఖు రా ను ధ్వ ని "అలీఫ్, లామ్ మీమ్" యొక్క ధ్వనియొక్క అర్ధము కూడనిదే. అది తనలోనిదేనని నిశ్చయము. ఎప్పుడైతే ఆ స్వరముయొక్క అర్ధము గ్రహించగలిగే శక్తి నీ ఆత్మకు కలిగినదో నామరూపరహితమైన సర్వశక్తి స్వరూపమైన "అవ్యయమై స్వయంభువైతినని నిశ్చయము. ఆ చోట ధ్వనింపబడి వెలువడే క్షరరహితమయిన అక్షరము ధ్వని రూపమున దానిని గ్రహించ గలిగే శక్తి తన ఆత్మ 'ఆహూయమానము' చేసికొని తిరుగ వెడల గ్రక్కే విధానమునకే "ఉపనిషత్తు"ని పేరు. ఆ యుపనిషత్తుగా వచ్చే ధ్వనిలో వచ్చిన పరిణామ ధ్వనిని "ఓం" కారముగా గ్రహించగలవు-

ఎప్పుడైతే ఓంకారమైన ధ్వని పిపీలకాది బ్రహ్మపర్యంతము ధ్వనించగలిగే శక్తి "నేన"నే శక్తిలో లీనమయ్యే విషయానికొచ్చి గ్రహించగలిగే పరిణామము తన ఆత్మకు సంక్రమింపజేయగలిగిననాడు ప్రతి భూతమందుండే అభౌతికమైన శక్తి స్వరూపంతో కూడిన రూపము (తేజస్సు) వెలువడినట్లు నీకు గ్రాహ్యము కాగలదు. ఆ సమయమందు ప్రతి భూతమందుగల పదార్థము తేజస్స్వరూపంగా మారి పంచభూతాలలో యున్న మహాశక్తి తేజస్సు తప్ప వేరు కాదని నీకు అవగాహన కాగలదు.

ఎప్పుడైతే యీ స్థితికి రాగలిగితివో, ఆ క్షణమందు నీకు కలుగబోయే పరిణామము ఈశ్వరతత్వము తప్ప వేరుకాదు. ఇంతవరకు గ్రాహ్యము కాకుండా చేసిన భ్రాంతి శక్తిని మాయా రూపమని పేర్కొన్నారు. ఈ చోటికి వచ్చిన వ్యక్తిత్వము "మాయా" శబళిత బ్రహ్మ అని సాధకుడు చెప్పగలడు. ఈ "మాయా" శబళిత బ్రహ్మ యన్నప్పుడు జీవరూపంలోయున్న పంచ భూతాత్మకంగా మారిన "ఓం" కారము యీ సృష్టియొక్క స్వరూపము, దీనికి వేరై నీవు ద్రష్టగా మారి, ద్రుగ్రూపంలో వీక్షించిన యీ సృష్టి యావత్తూ నిష్కళంకమైన తేజోవంతమయిన విధిగా (పరబ్రహ్మ స్వరూపముగా) మారగలవు. ఆ సమయమందు ఏనాటికైన భ్రాంతి (మాయ) యనునది దరికి జేరనేరదు. దీనికే "భ్రాంతి వదలిన తత్వమెవ్వనికి తెలుసు" అన్నాడు తత్వవేత్త.

అది సూక్ష్మాతి సూక్ష్మంగా గోచరించే శరీరంగా, అది నీవే యని తెలిసికొన్నప్పుడు దాని బరువు చాల సూక్ష్మంగా యుంటుంది. కాబట్టే ఆ విధానమయిన విషయము శ్రీ కృష్ణ భగవానుని తులా భారము. అదే రుక్మిణీదేవియొక్క భక్తి పూజాఫలము. (శ్రీ కృష్ణ భగవానుని ఆ రూపముగా మార్చగలిగిన మహాభక్తి రూపమయిన

శక్తి) ఆ సమయమందే భువన బ్రహ్మాండాలకు మించిన సృష్టి స్వరూపము మంచు బిందువువలె గోచరించగలదు. ఆ శక్తిని గ్రహించాలంటే ఆ శక్తియొక్క పూజాఫలశక్తి పంచభూతాత్మకంగా ఉన్న యీ సృష్టికి మించి శక్తి స్వరూపమయిన త్రిమూర్త్యాత్మకమయిన రూపాలకు మించి నిల్చిన దృక్ స్థానమదియని గ్రహించగలిగే శక్తి నీ అవయవ సౌష్టవంగాయున్న విధానము శీలరూపంగా యుండవలెను. ఇంక నీ దృష్టికి ఎక్కడ పంచభూతాలు? వానికి మించిన నాలుగు శరీరాలు? వాటికి మించిన పదార్థసహితమయిన సూక్ష్మరూపమయిన నీవు ధ్వనించుచున్న ఎక్కడ నేను? వాటన్నిటికి అన్యంగాయుండే "నేను" ధ్వనియే యీశ్వరుడనే తేజస్సు. ఇది మానవ వ్యక్తిత్వం పొందిన రూపంలోనే గ్రహించగలవు. అలా గ్రహించగలిగినవాడే గురువు. అదే జగత్తు. అది తెలియబడునట్లు చేయు దారియే సర్వశక్తి స్వరూపమయిన మంత్రము. దానినే "మంత్రమే జగత్తు. జగత్తే గురువు-గురుస్వరూపమే ఈశ్వర సంభూతమయిన మహాతేజస్సు" అది యొకచోట స్తంభించిపోయిన విధానములో వ్యక్తమయిన శ్రీ మహమ్మద్ ప్రవక్త, శ్రీ కృష్ణభగవానులు, క్రీస్తు రూపము ఆ స్థంభించిన శక్తి స్వరూప తేజస్సునకే "నేను" అను నామకరణము. అంతియేగాని నీవు భౌతికంగా నీలోనుండి ధ్వనించే నేను అను ధ్వని నేను కాదు. నేను అను ధ్వనికి ఆకరము కాగలిగినవాడే సాయుజ్యమైన స్వరూపము. ఇది సృష్టికి మించి ఓం కారమును ఛిద్రము చేసి "నేను"గా నిలిచిన స్థంభించిపోయిన సకలాంతర్యామి యొక్క తేజ స్వరూపము. ఇదియే నేను శబ్దముయొక్క ప్రాతిపదికము. ఇది తెలిసినవాడే మానవుడు. ఈ మానవుడుగా మారగలిగినవాడు వేషధారి కాడు. ప్రతి యణువునందున "నేన"ను ధ్వనితో కూడిన బ్రహ్మ తేజస్సును వీక్షించువాడు. ఈ స్థితికి వచ్చిన మానవ వ్యక్తిత్వము గురువుగా రూపించినప్పుడు అతని దరిజేరిన ఆత్మలు నిగూఢమయిన

విషయంగా యుండుటచేత వాటిని ఛిద్రము చేసి అనగా నేనను భావమును ఛిద్రముచేసి తన శిష్యునకు అవగాహన (తెలిసికొనునట్లు) యగునట్లు చేయగలడు. ఆ శిష్యుడనేవాని ఆత్మక్షాళనమయి తేజోరూపమయి నేనను విషయమును గ్రహించగలిగే శక్తివంతమయిన "ఓం" కార మయిన మానవరూపిగా మారినవాడు. ఇటువంటి ఆత్మనే భ్రాంతి రూపంలో పడనీయకుండా తన శక్తితో కాపాడ సమకట్టి దానిలో కళంకమును రాకుండ కాపాడువాడే సద్గురువు; ఈశ్వరుడు. దీనినే మర్కట కిశోర న్యాయము. మార్జాల కిశోర న్యాయమని ఉపనిషత్కార కర్తలు అన్నారు.

ఈగురుమహాశక్తిని తెలిసికొని పూజించి ఆతని సహాయమును పొందువాడే భక్తుడు. ముక్తపురుషుడైన సాధకుడు ఇదియే నేననుదాని పరిణామము. ఈ సంగతే శుభప్రదమయిన శివశక్తిని ఆత్మీయంగా ఆహూయమానంచేసి సంశయ రూపములో వశిష్ఠునిచే ప్రశ్నింప జేయబడినది. (నేనను భావము మదిలో మావి సమస్తంబు గురువు మాడ్కిన్‌గని. విజ్ఞాన సమాధిని గురువేతానని) అను తత్వవేత్త వాక్కు నిజము. ఈ స్థితికి వచ్చిన తత్వవేత్తయే యథార్థుడని తెలిసికొన గలవాడే భక్తుడు. ఈ స్థితికి వచ్చిన వ్యక్తిత్వాన్ని "స్వయంభువు" అనవలెను. ఇతనియందే 'సద్గురువు' నామము సార్థకము. ఇతనిని ఆశ్ర యించిన శిష్యకోటియొక్క ఆత్మలు అంతటివియై యున్నవని యూహించ వలెను. ఆ భక్తులకు గురువు ఆశీర్వాదము లభించును. సాయుజ్య మబ్బును— ఇదియే నేనను భావపరిణామము. భౌతికంగా ధ్వనించిన నేను నేనుగాదు. నోట ధ్వనిస్తున్న నేనను భావము నేను గాదు.



# తెలిసిన సద్గురువు

ప్రకృతిలో ఈ ఆధ్యాత్మిక రూపమనే సన్న్యాసిరూపం దాల్చి కొన్ని పడికట్టు మాటలు నేర్చుకొని వల్లించి ఒప్పగించే పరిస్థితిలో అరిషడ్వర్గాలని స్థూల, సూక్ష్మ, కారణ మహాకారణ శరీరములని ఉపనిషత్కారులు చెప్పినటువంటి మర్కట కిశోర న్యాయము, మార్జాల కిశోరన్యాయము, భ్రమర కీటకన్యాయము, అని చెప్పుటయేకాని వాటి విధానమేమిటో? ఎందుకవి ఉపమానంగా యివ్వవలసి వచ్చిందో ఈ సాధకుడైన భక్తునకు అవి ఎందుకు కావలసి వచ్చినవో? ఎందుకా విషయాల ఆంతర్యం వెల్లడించి సాధనారూపమైన సాయుజ్యమంత్రము గురుముఖతః వెల్లడించబడినదో అతను ఆయాచోట్ల ఆయా విషయాలలో గల యదార్థాన్ని వాటి ఆంతర్యాన్ని ఎందుకు నిరూపించవలసి వచ్చిందో, అనుభవ రూపమైన విమర్శనా విధానంలో వెల్లడించక విడమర్చి చెప్పలేక లౌకిక రూపమైన తన స్వార్థాన్ని, వెల్లడించక తన మనో యిచ్ఛను తీర్చుకొనడంలో ఆయా విషయాలను కేవలం పడికట్టు మాటలుగనే చెప్పి యొప్పించలేక లోక కల్యాణదాయకమైన ఆధ్యాత్మిక విషయాన్ని గురువుగా నున్న సన్న్యాసి సంస్కరించుచున్నాడు.

ఈ క్రింద మర్కట కిశోరన్యాయము, మార్జాల కిశోర న్యాయము, భ్రమర కీటక న్యాయము, వాటియొక్క విధానం చెప్పబడినది. ఆ విధానాన్ని ఏ గురువనే వ్యక్తి సాధించి సాయుజ్యుడై తన అనుభవంలో నిర్ధారణ యగునట్లు చేసికొని అది తన శిష్యుడైన మానవ వ్యక్తికి అనుభవం వచ్చునట్లు చేయునో అతడే తెలిసిన సద్గురువు అనిపించుకోగలడు. శిష్యుని భ్రాంతి జన్యమైన మహాశక్తి లొంగదీసి పెడదారిని నడిపించ జూచు సమయాన ఆదుకొని ఆ భ్రాంతి మహాశక్తి ఆవహించకుండా చేయు భారము గురువునకు అగ్నిపరీక్ష.

ఆ విధానాన్నే సాయుజ్యుడు కాబోయే శిష్యునకు కూడా అగ్నిపరీక్ష. అటువంటి విధానంతో శిష్యుని కాపాడి సాయుజ్యునిచేయు గురువే "తెలిసిన సద్గురువు" ఈ చోటికి వచ్చినప్పుడే.

చ॥ "తెలిసిన సద్గురుండు తనతేజము శిష్యునిపై పుటెట్టి; నిర్మలిన
వికాసరూపమున మాయనుమాయముజేసి చీకటిన్ తొలగగ
దోసి ఆత్మ తనతో జనుదేరగ మూడు లోకముల్ వలగొని
పోవు దేహబంధములు వాయ ముముక్షునిజేయు నెంతయున్-"

అన్నాడు తత్వవేత్త. దానియొక్క పర్యవసానంగా తెలిపిన విషయమే "భ్రాంతి వదలిన తత్వమెవ్వనికి తెలియు, తత్వమన్న తానేగదా" అన్నాడు తత్వవేత్త.

అటువంటి విధానములో యోగవాశిష్టమందు యీ క్రింది విధముగా తెలుపబడినది. "ఓ రామా! నేను ఏదైతే దృశ్యరూపంలో సూక్ష్మశరీరంతో అనుభవరూపంలో తెలిసికొంటినో ఆ విషయాలను ఒకదాని తరువాత యింకొకటి నీ యనుభవములో సూక్ష్మ శరీర రూపంలో గ్రహించునట్లు నిన్ను ప్రబుద్ధుని చేయుచున్నాను"

శ్లో॥ అస్మదా దేర్జన స్త్వైత త్ప్రత్యక్షం నానమానికం
శుద్ధబోధ శరీరేణ నాధి భౌతికరూపిణా॥
" ఎష తేనకధితః సర్వోదృశ్యామభవక్రమః

**1. మర్కటకిశోరన్యాయము :** కోతితన బిడ్డనుగుండెలకు హత్తుకొని ఎన్నిచోట్లు తిరిగినప్పటికి ఎన్ని కొండలెక్కినప్పటికి, ఎన్ని చెట్లు దూకినప్పటికి, ఏటువంటి ప్రమాదమైన చోటికి వెళ్ళినప్పటికి, ఆ సంతానాన్ని జారవిడువకుండా తన ప్రాణాల నొడ్డి సంరక్షించడం అనే విషయంలో దానిని ఏ విధంగా కాపాడగల్గుచున్నదో ఆ విధానాన్నే గురువుకూడా తన శిష్యుడైన భక్తుని ఆ భౌతికమైన మహదా

శీర్వాదరూపంలో భ్రాంతి అనే మహాశక్తిలో పడనీయకుండా మర్కట కిశోరన్యాయంగా కాపాడుచు సాయుజ్యమార్గమున కొనిపోవగలుగు చున్నాడు.

**2. మార్జాలకిశోరన్యాయము :** పిల్లి తాగన్న పిల్లల్ని నొప్పి కలుగకుండా నోటకరచి ఒకచోట గాకుండా 7 స్థానాలలో మార్చి వాటి ప్రాజ్ఞతకై అప్పుడప్పుడూ ఆయా విధానాల్ని నేర్పుతూ అందులో 5వ స్థానాన్ని తాను ఒక ఎలుకను వేటాడి దానిని చావు బ్రతుకుల మధ్యస్థితికి తీసికొనివచ్చి యీ పిల్లల యెదుట నిల్పి దాన్ని ఎలా వేటాడాలో శిక్షణరూపంలో నేర్పి, 6, 7, స్థానాలలో ఆ ఎలుకను ఎలా నిర్జించాలో వాటికి అనుభవంలో కృతార్థత వచ్చేలాగ చేస్తుంది. ఇందున్న రహస్యం మాతగానున్న ఆ మార్జాలానికే తెలుసు. ఏ యే చోట్ల వాటిని భద్రపరచి ఆ రహస్యవిద్య చెప్పడానికి సావకాశ మిచ్చునో అటువంటి స్థానంలోనే పెట్టి నేర్పుతుంది. అలాగుననే "సద్గురువు" కూడ 5వ స్థానమైన విశుద్ధచక్రంలో భ్రాంతి నిరూపింప చేసి, 6వ స్థానమైన ఆజ్ఞాచక్రంలో భ్రాంతిని నిర్జింపచేసి, 7వ స్థానమైన సహస్రార చక్రమందు కృతార్థుణ్ని చేయుచున్నాడు. తరువాత భ్రమర కీటక న్యాయమున నడిపించును.

**3. భ్రమరకీటకన్యాయము :** తుమ్మెద ఒక పురుగును తీసి కొనివచ్చి బాహ్యప్రపంచం దానికి తెలియకుండా మూర్ఛిలజేసి, (యీ స్థితికే "మూర్ఛిలజేయు బాహ్యప్రపంచగరిమ" అన్నాడు తత్వవేత్త) ఆ మూర్ఛిలియున్న కీటకాన్ని ప్రపంచరూపమైన భ్రాంతి జన్యమైన విషయాలకు పోనీయకుండా కొద్దిపాటి రంధ్రం ఉండేటట్లు మట్టితో గూడికట్టి మూసి ఝూంకారనాధం చేస్తూ ఆ ధ్వనిలో నున్న రహస్యం తనలాగే యింకొక భ్రమరరూపం దాల్చేవరకూ అనగా తనలాంటి రూపం దాల్చేవరకు దానిచుట్టూ తిరగడం మానడం లేదు.

తనలాంటి భ్రమరరూపం దాల్చిన తరువాత తనతోపాటు సృష్టియందు ప్రయాణంచేయ సమకట్టి ప్రాజ్ఞత వచ్చిన తరువాత వదలివేయును. ఈ విధానాన్నే సద్గురువు శిష్యుని తనంతటివానిగా మార్చి నిరూపణ చేయుచున్నాడు.

ఈ కాషాయవస్త్రధారులైన సన్యాసులు బ్రహ్మచర్యవ్రతమని నిరూపణ చేయడంకోసం, వేసినవేషంలో తనయొక్క గొప్పతనం నిరూపణ చేయుటకు బ్రహ్మచారియే తగిన వ్యక్తియని సర్వభూయిష్టమైన హావభావములను ప్రదర్శిస్తూ వివాహం కానటువంటి తాను తన లోని గూఢంగాయున్న కామరూపమైన భ్రాంతి జన్యమైన విష యేచ్ఛలను నిర్వర్తించుటకు ప్రయోగరూపంలో అమాయకులైన శిష్యులను మోసం చేయుచున్నాడు. పైన పేర్కొన్న విధానంలో వాటి అర్థం నిరూపణ చేస్తూయుండగా యీ కుహనా గురువులు దానికి వ్యతిరేకమైన విషయం నిరూపణచేస్తూ జ్ఞానమే అనర్థమైన అసహ్యమైన విషయంగా మార్చి నిజరూపమైన పై విషయాలు అనుభవపూర్వకంగా నిరూపణ చేస్తూయున్న "సద్గురువు" వాక్యములు తమ కడ్డుదూరు చున్నవని సంశయించి అపార్ధములు కల్పించుచున్నారు. కనుకనే "నిజములు చెప్పెనేని యవి నింధ్యములంచు తలంతురీ మహాప్రజల కబద్ధనాటకమె ప్రాయకమైనది" అన్నాడు తత్వవేత్త. పై విషయాలు చెప్పి యదార్ధం నిరూపణచేస్తూయున్న "సద్గురువు"ను తృణీకరించి ఆ నిజాల్ని అబద్ధాలని నిరాకరిస్తూ నూన్యత చేయుచున్నారు. "గురువు" యొక్క శాపరూపము అనుభవంలో వచ్చినప్పుడు యీ మోసగాండ్రు కంటికిమింటికి ఏకధారగా కన్నీరు వచ్చి, వచ్చినప్పుడు ఆ శాపరూపమైన బాధను భరింపలేక ప్రాణత్యాగం చేయుచున్నారు. వాటి యర్థం మోసరూపంలో చెప్పుచున్నసన్యాసిని గౌరవించి పారితోషిక రూపంలో తమ సర్వస్వం ధారబోసి హతాశసులగుచున్నారు.



# పరిణామము

తేజస్సు-ధ్వని తెలిసిన సద్గురువు తనకు లభించినప్పుడు నతనిని ఆశ్రయించి ఆశీర్వాద ధ్వనిరూపము నాతనినోట ధ్వనింపబడిన క్షర రహితమయిన అక్షరము మంత్రరూపమును గురు ఆశీర్వాదమున ప్రబోధింపబడి ఆధ్యాత్మిక ప్రయాణము సాగించి కృతార్థుడై "స్వయం బ్రహ్మాస సందేహ" అను పరిణామము పొందిన యోగిపుంగవుడు తన ఆత్మలో ఆ మహాశక్తివంతమయిన మంత్రధ్వని ధ్వనించినప్పుడు తాను విశ్వరూపినని నిశ్చయమయి యీ స్థితికివచ్చిన తన వ్యక్తిత్వము అదిని గురు ప్రబోధమున సాధనా కాలమునకు నెట్టి అక్కడ నుండి తాను పయనించిన బాటను విమర్శనలో బెట్టినప్పుడు మొదట తన వూహకు తన దృష్టికి గోచరమయిన యీ సృష్టి పంచభూతాత్మకంగా నున్న సంగతి తెలిసికొనుచున్నాడు. అందు ప్రతి భూతమున్ను వేరు వేరుగా తన దృష్టిని విమర్శించి సాధనాధ్వనిని ప్రతి భూతమందు ప్రోదీకరించి నెట్టి నప్పుడు ప్రతి ఒక్కటి ధ్వనితో కూడిన తేజస్సుగా కనబడిన విషయము తెలుసుకొను చున్నాడు. ఈ పంచభూతములను పంచ తత్వములుగ తెలిసి వాటియొక్క పరిణామము సమన్వయించి నప్పుడు అ పరిణామము తానుగానే యున్నాడని తెలుసుకొనగల్గు చున్నాడు. ఆ స్థితిని తాను "స్వయంభువు" అని నిశ్చయించు చున్నాడు అది కేవలము తేజస్సుతప్ప వేరుకాదని నిశ్చయము.

ఈ స్థితికి వచ్చిన తాను ఈశ్వర సంభూతమైన రసస్వరూపము స్వయంభువు. ఈ స్వయంభువు యొక్క కదలిక ధ్వని ఆ ధ్వని వలన విడిపోయినది ప్రకృతిగా మారిన అణువు. ప్రకృతి స్వరూపమైన అణు వునకు శాశ్వతమైన తేజస్సునకు మధ్య ధ్వనిరూపమున యేర్పడిన బీట కాలము విడిపోయిన అణుబద్ధమైన యీ ప్రకృతి రసస్వరూపమయిన

తేజఃపుంజము ఆఘ్రాణించి యుండుటచే యేనాటికైనను ఆ కిరణ పుంజము కాలమను బీటను మాయింపజేసి. ధ్వనిబద్ధమయిన తేజస్సు (విరాట్టు) నందు లీనం చేసుకో గలదనే యదార్థము యీ ప్రకృతికి తెలిసియున్నది.

తేజస్సునకు ప్రకృతికి మధ్య బీటగామారిన కాలమునకు కూడా తనను కళంకపరచిన బీటను మాయింపజేసుకొని తేజస్సులో లీనమగు ఆశ కాలమునకు కూడా నున్నది.

"ఏదో కాలము వైణికాకృతినదే నెవ్వానినోపాడు"

తత్వవేత్త

ఈ స్థితికి వచ్చినప్పుడు సూక్తకారులు
"తత్సృిష్ట్వా తదేవాను ప్రావిసతు" అన్నారు.
"అణోరణీయాన్ మహతో మహీయాన్ యేషోణురాత్మ"

ఈ సూక్ష్మతి సూక్ష్మమయిన అణువు మొదలు బ్రహ్మాండ ములవరకు ఆత్మ స్వరూపంగా యీ యీశ్వర రసస్వరూప కిరణపుంజము సూత్రరూపంలో స్థిరీకరింప బడినది. ఇది సూక్ష్మరూపమయిన తన ఆకారమును దృశ్యములో చూచినపుడు దానియందున్న ధ్వనితో కూడి ఆ సూక్ష్మమే స్థూలముగా మారినపుడు భౌతికమైన విధానముగా ఆయా విషయములను పరిగ్రిహించినపుడు అది కేవలము ధ్వని మిళిత మైన తేజస్వరూపమదక్క వేరుకాదు.

ఈ స్థితి ఈశ్వర సంభూతమైన స్వయంభువుగా నున్నవాడు యీ ధ్వని ప్రకృతిలోనే తెలుసుకొన గలడు. అందుచేత ప్రకృతికి ఆకరము ధ్వని, ధ్వనికి స్థానము తేజస్సు వీటికిగల అవినాభావ సంబం ధము విడదీయుట అసాధ్యము.

ఈ విషయము కాలమనే కుండలీశక్తియైన భ్రాంతిని మాయింప జేసిన యోగిపుంగవునకు సువిదితము.

ఇది గ్రహించిన తత్వవేత్త

"ఆదిని గల్గ్రదొక్క యణువైనను తేజముదక్క దానిలో
నాదము పుట్టి" (తత్వవేత్త)

ఆ తేజస్సునుండి ధ్వనిపుట్టి ప్రకృతియై పంచభూతాలై స్వర్గ, నరకాదిలోకాలై తరువాత జీవజాలములుగా చెన్నారి వాటి అంత్య పరిణామము మానవునిగా మారి తెలిసి సద్గురువు ఆశీర్వాదమున అన్ని తానై యున్న గ్రాహ్యమునకు వచ్చి యీ ప్రకృతి ధ్వనిలో మిళితమై యున్న శోభనమైన తేజస్సులో లీనమయి తానే రసస్వరూపినను శరరహితమయిన ఆకర రూపంగా మారు మాట నిజము.

ఇదియే బ్రహ్మ, విష్ణు, మహేశ్వర రూపము. ఈ త్రిమూర్త్యాత్మక సన్నిభమయిన రసస్వరూపము "స్వయంభువు".

స్వయంభువు అయిన తేజస్సు పీటినన్నటిని తనలో లీన మొనర్చునను, విషయమునకే ప్రళయమని పేరు.

ఈ ప్రళయమందు ప్రకృతి ధ్వనితో సిద్ధించిన తేజస్సును తానుగా మారినవాడే సద్గురువు.

అనుభవ రూపములో తెలియబడునట్లుచేసి శిష్యుని పై స్థితికి మార్చినవాడే తెలిసిన సద్గురువు. ఈ విషయాన్ని గ్రహించి తన గురువైన సద్గురుని రూపము పొందినవాడే యోగిపుంగవుడు.

జాజ్వల్యమానమైన మధ్యం దినమార్తాండుని తేజస్సులో వేయి కాండిల్సు ఫవరుగల మహాకాంతిని వెలార్చి కారు చీకటిని నిర్జించిన విద్యుద్దీపకాంతి ఏలాగున లీనమగుచున్నదో ఆలాగునే ఆత్మ తేజస్సైన స్వయం తేజస్సు అనగా స్వయంభువుగా మారిన, స్థంభించిన తేజస్సు కారుచీకటిగానున్న భ్రాంతిని నిర్జించి ఈశ్వర రసస్వరూప తేజస్సులో లీనమగుచున్నది. ఇదియే సాయుజ్య-రూపము.



# అస్వాసాంతము

1. సర్వవ్యాప్తమైన జీవచైతన్యముగల తేజస్సే ఆది విరాట్టు- (అదే శాశ్వతమైన రసస్వరూపము. అదే గుణరహితమైన తేజస్సు) దానినే "జల్లో జలలహూ" అని మహమ్మదు ప్రవక్తచే ఖురానులో ధ్వనింపబడినది. దానినే "అదిని గల్గనొక్క అణువైనను తేజముదక్క" అన్నాడు తత్వవేత్త. అదే విరాట్టు.
2. ఆది విరాట్టు అనగా "శాశ్వత ప్రభా భాసమాన నూత్నప్రదీప్త జ్ఞాన తేజంబులో లీనమైన వెలుగు అన్నాడు తత్వవేత్త.
3. ఆ విరాట్టు నుండి తెగిపోయిన మహాశక్తియే త్రిమూర్త్యాత్మక స్వరూపమైన మహాశక్తి. ఆ మహాశక్తి యేమాయాశబళితబ్రహ్మ ఈశ్వర రూపము.
4. ఈశ్వరుడన బ్రహ్మ. విష్ణు, మహేశ్వర మహాశక్తి స్వరూపము అదేసృష్టి, స్థితి, లయకారణమైనది.
5. ఆ త్రిమూర్త్యాత్మకమైన మహాశక్తి స్వరూపమే విస్తరించి పంచ భూతాత్మకమైన మహాసృష్టియైనది. ఆ త్రిమూర్త్యాత్మకమైన మహాశక్తియే ఆదివిరాట్టు నుండి తెగిన దన్నాడు. తత్వవేత్త.
6. ఆ సృష్టియైన ప్రతి యణువునందును ఈశ్వర రూపము ఆత్మ స్వరూపముగా నున్నది. ఇక్కడే తత్ సృష్ట్వాత దేవాను ప్రావిసతు సూక్తి అను రావడానికి కారణము. అదే "అణోరణీయాన్ మహితో మహీయాన్ ఏషోఽణురాత్మ" అని తెలుపబడినది.
7. ఆ పంచభూతాత్మక సంఘటితమైన పరిణామమే 84 లక్షల జీవ రాసులు-
8. ఆ పంచభూతాత్మక సంఘటితమైన 84 లక్షల జీవరాసుల యొక్క అంత్య పరిణామమే మానవ రూపము.

9. ఆ మానవరూపమే "ఓంకార" రూపమైన "నేన" ను ధ్వని.

10. ఆ ధ్వనే ఆత్మరూపమైన సర్వవ్యాప్తంగా యున్న విశ్వరూపము అదే త్రిమూర్త్యాత్మకమైన ఈశ్వర మహాశక్తి.

11. అటువంటి ఆత్మస్వరూపమే "స్వయంభువు"

12. ఆ స్వయంభువే తెలిసిన సద్గురు స్వరూపము. ఇచ్చటే "గురు బ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః గురుసాక్షాత్ పర బ్రహ్మ తస్మై శ్రీ గురువేనమః అనుసూక్తి వచ్చినది.

13. తెలిసినసద్గురు స్వరూపమే జగద్రూపకమైన విశ్వరూపము.

14. ఆ విశ్వరూపమే ఓంకార రూపమైన మానవరూపము.

15. ఓంకార రూపమైన మానవరూపమే భ్రాంతి రహితమైనచో ఈశ్వర రూపము "భ్రాంతి వదలిన తత్వ మెవ్వనికి తెలుసు" అన్నాడు తత్వవేత్త.

16. ఈ ఈశ్వరరూపమే శాశనమైనగుణ రహితమయిన"నేన" ను ధ్వని తో కూడిన రసస్వరూపము. ఇదే ఖురానులో ఆ తేజస్సునకు "జల్లో జలాలహూ" అని ధ్వనింపబడినది. దీని మూలము గ్రహించి నట్టి మన్సూరు తత్వవేత్త "అనల్‌హక్" (అహం బ్రహ్మస్మి) అన్నాడు (నేనే ఈశ్వరుడనని అన్నాడు.)

షరీయత్ (ముస్లిం కర్మిష్టులు) అది మతవిరుద్ధమని ముస్లిం కర్మిష్టులు ఆయనను చంపివేసిరి. (ఆ శవం కూడా "అనల్‌హక్" నేనే ఈశ్వరుడన్నది.)

17. ఆ శవాన్ని కాల్చి బూడిదచేసి సముద్రములో కలిపివేసిరి, ఆ బూడిన ఆ సముద్రములో ఎంతవరకు వ్యాపించినదో అంతవరకు "అనల్‌హక్" అని ధ్వనించినది ఆ ధ్వనే 'జల్లో జలాలహూ' అదే సర్వవ్యాప్తమయిన రస స్వరూపము,

18. అప్పుడు చేయునదిలేక ముస్లిం కర్మిష్టులు విరమించుకున్నారు.

19. "ముస్తఫా బోలేకెకహెతాహై ఖుదా
మై జమీ ఓ అసుమామె నై సమా
దిల్‌మె మోమిన్‌కె సమాతాహు అజబ్

(ఈశ్వర ఉవాచ) మహమ్మద్ ప్రవక్త వాక్కు. నేను భువన బ్రహ్మాండములకు మించియున్నాను. కాని స్థిత ప్రజ్ఞత్వము [illegible]న మానవాత్మలో ఇమిడిపోయాను–(అద్భుతం)

20. "పీర్‌పా బేపీర్ నకర్నయే సఫర్
హైపురా ఫతో ఖౌఫోఖతర్"

తెలిసిన సద్గురు సహాయము లేనిది అధ్యాత్మిక దారిలో ప్రయాణం చేయడం చాలా ప్రమాదకరమని అన్నాడు తత్వవేత్త.

సర్వజగంబులకు సర్వజ్ఞుడైన రూపము విష్ణు రూపమని అది జగద్రూపమని అదే విశ్వరూపమని పురాణ గ్రంధములలో పేర్కొన బడినది.

ఆ రూపంయొక్క రంగు నీలంగా యున్నదని చెప్పబడు చున్నది. విశ్వరూపమన్నప్పుడు పంచభూతాత్మకమైన పరిధిలేని సర్వవ్యాప్తమైన రూపానికే విశ్వరూపమని పేర్కొందురు. అదే జగద్రూపమని అందురు. జగద్రూపమనగా పంచభూతాత్మక సమ్మిళితమైన పరిధిలేని తేజ స్వరూపమే.

1. ఆకాశము 2. గాలి 3. నీరు 4. నిప్పు 5. భూమి. వీటి అంతరంగిక రూపాన్ని వీక్షించగలిగిననాడు వాటియొక్క రూపం నీలంగానే యున్నది.

1. ఆకాశం నీలం 2. గాలి నీలం 3. నీరు నీలం 4. నిప్పు నీలం 5. భూమి నీలం. ఈ పంచభూతాత్మక మహాశక్తి సమ్మిళితమైనప్పుడు కలిగే పరిణామము మానవ రూపము. అదే మహావిష్ణు స్వరూపము.

అదే జగ(ద్రూపమైన విష్ణు రూపము. అదే స్వయంభువు. ఆ రూపము ఎప్పుడు నీ విధంగా మారాలంటే ఆ విధమైన రూపంగా మారగల శక్తి స్వరూపము. అదే స్థిత ప్రజ్ఞత్వం. లఖదఖ లఖనల్ ఇన్సాన ఫీ హస్నే తక్వీమ్) అని ఖురానులో మహమ్మద్ ప్రవక్తచేత ధ్వనింపబడినది.

జీవంగావున్న అన్ని రూపలకంటె మానవరూపం ఉత్కృష్టంగా వున్నదని చెప్పడంలో మానవ రూపమే ఈశ్వరరూపమని అంతరంగికంగా అర్థమిస్తోంది. (అల్‌రాయ తెరబ్బీ బెరబ్బీ) మహమ్మద్ ప్రవక్త వాక్కు—"నేను ఈశ్వర తేజస్సునై యీశ్వరుని చూచేను."

"అహం బ్రహ్మాస్మి" అన్న మహావాక్యానికి కూడా అదే అర్థం. భువర్లోకాది సువర్లోకాలు మానవునియందే యిమిడి యున్నవి (సీతా రామాంజనేయం) కల డంభోధి కలండు గాలి కలడాకాశంబునన్ కుంభినన్ కలడగ్నిన్,....అని భాగవతము. "పంచ భూతమయుడు యీశ్వరుడంచు తెలియు నరుడు అది తానెయని చెప్పగలడు" అన్నాడు తత్వవేత్త. ఖురానులో దానినే "జల్లా జలాలహు" అని మహమ్మదుప్రవక్తచే ధ్వనింపబడినది. పంచభూతాత్మకమైన మహాశక్తి సమ్మిశితమయినప్పుడు వచ్చే పరిణామము ఓంకార రూపమైన మానవాకారము. పంచభూతాత్మక రంగు నీలం కాబట్టి పంచభూతాత్మకమైన మహాశక్తులు మిళితమైనప్పుడు వాటి పరిణామమయిన మానవాకారముగల ఆత్మ నీలిరంగు. అదే మహావిష్ణువు. స్థిత ప్రజ్ఞత్వము పొందిన ఓంకార రూపమయిన మానవాకారం, స్థిత ప్రజ్ఞత్వము పొందిన తెలిసిన సద్గురువు యొక్క ప్రబోధముచే తెలిసికొన్న ఆత్మ అంత్యపరిణామము. ఇదే "నేను" అనే ధ్వని అదే అహం బ్రహ్మాస్మి. అదే పంచభూతాత్మక సమ్మిశితమైన నీలిరంగు తేజస్సు. అదే పరబ్రహ్మ స్వరూపము.





.... సంపూర్ణము ....

